# గ్రంథకర్తృపరిచయము



పేరు : అగస్త్యరాజు సుబ్బారావు
ధర్మపత్ని : శ్రీమతి రత్నమ్మ
జననము : 1-7-1949
తల్లిదండ్రులు : శ్రీమతి కమలమ్మ
శ్రీ సుబ్బరాయుడు
జన్మస్థలము : కాంచెరువు (వరికుంటపాడు మండలం)
**విద్యాభ్యాసము :**
ప్రాథమికవిద్య : ప్రాథమిక పాఠశాల, కాంచెరువు
ఉన్నత విద్య : జి.ప. ఉన్నతపాఠశాల, వరికుంటపాడు
కళాశాలవిద్య : 2బి విద్వాన్ వేదసంస్కృత కళాశాల, నెల్లూరు
బి.ఎ. యస్.వి. యూనివర్సిటీ
పండిత శిక్షణ : కర్నూలు
వృత్తి : విశ్రాంత ప్రధాన ఆంధ్ర పండితులు,
జి.ప. ఉన్నతపాఠశాలలు
అభిరుచులు : రచనావ్యాసంగము
గ్రంథపఠనము
సత్సంగముల నిర్వహించుట
ఆధ్యాత్మిక ప్రసంగములు చేయుట
ఇతర రచనలు : శ్రీ దేవీ భాగవతము ప్రథమ భాగము,
"శ్రీ మంగళ గౌరీ సుందరేశ్వర శతకము"
"నివేదన"
సంతానము : డా॥ నాగరాజరావు (కుమారుడు) చి॥ ముదిత్ భార్గవ్ } మనుమళ్ళు
చి॥సౌ॥ కృష్ణకీర్తి (కోడలు) చి॥ గౌరీశ్రీచరణ్
చి॥సౌ॥ జ్యోతి (కుమార్తె) చి॥ అమర్‌నాథ్ } మనుమళ్ళు
చి॥ ఆర్. భాస్కర్ (అల్లుడు) చి॥ హరనాథ్
చి॥సౌ॥ ప్రసన్నలక్ష్మి (కుమార్తె) చి॥ భారతీశ్రీహిమజ } మనుమరాళ్ళు
చి॥ యం. చంద్రమౌళి (అల్లుడు) చి॥ హాసిత

# శ్రీ దేవీ భాగవతము (ఆంధ్రము)

## ద్వితీయ భాగము

### షష్ఠ, సప్తమ, అష్టమ స్కంధములు




రచయిత

**విద్వాన్ అగస్త్యరాజు సుబ్బారావు**

**11-33-991/6, బాలాజీ వీధి, వెంగళరావునగర్,**
**కావలి, శ్రీపొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా.**
**ఫోన్ : 9441767160**



ప్రథమ ముద్రణము : 2014, డిసెంబర్

ప్రతుల సంఖ్య : 1000

ముద్రణాలయము పేరు : అబిగ్రాఫిక్స్
కో-ఆపరేటివ్ బ్యాంక్ ఎదురుగా,
స్వాతీ కాంప్లెక్స్, ట్రంకురోడ్డు, నెల్లూరు

ప్రాప్తి స్థానము : అగస్త్యరాజుసుబ్బారావు, రచయిత
బాలాజీవీధి, వెంగళరావునగర్,
కావలి, శ్రీపొట్టిశ్రీరాములు నెల్లూరు జిల్లా.



ఈ గ్రంథముద్రణ అనంతరం వచ్చే విమర్శలకు,
చట్టరీత్యా తీసుకునే చర్యలకు గ్రంథకర్తగా నాదే బాధ్యత

**మూల్యము**
**రూ. 150/-**



**శ్రీదేవీ భాగవత మాంధ్రీకరించిన**
**శ్రీ మదగస్త్యరాజు సుబ్బారావుగారికి**
**ప్రశంసాపూర్వక పద్యమంజరి**



ఉ॥ శ్రీకరమైన భాగవత చింతన, కీర్తన, లెల్లవారికిన్
ప్రాకట రీతి గూరుచు శుభంబుల; లోకహితార్థమెంచి, తా
చేకొని యాంధ్ర భాష రచియించెను సత్కవి సుబ్బారావు, నే
డాకృతి, నెల్ల వారలకు నందగ జేయు మహోత్సవంబనన్॥

కం॥ దేవీ భాగవతంబును,
కోవిదు లెల్లరును మెచ్చ, కూర్చెను సుబ్బా
రావు తెలుంగున; వానిన్
దీవించును గాక దేవి, ధీసంయుక్తున్॥

తేగీ॥ అమ్మవలె నమ్మ చరితమ్ము నద్భుతమ్ము,
ఆత్మ భావనమీక్షిత మగుట వలన;
నెల్లరకు నమ్మ తత్వమ్ము నెఱుక పఱచె;
సుబ్బరావు కవీంద్రుడు, సుజనహితుడు॥

శా॥ ఛంద స్సుందర పద్యసంగతమునై,
సంస్కారయుక్తంబునై,
స్పందీభూత మృదూక్తి శోభితమునై,
శయ్యా విశిష్టంబునై,
చిందించున్ గృతి, రమ్యకావ్యకలనా
చిద్రూప భావాకృతిన్;
అందించున్ పరదేవతా కరుణ స
ద్యఃప్రాప్తి యోగంబునున్॥

మ॥ బహుజన్మార్జితమౌట, సత్కవిత సం
ప్రాప్తంబు గా దేరికిన్;
మహనీయంబగు కావ్యసంగ్రహణ పెం
పారంగ, నాంధ్రంబునన్
'వహవా' యంచు జనంబు మెచ్చ రచియిం
పన్ నీకె చెల్లెన్; మహా
మహులందీవును నొక్కడౌట, సుకవీ!
ప్రాప్తించె నానందమున్॥

**ఇట్లు**
**"శ్రీపాదపాంసువు" అగస్త్యరాజు సర్వేశ్వర రావు**
**కావ్యకళా కృషీవల, మధురకవి, సత్కవి,**
**సాహిత్యరత్న, ఆంధ్రా టాగూరు.**



## శ్రీ దేవీ ప్రసాదం



**డాక్టర్ చీమకుర్తి వేంకటేశ్వర రావు**
**యం.ఎ., పిహెచ్.డి**
**విశ్రాంత ఆంధ్రోపన్యాసకులు**
**దొడ్లకౌసల్యమ్మ ప్రభుత్వ మహిళా పి.జి. కళాశాల**
**ఆస్థాన పండితులు, శ్రీ సత్యానందాశ్రమము**
**ఇనమడుగు, నెల్లూరు జిల్లా**

శ్రీ దేవీ కరుణా కటాక్షలబ్ధవిభవులైన శ్రీయుత కమలాంబాసుబ్బరాయుడు దంపతుల ద్వితీయ పుత్రులు, విద్వాన్ శ్రీ అగస్త్యరాజు సుబ్బారావుగారు బాల్యం నుండీ తెలుగు భాషపై మిక్కిలి ఆసక్తి గలిగియుండేవారు. తెలుగు విద్వాన్ పట్టాపుచ్చుకొని జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలల్లో తెలుగును బోధించి ఉద్యోగ విరమణచేసి విశ్రాంతి తీసుకొంటూ ఉన్నారు. ఇది వీరి వృత్తి విషయం. ప్రవృత్తి విషయానికి వస్తే వీరు కావలి పట్టణంలో ఉంటూ, చిన్మయామిషన్ తదితర సంస్థలతో అను బంధాన్ని పెంచుకొంటూ, పురాణ ప్రవచనాలలో సత్సాంగత్యం పెంచుకుంటూ కల్మషాలను తుంచుకుంటూ, సత్సంగాలను నడుపుతూ ఉన్నారు. తనలోమెదిలే భక్తిభావాలకు అక్షర రూపం ఇచ్చి కావ్యాలుగా మలచాలనే భావన కలగడంతో వీరు ఒకటిరెండు కావ్యాలను వ్రాశారు. కాని వాటితో సంతృప్తి లభించలేదు. అమ్మల గన్న అమ్మయైన ఆ, జగదంబ చరిత్రను పద్యరూపంలో వ్రాయాలని స్థిరమైన నిశ్చయంతో శ్రీ దేవీ భాగవతాన్ని తెలుగులో శిష్టవ్యావహారికంలో పద్య గద్య రూపంలో వ్రాయడం ప్రారంభించారు. ఆదేవీకృపా కటాక్షంవల్ల కుటుంబ సభ్యుల బంధుమిత్రుల సహకారంవల్ల, ఆరోగ్య స్థితిని లెక్క చేయక శ్రమించి అయిదు స్కంధాల ఉద్గ్రంథంగా వ్రాసి అందటి సహకారంతో ముద్రణచేసి సహృదయులైన పండితులమన్ననల్ని పొందారు. ఇపుడు మరల మూడు సంకంధాలను రెండవ సంపుటంగా పద్యరూపంలో వ్రాసి ముద్రించుచున్నారు. మొత్తము 6000లకు పైగా పద్యాలు వ్రాసివీరు తమ కవితా ప్రాముఖ్యతను నిరంతర ఆధ్యాత్మిక చిత్తవృత్తిని ప్రదర్శిస్తూ ఉన్నారు.

ప్రస్తుత భాగమైన శ్రీదేవీ భాగవతంలోని వృత్రాసుర వృత్తాంతము, నహుషుని భంగపాటు, వ్యాస ప్రోక్తమైనయుగధర్మాలు, హరిశ్చంద్రుని వరుణ యాగము, నారదుని పూర్వజన్మ వృత్తాంతము, అజీగర్తుని చరిత్ర, సూర్యవంశచరిత్ర, బలరాముని వివాహము మాంధాత చరిత్ర, మొదలైన పెక్కు ఘట్టములతో 3 స్కంధాలు రచించి కృతకృత్యులైనారు. ఇంతటి ఉద్గ్రంధాన్ని వ్రాయాలంటే ఆరోగ్యం, ఓపిక, శక్తి, తీరిక వంటివి ఉండడమేకాక ఆ

భగవతి అనుగ్రహం తప్పక ఉండాలి. ఉండబట్టే శ్రీసుబ్బారావుగారు అనర్గళమైన కవితాధారతో, అన్నివృత్తాలను ప్రయోగిస్తూ, సందర్భోచిత భాషా శైలీ సంపన్నతతో, అలంకారయుక్తంగా, సంభాషణా చాతుర్యంతో, సరళ గంభీర మృదు పదవిన్యాసాలతో, సహృదయ హృదయంగమంగా, శ్రీ దేవీ మహిమలను వెలువరిస్తూ ఈ రెండవ సంపుటాన్ని దివ్యశక్తి సమన్వితంగా, రచించగలిగారు. గ్రంథరచన చెయ్యాలంటే భగవంతుడిచ్చిన ప్రతిభతో బాటు, బహుగ్రంథపఠనం వలన వచ్చిన పాండిత్యము, నిరంతర రచనా వ్యాసంగంవలన వచ్చిన అభ్యాసము అత్యావశ్యకములు, శ్రీసుబ్బారావుగారి పద్యాలు చదువుతూ ఉంటే వారికి గల ప్రతిభాపాటవాలు అభ్యాసం బోధపడుతూ ఉంటాయి. అయాసన్ని వేశాలను బట్టి పద ప్రయోగం చేయడం, సన్నివేశానికి వన్నె తెస్తుంది.

వీరు సాధ్యమైనంత వరకు సాధారణ పాఠకునకుగూడ అర్థమయ్యే రీతిలో రచించడానికి ప్రయత్నం చేశారు. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారు వీరి మొదటి సంపుటాన్ని పండిత పరిశోధన గావించి ఆమో దించి ముద్రణకు సహాయ సహకారాలం దించడం వీరి సామర్థ్యానికి మంచి ఉదాహరణగా చెప్పవచ్చు వీరి కవితాధార గంగా ప్రవాహంలా సాగిపోతూ ఉంటుంది. మచ్చునకు "అలికులవేణి యూర్వశి నవాబ్జ దళేక్షణ..................... మొప్పగన్

ఈ పద్యం సరళమైన సంస్కృత పదసమాసాలతో, అలంకార యుక్తంగా ప్రాచీన ప్రబంధకవుల ఒరవడిని తలపిస్తూ ఉంది. వసు చరిత్రలో "అలికులవేణి యారు నవయౌవన మన్ వలరాచ తోటలో పోలుచు నితంబ వేదికడ పొక్కిలి డిగ్గియ చెంతనీలసంకలిత నవాంబు యంత్రమగు ................ అన్న పద్యం ఈ పద్యం చదవగానే స్ఫురణకు వస్తుంది. అదేరీతిలో సరళమైన సంస్కృత వాక్యములతో, ధారాళంగా సాగిన ఈ పద్యాన్ని గమనించండి

"స్వాధ్యాయమ్ములు సాంధ్యకృత్యములు సత్సాంగత్యముల్ నిత్యదే
వీధ్యానమ్ములు సత్యశౌచతతియున్ విధ్యుక్త కర్మాదులున్
అధ్యాత్మస్థితు లాతిథేయములు నిత్యా నందముల్ గల్గ శా
స్త్రాధ్యానమ్ముల విప్రులొప్పెదరు రాజా సత్య కాలంబునన్"

పై పద్యంలో వాక్యసంయోజన పొంకంగా ఉంది పద్యం చదువుతూ ఉంటే ఒక లయగోచరిస్తూ ఉంది. ఇచట మహాకవి పోతన గారు స్ఫురణకువస్తున్నారు.

"అంధేందూదయముల్, మహాబధిరశంఖారవముల్ మూక సద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసక వధూ కాంక్షల్, కృతఘ్నావళీ బంధుత్వంబులు" మొదలైన విధంగా చిన్నచిన్న సంస్కృత వాక్యాలలో పద్యం మధురంగా సరళంగా మనోహరంగా ఉండడం మనం గమనించవచ్చు.



సందర్భోచితంగా చక్కని సందేశం, నీతి ఈ కావ్యంలో కవి పొందు పరిచారు. ఆత్మహత్యమహాపాపం అని అంటారు. కనుక ఆత్మహత్యలను ఖండిస్తూ దానివలన ప్రయోజనం లేదని చెప్పడం ఈ క్రింది పద్యంలోని సారాంశం.

"ఆత్మహత్యవలన నడగునే శాపమ్ము
జన్మ జన్మలకును సాగిరాదె
కర్మమను భవమున గాక తొలంగునే
అట్టి యెడల నాత్మహత్యలేల" (7-279)

చేసిన కర్మ అనుభవిస్తేగానిపోదు లేకున్న అది జన్మజన్మలకు మనవెంట వస్తూ ఉంటుంది. అటువంటప్పుడు మన బాధల్ని తొలగించుకోడానికి ఆత్మహత్య చేసుకొన్నందువల్ల ఉపయోగంలేదని కవి యుక్తియుక్తంగా వివరించిలోకానికి చక్కని సందేశాన్ని అందించారు.

ఇది పురాణ కథయైనప్పటికి, ఇందలి చారిత్రక భౌగోళిక విశేషాంశములను గూడా ఈ కవి వదలక, వాటిని చక్కని సీస పద్యాలలో రమ్యంగాను సుబోధకంగా రచించి, పాఠకులలో మరింత విజ్ఞానాన్ని పొందుపరచి సంతృప్తిని కలిగిస్తూ ఉన్నారు.

ఉ॥ జంబూద్వీప వర్ణనము

"శతయోజనసహస్రవితతవిస్తీర్ణమై, పద్మకర్ణిక భంగివర్తులముగ నమరిజంబూద్వీపమల రారుచుండును నవవర్షములతోడి ప్రవిమలముగ; అందుమహా గిరులష్ట సంఖ్య గలవు ద్వీపమ్ముజుట్టి సుదీర్ఘ మగుచు, ధనురాకృతినిబొంది తన్మధ్య భాగాన వరలు నిలావృత వర్షమెలమి దీనికేంద్రమునందు దివ్యమై భాసించు మేరు పర్వతము గంభీరవృత్తి, నొప్పు లక్షయోజననముల నున్నతమున, ఆసువర్ణాద్రి భూగోళమందు మధ్య, నమరియున్నది కడుదీర్ఘమైన శిఖర భాగమును గల్గి కేంద్రపర్వతమనంగ"

ఈ విధంగా శ్రీ అగస్త్యరాజు సుబ్బారావుగారు తన మదిలో మెదిలే దేవీ భక్తి భావనకు కృతిసమర్పణ చేసి చక్కని పద్యగద్యాలతో రసోచితమైన పదబంధంతో, దేవీ మహిమలను వివరిస్తూ సాహితీవిలువల్ని పరిపోషిస్తూ, ఒక మహాయజ్ఞంగా నిర్వహించి, కవి పండితమన్ననల్ని పొందడం హర్షించదగ్గవిషయం పాఠకులు ఈ గ్రంథాన్ని చదివి, ఇందలి కథాంశాన్ని, దేవీమహత్త్వాన్ని అర్థంచేసుకొని భక్తితో తరిస్తారని ఆశిస్తున్నాను. భగవంతుడు వీరికి ఇతోధికమైన శక్తిని, అనుగ్రహించి వారి కృషికి సంపూర్ణమైన ఫలితాన్ని అనుగ్రహించాలని మనసారా ప్రార్థిస్తున్నాను.

ఇట్లు
**భక్తజనవిధేయుడు**
**డాక్టర్. చీమకుర్తి వేంకటేశ్వరరావు**

# చలంచ్యాల వేంకట సుబ్రహ్మణ్యశర్మ



దేవీ ఉపాసకులు, రాష్ట్రప్రభుత్వమునుండి
ఉత్తమ ప్రధానోపాధ్యాయుడుగా అవార్డు పొందిన
రిటైర్డ్ హెడ్ మాస్టర్
కావలి.

## పాఠకులకు మనవి

హయగ్రీవ దేవుని నుండి, దేవీతత్వమును తెలుసుకొని, మానవులకందించిన శ్రీ అగస్త్య మహర్షి ఆదిదేవునకే ప్రణవరహస్యమును ఉపదేశించిన ఆతని కుమారుడైన శ్రీ సుబ్రహ్మణ్య స్వామి వారల నామముల లోని శబ్దములతో గూడిన నామము గలిగిన శ్రీ అగస్త్యరాజు సుబ్బారావుగారిని, నేను కావలి జిల్లా. పరిషత్ ఉన్నత పాఠశాల యందు ప్రధానోపాధ్యాయునిగా పనిచేయునపుడు, మొట్టమొదటి సారిగాచూచుట జరిగినది. వారు అపాఠశాలయందు ఆంధ్ర భాషా పండితునిగా పనిచేయుచుండిరి. వారు ఆసమయమునందే వారి బోధనా పటిమను పాండిత్యప్రాశస్త్యమును ఆధ్యాత్మిక పట్టును అన్నిటికన్నమించి వారి నిరాడంబరత్వమును నేను పూర్తిగా గుర్తించి, వారి నుండి మానవులకు ఆధ్యాత్మికముగా ఉపయోగపడు రచనలు రాగలవని విశ్వసించి, ఆవిషయము ఆనాడే నాకుటుంబ సభ్యులకు, మిత్రులకు, బంధువులకు సందర్భానుసారముగా చెప్పుచుండెడివాడను. ఆధ్యాత్మిక ఉపన్యాసములనిచ్చుటలో అతనికి అతనేసాటి. నా విశ్వాసము వమ్ముగాలేదు. భగవతి కృపా కటాక్ష వీక్షణంబువలన, ఆమె ఆదేశముల మేరకు శ్రీసుబ్బారావుగారు పదవీ విరమణానంతరము, వేదవ్యాస విరచితమయిన శ్రీ దేవీభాగవతమును సంస్కృతమునుండి ఆంధ్రములోకి అనువదించపూనుకొని మొదటి అయిదు స్కంధములను, ప్రథమ భాగముగా 2011 జూలై నెలలో ప్రజలకందించి "అభినవపోతన"గా ప్రఖ్యాతిగాంచిరి. ఆగ్రంథము పండితుల పామరుల సాహితివేత్తల భగవద్భక్తుల ప్రశంసల నంది, నేడు అనేక గృహములందు పారాయణ గ్రంథముగా వెలుగుచున్నది.

ఈ సందర్భమున స్వోత్కర్ష అయినను అవసరమయినందున, ఒక చిన్న విషయమును తెలియపరచ వలసియున్నది నా పితృ, పితామహ, ప్రపితామహుల నుండి, మా వంశమునందు పంచాయతన పూజ నిత్యము జరుగుచుండును. శరన్నవరాత్రులందు దేవీ భాగవతపారాయణము వసంత నవరాత్రులందు శ్రీమద్రామాయణ పారాయణము నిష్ఠగా, దీక్షితో మాతాతగారైన కీ॥శే॥సూర్యనారాయణయ్య పంతులు గారు, మాతండ్రి గారైన కీ॥ శే॥ శ్రీరాములు పంతులుగారు చేయుచుండుట వలన వంశా చారము గా నాకునూ అట్టి ఆచారము అలవడినది. అదృష్టవశముననో లేక భగవత్కృ పవలననో నా అర్ధాంగి శ్రీమతి భానుతులశమ్మ గూడ అట్టి నైష్ఠికాచార కుటుంబము నుండి యే వచ్చుటవలన, నా వంశా చారమునకు ఎట్టి ఆటంకములు గాని యిబ్బందులు గాని కలుగలేదు.



నాఇంట శ్రీ సుబ్బారావు గారి దేవీ భాగవత ప్రథమ భాగమును చూచి, చదివి, ఆనందించిన నా మిత్ర, బంధు వర్గము వారు ద్వితీయ భాగము ఎప్పుడు చూడగలమని నన్ను పదే,పదే, అడుగుచుండ, ఆదేవీ అనుగ్రహము చేత, శ్రీ సుబ్బారావు గారు ద్వితీయ భాగమును ప్రథమ భాగమునకన్న మిన్నగా అనువదించి, ప్రజల కందించుటకు సిద్ధము చేసినందులకు నాకెంతయో ఆనందముకలిగినది. ప్రథమ భాగమునేగాక ఈ ద్వితీయ భాగమును గూడ ముద్రణకు ముందే కూలంకషముగానేను పారాయణము చేయుట జరిగినది. వ్రాతప్రతిని శ్రీ సుబ్బారావుగారు "తొలిఏకాదశి" అయిన తే08-07-2014ది న నాకుయిచ్చి, దానిని చదివి, నా అభిప్రాయమును తెలుపవలసినదిగా కోరిరి. అదినా అదృష్టమను కొందును. ఆదినము నుండియే ఈ గ్రంథమును పారాయణము చేయుచుండ, నా శ్రీమతియు నా ప్రక్కనే కూర్చొని, వినుచు మధ్య మధ్య ఈ గ్రంథమునందలి ముఖ్య విషయముల ప్రాముఖ్యత గూర్చి నాతో చర్చించుచుండెడిది. అట్టి సమయములయందు ఒక విచిత్రమైన అనుభూతి మాకు కలిగినది. ఈ దేవీ భాగవత పారాయణ సమయమందు మాకు దగ్గరగ ఒక స్త్రీమూర్తి ఉన్నట్లుగ మాకు ఛాయామాత్రముగా గోచరించుచుండెడిది. నా ఇంటి యందు మేమిద్దరమేతప్ప మూడవ వ్యక్తి ఎవ్వరును లేరు. శ్రీ సుబ్బారావును ప్రేరేపించి వారిచే ఈ రచన చేయించిన మహాదేవీయే ఆమె అని మా నమ్మకము. ఆది మా నమ్మకము మాత్రమే. పవిత్ర పారాయణ గ్రంథము నావహించి ఆ గ్రంథస్థ దేవీ, దేవతలు ఉందురని పెద్దలు చెప్పగా వింటిని. అందువలన అట్టి గ్రంథములను ఎల్లప్పుడు పూజామందిరమందు ఉంచి పూజించ వలయును అని వినియుంటిని. శ్రీ సుబ్బారావు గారిచే రచించబడిన ద్వితీయ భాగమైన దేవీ భాగవతము మహాదేవి యొక్క అనుగ్రహమునకు పాత్రమైనదని మా అనుభవము వలన తెలిసికొని ఇట్టి దివ్యమైన గ్రంథమును లిఖించిన శ్రీ అగస్త్యరాజు సుబ్బారావు దేవీ అనుగ్రహ కటాక్షములతో ఇంకను మానవులను ఆధ్యాత్మిక మార్గములవైపు నడుపగల రచనలను కొనసాగించగలరని ఆశించుచు ప్రతిఒక్కరు ఈ గ్రంథమును నిత్యపారాయణగ్రంథముగా ఇంటియందుంచుకొని దేవీ అనుగ్రహ పాత్రులై మానవ జన్మను సార్థకముచేసుకొనగలరని నమ్ముచున్నాను.

ఇట్లు
దేవీ ఉపాసకులు
**చలంచ్యాల వేంకట సుబ్రహ్మణ్య శర్మ**






**చలంచ్యాల సూర్య ప్రకాశరావు** M.Sc,: M.ed
**విశ్రాంత ప్రధానోపన్యాసకులు, డైట్**

శ్రీ వేద వ్యాస విరచిత దేవీ భగవతాన్ని సంస్కృతం నుండి తెలుగులోకి అనువదించి సామాన్య పాఠకులకు అందుబాటులోకి తెచ్చిన శ్రీ అగస్త్యరాజు సుబ్బారావు గారిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. నాలుగు దశాబ్దాల ఆంధ్రభాషోపాధ్యాయ వృత్తిలో పెంపొందించుకొన్న తెలుగుపాండిత్యం, పదవీ విరమణానంతరం ప్రవచన పరంపరల కొరకు ఆర్జించిన ఆధ్యాత్మిక వైభవం, అగస్త్యరాజు వంశీయులనుండి పుణికి పుచ్చుకొన్న వారసత్వ కవితా పాటవం కలగలిపి తన అనువాదాన్ని సుసంపన్నంచేసుకొన్న సుబ్బారావు గారు కన్యాదాన ఫలితంగా లభించేవిధంగా దశపరేషాం, దశావరేషాం, 21 తరాలను తరింపచేయ గలరన్నది నిర్వివాదాంశం. ఒక జాతి ఫలాల నుండి అదే జాతి ఫలరసాన్ని మనకందచేయగల యంత్రాల వలె కాక నారికేళపాకమైన సంస్కృత గ్రంథం నుండి ద్రాక్షపాకాన్ని మనకందజేసిన ఈ ప్రయత్నం బహుధాప్రశంసనీయం మూలగ్రంథంలోని భాషా వైభవాన్ని, భావాన్ని, అందాన్ని, అలంకారాన్ని యథాతథంగా తెలుగులోకి అనువదించగల కవి ప్రజ్ఞాపాటవాలు అభినందనీయం. తెలుగు సేతలో విహరించిన మత్తేభాలు, శార్దూలాలు, భావాన్ని అత్యంతరమణీయంగా అలంకరించిన చంపకములు ఉత్పలమాలలు, కరిగించి మూసలలోపోసిన సీసములు తేటగీతులుగా ఆలపించబడిన ఆటవెలదులు కందములు, అగస్త్యరాజు గారి చందోబద్ధతకు, రచనాశైలికి పదప్రయోగ నిపుణతకు నిలువెత్తు నిదర్శనాలు.

తెలుగు వారి మనసులలోకి నేరుగా చొచ్చుకొని పోగల ప్రయోగాలు, నానుడి, శైలి, సుబ్బారావు గారికి చిరకీర్తిని ప్రసాదించగలవన్నది యథార్థం "లోకమందు నేజనని నిజాత్మజున్ విడువజాలును సత్కృప మాలి" "ఆ సత్యమె మీకు సాక్ష్యముగ శాశ్వత సఖ్యము గల్గుగావుతన్" "ధర పోగాలము వచ్చిన వానికి హితమదెట్లు చెవులకు నెక్కున్" అపయశమ్మును పొందిన యట్టి యెడల మేన ప్రాణములున్న నేమౌనుఫలము" "కర్మములవ్వియె జన్మకుకారణములు కర్మతొలగిన జన్మలు కలుగ వింక", సమ్మతి జగదంబ నామమును జపించుచున్నచో వెతలునుపాపముల్, వృద్ధి యగున్ సుఖశాంతు లీకలిన్" వంటి సూక్తులు మానవ జీవిత నౌకకు చుక్కాని వంటి సూచనలు, కావ్యముల్ వ్రాయునే ఋషికానివాడు అన్నసూక్తి యథార్థమని, సుబ్బారావుగారు కూడ గతజన్మలలో ఋషి కానిచో ఆ సౌశీల్యత, సాహిత్యము, పాండిత్యము, ఈ అనువాదము లభ్యము లయ్యేడివి కావని నా ప్రగాఢ నమ్మకము. వీరి కలం నుండి ఇంకా ఇంకా అనేక కావ్యాలు తెలుగుజాతికి అందించబడగలవని ఆశిస్తూ, వారికి ఆశక్తినివ్వవలనదిగా భగవంతుని ప్రార్థిస్తూ, వారిని వారి కుటుంబ సభ్యులను ఆయురారోగ్య ఐశ్వర్య కీర్తి ప్రతిష్ఠలతో వర్ధిల్లగలరని ఆశీర్వదిస్తున్నాను.

**ఇట్లు**

**చలంచ్యాల సూర్య ప్రకాశరావు** M.Sc,: M.ed
**విశ్రాంత ప్రధానోపన్యాసకులు, డైట్**
**కావలి**



**నాట్యావధాన కళాస్రష్ట**
**డా॥ ధారా రామనాధ శాస్త్రి,** M.A.PH.D.
**విశ్రాంత ఆంధ్రశాఖాధ్యక్షులు, శర్మకళాశాల, ఒంగోలు**

**మాన్య శ్రీ విద్వాన్ అగస్త్యరాజు సుబ్బారావు గారికి**
**నమస్కారములు, ఉభయకుశలోపరి**

అర్యా !

మనము శంకరజయంతి సందర్భముగా కావలిలో కలసినపుడు మీరు నాకు దేవీభాగవతమును ప్రీతితో ఇచ్చినందులకు కృతజ్ఞతా పూర్వక నమస్కారములు

ఆర్ష ప్రబోధము ఆకరముగా గల దేవీ భాగవతము అనన్యమైనది. ప్రౌఢ సుందరము – ధర్మ ప్రబోధకము. దానిని మీరు ఆంధ్రీకరించి ఆంధ్ర పాఠకవర్గము యొక్క కృతజ్ఞతను చూరగొనినారు. మీ కవిత ప్రతి పద్య హృద్యము. ప్రత్యక్షరమును అనన్య ధారాశుద్ధి, అసదృశ అభివ్యక్తి కలిగి ద్రాక్షాపాకమున నడిచినది. చదువరుల నిట్టె ఆకర్షించి కావ్యగత మహార్థమును వారికి అవగతము చేయగల శక్తి మీకు దైవదత్తము. ఇట్టిమహత్తరవాఙ్మయసేవయొనర్చిన మిమ్ములను మనసార అభినందించుచున్నాను. త్వరలో ద్వితీయ భాగము రావలెననియు పరమేశ్వరికృపచేత మీరు శతమానము వర్ధిల్లి ఇతోధిక కావ్యసృష్టి కావింపవలెననియు నా ఆకాంక్ష

**భవదీయుడు**

**ధారా రామనాధ శాస్త్రి**

# అభినందన




## "అరుణశ్రీ" విద్వాన్ అల్లంపాటి వేంకటేశ్వరరెడ్డి

**అల్లంపాటి రామాయణాది గ్రంధకర్త**
**విశ్రాంత తెలుగు పండితుడు**


శ్రీయుతులు మాచిరకాలమిత్రులు "అభినవపోతన" బిరుదాంకితులు విద్వత్కవి వరేణ్యులు శ్రీ అగస్త్యరాజు సుబ్బారావుగారు ఇంతకుముందు శ్రీదేవీ భాగవతములోని 5 స్కంధములను అనువదించి ప్రకటించియున్నారు. పీఠాధిపతులు, అవధానులు, కవులు పండితులు చదివిన తెలుగు ప్రజలు కవిగారికి అభినందనలు ఆశీర్వాదములు తెలుపుచున్నారు. దేవీ భాగవతంలో శ్రీ సుబ్బారావు కవీంద్రులు ప్రస్తుతము షష్ఠస్కంధము సప్తమ స్కంధము అష్టమ స్కంధములను అనువదించి ఆంధ్ర సరస్వతికి వన్నెగూర్చిరి. ఇంకను వీరు తక్కిన స్కంధములననువదించి సంపూర్ణ దేవీ భాగవత రచన పూర్తి చేయుటకు స్థిరచిత్తులై దీక్షబూనినారు. వీరికి శ్రీదేవీ కరుణా కటాక్షములు సంపూర్ణముగా కలవు.

అష్టాదశపురాణములందు ప్రశస్తిగన్న శ్రీవ్యాస దేవీ భాగవతము తెలుగులోనికనువదించి తెలుగు భాషను పరిపుష్టముచేసి తెలుగులోకానికి మహోపకారంచేయనెంచిన అభినవపోతన శ్రీ అగస్త్యరాజు వారి దృఢ దీక్ష కొనియాడదగినది. ఇందు షుమారు 2006 పద్యములున్నవి వీరి ప్రతిపద్యం ఎంతోహృద్యం. ఈ కవి కారణజన్ములు. దేవీభాగవతమును తెలుగు వారి కందించుటకే బ్రహ్మయీ కవీంద్రుని సృజించి నాడనవచ్చును.

వీరిపై కవిత్రయము, శ్రీనాధ, పోతన, పెద్దన, రామకృష్ణుడు మొదలైన ప్రబంధ కవుల ప్రభావము కలదు. అధునిక కవులు తుమ్మల, గడియారం, కరుణశ్రీ, జాషువా, దువ్వూరి రామిరెడ్డి, దాశరథీ, గారల ప్రభావము సుబ్బారావుగారి పద్య శిల్పంలో కనపడును. వీరి కవిత్వము మెత్తమెత్తగా హృదయానికి హత్తుకొనును. గతములోని వీరి రచనలు వన్నె కెక్కినవి. వీరితో కలసి సంస్కృత కళాశాల (నెల్లూరు)లో చదువుకొనుటయు జి. ప్ర.ప.ఉన్నతపాఠశాల – కావలి బ్రహ్మశ్రీ సి.వి.యస్.శర్మగారు వారి సోదరులు సూర్య ప్రకాశరావుగారి ఆధ్వర్యములో కలసిపనిచేయు భాగ్యము నాకు కలిగినది.

శ్రీదేవీభాగవతములోని ప్రతిఘట్టము దేవీ సత్కరుణతో కూడియుండును.

ఇందలివర్ణనలు ఎఱ్ఱనవలె, పద్యములోని జిగి పెద్దనవలె, నడక పోతనవలె, భావములు తక్కిన ఆధునిక కవుల పోకడలతోకూడివున్నవి.



ఈదేవీభాగవతములో హరిశ్చంద్రోపాఖ్యానములో – కొన్ని మార్పులు ఉన్నవి. ఇచ్చట చంద్రమతికి మాధవీలత అనునది నామాంతరముగా భావించవలసి యున్నది. లోహితుని పేరు రోహితుడనియున్నది. నక్షత్రకుని పాత్రలేనే లేదు. నక్షత్రకుని బదులు విశ్వామిత్రుడే హరిశ్చంద్రుని ధనమడుగును. రాజ్యదానమిచ్చిన పిదప దక్షిణకు బంగారమిచ్చెదనని రాజు పల్కును. ఆదక్షిణ నెపముతో విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని బాధించును. అప్పుడు విశ్వామిత్రునితో హరిశ్చంద్రుడు పలికిన పద్యమును పరిశీలింపుడు.

తే॥ ధారవోసిన దానిని తగునెముట్ట
కాలమదినాకు నొక్కటఁ గలసిరాగ
దక్షిణగ నిత్తు స్వర్ణమున్ దప్పకేను
వేచియుండుము స్వామి! యా వేళదనుక

విశ్వామిత్రుడు నీ సత్యమే నీ కొంప ముంచినదియను సందర్భములో హరిశ్చంద్రుడు సత్యముయొక్క మహిమను గూర్చి చెప్పిన పద్యము మనోహరము.

సీ॥ ఇన చంద్రతారక ..................................
......................

శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతలో
యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదా ౨౨ త్మానం సృజామ్యహమ్
పరిత్రాణాయ సాధునాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే

అని ధర్మహాని జరిగిన తానే యుగయుగాలలో అవతరించెదనని అర్జునునకు శ్రీకృష్ణ భగవానుడుచెప్పెను.

అదే విధముగా ఈ దేవీ భాగవతములో హిమవంతునకు ప్రత్యక్షమై శ్రీదేవీ ధర్మగతిని బోధించును. అందులో ఈ పద్యమును పరిశీలింపుడు.

తే॥ వేద ధర్మమ్మునకు హాని విస్తరిలిన
యుగయుగమ్ముల తద్ధర్మముద్ధరింప
నవతరించెద నేను తదను గుణముగ
రూపముల దాల్చి దుష్టుల రూపుమాప

శ్రీదేవీకూడ ధర్మహాని జరిగినప్పుడు తగినట్లు
జన్మించి ధర్మము కాపాడుతానని శ్రీకృష్ణుని వలె చెప్పినది.

యోగ విషయములు కూడ సరళముగ కవిగారు విపులీకరించనారు.

సుబ్బారావు గారు సహజముగా నటులుగావున వీరిపద్యములు తిక్కన, తిరుపతి వేంకట కవులు, బలిజేపల్లి మొదలగు వారి పోకడలతో నాటకీయత పెక్కు పద్యములలో ప్రస్ఫుటమగుచున్నది.నాటకీయతకు మనువు జగదంబను ప్రార్థించు పద్యమును తిలకింపుడు.

శా॥ నీరూపమ్మునె నిల్పుకొందుమదిలో నిన్నే జపింతున్ సదా!
నీరమ్యంబగు నామముల్ దలచెదన్ నీగాథలాలించెదన్
నోరారన్ భవదీయ కీర్తనల నెంతో తృప్తిమై పాడెదన్
నేరంబెంచక నాదు విన్నపము మన్నింపంగదే యీశ్వరీ!

దేహాంతర్గత జ్యోతిశ్చక్రము చక్కగా వర్ణింపబడినది. శ్రీ లోకమాతా! పరబ్రహ్మరూపీ......... నమస్తే నమః అను దండకముతో ఫలశృతితో అష్టమ స్కంధము సమాప్తమైనది. విశిష్ట భారతావనిలో "భరతోర్విన్ జనియించునట్టి జనులే భాగ్యోన్నతుల్ నారదా........ భక్త్యున్నతిన్ అని మన దేశంయొక్క పవిత్రతను ఔన్నత్యమును చక్కగా కవివర్యులు వివరించియున్నారు. అవీచీ నరకమును గూర్చి చెప్పు పద్యమును ఒకదానిని పరిశీలింపుదు.

తే॥ కూట సాక్ష్యమ్ము లిడువారి గుదులసొమ్ము
లూడ్చుకొని కుల్కువారి నత్యున్నత గిరి
శిఖరముల నుండి ద్రోతురు శిరము క్రింద
గాగవడి నవీచీ నరకమున భటులు

శ్రీ సుబ్బారావు గారి శ్రీదేవీ భాగవతము అష్టాదశ పురాణములలో ఒక పురాణముగా, ఒక కావ్యముగా ఒక ప్రబంధముగా దృశ్యకావ్యముగా విశిష్ట గ్రంథరాజముగా విశేషించి నిత్య పారాయణగ్రంథముగా తెలుగుల కరదీపికగా మోక్షమార్గ సోపానమైయున్నది. అవిరళ కృషితో రచింపబడిన అపారవిజ్ఞాన గ్రంథరాజమైన శ్రీదేవీభాగవతమును తెలుగువారికందించిన అభినవ పోతన అగస్త్యరాజు సుబ్బారావుగారు అభినందనీయులు ఆయురారోగ్య భాగ్యాలతో ఈ కవి గారిని, వీరి కుటుంబసభ్యులను శ్రీదేవి కటాక్షించి రక్షించుగాక! అమ్మదయతో తక్కిన స్కంధములు తెలిగించి తెలుగువారికి విజ్ఞాన వెలుగులను ప్రసాదించి తెలుగు భారతికి సంపూర్ణమైన హారమును కంఠసీమలో అలంకరించగలరని ఆశిస్తూ అన్ని విధముల కవి పాఠకులను అందరిని కటాక్షించమని శ్రీదేవీని ప్రార్థించుచున్నాను.

ఇట్లు
బుధజన విధేయుడు
**"అరుణశ్రీ" విద్వాన్ అల్లంపాటి వేంకటేశ్వరరెడ్డి**



అల్లంపాటి రామాయణాది గ్రంథకర్త
విశ్రాంత తెలుగు పండితుడు
పరికోట - కలిగిరి మండలం, నెల్లూరు జిల్లా.







**బ్రహ్మ శ్రీ అగస్త్యరాజు సుబ్బారావు** గారిని
అభినందిస్తూ వారికి, వారి వంశమునకు
సకలాయురారోగ్య భోగభాగ్య శుభములనీయ
ఆదిపరాశక్తి మాతను ప్రార్థిస్తూ............ నివేదిస్తున్న

గీ॥ వంశమా ! అగస్త్య మహర్షి వంశమయ్యె !
గోత్రమా ! కౌశిక మహర్షి గోత్రమయ్యె !
విద్యయా ! ఆంధ్రభారతీ విభవమయ్యె !
నామధేయమా ! వేంకట నామమయ్యె !
అనఘుడీ కవి చంద్రుని నభినుతింతు !!

శా॥ నాకున్ మిత్రుడు నుత్తముండు మఱియు న్నాకాప్తుడెంతేనియున్
రాకన్ మానడు కష్టవేళల నుదారం బొప్పు నోదార్చగన్
దూకున్ ముందుకు నేకవిత్వవరసద్గోష్ఠుల్ గనన్, బాల్గొనన్
సోకన్ రావతనిన్ దురూహలెపుడున్ శోధింప నెవ్వారలున్ !!

సీ॥ సద్వంశ మందున జన్మించె పృథ్విని
సత్వగుణోపేత సచ్చరితుడు
ఉద్యోగ ధర్మమున్ యోగ్యతన్నెఱవేర్చి
మేధావి యని మెప్పు నందెనతడు
సచ్ఛీల అర్ధాంగి, సద్గుణులిర్వురు
సుతలు, సజ్జనుడగు సుతుడొకండు
సత్కుటుంబీకులై సంసారమును వీరు
నీతి, గౌరవమొప్ప నెఱపు చుండు

గీ॥ దేవి భాగవత గ్రంథ దివ్యరచన
భక్త్యుపాసకుడై జేసి భవ్యుడయ్యె
ఆయురారోగ్య భాగ్యసౌఖ్యములనిచ్చి
వారి వంశకీర్తియు దిశల్ వ్యాప్తి చెంద
సత్కవిని కృపన్ గన పరాశక్తి నిన్ను
సర్వమంగళ ! స్తుతియింతు సతతమమ్మ !!

**నే॥ విఠల్‌రావు**
కవి, గాయకుడు, నటుడు, దర్శకుడు,
ఆంధ్ర పౌరాణిక సాహిత్య కవిత్వ నాటక రంగం,
మరియు, అధ్యక్షుడు శ్రీ సాయి నాటక కళామండలి, కావలి.

ఇట్లు విశ్వమంగళ కల్యాణా కాంక్షి
**ఊరుబిండి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి**
**దశసహస్రాధిక కవితా వనపంచాస్యం కవిబ్రహ్మశ్రీ తిక్కనామాత్య సాహిత్య కవిరచయితల సంఘం**
**వ్యవస్థాపక అధ్యక్షుడు, మరియు అధ్యక్షుడు (క.తి.సా.క.ర.సం)**
**27-1-840, బాలాజినగర్ నెల్లూరు - 2**
**ఫోన్ : 0861-2303825, సెల్ : 9293709321**



## ప్రశంస

**శ్రీ మ'దగస్త్యరాజా'న్వయ సంభూతులు తెలుగు 'విద్వాన్' పట్టభద్రులు:-**

అయిన - సుబ్బారావుగారు శ్రీ మరియు శ్రీమతి కమలమ్మా సుబ్బారాయుడు దంపతుల; మూడవ గర్భశుక్తి ముక్తా ఫలంగా తే 1-7-1949న జన్మించారు. వీరికుటుంబం, భాష ఆచార సంప్రదాయ వేషాల విషయంలో ప్రాచీనత పట్లమొగ్గుc జూపునది. కనుక వీరి, విద్యాభ్యాసాదులావైపుననే, కొనసాగినవి. వీరి ధర్మపత్ని రత్నమ్మగారు. వీరికి కుమారుడొక్కడు కుమార్తెలిద్దరు కలరు. అందరున్నూ, ఉన్నత విద్యావంతులే, ఉత్తమ కుటుంబీకులే, సంతానద్వయ సంశోభితులే. వీరు ఉపాధ్యాయ వృత్తిలో వివిధ ప్రాంతాలలో వుంటూ, వేలాది మంది నుత్తీర్ణుల నొనరించి, విద్యార్థి లోకానికి ఆదర్శ ప్రాయులైనారు. కనుక నే, వృత్తిలో నున్నంతకాలం నిబద్ధతగాపని చేసి; విశ్రాంత జీవనమారంభమైనాక జీవన పావనతకు తోడు ధన్యతకు నీడైన శ్రీమద్దేవీభాగవత. తెలుగు పద్యకావ్యరచనానువాదమునకు, పూనుకొని, అవిశ్రాంతంగా తనకుగల-'విద్యా, వినయవివేకపాటవాలతోయిప్పటికే, మూడున్నరవేల పైగా పద్యాలతో, అయిదుస్కంధములను వెలువరించుటేకాక, మరొకమూడు స్కంధములను కూడా, తెనిగించి ముద్రించినారు. వీరి భాష-సరళముగా-ధారాళముగా-పట్టువిడుపులతో, మంచి యొడుపులతో, కదురమణీయముగా -శృతిపేశలముగా, పఠితలకుత్సాహజనకముగా, శ్రోతల కానందదాయకముగా, నలరారినది. ఇందుల కీయనయొనరించిన కృషి- భాషాపరిశ్రమ-పట్టుదలలకు-తోడు ఆరాధ్యదేవతయైన, శ్రీదేవీ కృప - విశేషించి- సహకరించినది. మిక్కిలిగా-నుపకరించినది. శ్రీ దేవీ భాగవతమునకిది ప్రథమానువాదము కాకపోయిననూ దీని ప్రత్యేకత-దీనిదే, పద్యసారళ్యత కలదికనుక. ఏది ఏమైనాయింతటి బృహత్కార్యారంభంతో, మహత్కార్యారంభమొనర్చిన, మిత్రులు సుబ్బారావుగారు ధన్యులు మహాకవుల కోవకుచెందిన వారు. ఛందోబద్ధంగా-ఒక్కపద్యాన్నైనా చెప్పలేని వారూ. ముక్కిమూల్గి వందపద్యాలశతక కావ్యాలతో మతి భ్రమించి; మహాకవుల క్రిందపరిగణింప బడకపోతిమే యని పరితపించే బోన్ పాయిలూ, భట్టీయాలతోబహుభాషా వైదగ్ధులమని ప్రకటించు కునేవారూ, ప్రబలమౌతున్న ఈ కాలంలో, దాదాపు (10000) పదివేల పద్యాల్ని అలవోకగా అత్యంత మధురంగా - వెలువరించి ప్రచురించి ప్రాచుర్యంలోకి తెచ్చిన వారి నేమనాలో తెలుగుసాహితీ పద్య ప్రపంచమే తెలియచెప్పాల్సుటుంది!



ఒక పుస్తకాన్ని సమీక్షించడం అంటే? పాఠకుల్ని ప్రోత్సహించడమే. ఉత్తేజపరచడమే. ఉద్విగ్నుల నొనరించడమే! కాని, సముద్రాని కేతామెత్తినట్లు; చద్దియంత ఊరగాయన్నట్లు, సొంతడబ్బాను వాయించుకొనచూచినట్లు, అధిక ప్రసంగాలకుతావిచ్చినట్లు, అసందర్భాలకు పాదులు చేసినట్లు, భట్టీయాలకు పదును బెట్టినట్లుండకూడదని-నా అభిప్రాయం. గతంలో నేను పేర్కొన్నట్లు - శ్రీసుబ్బారావుగారు ఉత్తమోపాధ్యాయులు. అత్యుత్తమబోధకులు, స్థిరచిత్తులు! దృఢసంకల్పులు! నిబద్ధతగల వృత్తి జీవనంలో రూపుదిద్దుకొన్న విద్యావినయ వివేకపాట వాలను; సమాజాభ్యున్నతి వైపు మళ్ళించి, శ్రీదేవీభాగవత తెలుగు కవితాపద్యరచనకు పక్రమించారు. శ్రీదేవీ - కృపాకటాక్షాలతో అనూహ్యమైన అద్భుత ఫలితాల్ని ప్రత్యక్షీ కరింప జేసుకొన్నారు. ॥"గొప్ప గొప్పగ రచనలకోటి చేయు కంటె సద్గురుమైత్రిని కాంచుటొప్పు అట్టి గురుభక్తి సంపద అమిరె నేని లౌకిక జ్ఞానసంపత్తి లక్ష్యసిద్ధి,॥ శ్రీ సుబ్బారావుగారి విషయంలో పైసూక్తి సంపూర్ణ నిజంగా ఋజువైంది.యిక ఈ దేవీ భాగవతం, కూడా రామాయణ - భారత-భాగవతాలవలెనే ఆచంద్రసూర్యతారాత్మకమైన మహాజ్యోతి. స్వయం ప్రకాశమానమైన ఈ జ్యోతి సందర్శనానికి మన కద్దీలూ, కాగడాలూ, దీవిటీలూ, కర్పూరాలూ, చాలవు, సరికదా ఆగవుకూడా! స్తోత్ర నీరాజనాలు వర్ణనాడంబరాలు, సైతమట్టివే కావ్యంలోని పదివేల పద్యాలూ ప్రాముఖ్యం కలవే. అయినప్పుడు ఒకట్ల- పదుల-వందలలో పేర్కొనబూనడం! గ్రంథభారానికి - చోటిచ్చినట్లు పాఠకలోక సహనానికి - చేటు, చేకూర్చినట్లు న్నూ; కాబట్టి కావ్యసమీక్షాంతానికి - చేరువౌతూ, మామధ్యగల మైత్రీప్రారంభాన్నీ - ప్రవర్ధనాన్ని సోదాహరణంగా తెలియ చేస్తాను.

**నెల్లూరు గాంధీబొమ్మ సెంటర్‌లోని అభిగ్రాఫిక్స్‌లో దేవీ భాగవతం కంపోజ్ అవుతుంది.** అక్కడే నేనూ ఆరేటమ్మసుప్రభాతాన్ని అచ్చు వేయిస్తున్నాను వ్యక్తికన్నాముందు కావ్యపరిచయంతో 2010లో మొదలైన మాస్నేహం క్రమపరిణతిలో ప్రవర్ధమానమై వారు నెల్లూరికి రావడంతో బలంపుజుకుంది. పతాకస్థాయిలో పరాకాష్ఠనందుకొంది. యిక ఎప్పుడెవరమెక్కడవున్నా మామైత్రికి శైథిల్యంలేదు. రాదుకూడా. ఆయుష్మంతుని కొక సందర్భాననే నందించిన ఆశీరభినందనాలు

శా॥ శ్రీ దేవీ భగవత్కథామృతము నాసీ మంబుగా వ్రాయుచున్
ఐదింటిన్ ప్రచురించె స్కంధముల, నాపై నేడిటిన్ గూర్చుచున్
ప్రోదిన్‌జేయు, నగస్త్యరాజకుల-సంభూతుండు ధీమంతుడై
పాథోధిన్, అరచేతcబట్టినటు! సుబ్బారావు సాధించె, తాన్॥

ఉ॥ సర్వుల కర్ణమౌతెలుగు సంస్కృతులన్ మన పద్యభాషలో
నిర్వహణ మ్మొనర్చుటన! నిక్కము - రాయలనాటి, 'లెస్సలన్'
ఉర్విని విస్తరించుటయు నూహల లోవిహరింప జేయుటల్
పర్వములౌనికన్ తెలుగు బాటల వెల్గులు తెల్గు కోట్లకున్॥

తే.గీ॥ భాగవత కావ్యమన్న దీ - భారతాన,-
ప్రాణి కోటికి సౌభాగ్య పరమపదము.
కర్త - భర్తలు! పఠన సంకల్పులైన,
వారికిని సైత మమరుకైవల్యపథమె?

ఈ ప్రకారంగా - పరమమిత్ర శ్రీ అగస్త్యరాజు సుబ్బారావు గారిని తత్కృతమైన దేవీ భాగవతం తెలుగు పద్యకావ్యాన్నీ-వారికుటుంబాన్నీ - బంధుమిత్రపరివారాన్నీ - పరమ 'భగవతి, బహురూపనామధారిణి! సదా సర్వదాశతధాబహుధా-చల్లగా, కాపాడుచుండుగాక! అని కోరుకుంటూ శెలవ్.

**శుభం భూయాత్! మంగళంమహత్! జైహింద్! జైజగత్!**



## శ్రీ అగస్త్యరాజు సుబ్బారావునః సాహితీ వైభవం

శ్రీ విఖ్యాత కళాధురంధర మహా శక్త్యా సలాసాది భిః
సౌభాగ్యం సుఖభోగ భాగ్య విమలైః ప్రాధ్యాప కత్యాది భిః
దేవీ భాగవతామృతా విరళతః సౌగంధ్య మాహాత్మ్యతో
సుబ్బారావితి నామధేయక మహః శ్రేయంతి జీవంతి భో!

దత్తాత్రేయ వరప్రసాద విభవః ఏకావళీ చై క వీ
రౌ, శ్రీవ్యాసమనశ్చ నారదవిధిః వృత్రాసురోనాహుషః
జాహ్నవ్యాది నదీ సరోవర హరిశ్చంద్రాది నాడీబకాః
విశ్వామిత్ర కథా వినీత సుగుణాః వ్యాఖ్యంత్య గస్త్యాత్మకః

జ్ఞానా జ్ఞాన విధిః చ హైహయకథా శర్యాతిరాశ్విన్యకం
కళ్యాణం సతు రేవతీచ బలదేవైక్ష్వాకు వంశాదికం
మాంధాత్రోః చరితం ససత్య కథనం త్రైశంకు దేవీసుధే
శాకంభర్య మహత్వ మేతదితి తేవ్యాఖ్యం త్యగస్త్యాత్మకః॥

దక్షాపరాధ విశేషం శ్రీమాతృకా సుపీఠికాః
తారకాసుర దుష్కృతాః వ్యాఖ్యంతితేత్వగస్త్యకః
లోకాలోకాది విశేషాః గ్రహాగ్రహవిలాసతాః
సకలం సర్వలోక విన్యాసాః వదం త్యగస్త్యకః॥

హైమవతీ పరమేశ్వరయోః వివాహ సత్కథా
గణపతీ కుమారయోశ్చ వ్యాఖ్యంతిత్యేగస్త్యకః॥
శ్రీదేవీ దేవతా శ్చ సకలాః వైష్ణవమూర్తయః
శ్రీ పార్వతీచ వాణీచ సాఽ సువ్యాఖ్యంతీత్యగస్త్యకమ్॥

విశ్వం వషట్ శ్రీరామశ్చ సర్వదేవే చదేవతాః
వర్ధంతు సర్వేఽగస్త్యరాజు సుబ్బారావునం సదా॥

శ్రీమాతృ దేవీ విశేషాః బ్రహ్మ విష్ణు శివాదికాః
అగస్త్యరాజు సుబ్బారావునః మేధోఽ భివర్ధతాన్॥

ఇట్లు

**దువ్వూరి హైమా తిరువేంగడరమాకుమారః**
హైమావనం అయ్యప్పరెడ్డి పాళెం,
కలిగిరి మండలం, నెల్లూరుజిల్లా.



## పాఠకులకు మనవి

ఇది వరలో ముద్రింపబడిన శ్రీదేవీ భాగవతము ప్రథమ భాగము నందు కించిదవధానలోపమువలన అటనట కొన్ని దోసగులు దొర్లినవి. వానిని ఈ క్రింది విధముగా సవరించి చదువుకొనగలరని మనవిచేయుచున్నాను.

| స్కంధము | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ప్రథమ స్కంధము | 35.వ. వచనము 7వ లైను | పదిహేడున | పదునేడున |
| " | 62వ పద్యము 4వ పాదము | మనమున........... మాహాత్మ్యంబుల్ | మనముల గణియింతురామె మాహాత్మ్యంబుల్ |
| " | 99వ పద్యము 3,4, పాదములు | వినుదుశుభా........ ............ నెవ్వారున్ | వినుడు శుభాశుభములనే ర్పున సహియించుటయె మిగుల మోదము గూర్చున్ |
| " | 107వ. పద్యము 3,4, పాదములు | భవబంధ........... .......... సంస్మరణంబుల్ | మా వివిధ బంధ నములన్ నీవే మాయింపగలవు నిర్మల చరితా! |
| " | 161వ పద్యము 2వ, పాదము | సైగల.............. నా | యుగ సంజ్ఞల బ్రోచెడి పురుషోత్తమ! నాయీ |
| " | 170వ పద్యము 4వ, పాదము | తలపోతున్ | తలతు మదిన్ |
| " | 243వ పద్యము 2వ, పాదము | మౌదేహులన్ | దార్ఢ్యాంగులన్ |
| " | 261వ పద్యము 4వ, పాదము | వివర్ధ సరాగ | వివర్ధిత రాగ |
| " | 517వ పద్యము 1వ, పాదము 2వ, పాదము 4వ, పాదము | లోచనన్ గెన్ పొంపు లతాంచిని | లోచనన్ గనెన్ సొంపు లతాంగిని |
| ద్వితీయ స్కంధము | 108వ పద్యము 3వ, పాదము | చేతమునన్ దలపోతు | చేతమునందుఁ దలంతు |
| " | 149వ పద్యము 3,4,వ పాదములు | జేరి,పా వన | మెల్లగాఁ జని |

| | | | |
|---|---|---|---|
| ॥ | 396వ పద్యము<br>4,వ పాదము | వాజ్ఞిశాత | వాజ్నిశాత |
| తృతీయ<br>స్కంధము | 469వ పద్యము<br>3,వ పాదములు | తపము సేయంగ | తపమొనర్పంగ<br>వెడలె |
| ॥ | 590వ పద్యము<br>2,వ పాదములు | స్వయంవర | తిరంబుగ |
| ॥ | 751వ పద్యము<br>1,2 వ పాదములు | నేను చేతు<br>ఎచటి | నేను చేయు<br>దెచటి |
| చతుర్థ<br>స్కంధము | 42వ పద్యము<br>2 వ పాదము | యాతనపెట్టున్ | రాయిడి పెట్టున్ |
| ॥ | 72వ పద్యము<br>3, వ పాదము | చూడ ననురాగము | చూడగ ప్రియంబది |
| ॥ | 91వ పద్యము<br>2, వ పాదము | యజ్ఞంబులు సేతు<br>రెక్కుడు | యజ్ఞంబులొనర్తు రెక్కుడు |
| ॥ | 292, వ పద్యము<br>1,2 పాదములు | ధూమవశంబు . . . .<br>. . . . . వీచుచు | ఏపగు ఘర్మధారల సహింపక<br>యుండెడి వేళ వానికిన్<br>బ్రాపయి వీవనన్ విసరు, పాయక<br>శీతజలమ్ములిచ్చి దా |
| ॥ | 297, వ పద్యము<br>3వ పాదము | నాకై చేతు వింకేటికో | నాకై చేయు, దింకేటికో |
| ॥ | 360, వ పద్యము<br>3వ పాదము | నేనేమిచేతు జనుడిక | నేనేమి చేయుదిక మీ<br>రానయ వంచ. |
| ॥ | 387, వ పద్యము<br>3,4,5 పాదములు | . . . . . . . . శాత్రవుల్<br>తేజము. . . . . . . .<br>. . . . . నుద్యమింపుడీ | . . . . . . . . . . . . శాత్రవ<br>వ్రజమును నోర్చినల్దెసల<br>పర్విడ ఁజేయుదమంతె<br>గాని యీ<br>ద్విజ సహజంపుపల్కులను వీడి<br>రణంబున కుద్యమింపుడీ |



| | | | |
|---|---|---|---|
| పంచమ<br>స్కంధము | 41వ పద్యము<br>1 వ పాదము | ప్రయాణము సేయుచు | త్వరన్ జనుచుండగ |
| ॥ | 58 వ పద్యము<br>4 వ పాదము | చేతురనుచు | చేయరనుచు |
| ॥ | 227 వ పద్యము<br>3 వ పాదము | తగసేతుమమ్మ | పొనరింతుమమ్మ |
| ॥ | 267 వ పద్యము<br>3 వ పాదము | రణమొనరించుటొప్పదు | అని యొనరించుటొప్పదు |
| ॥ | 281 వ పద్యము<br>4 వ పాదము | భవాదృశు లిటుల్<br>న్యాయంబె భీతిల్లగన్ | భవాదృశుల కౌరా!<br>భీతిలన్ జెల్లునే |
| ॥ | 342 వ పద్యము<br>1వ పాదము | నేమి చేత | నెద్ది కార్య |
| ॥ | 349 వ పద్యము<br>4వ పాదము | జేతునే | సైతునే |
| ॥ | 385 వ పద్యము<br>2వ పాదము | జీవింపన్ దలపోతు | జీవింపంగ ఁదలంతు |
| ॥ | 527 వ పద్యము<br>గీ॥ 2వ పాదము | నెల్ల ఁబరగ ఁజేతు | యందు ఁజేరి యుందు |
| ॥ | 813 వ పద్యము<br>4వ పాదము | చేతునిక | చేయుదిక |



# మనవి

సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధికే
శరణ్యేత్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే

ఏ మహాదేవి కరుణాకటాక్షలబ్ధవిభవులై బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఈ సమస్తమును సృష్టి స్థితిలయములను గావించుచున్నారో, ఏ తల్లి ఆజ్ఞానుసారము సూర్యచంద్రాది గ్రహములు, అష్టదిక్పాలకులు, తమ తమ విధులను సక్రమముగా నిర్వర్తించుచున్నారో, అట్టి దేవీ తత్త్వ నిరూపణము సేయు మహోత్కృష్ట గ్రంథరాజమే శ్రీ దేవీ భాగవతము. సంస్కృతమున శ్రీ వేదవ్యాస విరచితమైన ఈ దేవీ భాగవతము పంచమ వేదముగా ప్రసిద్ధినందినది.

ఆజగజ్జనని కృపచే నీదేవీ భాగవతమును 5స్కంధములు పూర్తిగా పద్యకావ్యంగా తెలుగున అను వదించి ముద్రించి యుంటిని. అద్దానిని పఠించిన పలువురు పండితులు సంతోషించి ప్రేమపూర్వక ఆశీస్సులను నాకు అందించుచు మిగిలిన భాగములను గూడ పూర్తిచేయుమని నన్ను ఆదేశించిరి. వారొసంగిన ప్రేరణ నాకమితోత్సాహమును కలుగజేయ తరువాతి స్కంధములను వ్రాయఁబూనుకొంటిని. ఇది పరిపూర్ణముగ ఆ దేవీ కృపయు, దేవీ భక్తుల యాశీస్సులఫలితమేగాని యిందు నా ప్రతిభ యావంతయు లేదు.

ప్రస్తుతము షష్ఠ సప్తమ అష్టమ స్కంధములను సుమారు 2000 పద్యములకు పైగా రచించి దీనిని ద్వితీయ భాగముగా ముద్రించుటకు పూనుకొంటిని ప్రథమ భాగమైన ప్రథమ, ద్వితీయ, తృతీయ చతుర్థ, పంచమ స్కంధముల ముద్రణకు శ్రీ టి.టి.డి. దేవస్థానము వారి ఆర్థిక సహాయముతోను, పలువురు మిత్రుల సహాయ సహకారములతోను ముద్రించి వెలువరించుట జరిగినది. ప్రస్తుతము ఈ ద్వితీయ భాగమునకును టి.టి.డి వారు ఆర్థిక సహాయమందించి నన్ను ప్రోత్సహించినందులకు కృతజ్ఞతలు.



ఇది కేవలం అమ్మవారి పాదపద్మములకు భక్తితో సమర్పించిన యొక్క పుష్పగుచ్ఛమేకాని ఇందు నా పాండిత్యమును ప్రదర్శించుకొను నుద్దేశ్యమించు కంతయును లేదు అని విన్నవించుకొనుచున్నాను. శ్రీ దేవి యందలి అపారమైన భక్తి యొక్కటియే నాకు గల అర్హత. అమ్మ అనుగ్రహముతో మిగిలిన స్కంధములను కూడా త్వరలోనే పూర్తిచేసి పాఠకులకు అందించగలనని అందుకు పెద్దల ఆశీస్సులు నాకు పుష్కలముగా లభించగలవని ఆశిస్తున్నాను.

ఈ గ్రంథమును ఆమూలాగ్రము పరిశీలించి సహృదయతతో నాకు తగిన సలహాలొసంగుటయే కాక తమ అమూల్యమైన అభిప్రాయముల నొసంగిన శ్రీ అగస్త్యరాజు సర్వేశ్వరరావు గారికి, డా॥ చీమకుర్తి వేంకటేశ్వరరావు గారికి, శ్రీ సీ.వీ.ఎస్. శర్మ గారికి, శ్రీ సీ.ఎస్. ప్రకాశరావు గారికి, శ్రీ అల్లంపాటి వేంకటేశ్వర రెడ్డిగారికి, శ్రీ ఊరుబిండి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారికి, శ్రీ ధారా రామనాథ శాస్త్రి గారికి, శ్రీ నేల నూతల విఠలరావు గారికి, శ్రీ దువ్వూరి హైమా తిరువేంగడ రమాకుమారు గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

మరియు ఇది వరలో ప్రథమ భాగము ఆవిష్కరణ సందర్భమున దాని నిర్వహణమునకైన ఖర్చులను భరించిన చిన్మయామిషన్ అధ్యక్షులు శ్రీ సి. సుధాకర్ రావు గారికి మరియు సీర్స్ అధ్యక్షులు శ్రీమతి రమాదేవి శరత్‌బాబు గారికి, తదితరులకు నా కృతజ్ఞతాభి వందనములు. ఈ పుస్తకమునకు ఆర్థిక సహాయమందించిన టి.టి.డి. వారికి తక్కిన దాతలకు కృతజ్ఞతాభివందనములు, గ్రంథమును చక్కగా ముద్రించి యిచ్చిన అభి గ్రాఫిక్స్, నెల్లూరు వారికి నాశుభాశీస్సులు.

ఓంతత్ సత్

ఇట్లు
బుధజన విధేయుడు
**అగస్త్యరాజు సుబ్బారావు**
రచయిత

## విషయ సూచిక

### షష్ఠ స్కంధము





### సప్తమ స్కంధము

**అష్టమ స్కంధము**





# శ్రీ దేవీ భాగవతము (ఆంధ్రము)
## షష్ఠ స్కంధము

1. కం. శ్రీలక్ష్మికి శుభకరికిన్
పాలిత నిఖిలాబ్జ జాండ పంక్తికి నఘ ని
ర్మూలకు భక్తా వనకున్
వ్రాలి కరాంజలి ఘటింతు వైష్ణవి కెలమిన్

2. వ. దేవీ మాహాత్మ్యంబు నత్యంత శ్రద్ధతో వినుచున్న శౌనకాది
మహామునులు పులకిత గాత్రులై మరల సూతు నిట్లభ్యర్థించిరి

3. చం. సకల పురాణ శాస్త్రముల సంగతు లెల్ల వచింప ధాత్రి లే
రిక తమ కంటె దక్షు లెటనేని మహర్షి వరేణ్య! మాకు ని
చ్చకమునఁదెల్పుఁ గోరెదము స్వర్భువ నాధిపు డేల చంపె తా
ప్రకటిత బాహు విక్రముని త్వష్టృతనూజుని వృత్రు నుద్ధతిన్?

4. చం. అతడు మహా తపస్వి దివిజావళికిన్ హితుడౌను త్వష్ట, తత్
సుతుని బలాఢ్యు నిట్లు బల సూదను డెవ్విధి సంహరించె? వి
స్తృతముగ మాకుఁదెల్పుము ఋషీంద్ర! యిదెంతయు పాప కార్యమం
చతడు తలంప కామఘవు డట్లు వధింపఁగతం బదేమొకో?

5. ఉ. వెన్ను డదేల తత్క్రియకు ప్రేరకు డయ్యెను జాలి మాలి, తా
నెన్నగ బ్రహ్మహత్యకిటు లెంతయు నోడక పాప కార్యమున్
గన్న నొనర్చి నట్టి సుర రాజుకు పాతక మేల చుట్టదో
యిన్నియు సందియంబు లిటు లేచుచు నుండెను మానసంబులన్

6. కం. శ్రీదేవియె వృత్రాసురు
ఛేదించె నటంచు మున్ను చెప్పితివి గదా!
ఆ దివిజేంద్రుం డెవ్విధి
తా దళన మొనర్చె వాని దయతో చెపుమా

7. కం. అని శౌనకాదు లడుగగ
ముని వంద్యుడు సూతుడిట్లు ముదము దలిర్పన్
వినిపించె మున్ను వ్యాసుడు
జనపతి కేరీతిఁదెల్పె సాంతముగ నటుల్





## వృత్రాసుర వృత్తాంతము

8. ఉ. ఇందుకులావతంస! విను మీకథ వేద పురాణముల్ గడున్
పొందుగఁ జెప్పి యున్నయవి భూరి బలాఢ్యుని వృత్రు జంపుటన్
జెందెను పాతకమ్ము సురశేఖరు; నయ్యది నిక్కమైన నా
నిందను బాయు కర్మముల నేర్పున పెక్కులొనర్చె నాతడున్

9. మ. కపటోపాయముఁబూని యింద్రుడును నా కంజాక్షుడున్ గూడి తా
మపరాధం బొనరించి రీగతిని, మాయా శక్తి దుర్భేద్య మౌ
నృప వర్యా! ముని వర్యులేనియును దానిన్ దాటగాలేరు, తా
నెపుడున్ శ్రీహరి కుట్ర బూనియె గదా! హింసించు దైతేయులన్

10. శా. మాయా మోహితు డౌటచే నతడు చంపన్ బూనె దైతేయులన్
మాయా కృత్యము లాచరించి హరి; యా మాయా మహా శక్తియే
ఆయా కాలములందు చిత్రముగ నాయారూపముల్ దాల్పగా
జేయున్ శ్రీకమలేశు;ఁగాక తనకున్ శ్రేయంబులే జన్మముల్

11. మ. మమకారమ్ములు పాప పుణ్యములు కామక్రోధ లోభాదులున్
శ్రమఁగల్గించును మాయకున్ దవుల విశ్వంబందునెవ్వారికేన్.
అమరాధీశుడు నబ్జనాభుడును మాయా మోహ జాలంబునన్
గ్రమమున్ దప్పక చిక్కి త్వష్టృ తనయున్ ఖండించి రుద్వేగులై

12. వ. తత్కథా క్రమం బెట్టిదనిన

13. చం. దివిజ వరేణ్యుడున్, దపసి, దివ్యుల కార్యములెల్ల నేర్పుతో
నవిరళ రీతిఁ దీర్పఁగల యాధ్యుడు "త్వష్ట"; యతండొకప్డు తా
ప్రవిమల తేజుఁడౌ సుతునిఁ బాయని కూర్మి సృజించి పెంచె నీ
భువనములం దతండె పొలుపొందఁగడున్ గడు సుందరుండనన్

14. ఆ.వె. మూడు తలల తోడ మోదమున్ గూర్చెడు
సుతునిఁగాంచి త్వష్ట చోద్యమంది
విశ్వరూపు డనెడి విఖ్యాత నామమ్ము
నతని కిడియె మెచ్చ నఖిల సురలు

15. వ. దినదిన ప్రవర్ధ మానుండైన యావిశ్వరూపుడు

16. సీ. ఒక్క శిరసు తోడ నొయ్యన వేదమ్ము
లభ్యసించు నిరత మమరు లలర
మఱి యొక శిరసుతో మద్యపానమ్మును
చేయఁ బూనును నిజ చేత మలర
వేరొంట వేడ్కతో వివిధ లోకమ్ముల
నవలోకనము సేయు నన్నిదిశల
ఏక కాలంబందె యిన్ని కార్యమ్ముల
నొనరించు చుండు తా ననుదినమ్ము

గీ. వేద పఠనము ముగిసిన మీద నియతి
సకల భోగమ్ములన్ వీడి శాంతినొంది
తపమొనర్చును నిత్యమ్ము దాంతుడౌచు
నన్యచింతన లేక యేకాగ్ర మతిని

17. మ. పరగన్ గ్రీష్మమునందు నిశ్చల మతిన్ బంచాగ్ని మధ్యంబునన్
స్థిరమై నిల్చి తపం బొనర్చు;నటులే శీతర్తు కాలంబునన్
వర శైత్యోదక పంకజాకరములన్ బద్మాసనాసీనుడై
యరిదిన్ సత్తప మాచరించును నిరాహారస్థితిన్ నిష్ఠగన్

18. చం. అది గని దేవనాథుడు భయమ్మున నాతని తాపసక్రియల్
మదిఁదల పోసి యీతడు క్రమంబున నిట్టులె నిశ్చల స్థితిన్
వదలక సత్తపో నియతిఁ బట్టిన మత్పదవిన్ గ్రహింపడే
తుదకు మదీయ జీవనమె దుర్భర మౌనని సంశయాత్ముడై

19. తే.గీ. విజ్ఞు డెవడైన శాత్రవ వీరు బలము
పెరుగు చుండుట చూచి యుపేక్ష సేయ
తగదు; కాన నే నిప్డు డీతని తపమ్ము
భగ్నమొనరింపఁ దగును నెబ్భంగినైన

20. చం. అని మదిలోఁ దలంచి దివిజాధిపుఁడాక్షణమందె యప్సరో
వనితల మేనకాదులను వైళమ నల్వురఁబిల్వఁబంపి తా
పనిచెను విశ్వరూపుని తపంబును నెవ్విధినైన మీదు యౌ
వన తను శోభలన్ బరపి భగ్నమొనర్చు డటంచుఁ బల్కుచున్





21. చం. పనిచిన వారలున్ దివిజ వర్యుని యాజ్ఞను సమ్మతించి యో
యనఘ! రయంబునన్ జని ప్రయత్నముతో విఫలంబొనర్తు మొ
య్యనఁ దదుదగ్ర నిశ్చల తరాద్భుత తాపస వృత్తులెల్ల మా
యనుపమ నాట్యగాన మధురాన్విత మంజుల వాక్సమత్కృతిన్

22. వ. అని పలికి వారలతి రయంబున నావిశ్వరూపు కడకున్ జని

23. సీ. తనతను కాంతులు కనిపించి కన్పింప
నట్లు చేలముఁద్రిప్పు నతివ యొకతె
తన నాట్య కళలెల్ల తళుకొత్త పలుక్రొత్త
రీతుల చరియించు నాతి యొకతె
తన వచస్సుమశర దారుణ సంహతిఁ
గలగింపఁ జూచును కలికి యొకతె
తన గాన మధురస ధారల స్రవియించి
ముద మొనర్పగఁజూచు ముదిత యొకతె

గీ. ఇట్లు వారలు తమ కళ లెల్లఁ జూపి
వాని లోగొన యత్నించి రైనఁ గాని
వరుస తత్ప్రయత్నములు నిష్ఫలములయ్యె
అడవిఁ గాచిన వెన్నెల లట్టు లధిప!

24. ఆ.వె. మూగ వాని యెదుట యోగవిద్యయుఁబోలె
అంధు నెదుట సుందరాకృతి యన
బధిరు నెదుట శ్రావ్య భావ సంగీత మ
ట్లతని యెదుట నివియు వ్యర్థమయ్యె

25. ఉ. ఐనను పట్టు వీడ కటు లాతని యాశ్రమ మందె కొన్నినా
ళ్లానలినాయ తేక్షణ లహర్నిశముల్ తగురీతి యత్నముల్
మానక చేయుచుండినను మౌనము వీడక నిశ్చలాత్ముడై
పూని తపంబు సేయు ముని పుంగవుఁగాంచి విచారమగ్నలై

26. చం. సరగున నేగి వారు సురసత్తముఁగాంచి వినమ్ర శీర్షలై
కరము భయమ్ముతోడ పరికంపిత చిత్తములన్ "సురాధిపా,!
స్థిరమతి సత్తపో నియతిచే వెలుగొందెడి వాని చెంత మా
తరుణ విలాసముల్ కళలు దప్పెను భానుని మ్రోల దివ్వెలై

27. చం. అతుల తపో విభూతి నతడగ్నియ వోలె వెలుంగు చుండె, మే
మతని క్రుధాగ్నికిన్ దవిలి యాహుతి గాకిటు పూర్వపుణ్యస
త్కృతతతి మీదు సన్నిధికి క్షేమముగా నరుదెంచి నారమో
నుతగుణ! మంచి చెడ్డలు గనుంగొని మీరును నుద్యమింపుడీ!"

28. వ. అని పలికి అయ్యప్సరోవనితలు నిష్క్రమించినంత

29. కం. దివిజ పతి కపుడు మదిలో
నవిరళమై ద్వేష భావ మధిక మగుటచే
వివరింప కయుక్తంబని
పవిఁగొని చనె విశ్వరూపు పరిమార్పంగన్

30. చం. చని యట సత్తపో విభవ సంపద నొప్పెడు విశ్వరూపునిన్
గని తలపోసె, "నీతనిని కల్మష దూరు సమాధి యుక్తు, స
ద్గుణ యుతు నెట్లు చంపుదును, కోరి యిటుల్ గడు పాపకార్య మే
యనువున నాచరింపగలు" నంచుఁదలంచి మరుక్షణంబునన్

31. చం. ఇది తగదంచు వీని వధియింపక యున్న సురాధి పత్యమున్
వదలు కొనంగ నౌ, నిదియు పాపమొ పుణ్యమొ శంకయేల? యీ
యదనున వీనిఁ జంపుటయె యర్హ మటంచు వినిశ్చితాత్ముడై
వదలె శతారమున్ గడు జవంబున నాతడు నేలఁగూలగన్

32. కం. గిరి శిఖరము వలె పుడమి కి
నొరిగె నపుడు విశ్వరూపు నొడలతి వేగన్
సురపతి దుష్కృత్యముఁ గని
పరిసరముల నున్నవారు భయకంపితులై

33. ఉ. ఎంత దురాత్ము డీతడు సురేంద్రుడె? నేడిటు తాప సోత్తమున్
పంతముఁ బూని చంపె కడు పాప మటంచు మదిందలంప; కీ
వింత యెటైనఁ జూచితిమె, వీడొనరించిన దుష్ట కృత్య మా
వంతయుఁ బొల్లు వోవునె, ధ్రువంబుగ తత్ఫల మందకుండునే

34. కం. అని యాశ్రమ వాసు లపుడు
మనములఁదలపోయు చుండ క్ష్మాతలమున నా
ముని విశ్వరూపు దేహం
బిన తేజం బట్లు వెల్గు లీనుచు నుండెన్

35. కం. ఉలికి పడి చూచి యింద్రుం
డిలపై వెలుగొందు వాని నీక్షించి మదిన్
గలఁగుచు నీతడు బ్రతికిన
పొలివుచ్చక నన్ను విడువ బోవునె యనుచున్

36. కం. తన హితుని తక్షు డను వా
నిని పిలిచి రయంబున నితని శిరములను ఖం
డన మొనరింపుము లేదే
ని, నను వధించును బ్రతికిన నిక్కము తక్షా!

37. మ. అనినన్ తక్షుడు సమ్మతింపక మహేంద్రా! యిట్లనంజెల్లునే
ఘన నిష్పాపరు తాపసేంద్రు ననఘున్ ఖండింపగా నా మనం
బనయంబున్ సహియింపదయ్య! యిటు లీయన్యాయపున్ వృత్తి చే
కొని పాపంబును గట్టు కొమ్మనుట నీకున్ ధర్మమే చెప్పుమా!

38. కం. ఇది కడు నింద్యం బని నీ
హృదయమునన్ దలప కిట్టు లీతనిఁ దపసిన్
విదళించి యేఫలం బిం
పొదవగఁ బొందందలంచి తోయసురారీ!

39. చం. అనవుడు నోయి తక్ష! యిత డంతము నొందక ప్రాణయుక్తుడౌ
నని భయ మందు చుంటిని; తదాననముల్ పరికింపు; మర్క కాం
తినిఁ బురుడించు తేజమున దివ్యములై వెలుగొందు చుండె, నే
మని యెదు వీడు నా కహితు డౌట వధింపగ నర్హుడిత్తఱిన్

40. చం. అని యమరాధి నాధుడన నక్కజ మందుచు తక్షు డాతనిన్
గని సురనాధ! నీచమగు కార్యము నిట్లొనరింప నేల? నీ
మనమున సిగ్గు దోప దొకో? మాన్యుని నీతనిఁ జంపి పాతకం
బును నొడిఁగట్టఁ జూతువె? ప్రమోదమె నీకిది? భీతిఁజెందవే!

41. వ. నావుడు సురపతి యిట్లనియె

42. కం. ప్రాయశ్చిత్తము తోడన్
బాయుదుఁ బాపమ్ము దాన భయపడ నేలా!
వేయేల ముందు వీనిని
వ్రేయుము నీ పరశు వెత్తి వేగమె తక్షా!

43. కం. అనవుడు తక్షుం డిట్లనె
ఘనలోభం బెదియొ నిన్నుఁగ్రమ్ముట చేతన్
పనిఁబూనితి వితనిఁ దునుమ,
పని యేమీ నాకు నితని పరి మార్పంగన్

44. ఆ.వె. ఇతనిఁ జంప నాకు నేమి ఫలిత మబ్బు
ఫలము లేని యిట్టి పాప మేల?
కాన నీ యకార్య మేను చేయ ననిన
అతనిఁ గాంచి యింద్రు డనియె నిట్లు

45. చం. భయపడ కోయి తక్ష! యెడఁ బాయక నీకును యజ్ఞ భాగముల్
ప్రియమునఁ గూడు నట్లు సవరించెద, యజ్ఞములందు జంతు సం
చయముల శీర్ష భాగములు సమ్మతి నీకిక దక్కునయ్య, సం
దియమును బొంద కీతని వధింపుము సత్ఫలమున్ గ్రహింపుమా!

46. మ. అకటా! లోభ మదెంత వాని నయినన్ వ్యామోహితున్ జేయు, చి
ద్వికలత్వం బొనరించు, హత్య కయినన్ బ్రేరేచు, నేమందు న
య్యకలంకుండగు తక్షు డాక్షణమ యుక్తాయుక్త శూన్యుండునై
యొక లాభంబున కొప్పి సిద్ధపడె నిట్లుద్వృత్తికిన్ దుష్టుడై

47. కం. సురపతి యెరకున్ లోబడి
యరమరికలు లేక పరశు వాక్షణమున తా
కరమున గొని విశ్వరూపు
శిరముల ఖండించి విసరె చెఱి యొక దెసకున్

48. వ. అవ్విధంబున తక్షుచే మూడు దిక్కులకు విసరి వేయబడిన మూడు
శిరంబులనుండి వేనవేలుగా పక్షులుదయించె

49. సీ. ముదమున వేదముల్ చదివెడి ముఖమున
పిచ్చుక లుదయించె పెద్ద సంఖ్య





నఖిల దిక్కులఁ జూచు నాననం బందుండి
తీతువుల్ జన్మించి తిరుగ సాగె
మధు పాన మొనరించు మఱియొక ముఖమునన్
కముజు పిట్టలు పుట్టె గములు గట్టి
మూడు దిక్కుల నుండి ముప్పిరి గొని యిట్లు
ఖగ పంక్తి జన్మించి యెగయు చుండ

గీ॥ "విశ్వరూపుడు మరణించె, వెఱపికేల
యజ్ఞ భాగమ్ము లెల్ల నాకమరు" ననుచు
సంతసం బంది యింద్రుండు స్వర్గమునకు
వేగఁ జనియెను మిక్కిలి వేడ్కతోడ

50. కం. చని బ్రాహ్మణ హత్యవలన
తనకున్ బ్రాపించినట్టి తద్దయు పాపం
బునకున్ ప్రాయశ్చిత్తం
బనయము యోచింపఁదొడగె నతి గూఢముగన్

## వృత్రుని జననము

51. చం. తన తనయున్ దపస్వి నతి ధార్మికు నిట్టు లకారణంబుగా
తునిమిన దేవనాథు నతి దుష్టు వధింపఁగలట్టి వీరు నీ
క్షణమె సృజింతు నొక్కని ప్రశస్త పరాక్రము నంచు 'త్వష్ట' తా
ననుపమ కోపవహ్ని కెనయౌ సవనాగ్నిని వ్రేల్చి యంతటన్

52. తే.గీ. అష్ట రాత్రమ్ము లొనరించె నధ్వరమ్ము
నమిత నిష్ఠ నధర్వ మంత్రముల తోడ
నంత నయ్యగ్ని కుండ మధ్యముననుండి
అగ్ని సమ తేజు డుద్భవ మందె సుతుడు

53. తేగీ. నా తపశ్శక్తి తోడ సంతసము మీఱ
వృద్ధిఁబొందుము మిక్కిలి విస్తరిల్లి
ఇంద్ర శత్రూ! యటంచు దీవించెనపుడు
తాప సేంద్రుండు 'త్వష్ట' తత్తనయుఁగాంచి

54. ఉ. అంతట నాత డొక్క క్షణమందె వియత్తల మాక్రమించి ది
గ్గంతి చయమ్ము భీతిలగ కాల యముండన వృద్ధిఁజెంది యా
చెంతన నిల్చి, తండ్రిఁగని శీర్షము వంచి మహాను భావ! న
న్నింతకు సృష్టిఁ జేయఁగత మెయ్యది తెల్పుము సత్వరమ్ముగన్

55. ఉ. ముందుగ నొక్క నామమును పొల్పుగ నాకిడు మయ్య! మీ మదిన్
బొందిన దుఃఖమెద్ది? తమ మోముఁగనంగ విచార మెద్దియో
దందడి వెట్టు చుండెడి విధంబు గ్రహించితి, నెంతకష్టమేన్
సందియ మింత లేక నిముసంబున నే నెరవేర్తు చెప్పుమా!

56. సీ. సప్త సాగర మహా జలముల నైనను
పుక్కిటఁబట్టుదు నక్కజముగ
కుల పర్వత శ్రేణిఁ గూల్చి ముష్టి హతుల
పిండి గొట్టుదు బాహు విక్రమమున
అర్కబింబము నైన నరచేత ధరియించి
బంతు లాడగలను బహు విధముల
దివిజుల తోడ నా దివిజాధిపునిఁ జేర్చి
సమయింపఁ జాలుదు శౌర్యమొప్ప

గీ. యముని బంధించి తెత్తు నశ్రమము తోడ
పుడమిఁ బెకలించి పడవైతు కడలిలోన
నేమి చేయంగ వలయునో యెఱుగఁ దెల్పు
మనుచు కరములు మోడ్చె తా జనకునెదుట

57. మ. అనినన్ 'త్వష్టయు' హృష్టుడై ప్రియ తనూజా! సంతసంబయ్యె నిన్
గనినన్; దక్షుడ వీవె మద్విపుల దుఃఖంబున్ నివారింప, cగా
వున వృత్రుండను పేర నెల్లరును సంబోధింతు రింతన్ నినున్,
ఘన విఖ్యాతిని బొందెదీవు భువనోగ్రస్ఫార శౌర్యోన్నతిన్

58. శా. నాకున్ బుత్రుడు, నీకునగ్రజు, డనంత జ్ఞాన సందీప్తుడున్,
లోకాతీత తపోధనుండొకడు సుశ్లోకుండు మున్నుండె ము
ల్లోకారాధ్యుడు విశ్వరూపుడన; దుర్లోభ ప్రవృత్తుండునై
నాకాధీశుడు సంహరించె నతనిన్ నైచ్యస్థితిన్ పుత్రకా!





59. ఆ.వె. బ్రహ్మహత్య మిగుల పాతకంబని యెంచ
కతనిఁ జంపినట్టి యమర విభుని
పాపమనక చంపి పగఁ దీర్పు మోపుత్ర!
యనుచు దుఃఖ మగ్నుడయ్యె త్వష్ట

60. వ. ఇంచుక దుఃఖించిమరుక్షణంబున దుఃఖంబు దిగమ్రింగుకొని

61. కం. ప్రవిమల దృఢ కవచంబును
దివిజ పతికి వెఱపుఁగొలుపు దివ్య రథంబున్
వివిధాయుధముల తక్షణ
మవిరళగతి సృష్టి జేసి యతని కొసంగెన్

62. కం. వేదోక్తుల నాశీస్సులు
భూదేవు లొసంగ ముదముఁ బొందుచు వృత్రుం
డాదివ్య రథారూఢుం
డై దివిజ పతిని వధింప నరిగె వడి వడిన్

63. కం. సుర పతి కహితులు రక్కసు
లరుదెంచిరి వృత్రునకు సహాయ మొనర్పన్
విరివిగ తమ తమ బలములు
తరలి నడచు చుండ శౌర్య దర్పోద్ధతులై

64. చం. అదిగని గూఢచారులు రయంబున నింద్రుని చెంతకేగి బి
ట్టదరుచు పల్కిరిట్లు దివిజాధిప! తా నభిచార హోమమున్
బదిలముగా నొనర్చి బలవంతుని పుత్రుని సృష్టిఁజేసి య
ల్లదె యిటు పంపె 'త్వష్ట' నిను నంత మొనర్పగ వృత్రు పేరిటన్

65. కం. ఆతడు మందర గిరి సము
డాతత సైన్యముల తోడ నాభీల గతిన్
దైతేయులు తోడైరా
వీత భయుడు వచ్చుచుండె వృత్రుడు వేగన్

66. వ. అని విన్నవించి రంత.

67. కం. ఈవార్త వినిన దివిజులు

వేవేగన్ దరలి వచ్చి భీతావహులై
దేవేంద్రుని వలగొని తా
మీవిధమున విన్నవించి రేర్పడు రీతిన్

68. చం. అప శకునంబు లీ నగరమం దెటు చూచినఁగాన వచ్చె; తో
రపు రొదలన్ చరించు నదె గ్రద్దలు కాకులు జంబుకంబులున్
ద్విపతతు లశ్వ సంఘములు వీడక కన్నుల నీరు గార్చెదున్
రిపు వనితాళి రోదనలు వ్రేగయి విన్పడు నర్ధ రాత్రులన్

69. మ. భవ నాగ్రంబులపై పతాకలును, స్తంభంబుల్ వడిన్ గూలెదున్
దివిజావాసములన్ వినీల వసనల్ స్త్రీ లెవ్వరో నిత్యమున్
వివిధంబౌ వికృతంపు రూపములతో వేధించుచున్ శీఘ్రమే
భవనంబుల్ విడి పారి పొమ్మనెద రప్రాజ్ఞ ప్రసంగమ్ములన్

70. కం. ఈ దుశ్శకునములను గని
యాదిత్యులు తగిన హేతు వరయక నిరతం
బేదేని యుపద్రవ మిక
మీదన్ రానున్న దనుచు మిడుకుదు రనఘా

71. కం. అని పలికి సురలు చారులు
ననిమిష పతి వీడి వెడలి రంతట తా న
య్యనిమిష గురు వర్యు కడకు
జని యిట్టుల విన్నవించె సవినయ ఫణితిన్

## ఇంద్రుని భంగ పాటు

72. శా. స్వామీ! మీ కెఱుగంగ రాని దిట నావంతైన లేదయ్యా! నే
డేమో దేవ పురంబునన్ వినగ నయ్యెన్ దుర్నిమిత్తంబు లె
న్నో; మాబుద్ధుల కెక్కదయ్యె కతమేమో? సత్కృపన్ శీఘ్రమే
యీ మాయల్ దొలగింపఁ జేసి దివి కీ హీనస్థితిన్ బాపుమా!

73. వ. అని ప్రార్థించు సురపతిన్ జూచి సురగురుం డిట్లనియె

74. ఉ. ఏనిపు డేమి సేయుదు మహేంద్ర! భవత్కృత పాపమెల్ల నీ
మేనికిఁ బట్టె, ధర్మమును మీఱి మునీంద్రు సుతున్ తపస్వినిన్





బూని వధించి పాపమును బొందితి, వా ఫలితంబె యిద్ది యం
చేను తలంతు; కర్మఫల మెంతటి వారికి నైన తప్పునే

75. శా. ప్రారంభింపక మున్నె తత్ఫలితమున్ భావించి విజ్ఞాన వి
స్తార ప్రాజ్ఞులఁ జేరి మిక్కిలిగ చర్చల్ చేసి, యామీద నె
వ్వారైనన్ క్రియ కుద్యమింపఁదగు, నీ వక్కార్యమున్ బూనునా
డారీతిన్ దగ చర్చ చేసితివె యేలా! యిప్పుడాలోచనల్

76. తే.గీ. పరుల మనసుల నొప్పింపఁ బాడి కాదు
అట్టి వారికి సుఖము లెట్లమరు నయ్య
లోభ మోహమ్ములకు నాడు లొంగి బ్రహ్మ
హత్య నొనరించి పాతక మంది తీవు

77. కం. నిను సంహరించు కొఱకే
ముని వర్యుడు సృష్టిఁజేసె పుత్రుని వృత్రున్,
ఘన వజ్రము కంటె నధిక
మనదగు దివ్యాయుధమ్ము లతనికి నొసగెన్

78. చం. అతడు మహోగ్ర కోపమున నల్లదె వచ్చుచు నున్నవాడు నిన్
హతమొనరింపగా, నని బృహస్పతి బల్కుచు నుండ నంతలో
వితత మహోర్త నాదములు విన్పడె; యక్షులు కిన్నరుల్ మునుల్
స్థితి సెడి పర్వులెత్తుట మదిన్ గ్రహియించి సురేంద్రు డుద్యతిన్

79. చం. చకిత మనస్కుడై యపుడ సర్వ దిగీశులు రుద్రు లశ్వులున్
సకల చమూపతుల్ మఱియు చంద్రుడు సూర్యుడు నెల్ల దేవతా
నికరములున్ నిమిత్తము గణింపక రండని యాజ్ఞ సేయ త
త్ప్రకటన విన్న తక్షణమె పర్వున నచ్చట చేరి రెల్లరున్

80. కం. సురనాధుండప్పుడు సుర
కరిపై నెక్కి పవిని నిజ కరమునఁ గదు ని
బ్బరమునఁదాల్చి నడచె న
చ్చెరువుగ సేనాగ్రమందు చేరి వడివడిన్

81. మ. అటవృత్రుండును మాన సోత్తరమునం దత్యంత సైన్యమ్ముతో
పటు సంరంభము మీఱ చేరి నిలిచెన్ ప్రత్యర్థి రుద్రుండనన్,

చటు లాంభోధి తరంగ ఘోష లెసగన్ స్వర్నాథుడున్ వేగ ను
త్కట సైన్యమ్ములఁ గూడి వచ్చె నటకున్ దర్పంబు నెక్కొల్పుచున్

82. మ. ఇరు పక్షంబుల వారికిన్ బెలుచ నూఱేడుల్ మహా ఘోర సం
గర మయ్యెన్ భువనంబు లెల్ల వడఁకన్ గాలాంతమో యన్నటుల్;
సుర లొక్కొక్కరె ధైర్యముల్ సడల నచ్చో వీడి పర్వెత్త సా
గిరి; యింద్రుండది గాంచి భీతిలుచు నేగెన్ వేగ స్వర్గానకున్

83. మ. పరమానందముఁ బొంది వృత్రు డటుపై స్వస్థానమున్ జేరి సు
స్థిరుడై తండ్రికి మ్రొక్కి పల్కె జనకా! దిక్పాలకుల్ దేవతల్
కరమున్ భీతిలి నాప్రతాపమునకున్ గైమోడ్చి పర్వెత్తి; రా
సుర నాథుండును స్వర్గమున్ విడి చనెన్ చోద్యంబుగా; నంతటన్

84. చం. భయపడి యుద్ధమున్ విడిచి పర్విడు వారిని చంపుటెల్ల దు
ర్నయమని యెంచి నేనును దురంబును మాని సురాళి కెంతయున్
ప్రియమును గూర్చు నేన్గు నట వేడ్కఁగనుంగొని తెచ్చితయ్యా! నా
జయమున కిద్ది చిహ్నమని చాటగ; మీకు ముదంబుఁగూర్చగన్

85. మ. అనినన్ త్వష్టయు సంతసించి వినుమయ్యా! నామనం బెంతయున్
గనియెన్ శాంతిని, క్రోధమున్ దొలగె, నిక్కంబిప్డు నే "పుత్ర వం
తు"ననన్ జెల్లెను పుత్రకా! మఱియు నిన్నున్ గోరుదొండొక్కటిన్
వినుమయ్యా! వివరింతు నిశ్చల మతిన్ వీరాగ్రణీ! వేడ్కమై

86. మ. అవధానాత్ముడవై స్థిరాసన విధిన్ వ్యావృత్త పంచేంద్రియ
వ్యవహారంబున తీవ్రమౌ తపముసేయంబూను మబ్జాసనున్
స్తవమున్ జేయుచు, పట్టు వీడకుము సాక్షాత్కార మౌదన్క, నీ
వవి నాశిత్వముఁ గోరు కొమ్ము వరమయ్యా! స్వస్థతన్ గూర్చుమా!

87. మ. అవినాశిత్వముఁ బొంది దుష్టుడగు నాకాధీశు చంపన్ వలెన్
దివిజేంద్రుండు నిరంతరమ్ము తపమున్ విఘ్నంబు గావింపగా
నవ కాశంబును చూచుచుండు, నత డత్యంతమ్ము మాయావి; నిన్
వివిధోపాయములన్ గలంచు;వ్రతమున్ వీడంగఁబో కెన్నడున్





## వృత్రుని తపస్సు

88. చం. అనవిని వృత్రుడున్ జనకు నాజ్ఞను గైకొని యంత గంధమా
దనగిరిఁ బుణ్య తీర్థమున తాన మొనర్చి కుశాసనస్థుడై
ఘనతర నిష్ఠ సత్తపము కంజజుఁ గూర్చి యొనర్ప సాగె నో
దన జల వర్జితుండయి సతంబును యోగ సమాధి నిష్ఠుడై

89. ఉ. ఈవిషయంబు విన్న దివిజేంద్రుడు మిక్కిలి భీతిఁ జెంది, లో
భావిల చేతసుండగుచు నచ్చరలన్ సిత పద్మ నేత్రలన్
భావజ పత్ని సన్నిభలఁబంపె మనోహర గాత్రలన్ వడిన్
వేవురఁ దత్తపోనియతి భిన్నము సేయు డటంచు పల్కుచున్

90. తే.గీ. వార లెవ్వరుఁ తత్తపః పటిమఁ జెఱుపఁ
జాలరై రొకింతయు నైన, శ్రమయె తప్ప
నిశ్చలం బైన నిష్ఠను నిలుప కతడు
తపముఁగావించె నూఱేండ్లు దాంతుడగుచు

91. చం. విమల తపః ప్రవృత్తుడగు వృత్రుని దీక్షకు సంతసించి య
క్కమలజు డగ్రమందపుడు కమ్ర మరాళ వరాధి రోహుడై
క్రమమున నైజ కాంతులు దిగంతములన్ బ్రసరింప నేత్ర యు
గ్మమునకుఁ దోచి వృత్రుగని మంజుల వాక్కులఁ బల్కె నివ్విధిన్

92. కం. వరమేమి వలయునో మది
నరమర యొకయింత లేక యడుగు మొసగెదన్
స్థిరమగు నీ తపమున కే
నరుదుగ మెచ్చితిని మాను మయ్యా! దీక్షన్

93. చం. అజుని మృదూక్తులన్ వినిన యంతట వృత్రుడు లేచి మెల్లనన్
సజల విలోల నేత్రముల సంతస మందుచు పల్కెనిట్లు తా
నిజ కరముల్ మొగిడ్చి మహనీయ! దయా పరిపూర్ణ సాగరా!
నిజముగ నా మనోరథము నీకెఱుగంగ నశక్య మౌనాకో!

94. ఉ. ఐనను కోరు కొమ్మని దయామతిఁ బల్కితిగాన తెల్పెదన్
దీన జనావనా! యసుర దేవ గణంబులు యుద్ధమందు నన్

బూని జయింప లేనటుల, పొల్పుగ నా బల మంతకంత కే
పౌనటు, లాయుధమ్ములెవి యైనను గూల్చని యట్టు లిమ్మజా!

95. వ. అనిన చతుర్ముఖుండు మందస్మితుండై వృత్రునిం గనుంగొని యిట్లనియె

96. తే.గీ. దారు పాషాణ కృతకాయుధములఁగాని
ఆర్ద్ర శుష్కాయుధమ్ముల నైనగాని
కలుగదెప్పుడు మరణమ్ము, కలత వీడు
మనుచు వర మొసంగి యదృశ్య మయ్యె నజుడు

97. మ. వరమున్ బొందిన వృత్రు డంతట నిజావాసానకున్ జేరి సం
భరితానందము తోడ తండ్రిఁగని చెప్పన్, త్వష్ట హృష్టాత్ముడై
చిఱ సౌఖ్యంబులఁ బొందు మంచుఁదగ నాశీర్వాదమున్ జేసి త
చ్ఛిరమున్ దువ్వుచు పుత్రుతో నిటు వచించెన్ బాష్ప పూర్ణాక్షుడై

98. మ. మనకున్ దేవవిభుండు శాత్రవు, డసంభావ్యుండు, దుష్టాత్ముడున్
తనయా! మత్సుతునిన్ త్రిశీర్షునిఁ దపోదాంతున్ గడున్ గ్రూరుడై
ఘన పాపంబని యైన నెంచకటులన్ ఖండించె; నీ వద్దురా
త్ముని కంఠంబును ద్రుంచి నాకు ముదమున్ బొందింపు మత్యంతమున్

99. ఉ. అంతియె కాక నీ వతని నంత మొనర్చి తదీయ పీఠ మ
త్యంత ముదంబునన్ గొని సురావళి నేలుము; నాటి దన్క నా
చింత యొకింతఁ దీరదు, ప్రసిద్ధము లోకమునం "దెవండు ని
శ్చింతను పొందు నాత్మజుని చే" నతడౌ ఘనుడన్న మాటయున్

100. చం. బ్రతికిన యంతకాల మెడఁ బాయక తండ్రిని గౌరవించి ని
ర్గత జవసత్వుడైన తఱి కష్టము లెంచక వాని కిష్టమౌ
గతి పరి చర్యలన్ దనిపి, కాయము వీడిన యంత దానముల్
చతురత యాచకాళికిడి సమ్మతి పుణ్యనదీ జలంబులం
దతనికి పిండముల్ శ్రమమునందక యిచ్చెడి వాడె పుత్రుడౌ

101. చం. అని తన తండ్రి పల్క వినయమ్మున సమ్మతిఁదెల్పి వృత్రు డ
య్యనిమిష నాథుపైన వెస నాహవమున్ బ్రకటించె; నంత పె
ల్చన రణ దుందుభుల్ మొఱసె శంఖ నినాదము లొక్క పెట్టునన్
ఘనముగ మ్రోగె నల్దిశలు గంపము నొందగ తత్ క్షణంబునన్





102. చం. అరదము నెక్కి వృత్రుడపు డాగ్రహ జాత మహోగ్ర రావముల్
పరగ ప్రయాణ మయ్యె సుర పట్టణ మెల్లను ముట్టడించి యా
సురపతిఁ ద్రుంచి వత్తు ననుచున్ సమయం బొనరించి; దేవతా
వరుడిది యెల్ల తా నెఱిగి వైళమ సిద్ధ మొనర్చె సైన్యమున్.

103. చం. సకల దిగీశులన్ బిలిచి సైన్య గణంబులతోడ గృధ్ర రూ
పకమగు వ్యూహ మేర్పఱచి వజ్రి రణోత్సవ మొప్ప నిల్వ; నం
తక సముడౌచు నంత కడు దర్పమెలర్పగ వచ్చె వృత్రుడున్
ప్రకటిత రౌద్ర రూపుడు సుపర్వ భయంకరు డాగ్రహంబునన్

104. ఉ. వచ్చిన వానిపై నుఱికె వాసవు డుద్ధతి; నంత వృత్రుడున్
హెచ్చిన కోపవహ్ని శిఖ లెల్లెడఁ బర్వ నెదిర్చె నింద్రునిన్,
మచ్చరముల్ వివృద్ధ మయి మానక యిర్వురు ద్వంద్వయుద్ధ మి
ట్లచ్చు పడంగఁ జేయ సమయంబు నెఱింగిన వృత్రుడంతటన్

105. కం. సురపతి ముఖ మదరగ వడి
కరమును బిగయించి కొట్టె కఠిన తరముగన్
తిరుగుడు వడి యింద్రు డపుడు
సొరగి పడియె క్రింద నెల్ల సురలులికి పడన్

## దేవతలు జృంభికను సృష్టించుట

106. శా. అంతన్ వృత్రుడు దేహమున్ బెనిచి దీర్ఘాకారుడై విస్తృత
ధ్వాంతం బౌ గిరి గహ్వరంబనగ వక్త్రంబున్ గడున్విప్పి తా
నంతన్ హస్తము నందు దేవపతి నొయ్యన్ బట్టి బంధించి ని
శ్చింతన్ మ్రింగఁ దలంచి నోట నునిచెన్ శీఘ్రంబ భక్ష్యంబటుల్

107. కం. దివిజులు భయ విభ్రములై
దివిజ గురుని వేడ నతడు తెల్ల మొగమునన్
దివిఁజూచె నశక్తుండై
దివి జేంద్రుని వెలువరింప తెరు వెఱుగ నటుల్

108. చం. అమరుల కష్ట మానసములం దొక యోచన తళ్కుమంచు రా
నమిత ముదంబుఁ జెందుచు బలాతిశయంబునఁ బొల్చు జృంభికన్

గమికొని సృష్టిఁ జేసి వడిగన్ విడువన్, దడవోర్వ కద్ది దు
ర్గమ మగు వృత్రు విస్తృత ముఖంబునఁ జేరిన యంత నాతడున్

109. తే.గీ. అంగముల్ ద్రిప్పి బిట్టుగ నావులింప
అద నిదే యని యల్ప దేహమ్ముఁ దాల్చి
వెలికి నుఱికెను సురపతి వేల్పు లలర
ఆవులింతలు మొదలయ్యె నంతనుండి
వింతఁ గొలుపుచు జగముల జంతు తతికి

110. మ. అటుపై వందల యేండ్లు సాగె సమరం బా రెండు పక్షాలకున్
దిటవై వృత్రుని తేజమున్ బలము వృద్ధిన్ బొంద నానాటికిన్
పటిమల్ గోల్పడి దివ్యు లెల్లరును విభ్రాంతాత్ములై పాఱి రె
ట్టెటులో చెట్టుకు పుట్ట కొక్కొకరునై యేపారు దుఃఖమ్ములన్

111. ఉ. స్వర్గము నాక్రమించు కొని త్వష్టృతనూజుడు వృత్రు డప్సరో
వర్గము తోడ దివ్యసితవాజిని నేన్గును తాగ్రహించి నై
సర్గిక నందనోపవన చందన కల్పక వృక్షసంగతిన్
నిర్గత చిద్విచార సరణిన్ విహరించుచు నుండె నిచ్చలున్

112. చం. అడవులఁ బట్టి వెళ్ళిన సురావళి యెట్టులొ యొక్కచోట సం
గడిఁగొని స్వర్గ రాజ్యమును గైకొను మార్గముఁగూర్చి చర్చలన్
విడువక సల్పి మార్గమును పేర్కొనఁ జాలక యంద రొక్కటై
కడువడి నేగి రప్డు శితి కంఠుని యొద్దకు రక్షణార్థులై

113. చం. శివుడును వారు వచ్చిన విశేష మెఱింగి యుపాయ మెద్దియున్
దివిరి కనంగ లేక మది; దివ్యులఁ దోడ్కొని బ్రహ్మ లోకమున్
జవమునఁ జేరి యంతయును సారస గర్భుని తోడఁ జెప్పగా
వివర మెఱింగి యన్నలువ వెన్నునిఁజేరుద మంచుఁ దెల్పినన్

114. తే.గీ. అందరును గూడి యప్పుడయ్యబ్జ నాభు
సన్నిధిన్ జేరి సన్నుతుల్ సలుప నతడు
వారి కుశలంబు లెల్లను వరుస నడిగి
అవసరంబేమి మీరాక కనిన యంత

115. మ. అరవిందోదర! సర్వ లోకములయం దావంతయున్ లేదు నీ
కెఱుగన్ రానిది, మావెతల్ దెలియవే? యింకేల చెప్పంగ, మున్





సుర నాథున్ గరుణించి వామనుడవై శోభిల్లి వైరోచనున్
దిరమై వాస మొనర్పఁ జేసితివి గాదే నాగ లోకమ్మునన్

116. తే.గీ. అసురుల కొకింతయు నమృత మందనీక
దేవతల కెల్ల పంచిన దేవ దేవ
ఇపుడు నీకన్న దిక్కు మా కెవరు తండ్రి!
కాన కాపాడు మమ్మిప్డు కమల నాథ!

117. చం. అని దివిజుల్ వినమ్రులయి యంబుజ నాభుని వేడ నాత డి
ట్లనియెను మిత్రులార! భయ మందకు డయ్య, యుపాయమొండు నే
మనమున నెంచితిన్ వినుడు మంచి తనమ్మున మోసగించుటే
యనువగుఁ గాని తక్కిన ప్రయత్నము లాతని పట్ల వ్యర్థముల్

118. చం. అలయక మీర లెల్లరు మహర్షుల వెంబడి నేగి వృత్రునిన్
గలిసి ప్రతిజ్ఞలన్ నెఱపి గాటపు మైత్రిని గల్గి యున్నటుల్
మెలగుచు నుండు డెంతయును మెల్పున; సందియ మింతయేనియున్
గలుగక సంచరింపు డటు కాలము కొంత సనంగ నాపయిన్

119. చం. సమయముఁ జూచి నేను సుర సత్తము వజ్రము లోనఁ జొచ్చి య
శ్రమమున వానిఁ జంపెదను శౌర్యమునన్ వధియింపరాని దు
ర్గమితు వధింప నెందును ప్రతారణ మొక్కటె చక్కనైన మా
ర్గము సురలార! పొందిక సుఖంబులు గల్గును మీకు శీఘ్రమే!

120. చం. దివిజ వరేణ్యులార! పరదేవిని, కామద నేకభక్తితో
వివిధములైన స్తోత్రముల విస్తృత రీతి భజింపు డింకపై
ప్రవిమల సత్వ రూపిణి పరాత్పర మీకు ప్రసన్నయై రిపున్
జవమున మోహ పాశముల సంకట పెట్టి వధించు నెట్టులేన్

121. ఉ. కామిత సౌఖ్యదాయి కల కారణ కారణురాలు సర్వభూ
తామల హృద్గుహైక నిలయన్ భజియింపు డనన్య చిత్తులై
యామె ప్రసన్నయైన నెది యైనను సాధ్యము ముజ్జగంబులం,
దామె యను గ్రహమ్మె కఱవైన నిరర్థకముల్ ప్రయత్నముల్

122. చం. మును మధు కైట భాసురుల భూరిపయోనిధి మధ్యమందు నే
నని యొనరించి చంపుటకు నాజగదంబ యనుగ్రహమ్మె కా

రణమని యెంచు; దయ్యెడ నిరంతరమున్ మది నిల్పి యా జగ
జ్జనని గూర్చి నే తపము సల్పిన వైన మెఱుంగు బ్రహ్మయున్

## దేవత లొనర్చిన దేవీ స్తుతి

123. చం. అరవిందోదరు డిట్లు వల్క నపు డయ్యాదిత్యు లామోద సం
భరితుల్ చేరిరి వేగ దివ్యవన సంపత్ శోభితో ద్వేలమున్
వరశృంగాగ్ర నిపాత నిర్మల తరాంభఃపూర్ణ కల్లోలినీ
చరదామోద మరాళ చక్ర బకమున్ స్వర్ణాద్రి తుంగాగ్రమున్

124. శా. ఏకాంతంబగు తత్ప్రదేశమున దేవేంద్రాది యాదిత్యు ల
స్తోకధ్యాన పరాయణాత్ములయి నిర్ధూతాఘ భావోదయా
నీకుల్ ప్రార్థన లిట్లు సల్పిరి జగన్నేత్రన్ మహా పావనిన్
శ్రీకల్యాణిని గూర్చి నిశ్చల గతిన్ శ్రేయః ఫలా పేక్షులై

125. శా. తల్లీ! యెల్లరమేము నీ సుతుల మే తథ్యమ్ము నేడివ్విధిన్
యెల్లల్గానని దుఃఖ సాగరమునం దిట్టట్టులన్ మున్గుచున్
అల్లల్లాడుచు నుంటిమమ్మ జననీ! యావృత్రు దుష్కృత్యముల్
కొల్ల ల్గొల్లలు, నీవు కాదనిన దిక్కున్ మొక్కు మా కేరికన్

126. ఉ. ఏల యుపేక్ష తల్లి! దొసగేమి యొనర్చితి మమ్మ! యెల్లలో
కాలకు తల్లి వీవ, నిను కాదని స్వేచ్ఛఁ జరించు వార లే
కాలమునందుఁ గల్గుదురె, కానక తప్పొనరించి యుండినన్
బేల తనంబుగాఁదలచి బిడ్డల మమ్ము క్షమింపగాదగున్

127. చం. "సకల సుఖోప భోగముల సంతతమున్ గడు లుబ్ధచిత్తులై
సకల జగంబు లేలు నను సమ్మతిఁ దల్పరు కాన కష్టముల్
ప్రకటిత మయ్యె మీ"కనుచుఁబల్కెదవేమొ నిజమ్ముగాదు, మే
మొకపరియైన నిన్దలప నోపని యట్టి క్షణంబు గల్గెనే

128. చం. నిను నొకవేళ మేము మది నిల్పక సుంత యుపేక్ష సేసినన్
తనయుల పట్ల ప్రీతి యెటు తప్పును తల్లికి; లోకమందు నే
జనని నిజాత్మజున్ విడువఁ జాలును సత్కృప మాలి,? కాన మ
మ్మనయముఁబ్రోచు వార లెవరన్యులు నీవిటు మిన్నకుండినన్





129. చం. మహిషుని మట్టు వెట్టి మును మమ్ములఁ బ్రోచిన యట్టు లిప్పు డి
య్యహితుని వృత్రుఁజంపఁదగు నమ్మ! రయమ్మున, లేకయున్న దు
స్సహమగు వాని చేష్టలకు సర్వ సుపర్వులు నెల్లలోకముల్
రహిచెడి వర్తిలున్ మఱియు రాక్షస వృత్తులు హెచ్చు నెల్లెడన్

130. సీ. ఈఫల పుష్పాదు లీమంత్ర తంత్రమ్ము
లెల్ల నీ సృష్టియై యెసగుచుండ
నినుపూజ సల్పెడు నియమాదు లెవ్వియో
యెఱుగ జాలము మే మొకింతయైన
సంసార జలధిని చక్కగా దాటింపఁ
దగిన నావలు నీ పదమ్ము లెలమి
వాని నర్చించెడి వారలే ధన్యులు
యోగులైనను మహా భోగులైన

గీ. అమరులకు యజ్ఞ భాగమ్ములందఁజేయ
పితరులకు నెల్ల మిగుల సంప్రీతిఁజేయ
జగతి స్వాహా స్వధా యను సంజ్ఞ లమర
దాల్చి యొప్పెడి తల్లి! నిన్ దలతు మెపుడు
మమ్ము కరుణించి రక్షింపు మమ్మ వేగ

131. వ. దివిజు లెల్ల రివ్విధంబున ప్రస్తుతింప జగదీశ్వరి సంతోష భరితయై
వారి యెదుట ప్రత్యక్షంబయ్యె

132. సీ. జగముల సౌందర్య సంపద లొక్కట
రాశివోసిన మహా రాజ్ఞి యనగ
చిఱు మువ్వల రవళి చిందులాడగ కటి
సూత్రము పాత్రమై సొబగు లీన
కంకణ నూపుర గలగలల్ తన వచో
మాధుర్యమునకు సంభావన లిడ
చిఱు నవ్వు వెన్నెలల్ చిందించు నెమ్మోము
కరుణామృతపు జల్లు కురియు చుండ

గీ. అరుణ భూషలు రక్త మాల్యాను లేప
నములు దాల్చి సర్వజ్ఞ యనంగ నొప్పి

సచ్చిదానంద రూపిణి వచ్చి నిలిచె
దేవతల కెల్ల సంతోష మావహింప

133. మ. జగదంబన్గని దివ్యులెల్లరును సాష్టాంగ ప్రణామమ్ములన్
విగతాహంకృతు లొచు సల్పి నిలువన్ విశ్వేశి సంతోషియై
నగుచున్ దేవతలార! నన్ను పిలువన్ గార్యం బదేమీ? యిటుల్
వగలన్ బొందగ కారణంబు చెపుడీ వైళంబ నిర్భీతులై

134. మ. అనినన్ దివ్యులు నమ్ర శీర్షులయి యమ్మా! మమ్ము వృత్రుండు దు
ర్జనుడై హింసల వెట్టు చుండ నిక నోర్వన్ లేక యొక్కుమ్మడిన్
వనముల్ పట్టుక పర్వు లెత్తితిమి దౌర్భాగ్యమ్మునన్ గుందుచున్
జననీ! వాని వధింప వజ్రమునకున్ శక్తిన్ బ్రసాదింపుమా!

135. మ. అని దివిజులు వేడగ నా
జననియు సమ్మతిని దెల్పి క్షణ మాత్రమునన్
జనియెను నంతర్హితయై
యనిమిషులును సంతసించి యరిగిరి స్వేచ్ఛన్

136. ఉ. అంతట నాదితేయులు మహర్షుల వెంబడి నేగి యాశ్రమో
పాంతముఁ జేరి యచ్చట తపఃపరిశోభిత నిర్మలాంగు, భా
స్వంత సమానతేజు, నిజశక్తి జగంబుల నాక్రమించు న
ట్లెంతయు నొప్పు వృత్రుఁగని రెల్లరు విస్మయ మావహింపగన్

137. చం. కని ఋషులంతటన్ దివిజ కార్యము నెమ్మిఁదలంచి మెల్లనన్
జని ప్రియమారఁ బల్కిరిటు సర్వభయంకర మూర్తి! నీతపం
బనితర సాధ్య, మీ కమల జాండములం దెటుఁ జూడ నీవయై
పెనగొని యుంటివయ్య! కడు భీతిలు నింద్రుడు సైత మీవనన్

138. ఉ. ఏల విరోధ మింక దివిజేంద్రుని తోడ, నిరంతరంబు ని
ట్లాలము సేయ సౌఖ్యమెటు లబ్బును నీకును వానికైన, భో
గాలకు దూరమై యిటుల కంటికి నిద్దుర లేక శత్రుని
ర్మూలనమే స్మరించుటది మోదమె? యోచన సేయుమాత్మలోన్

139. మ. నిదురన్ గూరగ నీదు, దుఃఖమును బొందించున్, మహాయోధుడేన్
మదిలో శాంతము లేక కుందు, రణసంబంధమ్మునన్ సర్వసం





పదలున్ గోల్పడు, నెల్ల ప్రాణులకు సంప్రాప్తించు కష్టంబులున్,
కదనంబున్ విడనాడి యింక సుఖముల్ గైకొమ్ము భద్రంబగున్

140. చం. కడు విలువైన కాలమును కయ్యములన్ సరిపుచ్చు చుంటి, వె
య్యెడల సకాల భోజనము, నింపగు నిద్రయు స్త్రీ సుఖంబులున్
బడయుట కల్గెనే? మదిని బాగుగ యోచన సేయుమయ్య! యి
ట్లెడపని యుద్ధ కాలముల; యేటి కికన్ బహు దీర్ఘ వైరముల్

141. ఉ. కావున వీరవర్య! యిక కాలము వ్యర్థ మొనర్పఁ బోక సౌ
ఖ్యావహ మైన సఖ్య మమరాధిపుతో నొనరింపు మయ్య! లో
కావలి శాంతి నొందు, దివిజాధిపుతో నిను గూర్పనెంచి మే
మీవిధి నేగుదెంచితిమి, వేగమె సమ్మతిఁదెల్పు టొప్పగున్

142. చం. శపథ మొనర్పఁ జేసి యల శక్రుని నిన్నును గూర్పగా కడున్
తపనలు చెందు చుంటిమి; శతారథరుండును నీవు కోరిన
ట్లపనయ దోష మానసుడునై శపథంబు లొనర్చు; మాకునున్
విపుల యశంబు గల్గు మిము వేడుకఁగూర్చిన కారణంబునన్

143. సీ. ఏ సత్యమున నిల్చి యెల్ల భూమండలం
బఖిలమున్ భరియించు నను దినమ్ము
ఏ సత్యమున నిల్చి యిను డవిశ్రాంతుడై
నిజ కాంతు లెల్లెడ నింపుచుండు
ఏ సత్యమున నిల్చి యా రేడు లోకాల
వీడ కయ్యనిలుండు వీచు చుండు
ఏ సత్యమున నిల్చి యెల్లలు దాటక
నిలిచి యుండును మహా జలధు లెల్ల

గీ. అట్టి సత్యము, పంచభూతాదు లెలమి
సాక్షు లౌదురు గాక! మీ సఖ్యమునకు
అరమరలు లేక మీరు విఖ్యాతి తోడ
కలసి యుండుడు సౌఖ్య సంగమము గలుగ

144. ఉ. తాపస వర్యులిట్లు కడు ధార్మిక దృష్టి వచింప వృత్రుడున్
కోపము వీడి శాంతుడయి కూరిమి మీరగఁ బల్కె నిట్టు లో

పాప విదూరు లార! కదు భవ్యతపోనిధులైన మీర లే
పాపపు కార్యముల్ గొనరు, పల్కరసత్యము లెన్నడేనియున్

145. వ. కాన నొక్కమాట తెల్పెద నాలకింపుదు

146. తే.గీ. శాత్రవునితోడ, శఠునితో, స్తబ్ధు తోడ,
కాముకుని తోడ, తేజమ్ము గడచినట్టి
వాని తోడను, సఖ్యమ్ము పూని సల్ప
బోడు బుద్ధి మంతుడు నైన పూరుషుండు

147. ఉ. ఆతడు సిగ్గెఱుంగడు, దురాత్ముడు, నింద్యుడు, బ్రహ్మహత్యకున్
భీతిల నట్టి పాతకుడు, విస్తృత కాముకుడున్, శఠుండు, న
త్యాతత ద్రోహ చింతనుడు, నయ్యమరేంద్రుడు; మీర లెంతయున్
పూత చరిత్రులున్ ఘన తపోధను లాతని విశ్వసింతురే?

148. తే.గీ. అతని కొఱకేల మీరు ప్రయాస పడుట
వాని నడవడి యెఱుగక పలుకు చుంటి,
రిట్టి యత్నమ్ము మాని మీరేగు డనుచు
వృత్రుడన ఋషు లెల్లరు విస్మయమున

149. మ. వ్యతిరేకింపక వారలంత నిపుణత్వంబున్ బ్రదర్శించుచున్
హితముల్ పల్కఁ దొడంగిరిట్లు వినుమోయీ! లోకమం దెవ్వడేన్
కృతకర్మోచితముల్ శుభా శుభ ఫలాకీర్ణంబులన్ బొందు, నే
గతి తప్పింపగ రాదు; శాంతు గతి దుష్కర్ముండు నిద్రించునే

150. తే.గీ. బ్రహ్మ హత్య యొనర్చిన వారలకును
మద్య పానమ్ము చేసిన మందులకును
కలదు నిష్కృతి; విశ్వాస ఘాతకునకు
ఎన్ని జన్మములకును నిష్కృతి హుళక్కి

151. కం. కావున నీ వింద్రునితో
నేవిధమున సంధిఁగొనగ నెంతువొ చెపుమా
ఆవిధమగు నియమమ్ముల
నోవృత్రా! సంధి చేతు ముదుగుము శంకన్





152. కం. అనినన్ వృత్రుండిట్లనె
ననఘుల కా ఋషి వరులకు నంజలియిడి, యో
యిన తేజు లార! నాకున్
వన జోద్భవు డిడిన యట్టి వరములెఱుగరే?

153. తే.గీ. ఆర్ద్రములు, శుష్కములు నైన, యాయుధముల,
నశ్మములనైన, పవినైన, నమరనాథు
వలన నేనియు, సకల దేవతల వలన,
నహములందైన, నిశల యందైనఁగాని,
మరణమెన్నండు లేనట్టి వరము నొసగె
నబ్జ జుడు నాదు తపమున కాత్మమెచ్చి
ఇన్నిటికి కట్టుబడి మీర లెట్టు లైన
సంధి కుదిరించఁగలిగిన సమ్మతమ్మె
విప్ర వరులార! సద్ధర్మ వేత్తలార!

154. మ. అనినన్ విప్రులు సమ్మతించి సుర లోకాధీశు రావించి వృ
త్రుని చెంతన్ నియమమ్ములన్ దెలుప సంతోషించి దేవేంద్రుడున్
మునివర్యుల్ వినిపించినట్లు శపథమ్ముల్‌సేసె నిశ్శంక, నం
తన నయ్యిర్వురు నాప్తులై మెలగి రానందమ్ము లేపారగన్

155. కం. ఒకచో నందన వనమున
నొక వేళన్ గంధ మాద నోన్నత శిరమం
దొకచో జలనిధి తటముల
నొకటై క్రీడింప సాగి రుత్సాహములన్

156. మ. మదిలో త్వష్టృ తనూజు డాప్త సఖ సంబంధమ్మునన్ వజ్రితో
ముదమారన్ జరియించు చుండ సమయంబున్ జూచు చుండెన్ శచీ
హృదయేశుం డతనిన్ వధించు కొఱకై యేర్పాట్లు గావించుచున్
పదిలుండై తన చేయు కుట్ర లితరుల్ భావింప లేనట్లుగన్

157. తే.గీ. కాల మీరితి కొన్నేళ్ళు గడచి పోయె
తనయు డింద్రుని నిజముగ మనము నందు
నమ్మె నని యెంచి త్వష్ట నందనుని కడకు
వచ్చి ప్రియమున హితములు వల్కెనిట్లు

158. మ. తనయా! నమ్మగరాదు శత్రువును; సుత్రాముండు నీపైన తా
నసయంబున్ బగఁబూని నిన్ దునుమగా నాలోచనల్ సల్పెడున్,
ఘనలోభాత్ముడు, మత్తుడున్, పరుల దుఃఖంబుల్ సదా గాంచుచున్
మన మందెంతయు సంతసంపడెడు దుర్మార్గుండు పాపిష్ఠుడున్

159. ఉ. పాపము లెన్నియో సలిపె పాకవిరోధి; రవంత యేనియున్
పాపభయమ్ములే, దొకట పాప మొనర్చిన యాత డావలన్
పాపము లెన్నియైన సలుపన్ దలపెట్టును, కాన నెయ్యమున్
బాపు కొనంగనౌ దివిజ వర్యునితో తనయా! రయమ్మునన్

160. కం. అని యిట్లు హితము వల్కెడి
జనకుని పల్కులను నతడు సరకుఁగొనక యుం
డెను; ధర పోఁగాలము వ
చ్చిన వానికి హితము లెట్లు చెవులకు నెక్కున్

## వృత్ర సంహారము

161. మ. అది సంధ్యా సమయమ్ము వృత్రు డొకనా డంభోధి తీరమ్మునన్
ముద మారన్ చరియించు చుండఁగనియెన్ పూర్వాధి నాథుండు, న
య్యది చూడన్ దివమున్ నిశీథమునుఁ గాదంచున్ విచారించి తా
మది లోనన్ దలపోసె నీ గతిని దుర్మంత్రాంతరాత్ముండునై

162. తే.గీ. పగటి వేళల రాత్రుల ప్రాణ భయము
లేని యట్టుల వరమును బూని కోరె
నిపుడు రాత్రియు పగలు గా దెంచి చూడ
తగిన సమయమ్మిదియె యౌ నితని వధింప
ననుచు తలపోసి సురనాథు డాక్షణంబ

163. మ. స్మరియించెన్ జలజోదరున్ మిగుల నిష్ఠన్ స్వాత్మలో నంత, న
య్యరవిందాక్షు దదృశ్య రూపమున దేవాధీశు వజ్రంబునం
దిరవై చొచ్చుటఁ గాంచి యిద్దె సమయం బీవృత్రు ఖండింప; దు
ర్భర శౌర్యోన్నతు వంచనన్ దునుముటే భావ్యంబు యోచింపగన్

164. తే.గీ. దారు లోహేతరములును; తడియు పొడియు
కానియట్టి యాయుధముల వీనిఁజంప





వలయు ననియెంచి యప్పుడ వ్వనధి తీర
ఫేనమున వజ్రమున్ ముంచి మాన సమున
నాది శక్తిని స్మరియించి యాక్షణంబ
విసిరె వృత్రుని కంఠమ్ము వీడి పడగ

165. వ. వననిధి ఫేనంబులార్ద్రంబులును, శుష్కంబులును కాని వగుటచే
తత్ఫేనావృతమైన వజ్రాయుధపు దెబ్బకు వృత్రుని శిరము
తెగిపడ నతని మొండెము పెద్ద పర్వత శిఖరము వలె నేల
కొరిగె, ఆదృశ్యమున్ గాంచి

166. శా. ఆనందమ్మున దేవతల్, ఋషులు, నాకాధీశుడున్ భక్తిసం
ధానోత్కర్షులునై జగజ్జనని నత్యంతంబు స్తోత్రమ్ములన్
గానంబుల్ బొనరించి యోజనని! త్వత్కారుణ్య సంపత్తిచే
యీనాడిట్లు వధింపఁ గల్గితిమిగా వృత్రున్ దురాచారునిన్

167. చం. అనుచుఁ గృతజ్ఞతల్ దెలిపి యందరు మ్రొక్కగ నింద్రుడంత నం
దనమున నాలయమ్మొకటి తద్దయు వైభవ మొప్ప దేవికిన్
ఘనముగ నిర్మితిన్ సలిపి, గర్భ గుడిన్ జగదేక మాత మూ
ర్తిని నియతిన్ బ్రతిష్ఠ నొనరించెఁ గడున్ గడు సుందరమ్ముగన్

168. కం. అది మొదలు సకల దివిజులు
హృదయంబుల నిల్పుకొనుచు నీశ్వరి నెపుడున్
సదమల గతి భజియింతురు
ముదమున నిల వేల్పుఁ జేసి పూర్ణ శ్రద్ధన్

169. వ. నాటి నుండి జగన్మాత "వృత్ర హంత్రి" యను నామంబున
సకల జనుల పూజ లందు కొను చున్నది

## మహర్షుల పశ్చాత్తాపము

170. చం. వనజదళేక్షణుం డపుడు వాసవు పూజలనంది వేడ్కతోఁ
జనియెనె కాని మిక్కుటపు సందియముల్ మదినేచ శాంతమున్
గనుగొన డయ్యె; నింద్రుడును కంపము నందుచు భీతచిత్తుడై
యనిమిష లోక మేగెను; మహర్షులు తామిటు లెంచి రాత్మలన్

171. మ. అకటా! యెంతటి మోసమయ్యె; యిటులీ యాదిత్యులన్ నమ్మి త్వ
ష్టృకుమారున్ గడు మోసగించితిమి, నిశ్చింతుండునై వృత్రు డి
చ్చక మొప్పన్ దివిజేంద్రు తోడ నెలమిన్ సఖ్యంబు గావించె పొం
దిక తోడన్ మన మాటలన్ విని మదిన్ ద్వేషంబుఁబోనాడుచున్

172. తే.గీ. ఇంత పాపమ్ము చేసిన యిట్టి క్రూర
కర్ములకు మహర్షుల మను గౌరవమ్ము
తగునె, సురపతి సంబంధ మగుట వలన
మనము చెడితిమి వేరొండు మాటలేల

173. చం. కడు మమకార మొక్కటియె కారణమై యిటు లింద్రు చేత నే
ర్పడ శపథంబులన్ బలుకఁబంచి యనర్థము తెచ్చుకొంటి, మె
ల్లెడలను పాప కార్యముల కెల్ల మమత్వమె ముఖ్యహేతువౌ,
నెడపక పొందకుందుమె సురేంద్రుని పాప ఫలార్ధ భాగమున్

174. ఉ. పాపపు కృత్యముల్ సలుపు వారును, తత్క్రియ చేయుమంచు ప్రే
రేపణ చేయు వారు, వివరింపక సమ్మతిఁదెల్పువార, లా
పాపుల పక్షమై నిలుచు వారును, లోకములం దలంప తత్
పాప ఫలంబు బొందెద రవారణ నంచు వచించు శాస్త్రముల్

175. కం. అమర పతికి సాయపడిన
కమలేశునికైన నఘము గల్గక యున్నే?
మమతా స్వార్థంబులు మది
నమరిన వాడెట్టి పాప మైన నొనర్చున్

176. కం. పురుషార్థమ్ముల లోనన్
మరుగు పడియె ధర్మమోక్ష మార్గమ్ము లెటన్
తిరమగుచు నర్థకామము
లిరవుగ సమ్మతములయ్యె నెల్ల జనులకున్

177. వ. అని యిట్లు వితర్కించుచు మునివరు లెల్లరు తమ తమ
యాశ్రమంబులకున్ జనిరి.

178. చం. తన సుతు డింద్రుచే నిటుల దారుణ రీతి వధింపఁబడ్డ వా
డనియెడి దుష్ట వార్త విని యార్తి మునింగిన త్వష్ట యంతటన్





తనయుని యాశ్రమంబునకు తద్దయు వేగమె యేగి యచ్చటన్
గనియెను పుత్రుదేహమును కన్గవ బాష్పము లొల్క ధారలై

179. ఉ. పొంగెడు దుఃఖ మాపు కొని పుత్రునకున్ దగ నంత్య కర్మముల్
సాంగముగా నొనర్చి, యల శక్రు డొనర్చిన దుష్టకృత్య మో
ర్వంగ మనంబు రాక, తన పట్టినిఁబట్టి వధించినట్టి దు
స్సంగు డతండు నింతకు భృశంబుగ దుఃఖముఁ బొందు గావుతన్!

180. తే.గీ. అనుచు శపియించి త్వష్ట తా నచటు వీడి
మేరు శిఖరాగ్ర మున కేగి మిగుల నిష్ఠ
తప మొనర్పగ సాగెను దాంతు డౌచు
ఆహరించుచు ననిల పర్ణాంబు వులను

181. కం. వ్యాసుం డివ్విధి వృత్రుడు
వాసవుచే చంపఁబడిన వైనముఁజెప్పన్
వేసరిలక వినుచు నృపతి
యాసక్తిన్ మరల నిట్టు లడిగె మునీంద్రున్

182. చం. మునికుల నాథ! యింద్రుడటు భూసుర నందను సంహరించుటన్
ఘనమగు పాతకం బొడిని గట్టడె? దానన నెట్టి కష్టముల్
గొనెనొ యెఱుంగఁ దెల్పుము, ముకుందుడు వానికి ప్రేరకుండునై
యనిమిష నాథు పాతకము నంతమొనర్ప సహాయుడయ్యెనా?

183. చం. తెలుపు మటన్న వ్యాసుడు సుధీవరు దయ్యవనీశుఁగాంచి యో
యలఘు యశో విశాల! వినుమయ్య! స్వకర్మఫలంబు లేరికిన్
దొలగవు, దుఃఖమైన పరితోషమె యైనను వారి వారి క
ర్మల కనురూపమై కలుగు మానవ దానవ దేవ జాతులన్

184. చం. నిజముఁ దలంప నింద్రునకు నీరజ నాభుడె యీ యుపాయ మ
క్కజముగఁదెల్పె; తెల్పుటయె కాక శతారము నందుఁజొచ్చి త
ద్విజ వధకున్ సహాయ పడె; పెల్చనఁ గార్యము తీరినంత ది
వ్యజ పతి వంకఁ జూడ దత డాపదలన్ దల మున్కలౌతతిన్

185. కం. దైవము ప్రతికూలించిన
సేవకులును, కన్నవారు, స్నేహితులు సుతుల్

ఏవారు సహకరింపరు
భావింప స్వకర్మ ఫలము వారింపగన్

## ఇంద్రుని కంగారు

186. మ. కపటోపాయము చేత వృత్రు నిటులన్ ఖండించి స్వర్గాధిపుం
డుప మింపన్ దగనట్టి చిత్త వికలత్వోత్తప్తుడై యుండ గా
కృప యొక్కింతయు లేక బ్రాహ్మణు నిటుల్ గీర్వాణ నాథుండు తా
కపటం బూని వధించె, మోసమని నాకంబెల్ల గగ్గోల్వడెన్

187. సీ. శపథమ్ములన్ జేసి సంధి కొడంబడి
సఖ్యమ్ముతో నెప్డు సంచరించి
విద్వేష మెఱుగక విశ్వసించిన వృత్రు
నన్యాయముగ చంపె నౌర యిట్టు
లింతటి క్రూరుని నెన్న డెఱుంగము
మనకు నాయకు డీత డనుట సిగ్గు
మునులును నమ్మించి మోస గించిరి వీర
లేనాటి ధర్మాత్ము లెంచి చూడ

గీ. అనుచు దేవ గంధర్వ యక్షాదులెల్ల
గములు గట్టుచు చర్చింతు రమిత గుహ్య
ముగ తమ తమ గోష్ఠుల, వనముల నిజగృహ
ములను జేరి నిరతమున్ గలతలెసగ

188. కం. అట నట నెల్లరు పలికెడు
కటు వగు నీపలుకు లెల్ల కర్ణములఁబడన్
నిటల తట ఘటిత కరుడై
యటమట వడె యింద్రు డప్డు డపయశ మౌటన్

189. తే.గీ. అప యశమ్మును పొందిన యట్టి యెడల
మేన ప్రాణమ్ములున్న నేమౌను ఫలము
బ్రతికి యుండియు జీవచ్ఛవంబె యతడు
కాన మరణమే మేలు నిక్కమ్ముఁదలప





190. కం. మును నింద్రద్యుమ్నుండను
జనపతి కడు పుణ్యమూర్తి సద్యశు డయ్యున్
తన పుణ్యము నశియింపగ
ననిమిష లోకమున నుండి యవనికి దిగడే!

191. సీ. అపరాధ మొకయింత యాచరించి యయాతి
శపియింపఁ బడి పీత జన్మ మెత్తె
భృగు శాపమున వెన్ను డగణిత జన్మమ్ము
లెత్తంగ వలసెను హీన గతిని
వామనుండై పుట్టి బలిని యాచించెను
మూడడుగుల నేల పోడిమి సెడి
దశరథ రాముడై ధాత్రీ సుతను వీడి
యడవులఁ బడి యేడ్చె నల్పు పగిది

గీ. అవ్విధమ్మున నిపుడు స్వర్గాధిపుడును
బ్రహ్మ హత్యా మహా పాప భారు డగుచు
శాంతి నశియింప తనవిధుల్ జరుప మరచె
తప్పునే కర్మ ఫలము విధాత కైన

192. మ. తన వారల్ దరిఁజేరి పిల్చిన పరధ్యానంబు నందుండు, నే
దినమున్ గొల్వును దీర నెంచడు, భయోద్వేగమ్మునన్ దీర్ఘ చిం
తనుడై నింగిని చూచుచుండు, శచియున్ ధైర్యంబు బోధించినన్
వినబో డమ్మఘవుండు పాపభయ సంవేగాత్ముడై నిచ్చలున్

193. శా. స్వామీ! భీతిల నేటికయ్య, కడు నుత్సాహంబుతోనుండ కి
ట్లేమీ? దుఃఖముఁజెంది యుంటివి సురాధీశా! భవత్ శాత్రవున్
భీమా కారుని సంహరించితి గదా వృత్రున్; మఱింకెవ్వరేన్
నీమీదన్ బగఁ బూనిరో తెలుపుమా నిర్మించు వాడెందునేన్

194. చం. అన దివిజాధి నాథు డపుడా శచిఁగాంచి సరోజనేత్ర! నీ
వను కొనినట్లు శాత్రవ భయంబొక యింతయు లేదునాకు, కా
దనిన సుఖమ్ము శాంతియును నాత్మ నెఱుంగక యుంటి నిట్లు, బ్రా
హ్మణ వధచేత పాపమిటు లందితి నంచు మదిన్ గలంగుచున్

195. సీ. నందనోద్యాన మానందమ్ము నిడదయ్యె
నమృతము విషమట్టు లరుచి మయ్యె
గంధర్వ గానముల్ కర్ణ శూలములయ్యె
నప్సరోగణనృత్య మహిత మయ్యె
కామధేనువు కల్ప కమ్ములు నైనను
సౌఖ్య మొసంగవు శాంతి నిడవు
ఏకాంత మేర్పడ నింట నుండుద మన్న
నాలోచనల్ పెక్కు లగును మదికి

గీ. ఏమి చేయుదు నెచ్చటి కేగు వాడ
శాంతి సౌఖ్యము లొసగెడి స్థలమ దెదియొ
తెలియఁ జాలక యుంటిని దీన గతిని
అనుచు సతితోడఁ బల్కి తానంతమీద

196. కం. వనరుచు మానస సరసికి
ననిల జవంబునఁజని యట నంబుజ నాళం
బున దూరి వసించుచు న
య్యనిమిషపతి యుండె నీట నహివరు పగిదిన్

## నహుషుని ఇంద్రపదవి వరించుట

197. శా. నాకాధీశుడు స్వర్గమున్ విడిచి చింతా మగ్నుడై వెళ్ళగా
నాకంబెల్ల నరాజకం బగుట నన్యాయ ప్రవృత్తుల్ వెసన్
బ్రాకన్ దేవత లెల్ల భీతిలిరి, దుర్వార్తల్ విజృంభించె, నా
వైకుంఠంబున సైత మీవిషయముల్ వ్యాపించె శీఘ్రంబుగా

198. మ. వసుధన్ వర్షము లేక పంటలును శోభల్ దప్పె, కూలంకషో
ల్లసముల్ మారెను నిర్జలంబులయి, యల్లల్లాడి రుగ్రక్షుధా
వ్యసనార్తిన్‌బడి ప్రాణి కోటి, విషమం బైనట్టి యాదుస్థితుల్
వెస మాయింపగఁ జేరి రొక్కెడ సురల్ విద్వాంసులున్ మౌనులున్

199. తే.గీ. అందరును చేరి చర్చించి యమర లోక
మందు నెలకొన్న దుస్థితి నంతమొందఁ
జేయ నహుషుడను నొక ప్రసిద్ధ పురుషు
నింద్ర పీఠమ్మునన్ నిల్పి రిచ్చకమున





200. ఉ. ఆ నహుషుండు ధర్మయుతు డయ్యును నింద్ర పదాధి రోహుడై
పూనె రజోగుణంబు నతి భోగ విలాస విశేష సక్తుడై,
సూన శరాహతిన్ మిగుల సొక్కుచు నిచ్చలు నప్సరోఙ్గనా
ధ్యాన పరాయణ త్వమున తన్మయుడై విహరించు నుద్ధతిన్

201. తే.గీ. అట్లు విహరించు నెడల తానందు నందు
శచిని గూర్చియు నయ్యింతి సద్గుణముల
నంద చందమ్ములన్ విని యమిత ముదము
నంది యామెతో సంగమ మొందఁదలచె

202. చం. తలచి యతండు నియ్యది యధర్మ మటంచుఁదలంచ కప్డు సం
చలితుడునై తపోధనుల సన్ముని వర్యులఁబిల్చి పల్కె ని
శ్చల మతులార! నే నిపుడు స్వర్గ పురీశుడ నైతిఁగాదె, నన్
గలసి శచీ పురంధ్రి నవకంజ దళాక్షి సుఖింప దేలొకో?

203. ఉ. నేనిపు డింద్రుడన్ సురల కెల్లను, మీకును, లోక పాలక
శ్రేణికి, కావునన్ వినుడు స్నేహమెలర్పగ మీర లెల్ల నా
యానఁ జరింపగా వలయు, నయ్యతివన్ శచి నెట్టు లైన నా
తోన సుఖింపఁ జేయు డతి తూర్ణముగా నని యానతిచ్చినన్

204. మ. అనఘుల్ మౌని వరేణ్యు లెల్లరు వివృద్ధాశ్చర్య సంభూతులై
కనలే కెద్ది యుపాయమున్, నహుషునిన్ గామాంధు గర్హించుచున్
జని రొక్కుమ్మడి మెల్లమెల్ల శచికిన్ సర్వంబు నీ వృత్తమున్
వినిపింపన్ దగునంచు నెంచుచుఁగడున్ వ్రీడాభిభూతాత్ములై

205. చం. పలికి రిటుల్ శచిన్ గని యవారిత చిత్త వికంప మానులై
కలికిరొ! నీపయిన్ మిగుల కామ వికారముఁజెంది యున్నవా
డల నహుషుండు, నిన్నె మది నర్థిఁదలంచుచునుండె గర్వ సం
కలితుడునై, మమున్ బనిచె కార్యము దీర్పుమటంచు దుష్టుడై

206. తే.గీ. ఏమి సేయుదు మిపుడత డింద్రు డయ్యె
నతని యాజ్ఞను పాలింప నౌనుగాదె.
కర్మ వశమున నతని నాకమునకెల్ల
నధిపు నొనరించితిమి గాదె యరయ కపుడు

207. చం. అనవిని యాశచీ హృదయ మగ్నియ వోలె తపింప భీతిచే
తన యొడలెల్ల బిట్టదర తద్దయు పొంగుచు నున్న దుఃఖమున్
మనమున నిల్పి; తప్పుకొను మార్గ మొకండును గాన లేక తాఁ
జనియె బృహస్పతిన్ గలసి సర్వము నాతని కెక్కఁజెప్పగా

208. చం. అలయుచు నట్లు తాఁజని బృహస్పతి కంతయుఁజెప్పి దుఃఖసం
కలిత మనంబునన్ నిలువ;ఁ గన్గొని యాగురుదేవుడప్డు తా
య్యలి మది వేదనన్ విని ప్రియంబున నిట్టులఁబల్కె నింక చిం
తిలకుము పుత్రి! వీడుము మదిన్ భయమెల్ల శుభంబు గల్గెడున్

209. చం. నహుషుని బారినుండి నిను నాతిరొ! రక్షణ సేయుదేను, దు
స్సహమగు దుఃఖ మేర్పడ విచారముతో శరణన్న వారలన్
అహితుల నైనఁబ్రోచుటయె యార్ష మతమ్మగు;నట్లు కాక ని
స్పృహ శరణార్థులన్ విడచు భీరునకున్ నరకంబు తప్పునే

210. తేగీ. కాన నిను నేను విడువను కమల నేత్ర!
అభయ మిచ్చితి నింక నేమైనఁ గాని
నిన్ను రక్షింతు శోకింప నీకుఁ దగదు
ధైర్యమును బూని యుండు మింతటన మదిని

211. కం. ఈవార్తను విని నహుషుడు
దేవత లెల్లరను బిలిచి తీవ్ర తరంబౌ
నావేశము పూని పలికె
భావంబున మదన తాప భర మధికంబై

212. ఉ. నేర మొనర్చినట్టి గురునిన్ పరిమార్పుడు మీరలేగి, నే
కోరిన యట్టి యా శచికి కూరిమి రక్షణ నిచ్చె తా నహం
కారము మిన్ను ముట్టి; నను కాసునకైనను లెక్క చేయ దం,
చోరిమిఁ దప్పి పల్కెఁ గడు నుద్ధతుడై ఋషు లక్కజంపడన్

213. కం. అచ్చెరువడి ఋషి వర్యులు
మెచ్చక యానహుషు విధము మెల్లగ సౌమ్యం
బచ్చువడగ నతని మదికి
నచ్చంగన్ బలికిరిట్లు నయమగు రీతిన్





214. చం. తగదిటు కోపమూనుట సుధాకర తేజ! శమంబుఁబూనుమా!
నిగమము లెల్ల నన్యరమణీ మణులన్ మది లోన గోరుటల్
దగదని తెల్పుచున్నయవి, తాదృశు లిట్టి లధర్మ వృత్తికిన్
దగిలిన నన్యు లెట్టులిక ధర్మపథంబునఁబోదు రెంచుమా!

215. చం. అదియునుఁగాక యాశచి మహా పతిభక్తిఁజరించు సాధ్వి, తా
మది నెటు నిన్నుఁగోరు, నిక మానుము నీదు ప్రయత్న, మీ దివిన్
మదగజయాన లచ్చర లమంద విలాసినులుండ వారితో
ముదమున సేవలన్ గొనక పుణ్యసతిన్ మదిఁగోరుటొప్పునే!

216. కం. రతి వలయు సంగమమునకు
నతివకు పురుషునకు మధ్య ననురాగమ్మే
రతియగు; నేయొక్కరికేన్
రతిలేక జరుగు కలయిక రంజిలఁగలదే

217. కం. బలవంత మైన సంగమ
మలరింపదు కాన నెప్పు డన్యస్త్రీలన్
గలియఁ దలంచుట తప్పని
తెలియుము, మిము బోంట్ల కిట్టి తీరుల్ దగునే

218. కం. అభివృద్ధు లెల్ల పాప
వ్యభిచారము వలనఁ దగ్గు పరిపూర్ణముగన్
అభివృద్ధులవియె దివ్య
ప్రభలన్ వర్ధిలును పుణ్య వర్తనములచే.

219. చం. అని ఋషి వర్యు లెల్లరు నయంబునఁ బల్కగ మెచ్చఁబోక హు
మ్మని నహుషుండు బిట్ట దర నార్చుచు నోఋషులార! మీర లి
ట్లనుట సమంజసంబె, దివిజాధిపుడున్ మును మోసగించి య
వ్వనిత నహల్యఁ బొందెఁగద భర్త గృహంబున లేని పట్టునన్

220. కం. సవనముఁ జూడగ వచ్చిన
దివిజా చార్యుని సతి నతి తేజోవతిఁదా
గవయగ లేదే చంద్రుం
దవకాశము జార నీక యతివన్ దారన్

221. కం. ఆనాడు మీరు లేరా?
యీ నీతులు వారి కేల యెఱిగింప రాకో?
నేనే దొరికితినా మీ
కీనాటికి నిట్లు చెవుల కెక్కగఁ జెప్పన్

222. కం. విను వారలున్న నెల్లరు
ఘనముగ నీతులను చెప్పఁగల రెల్లెడలన్
వినఁబో మెక్కాలంబున
నెనయగఁజెప్పినవి యాచరించెడి ఘనులన్

223. ఉ. కావున నిట్టి నీతులను కట్టి శచిన్ ననుఁగూర్చు డెట్టులేన్
భావజ పుష్పబాణము లపారముగా నెదఁ దాకుచుండె, మీ
రేవిధమైన కానుకల నిష్ట పడన్ సమకూర్తు నిక్కమో
దేవ మునీంద్రులార! యెటు తెత్తురొ యామెను తేల్చుకొండికన్

## శచీరక్షణకు బృహస్పతి యోచన

224. చం. అనియిటు కుండ బ్రద్దలగు నట్లు వచించిన వాని మాటలన్
విని ఋషి వర్యు లెల్లరును భీతిలి యాతని కోర్కె దీర్పకుం
డిన బ్రతుకంగ నిచ్చునె? వడిన్ జని యెవ్విధినైన యామెకున్
వినయమునన్ వచించి కడు వేగమె తోడ్కొని వచ్చుటొప్పగున్

225. చం. అని తలపోసి యందరు బృహస్పతి యింటికి నేగి భక్తితో
ననఘున కాగురూత్తమున కంజలి ఫాలము సోక మ్రొక్కి యో
యనిమిష వంద్య! యింద్ర సతియౌ శచి మీకడ నున్నదంచు తా
విని నహుషుండు పంచె మము వేగమె తోడ్కొని రాగ నయ్యమన్

226. కం. అమర పతి పీఠమందపు
డమరులు సమ్మతినిఁ దెలుప నభిషేకంబున్
గొమరొప్పఁ జేసి నందున
నమరేంద్రుని భార్య నాత డాశించె మదిన్

227. కం. ఈ మాటలు విని నంతనె
యామాన్యుడు గీష్పతి కడు నాగ్రహ మొదవన్
ఈ మానిని నే విడువను
ఏమైనను భయపడనిక నేటికి మాటల్





228. మ. అనినన్ మౌని వరేణ్యు లిట్లనిరి దివ్యాచార్యునింగాంచి యో
యనఘా! మీరని నట్టి పల్కులను మే మవ్వానికిన్ జెప్పినన్
వినఁబో డెంతయు తీవ్ర కోప యుతుడై వేధించు మమ్మందరన్
గనుకన్ వేరొక మార్గ మేదయిన వక్కాణింపుమయ్యా! వెసన్

229. చం. అనిమును లెల్ల వేడగ బృహస్పతియున్ క్షణమూరకుండి యి
ట్లనియె మునీంద్రులార! విను దానహుషున్ దరిజేరి ముందుగా
వనజ దళాక్షి యౌశచి యవశ్యము వానిఁబ్రలోభపెట్టి తి
య్యని వచనంబులన్ బలుకు; నంతట గండము తప్పు నేటికిన్

230. కం. అని శచికి నహుషు తోడన్
వినిపింపన్ దగిన వెల్ల వివరించి వెసన్
ముని వర్యుల తో గీష్పతి
వనజాక్షిన్ వెంటఁగొనుచు పయనం బయ్యెన్

231. చం. శచిని బృహస్పతిన్ మఱియు స్వర్గ నివాసులఁ గాంచి నంతనే
ప్రచుర మహోల్లసంబెనయ భావజ తాప వివర్ధ మానుడై
విచలిత పద్మనేత్రఁ గని వేడుక నన్నహుషుండు వల్కె తా
నచల మనస్కుడై కృతక మౌ ప్రియ భాషణ నైపుణీ గతిన్

232. మ. అరవిందాయత పత్ర లోచన! సురాధ్యక్షాఖ్యకున్ నేడు నే
కర మర్హుండ ననంగఁ జెల్లె నిను విఖ్యాతంపు సౌందర్య ని
ర్భర గాత్రిన్ గనఁగల్గి నంత;నిది నాభాగ్యంబు, మత్ సత్కృతుల్
బరి పూర్ణంబయినట్లు దోచె సుదతీ! వ్యాలోల నీలాలకా!

233. మ. అనినన్ బొంగెడు దుఃఖ మాపుకొని యయ్యబ్జాక్షి సర్వాంగముల్
వణకన్ భీతిలి హీనమౌ స్వరమునన్ బల్కెన్ మహేంద్రా! నినున్
గుణగణ్యున్ వరమొందు వేడెదను, నీకున్ సమ్మతంబయ్యెనేన్
వినుమీ! యోర్పు వహించి మేలగును నా విజ్ఞప్తి సేకొన్నచో

234. కం. నా నాధు డేమి యయ్యెనొ
నే నెఱుగక యుంటిఁగాన నిర్ణయ మెదియున్
మానసమున నొనరింపక
దీనత నిటులుంటి నదియు తీరిన యెడలన్

235. కం. నే నిను వరియించెద న
వ్వానిని వెదకింపు మతని పాటెఱుగక యే
నే నినుఁ గోరుట తగునే
మానిని కిది ధర్మమగునె మదిఁ దల పోయన్

236. వ. అని ధర్మయుక్తమ్ముగా బలికిన శచీదేవిమాటలు విని నంత

237. కం. సమ్మతిఁ దెలిపెను నహుషుడు
సమ్మదమున శచియుఁ జనియె స్వస్థలమునకున్
నెమ్మది గీష్పతియు నలరి
యిమ్ముగ దేవతలఁ గూడి యేగెన్ స్వేచ్ఛన్

238. ఉ. అంతట దేవ సంఘముల నందర నా నహుషుండు పిల్చి మీ
రింతట నెల్లరున్ గలసి యింద్రుని జాడ నెఱింగి రండటం
చెంతయు దర్పమేర్పడ నహీన స్వరంబున నాజ్ఞ సేయ, నే
చెంతన నెట్లు గాంతుము శచీ పతినంచుఁదలంచి యెల్లరున్

239. ఉ. చేయున దేమియున్ గనక శ్రీపతి చెంతకు నేగి నమ్రులై
తోయజ నాభ! బ్రాహ్మణుని ద్రుంచుటచే కడు పాపయుక్తుడై
యేయెడ కేగెనో మఘవు డెన్నిదినంబు లొ దాటిపోయె, నే
మాయెనొ జాడయే తెలియ దయ్యె శరణ్యుడ వీవె మాకికన్

240. మ. అనినన్ దా చిఱునవ్వు నవ్వి హరి యయ్యాదిత్యులంగాంచి మీ
రనుమానింపక యశ్వమేధమును చేయన్ బూను డట్లైనచో
తనకున్ బుణ్యము సంభవించి ద్విజ హత్యాపాప నిర్యాతుడై
యనిమేషాధిపుడున్ పవిత్రుడగు నయ్యాగ ప్రభావంబునన్

241. తే.గీ. అశ్వమేధమ్ము చే జగదంబ మదిని
సంతసంబంది యింద్రుని స్వర్గ పీఠ
మందుఁగూర్చుండఁబెట్టు భయమ్మదేల?
తల్లి కరుణింప పాపముల్ దలగకున్నె

242. చం. శచియును నిత్యయుక్తయయి శాంకరినిన్ మది నిల్పి యెప్పుడున్
ప్రచుర గతిన్ భజంపుమని పల్కుడు, సత్కృప తోడ మోహసం
కుచితునిఁ జేసి యానహుషు కుత్రను భగ్నమొనర్చు దేవి; తా
నచిరగతిన్ మహేంద్రుడు దివాధిపు డౌ నతి వైభవంబుగన్





243. కం. అని వెన్నుడు తెల్పగ న
య్యని మిషు లెల్లరును మిగుల నానందముతోఁ
జని యశ్వమేధ యాగం
బొనరించిరి దేవ విభుని యున్నతి కొఱకై

244. ఆ.వె. అశ్వమేధ యాగ మమరులు సేయగా
నతి పవిత్రు డయ్యె నమర విభుడు
బ్రహ్మహత్య వలనఁబడసిన పాపమున్
తొలగె నతని కంత తూర్ణగతిని

245. మ. తనకున్ జుట్టిన యట్టి పాతకము నాతం డాక్షణంబందె వృ
క్ష నదీ భూ తరుణీ తతిన్ దగుల వీకన్ రువ్వి పాపౌఘ సం
జనితోగ్రామయ బాధనుండి గనె మోక్షంబున్; తదాదిన్ నిరీ
క్షణుడైయుండెను పద్మ నాళమున యుక్తంబైన కాలమ్ముకై

246. శా. కాలం బిట్టుల సాగుచుండ నతి దుఃఖంబంది యింద్రాణి నే
త్రాలన్ బాష్పజలమ్ము నిండ గురునిన్ ధర్మజ్ఞునిన్ జేరి, పా
దాలన్ ముట్టి నమస్కరించి పలికెన్ దైవజ్ఞ! యీ దేవతల్
శ్రీలక్ష్మీపతి యాజ్ఞఁ జేసిరి గదా! చెల్వంబుగా యాగమున్

247. ఉ. "యాగ మొనర్చినార మమరాధిపు పాపము వీగి పోయె. తా
నాగమ నమ్ముసేసి తన యాసన మెక్కు సురేంద్రు" డంచు నా
డాగతిఁబల్కి రీదివిజు; లట్టులె యైన మహేంద్రుడేడి? య
య్యాగ ఫలం బదేది? యెటు లాతని దర్శనమబ్బు నాకికన్

248. మ. అని యర్థించెడు నింద్ర పత్నిఁగని యమ్మా! నీవు లోకేశ్వరిన్
ఘన నిష్ఠన్ భజియింపగావలె, జగత్కల్యాణి సంతృప్తి జెం
దిన నీకున్ పతి దర్శనం బగును, తా దివ్యా సనంబెక్కుఁగా
వున పూజింపుము లోక మాతను గడున్ బూత వ్రతావిష్కృతిన్

249. కం. అని పలికి దేవగురువపు
డనిమిష పతి సతికి నిచ్చె నంబామంత్రం
బనితర మహిమోపేతము
ననిశము జపియింపు దీనినంచుఁబలుకుచున్

## శచీ దేవికి జగన్మాత అనుగ్రహము

250. కం. గురువరు డిచ్చిన మంత్రము
నరమరికలు లేక జపము నాత్మ సలుపుచున్
స్థిరముగ భజియించెను శచి
సుర భోగము లెల్ల విడిచి శుచియై దేవిన్

251. వ. ఆశచీదేవి ఆరాధనకు జగదీశ్వరి సంతృప్తిఁజెంది యామె
యెదుట ప్రత్యక్షంబయ్యె

252. సీ. హంస వాహన మెక్కి అఖిల లోకారాధ్య
కోటి సూర్య ప్రభల్ కొమరు మిగుల
కోటి విద్యుల్లతల్ గూడి నిల్చిన యట్లు
చంద్ర కాంతు లొకటఁ జల్లి నట్లు
పాశాంకుశ వరదాభయ హస్తముల నొప్పి
నాల్గు వేదమ్ములు వెల్గు చుండ
ఆపాద కంఠమ్ము నావరించిన మేలి
ముత్యాల దండలు ముద్దు లొల్క

గీ. మూడు కన్నుల చిఱునవ్వు మొలచుచుండ
అఖిల సృష్టికి కారణమైన తల్లి
అక్షర స్వరూపిణి కరుణామృతాబ్ధి
ఎదుట ప్రత్యక్షమయ్యె నయ్యింద్ర సతికి

253. వ. అట్లు ప్రత్యక్షమైన జగదీశ్వరి శచినిఁగాంచి

254. ఉ. ఏమి వరమ్ము కావలయు నింద్ర సతీ! భవదీయ భక్తికిన్
నే మది సంతసించితి; ననింద్య తపోధను లైన వారికేన్
నా మహితోజ్జ్వలాకృతిఁ గనంగ నసాధ్యము; నీదు పూర్వపున్
బాముల పుణ్య యోగమున వచ్చితి నిట్టు లనుగ్రహించితిన్

255. కం. అనవిని శచియిట్లనె నో
జననీ! యీనహుషు భయము సైరింపగ జా
లను నాభర్తను స్వర్గం
బున కధిపతిఁ జేయుము ననుఁబ్రోవుము కరుణన్





256. ద్విపద. అని యిట్లు వేడెడి యాశచిన్ గనుచు
జనని యిట్లని పల్కె సత్కృప తోడ
"విను మిదే దూతికన్ వెంటఁగైకొనుచు
చను మిప్డె మానస సరసి చెంతకును
కనిపించు నచ్చట కమల నాళమున
ననిమిష పతి నీకు నక్కజంబుగను
మునిగింతు నహుషు నే మోహ వార్నిధిని
అనిమిషేంద్ర పదవి నంతమొందింతు
కనగల వికపైన ననిమిషాధిపుగ
ఘనముగ నీభర్త" ననిపల్కి జనని
కనుమరు గయ్యె నా క్షణమున శచికి

257. ఉ. అంతట దేవ దూతిక రయమ్మున మానస సారసాకర
ప్రాంతముఁ జేర్చె నాశచిని, భర్తృ వియోగ విచార పూర్ణయై
చింతిలు నామె యప్డు సరసీ రుహనాళము నందుఁగాంచె న
త్యంతము సూక్ష్మమై వరలు నాత్మ విభున్ దివిజాధి నాథునిన్

258. మ. కని యానందము దుఃఖ మొక్కటన సఖ్యం బేర్పడన్ జూచు న
వ్వనితా రత్నముఁగాంచి యింద్రుడతి విభ్రాంతాత్ముడై పల్కె నో
వనజాక్షీ! యిటకెట్లు వచ్చితివి యీప్రాంతాన నేనున్నటుల్
మును నెవ్వార లెఱుంగ? రెవ్వరిటకున్ బూబోణి! నిన్ జేర్చిరో?

259. మ. అని యాశ్చర్యము తోడఁబల్కు పతి నయ్యబ్జాక్షి వీక్షించి, యో
యనఘా! నే జగదీశ్వరీ కృప ననాయాసమ్ముగా వచ్చి నిన్
గను భాగ్యంబును బొందితిన్, వినుము నాకంబందు నిన్నెచ్చట
న్గనలే కెల్లరుఁగూడి యన్నహుషు నింద్ర త్వమ్మునన్ నిల్పగన్

260. ఉ. ఆ నహుషుండు ధర్మయుతు డయ్యును నింద్ర పదాధిరోహ గ
ర్వాన నయుక్త మంచు మది భావన సేయక తన్ను భర్తగా
పూని వరింపు మంచు కడు మూర్ఖుడునై నను హింసవెట్ట, న
వ్వాని ప్రయత్నమున్ దివిజ వర్యులు కాదన జాల రయ్యెడన్

261. చం. సుర గురుడౌ బృహస్పతియు చూచుచు నుండక యేమిసేయు భూ
సురుడును దుర్బలుండగుట; శోక మికన్ గడ తేరు మార్గమున్

అరయగ లేక యెట్టులొ యహర్నిశముల్ గడు భీతచిత్తనై
హరిఁగని కంపమొందు హరిణా కృతిఁ బుచ్చుచు నుంటి కాలమున్

262. చం. కులసతి నైన నేనెటుల కోరుదు జారిణియట్లు వాని; నే
కల నయినన్ దలంప నిను కాదని యన్యుని; కాన నో ప్రభూ
తెలుపుము నాకు దిక్కెవరొ? దీనత నిట్టుల నుంటి, నాపయిన్
కలుగదు బ్రహ్మకైన దయ, కన్గొనఁ జాలుదె నే సుఖంబికన్

263. కం. అని పెల్లుబికెడి దుఃఖముఁ
దనలో నడగింప లేక తద్దయు నేడ్వన్
గని యింద్రుడు మెల మెల్లగ
ననునయగతిఁ బల్కె నిట్టు లాశచి తోడన్

264. శా. దేవీ! నీవును మంచి కాలమునకై తెన్నుల్ గనంగా వలెన్
నీ వృత్తంబును నీ గుణోన్నతియు నిన్వెన్నంటి కాపాడుతన్!
భావంబందు విచారమున్ విడిచి యంబన్ భక్తి సేవింపుమా
నే విన్పింతునుపాయ మొండు వినుదేనిన్ నీకు భద్రంబగున్

265. సీ. ఇకపైన నహుషుఁ దత్యకలంక వగు నిన్ను
తన పొందు కొఱకు రమ్మనియె నేని
షరతు నొక్కటిఁ దెల్పు మర మరికలు లేక
యనుమతించునతి కామాంధుడగుట,
ఋషి వాహనము నెక్కి యెగయు దర్పము తోడ
"ననుఁబొందు" మని తెల్పు మనునయమున
అరిషట్కయుతు డతం దమరర్షులను బిల్చి
తన వాహనము మోయు డని యదల్చు

గీ. అట్టు లదలించి ఋషుల శాపాగ్నిలోన
తాను నశియించు భయమింకఁ దలగు నీకు
అంబ వరమిచ్చె గద! నీకు నబ్జ నేత్ర!
ఆమె పదపద్మముల గొల్చు నట్టి వారి
కెలమి బహుదుఃఖములు వీడ కెట్టులుండు





## నహుషుడు ఋషి వాహనమెక్కి వచ్చుట

266. చం. తనపతి మాటలన్ విని ముదంబున నాశచి ధైర్యమున్ మనం
బున నెటులో కుదిర్చి దివమున్ మెల మెల్లగఁ జేరి, ముందుగా
ననిమిష నాథుడౌ నహుషు నంగజ పీడిత దుర్మదాంధునిన్
గనె, పతి చెప్పి నట్లుచిత కార్యమొనర్ప మదిన్ దలంచుచున్

267. మ. మది నూహింపని యట్టు లివ్విధమునం బద్మాక్షి యేతేరగా
ముద మారన్ నహుషుండు గాంచి పలికెన్ పూర్ణేందు బింబాననా!
యిదె నీసేవకుడన్ ననున్ గరుణతో నీక్షింపుమా! నీకు నె
య్యది యిష్టంబొ వచింపు మీక్షణమె నీ కర్పింతు నే భక్తితో

268. తే.గీ. నన్ను చేపట్టు మింక నో నలిన నేత్ర!
నిన్ను సంతోష పెట్టుట కన్న మిన్న
యైన కార్యంబు కలదె నా కఖిల జగతి
సిగ్గు పడనేల రమ్ము నా చెంతకింక

269. మ. అని ప్రార్థించెడి యాతనింగని యసభ్యంబైన తద్వాక్యముల్
వినియున్ బాధను లో నడంచి శచి సంప్రీతిన్ ముఖంబందు నె
ట్టన సిగ్గుల్ మొలకించి నవ్వి నిను వేడన్ దక్కు వేమయ్యొ నా
కనఘా! యైనను నొక్కకోర్కె కలదయ్యా తీర్చెదేన్ తెల్పెదన్

270. కం. అనినన్ నహుషుడు మిక్కిలి
మనమున సంతోష మంది మగువా! నీకై
కొని తెత్తు నెద్ది యేనియు
ననుమానింపకుము వేగ నాజ్ఞ నొసగుమా!

271. మ. అన నింద్రాణియు సంతసించి కనులల్లల్లార్చి వీక్షించుచున్
తన భ్రూ యుగ్మము లాస్యముల్ సలుప "నోధర్మాత్మ! నాకోర్కెదీ
ర్చిన నీకున్ వశమౌదు, విన్న పిదపన్ జేయంగ లేనంచు నీ
వనరా, దట్ల నెదేని చెప్పు మిపుడే యాపైన నేలా వెతల్"

272. చం. అని తన నిర్ణయంబు తరళాక్షి వచింపగ నాతడా శచిన్
గని సుకుమారి! సందియము గల్గగ నీకుము, నీవుచెప్పిన

ట్లనయము చేయువాడ నని యచ్చుగ సేయుదునే ప్రతిజ్ఞ మత్
ఘనతర యజ్ఞ దాన తతిఁ గల్గిన పుణ్య ఫలంబు నొడ్డుచున్

273. వ. కాన సంశయింపక కోరుకొమ్మన నయ్యింద్రాణి నవ్వుచు

274. సీ. ద్విరదాశ్వ రథములు పరగు వాహనములై
దేవేంద్రునకు యశోదీప్తు లలర
వాయు వేగ సముడు వైన తేయుడు పంక
జాక్షుని వాహన మై వెలుంగు
సమవర్తి యన నొప్పు యమధర్మరాజున
కమరె మహిషము వాహనము నౌచు
విష భక్షుణునకెప్డు ఋషభమ్ము వాహన
మై యొప్పు చుండు నయమ్ము తోడ

గీ. అజుడు పేరొందె హంస వాహను డనంగ
స్కంధునకు వాహనమ్ముగ కలదు నెమలి
గణపతికి వాహనము మూషికము దలంప
ఇందరకు వాహనము లిట్టు లేర్పడంగ
నీకు లేదని చింతింతు నే సతమ్ము

275. ఉ. ఇంతకు ముందు నేరికిని నేయుగ మందును లేనియట్టి, ద
త్యంత మనోహరంబయి మహర్షులు మోయగ నొప్పుదాని, నా
శాంతములందు దీప్తులొలయన్ దనరారెడు నట్టి పల్లకిన్
చింతలు లేక యెక్కి నను చేరగ రమ్మది చూడఁగోరెదన్

276. కం. అటులైన నిన్ను నేమది
పటు పౌరుష మున్న సార్వ భౌముడవని సం
కట పడ కెఱుగుదు; నీ వి
ట్టటు లాలోచింపక వెస యత్నింపు మికన్

277. చం. అన విని నవ్వి యన్నహుషు డయ్యమతో నసె నోలతాంగి నే
గొనకొని నీదు కోర్కె నతి కూరిమిఁ దీరుతు చూడుమంచు న
వ్వనజ దళాక్షి వీడ్కొలిపి, వైళమ రమ్మని యాజ్ఞ చేసె తా
మునులకు, వారునున్ కదలి బోరన నచ్చటఁజేరి రెల్లరున్





278. ఉ. వచ్చిన వారలన్ గని యవశ్యము మీరలు నాదు పల్లకిన్
చెచ్చెర మోసికొంచు ననుఁజేర్చ వలెన్ శచి యొద్ద, కంత తా
మెచ్చి ననున్ వరించు, నటు మీద సుఖించెద నామెఁగూడి మీ
రిచ్చక మొప్ప యీపని వహింపుడు చేయుడు సాయ మిత్తఱిన్

279. మ. అరెరే! యెంతటి జ్ఞాన హీనుడత, డయ్యబ్జాక్షి నాశించి దు
ష్కర కార్యంబున కిచ్చగించెను, జగత్కల్యాణి కల్పించు దు
స్తర మోహంబునఁ జిక్కెఁగాక యిటు లేదౌర్భాగ్యుడైనన్ దపో
వరులన్ పల్లకి మోయఁబంచునె యహంభావమ్ముగా కేమగున్

280. చం. అనుచిత రీతి నిట్లడుగు నన్నహుషుంగని వాని భావి జీ
వనము నగస్త్యుడాది ఋషి వర్యులు గన్గొని సమ్మతించినన్
మనమున సంతసించి యిక మానిని నాకు లభించినట్లె పొ
మ్మనుచుఁదలంచి యెక్కె ముద మారగ పల్లకి నెంతయున్ వడిన్

281. తేగీ. పల్లకిని యెత్తుకొనిరి సప్తర్షు లెలమి,
కామ వశుడైన నహుషుడు కాల పాశ
బద్ధుడై యదలించుచు పల్కె నపుడు
'సర్ప' 'సర్ప'యని తడవు సైప లేక

282. వ. అంత

283. ఉ. చిందఱ రేఁగి నట్లుగ యిసీ! యటు లన్నహుషుం డదల్చుచున్
ముందఱి కొమ్ము పట్టు కొని మోయుచునున్న యగస్త్యు, సింధువున్
బిందువు వోలెఁ ద్రావిన ప్రవీణు, తపోధను నొక్కయూపునన్
ముందుకు లేచి తన్ని యటుఁ బోక కశన్ గొనివైచె బిట్టుగన్

284. చం. అదిగని యమ్మహర్షి కడు నాగ్రహమూని దురాత్మ! నీవు దు
ర్మదమున కన్నుఁగాన కిటు మంచియు చెడ్డయు లోనెఱుంగ బో
కదలిచి "సర్ప" "సర్ప" యని యంటివిగాన సహస్ర వర్షముల్
వదలక సర్ప రూపమున వాసము సేయు మరణ్య భూములన్

285. ఉ. అంతట పాండు సూనుడు మహాత్ముడు వచ్చు యధిష్ఠిరుండు నీ
చెంతకు, నీదు ప్రశ్నలకు శీఘ్రగతిన్ బదులిచ్చు, నాపయిన్

చింతలు దీఱు, శాపమును చెల్లును స్వర్గముఁజేరుమంత, నీ
కింతయు సంభ వించుటకు హేతువు హెచ్చిన గర్వమే సుమా!

286. వ. అని యిట్లగస్త్యుండు శాపంబును, తద్వి ముక్తియును చెప్పినయంత

287. కం. నహుషుని కామ పిశాచము
రహిచెడె, గర్వంబు నడగె, రాగంబుడిగెన్,
అహి రూపం బేర్పడె, దు
స్సహమై పృథ్విన్ బడియెను స్వర్గచ్యుతుడై

288. చం. అరిగె హుటాహుటిన్ విషయ మారసి గీష్పతి యింద్రునొద్దకున్,
జరిగిన దెల్లఁ జెప్పె సురసత్తము డెందము పొంగ, నంతటన్
సరగున దేవతల్ ఋషులు సాధు జనావళి చేర, నందరున్
సురపతి తోడ స్వర్గమును జొచ్చిరి హెచ్చిన సంతసమ్మునన్

289. కం. కొనివచ్చి యింద్రు నకు న
య్యనిమిషపతి పదవి నిచ్చి యానందమునన్
గొనియాడి రెల్ల దివిజులు
మునుపటివలె నాకమెల్ల ముదమును బొందెన్

290. ఉ. భూసురునిన్ వధించి మును పొందిన పాతక మెల్ల నివ్విధిన్
వాసవు డమ్మహేశికృపఁబాయగఁ జేసె నటంచుఁదెల్పి యా
వ్యాసుడు వల్కె యిందుకుల వర్ధన! యెంతటి వారికేనియున్
చేసిన కర్మకున్ ఫలము చెందక మానదు తగ్గ రీతిగన్

291. కం. అనవిని జనమేజయు డి
ట్లనియె మహర్షీ! కడుముద మందితి నైనన్
మనమున నొక సందేహము
పెనగొను చున్నయది దాని వివరింపు కృపన్

292. చం. అలఘు తపస్వి యింద్రుడు శతాధిక యజ్ఞము లాచరించి ది
వ్యుల కధి నేత యయ్యును నయుక్తము లౌక్రియలెట్లు సల్పె న
న్యుల కగు దుఃఖముల్ గడప నోపిన దక్షున కేల యివ్విధిన్
దొలగె సురాధి పత్య మతి దుఃఖము లేటికిఁగల్గె తెల్పుమా





293. వ. అని యిట్లు సూతుండు శౌనకాది మహామునులకుం జెప్పి ముని వరులారా! జనమే జయుని సందేహములకు వ్యాసుం డొసంగిన సమాధానముల నెఱింగించెద సావధాన చిత్తులై వినుడు. అంతట వ్యాసుండు జనమే జయుంగాంచి యిట్లనియె

## వివిధ కర్మగతి భేదములు

294. సీ. కర్మమ్ము లవియెల్ల గణుతింపఁబడె మూడు
విధములై బుధులచే విశ్వమందు
పరగ సంచిత మన వర్త మానమ్మన
ప్రారబ్ధ మనగ నవార్యగతిని
సంచితం బదియును సాత్విక రాజస
తామ సంబులఁ ద్రి విధంబు లయ్యె
అది యెప్డు మనవెంట నంటి వచ్చుచు నుండు
అశుభమైనను శుభ మైనఁగాని

గీ. అనుభ వింపక సంచిత మడగ దెపుడు
కోటి జన్మల కైనను కువల యేశ!
ప్రస్తుతము చేయు కర్మలు వర్తమాన
కర్మలను పేరఁబరగె జగమ్ములందు

295. తే.గీ. అనుభ వింపక మిగిలిన యట్టి సంచి
తమ్ములు మనల వెన్నంటి తలగి పోక
అవియె ప్రారబ్ధ కర్మమ్ము లనుచు నేటి
దేహ మారంభమైన యా దినము నుండి
వర్త మానమ్ములకు తోడు పడుచు నుండు
అడగు నవి యెల్ల ననుభవం బైన పిదప

296.గీతమాలిక. కర్మ లివియెల్ల జన్మకు కారణములు
కర్మ తొలగిన జన్మలు కలుగ వింక
బ్రహ్మ విష్ణు మహేశ్వర ప్రముఖులైన
కర్మవశ్యులె యౌదురు, కాని యెడల
కాయములు వారి కెవ్విధి ఁగలుగు చుండు,?
సకల కర్మాను భూతికి జగములందు
దేహమే స్థానమని మది తెలియ వలయు

297. శా. ప్రారబ్ధాను గతంబుగా తిరుగుచున్ బ్రాణుల్ సదా కర్మముల్
ప్రారంభింతురు పుణ్య పాప యుతముల్ బ్రహ్మాండ భాండమ్ములన్
ప్రారబ్ధంబదె కారణమ్ము నరుడున్ బద్మాక్షుడున్ దుష్ట సం
హారంబన్న నెపంబు నన్ బృథివి నాయాజన్మముల్ బొందుటల్

298. తే.గీ. కావ్యముల్ వ్రాయునే ఋషి కాని వాడు
రుద్రు నర్పింప నేర దరుద్రు డెపుడు
అతిథి కన్నమ్ము నిడదు దైవాంశలేక
అబ్జ నాభుని యంశ లేనట్టి వాడు
ధరణి నేలంగ లేడంద్రు ధర్మవిదులు

299. తే.గీ. అనల తేజము, సురపతి యాధిపత్య
మబ్జ నాభు పరాక్రమ, మల కుబేరు
సంపద, యముని రౌద్రమ్ము సంగ్రహించి
భూమిపతి దేహ నిర్మితిఁ బూను నలువ

300. కం. జీవుల సుఖ దుఃఖమ్ములు
భావింపగ దేహమునకె పరిమిత, మవియున్
దైవాధీనమ్ములగుట
జీవులు సహియించి యుంట శ్రేష్ఠము తలపన్

301. సీ. అడవుల జన్మించి యప్పను గోల్పోయి
అమ్మతో హస్తిన కరిగి రెటులొ
భుజ బలమున నెల్ల పుడమి తేదులగెల్చి
రాజ సూయ మొనర్చి ప్రగతి గనిరి
కుటిల జూదమ్మున కురు వీరులకు నోడి
వన వాస దుఃఖమ్ముఁ గనిరి మరల
ఘోర తప మొనర్చి వీరు దక్కవ్వడి
యమర వరుల చేత నందె వరము

గీ. లంత పుణ్యమ్ము చేసిన యట్టి పాండ
వేయులకు నైన దుఃఖముల్ పాయ లేదు
కర్మ గతి దేవతల కైన కష్ట మెఱుగ
ననిన మనుజుల కెవ్విధి నౌను తెలియ





302. సీ. విష్ణ్వంశ జన్మించి వ్రేపల్లెకున్ జేరి
గొల్ల వారల తోడఁ గూడి పెరిగి
మధురకున్ జనుదెంచి మామను వధియించి
అతని తండ్రిని భూమి పతినిఁజేసి
ద్వారవతినిఁజేరి పరమాత్ముడన నొప్పి
తుదఁ బ్రభాసమ్మున వదలె తనువు
విప్ర శాపమ్మున విడిచిరి ప్రాణముల్
తన వార లెల్లరు దైన్య గతిని
అట్టి వసుదేవ నందనుం డంత మందు
ఒక నిషాదు బాణాహతి నొరిగె ననిన
కర్మ గతిచిత్ర మత్యంత గహన మరయ
నెట్టి వారల కైన తప్పింప నరిది

303. వ. అతి కమనీయమ్ముగా నిట్లు వచించు చున్న వేదవ్యాసుంగాంచి
జనమే జయుండిట్లు పలికె

304. కం. నర నారాయణు లిరువురు
ధర కృష్ణార్జునులన నవ తారము లెలమిన్
ధరియించిరి భూభరమును
పరువడి నడగింప ననుచు పల్కితివి గదా!

305. కం. ద్వాపర యుగాంతమున గో
రూపము ధరియించి భూమి రోదించుచు ల
క్ష్మీపతి వేడగ తానపు
డీ పృథ్విన్ జనన మందె కృష్ణుం డనియున్

306. కం. బలరాముండును, నర్జును
డిలపై వసుదేవ సుతున కీకార్యమునన్
బల యుతులై తగు సాయం
బెలమిని నొనరింప జన్మమెత్తి రటంచున్

307. చం. పలికితి గాదె నీవును; పంకజ నాభుడు కృష్ణుడై భువిన్
గల నసురాళి నెవ్వరిని కాలుని ప్రోలికిఁ బంపె? భీష్మ ము

ఖ్యుల వధియింప నేల? కడు క్రూరులు చోరులు నింకనెందరో
కలరు భువిన్ మహాదురిత కర్ములు వారల నేల చంపడో?

308. కం. కలియుగమున ప్రజలెల్లరు
పలు విధముల పాప కార్య పరిరంభులునై
మెలగుచు నుంటకు కారణ
మలఘు తపోవిభవ! తెలుపు మభ్యర్థింతున్

## వ్యాసుడు యుగ ధర్మముల నెఱింగించుట

309. కం. అని జనమేజయు డడుగన్
మునివంద్యుడు పల్కెనిట్లు మోదము తోడన్
వినుమో భూనాథా! నే
వినిచెద యుగధర్మములను వేడుక తోడన్

310. మ. యుగ ధర్మంబిది మాన వేంద్ర! మదిలో యోచింపుమా! యెప్పుడే
యుగ మందెట్టి స్వభావ మున్న జనులీ యుర్విన్ బ్రవేశింతురో?
స్వగుణాను క్రమ మొప్ప వర్తిలుదురో? సర్వంబు కాలంబె తా
నొగి నిర్ధారణ సేయు, తప్పు కొనలే డొక్కండు నద్దానినిన్

311. తే.గీ. కేవలము ధర్మ రసికులు కృతయుగమున
తనర ధర్మార్థ యుతులు త్రే తాయుగమున
ద్వాపరమున ధర్మార్థ కామోప రతులు
అర్థ కామరతులు కలియందు మిగుల
నవత రింతురు యుగధర్మ మనగ నదియె

312. చం. కృతయుగమందు మానవులు కేవల పుణ్యములాచరించి వి
స్మృత భవ బంధ ముక్తులయి దివ్య పదస్థితు లౌదు రెల్లరున్,
చతురత సర్వవర్ణులును సమ్మతితో నిజధర్మ రక్షణ
క్రతువులఁ గర్మవాసనలఁగాల్చి గడించెద రూర్ధ్వలోకముల్

313. కం. దానము దయయును సత్యము
మానుగ సమతయును పరుల మానినులందున్
మానస ముంచక యుండుట
మానవులకు స్వర్గలోక మార్గము లధిపా!





314. కం. త్రేతా ద్వాపర యుగముల
నీ తీరున జరుగు చుండు నెల్ల రకును నో
భూతల నాథా! వినుమిక
నే తెల్పెద కలియుగ గతు లేర్పడు నట్లున్

315. చం. కలియుగమందు పాపులతి కష్టగతిన్ నిరయంబుఁజేరి ని
చ్చలు నతి తీవ్ర శిక్షల నసమ్మతిఁ బొందుచు నుందుచున్, మొదల్
గల యుగముల్ గతింప కలికాలము వచ్చిన యంత పృథ్విపైఁ
బలుగతి జన్మలెత్తుదు రవారణ కర్మఫలాను గాములై

316. తే.గీ. సత్యయుగ మేగు దెంచిన, స్వర్గవాసు
లైన ధర్మాత్ము లెల్లరీ యవనియందు
నుద్భవింతురు; తక్కిన యుగము లందు
నట్లె పుట్టుచు నుందు రయ్యెక్రమాన

317. ఉ. దైవ వశమ్మునన్ గలిని ధర్మము తప్పని నిత్యయుక్తులౌ
జీవులు సైత మిద్ధర ప్రసిద్ధిగ నావలి కల్ప మందు స
ద్భావము లొప్ప ద్వాపర కృతంబుల పుట్టుట, తొంటివారలున్
ఆవిలురై కలిన్ జనన మందుట యున్ సమకూరు నొక్కెడన్

318. కం. అనవిని జనపతి వ్యాసుని
గని పల్కె మహాను భావ! కరుణన్ నాకున్
వినిపింపుము యుగధర్మము
లనిశము వినవలయు నంచు నాత్మఁదలంతున్

వ. అనిన వ్యాసుండిట్లనియె

319. మ. ధరణీనాథ! యవశ్యమున్ దెలిపెదన్, ధర్మాత్ములౌ వారలేన్
కరమున్ ధర్మ విదూరులై ధరణి దుష్కర్మాను సంధాన సం
భరితాచారులు నౌట యెల్ల యుగ ధర్మంబౌను, కాకున్న స
చ్చరితుండయ్యు భవద్గురుండెటుల దుశ్చర్యన్ దలంచున్ మదిన్

320. చం. తుహిన కరాన్వయాగ్రణి, విదూరిత దోషుడు, ధర్మమార్గస
న్నిహితుడు మున్ యయాతి; తదనింద్యకులో ద్భవుడయ్యు మీ గురుం

దహహ! మృతాహిఁగైకొని ధరామరు కంఠమునందు వైచె తా
సహనము వీడి యన్న కలిసంగమ దోషముగాక యేమగున్

321. కం. యుగధర్మం బది గావున
నగణిత గుణ యుతులు నైన నయ్యెయెడలన్
విగుణులునైవర్తించుచు
ప్రగతిన్ గోల్పడుదు రయ్య! పరికింపంగన్

322. శా. స్వాధ్యాయమ్ములు, సాంధ్య కృత్యములు, సత్సాంగత్యముల్, నిత్య దే
వీధ్యానమ్ములు, సత్యశౌచ తతియున్, విధ్యుక్త కర్మాదులున్
అధ్యాత్మస్థితు, లాతి ధేయములు, నిత్యానందముల్ గల్గ శా
స్త్రాధ్యానమ్ముల విప్రు లొప్పెదరు రాజా! సత్యకాలంబునన్

323. ఉ. క్షత్రియులున్ నిరంతరము సత్య యుగమ్మున ధర్మయుక్తులై
ధాత్రి భరించుచున్ ప్రజ నుదారతఁ జూతురు, వైశ్యముఖ్యులున్
మైత్రి యెసంగ గోవులకు మానుగ సేవలు చేయుచున్ గడున్
పాత్రులు నై మెలంగెదరు వర్తక కర్షక వృత్త్య పేక్షులై

324. కం. వీరల కన్ని విధమ్ముల
వారక తోడౌచు శూద్ర వర్ణము వారల్
నేరము లెఱుగక నిత్యం
బోరిమి మెలగుదురు సత్య యుగమునఁగడిదిన్

325. సీ. ధర్మ సంస్థితి సుంత తగ్గను త్రేతా యు
గమునఁ గృతయుగమ్ముకంటె చూడ
అక్కాలమున జగ దంబను మదినిల్పి
అర్చింతు రెల్ల రత్యంత భక్తి
త్రేతాయుగముకంటె దిగ జారు ధర్మమ్ము
ద్వాపర యుగమున ధాత్రి యందు
కలియుగ మేతేర కన్పింప వెచ్చోట
సత్య ధర్మమ్ముల జాడలైన

గీ. పూర్వ యుగముల రాక్షసుల్ పుడమి యందు
కలిని విప్రులై జన్మించి తెలివి మాలి





వేద ధర్మమ్ములను వీడి వివిధ గతుల
బ్రతుకు చుందురు నిరతమ్ము వంచకులుగ

326. ఉ. కొందరు బ్రాహ్మణుల్ కలినిఁ గొంకక దాంభిక వృత్తి తోడ పే
రొందిన వేదధర్మముల నొల్లక, పెక్కగు నవ్య ధర్మముల్
బొందుచుఁగ్రూరులై సతతమున్ జని శూద్రుల సేవసేయుచున్
నిందలు పొంది దానముల నీచగతిన్ గ్రహియింతు రింపునన్

327. చం. అతివలు కామలోభ విషయాభిరతిన్ దమ ధర్మమార్గముల్
సతమును వీడి పై పయిన సత్యము ధర్మములంచుఁబల్కుచున్
పతులను మోసగించుచు ప్రవర్తిలు చుందురు స్వేచ్ఛఁబూని వి
స్మృతముగ క్లేశముల్ గొనుచు సిగ్గును నెగ్గను వీడియక్కలిన్

328. ఉ. సాత్విక భోజనమ్మునఁ బ్రశస్తిగ చిత్తము శుద్ధి యౌను, ది
వ్యత్వము ధర్మమున్ వెలయు పావన చిత్తమునందు స్పష్టమై;
సత్వము తత్త్వమున్ దొలగు, సాంకరమౌ కలియందు ధర్మముల్,
సాత్విక ధర్మవిత్తములు సైతము వీడెద రార్షధర్మముల్

329. మ. అనినన్ వ్యాసునిఁగాంచి భూపతి మునీంద్రా! వేద వేదాంత వి
ద్ఘనులౌ మీరలె యిట్లు పల్కుటిది చోద్యంబయ్యె, నట్లైన చో
ననఘా! ధర్మవిహీనమౌ కలియుగంబందెట్లు జీవింతు రీ
మనుజుల్, వేరొక టెద్దియైన కలదా! మార్గంబు తెల్పందగు న్

330. కం. అనియడిగిన జనమేజయుఁ
గని మునివరు డిట్లు వల్కె కరుణాలయుడై
జననాథ! వినుము తెల్పెద
మనుజుల దోషములు తొలగు మార్గంబొందున్

331. చం. ఇతరములైన మార్గము లవేవియు లేవు, మనుష్య కోటికిన్
సతతము లోక మాత పదసారస యుగ్మము లోన నిల్పి సం
స్తుతి యొనరించుటే సకల దోష నివారణ హేతువయ్య! స
మ్మతి జగదంబ నామమును మానసమందు జపించుచున్నచో
వెతలును పాపముల్ దొలగి వృద్ధియగున్ సుఖశాంతు లిద్ధరన్

332. శా. శ్రీదేవీ నిలయంబు లున్న పురిలో జీవించుచున్ మానవుం
దేదోరీతిఁ దదీయ నామ జప మత్యేకాగ్ర చిత్తంబునన్
మోదంబందుచు సల్పుచుండిన భయంబుల్ వీడు, నింకేదియున్
లేదయ్యా! కలియందు పాపముల నోలిన్ ద్రోలుమార్గంబెటన్

333. మ. అనినన్ భూవిభు డిట్లు పల్కె మహనీయా! పుణ్యతీర్థంబులన్
ఘనమౌక్షేత్రములన్ మహత్వముల నాకర్ణింపగా కోర్కె నా
కనయంబున్ గలదయ్య! చెప్పుటకు నర్హంబైన విన్పింపు మో
ముని వంద్యా! శ్రవణంబులున్న ఫలమున్ బొందింపుమా సత్కృపన్

334. కం. అని జనమేజయు డడుగగ
మనమున సంతోష మంది మాన్యుడు వ్యాసుం
డిన తేజుడు తెలిపె నిటుల
మను జాధిపుఁగాంచి తీర్థ మాహాత్మ్యంబుల్

335. సీ. జాహ్నవీ నదియన, సరయూ నదియనంగ,
చంద్ర భాగయు, సరస్వతియు ననగ,
అమల వేత్ర వతియు, నర్మదయు, సింధు,
చర్మణ్వతియు, తాపి, నర్మదయును,
గండకియు, తమస, కావేరియు, ననంగ
కలవు పెక్కులు తీర్థములు ధరిత్రి
నందు నుత్తమ తీర్థ మంచు నీపృథ్విపై
జాహ్నవీ తటిని ప్రశస్తి నొందె

గీ॥ నిందు సాగర జలముల యందుఁగలియు
నదులు పుణ్యప్రదంబులు; నుదధి కేగు
వాని యందును నిత్య జీవనము తోడ
వెలయు నవి యుత్తమములంచు విబుధులంద్రు

336. కం. ధర నైమిశ, ధర్మాటవు
లరయన్ గురుభూమి, యర్బుదారణ్యంబున్,
దిరముగ ప్రభాస, పుష్కర,
వరభూము లరణ్యములను ప్రస్తుతిఁ బొందెన్





337. కం. ఘనమగు శ్రీశైలంబున్
దనరగ శ్రీగంధ మాద నంబును మఱియున్
జననాథ! సుమేరు గిరియు
గణుతింపంబడియె మేటి గట్టులన ధరన్

338. కం. మానస సరోవరంబది
మానవ లోకమున నొప్పు మహిమాన్వితమై
మానుగ నింకను బిందువు
నా,నచ్ఛోదన మనంగ నలరున్ సరసుల్

339. కం. నర నారాయణులు కరం
బరిదిన్ తపమాచరించి నట్టి బదరికా
వర వనమును, శతయూపుని
పరమాశ్రమమును ప్రసిద్ధి వడసెన్ ధాత్రిన్

340. ఉ. ఇవ్విధి భూతలంబున మఱెన్నియొ యున్నవి క్షేత్ర తీర్థముల్
దవ్వుల, cజూడ నన్నియు నుదార మహా మహిమాన్వితంబులై
నివ్వటిలున్ ధరాధిప! గణింపగ నిన్నిట నుత్త మంబులై
యవ్వల కవ్వయైన జగదంబ నివాసములొప్పు నిత్యమున్

341. కం. దేవీ క్షేత్రంబుల స
ద్భావంబునఁ గనిన పాపపంకిల మెల్లన్
వేవేగ నింకి పోవును
దేవీ మహిమం బనియెడి దినకర రశ్మిన్

342. తే.గీ. దానములు, వ్రతములును, సత్తపము లేని
యజ్ఞములు తీర్థములు నైన నన్నియెడల
భావ శుద్ధికి నీడైన ఫలిత మిడును
ద్రవ్యములు క్రియలు కడుశుద్ధములె యైన
భావ సంశుద్ధి లేక సత్ఫలము లిడవు.

343. చం. అనిశము చంచలమ్ము, విషయాను గతంబు మనంబు; భావముల్
పెనగొని యందు సంచరిలు, వీడకయెప్పుడు శత్రుషట్క మీ
మనమున తిష్ఠవేసికొని మాయలు సల్పును; దీని నిల్పగా
ఘనులకు నైన కష్టమగు గట్టి ప్రయత్నము లేకయుండినన్

344. సీ. సత్య మహింసయు, శౌచ మస్తేయమ్ము
ఇంద్రియ నిగ్రహ, మెల్లవేళ
నిజధర్మములయందు నిల్చి యుండుటయును,
నక్రోధ నంబును, నార్జవంబు
ననునివి తీర్థ సేవనముల కన్నను
మిన్నలనుచు పెద్ద లెన్నుచుంద్రు
నిత్య కర్మల వీడి నియమంబులన్ ద్రోలి
అపమార్గ గామియై యంతమందు
చేయు యాత్రలు కడు చేటుఁ గూర్చునె గాని
పుణ్య మెద్దియు వానిఁ బొంద దధిప!

గీ. తీర్థములలోన గ్రుంకిడ దేహ శుద్ధి
కలుగునే గాని మనసునఁ గల్మషములు
తొలగ వెన్నడు కావున ద్రోహ చింత
వదలి చిత్తశుద్ధిని బొంద వలయు నరుడు

345. ఉ. వేదము లభ్యసించినను, విస్తృత రీతిగ పెక్కు శాస్త్రముల్
మోదముతో పఠించినను, పొల్పగు యజ్ఞ తపోవ్రతంబులన్
బ్రోదిగ నాచరించినను, భూరి ధనమ్ముల దానమిచ్చినన్,
భూదయితా! గుణంబులను పొందక చిత్తము శుద్ధియెట్లగున్

346. ఉ. ధాతకు మానసాత్మజుడు, తాపస వంద్యుడు, వేదతత్వ వి
జ్ఞాతయు నౌ వసిష్ఠు డనిశంబును గాంగతటీ నివాసుడై
చేతమునన్ పవిత్రతను చేకొనఁగల్గెనె? ద్వంద్వభావ సం
ఘాత మనస్కుడై కనలి కౌశికుతోఁగడు వైరమూనడే!

347. మ. బక రూపమ్మును బొందె కౌశికుడు తాబ్రహ్మర్షి శాపమ్మునన్
అకలంకుండగు నావసిష్ఠుడును తానాడేలుగామారె కౌ
శికు శాపమ్మున, నిట్టు లిల్వురు తపస్సిద్ధాత్ములయ్యున్ మనో
వికలత్వంబులఁబొంది యుండిరి గదా! పెక్కేండ్లు విద్వేషులై

348. కం. మానస సరోవరంబున
మానక మదగజములట్లు మత్సరయుతులై





హీనుల గతి పోరాడి ర
హీన తపోధనులు నయ్యు నేమందు విధిన్

349. కం. అనవిని జనమే జయుడపు
డనఘా! యట్లేల వార లనఘులు నయ్యున్
గొనకొని శపియించు కొనిరి
వినిపింపుము వారిగాథ విస్తరరీతిన్

## వరుణుడు హరిశ్చంద్రునకు శాపమిడుట

350. వ. అని జనమేజయుఁడడుగగా కృష్ణ ద్వైపాయనుండు సంతసించి తత్కథాక్రమంబిట్లు చెప్పందొడంగె.

351. మ. ఇనవంశమ్మున రామ చంద్రునకు మున్నేలెన్ హరిశ్చంద్రుడన్
జననాథుండు త్రిశంకు పుత్రుడు, మహాసత్వాఢ్యు, దాతండు నం
దన భాగ్యంబును నోచమిన్ గుమిలి సంతానార్థియై వారుణీ
శుని యాగంబును చేయ నెంచి మది నౌత్సుక్యంబు నిండారగన్

352. తే.గీ. పుత్ర సంతితి గల్గిన పొల్పు మీర
నతని బలియిచ్చి సంతసం బావహిలగ
వరుణ యాగంబొనర్తు నవారితముగ
నన్ను కరుణింపు మనుచు తానార్తి తోడ
వరుణ దేవుని మదినిల్పి ప్రతినఁ బూనె

353. చం. వరుణుడు సంతసించె; నరపాలుని పత్నికి గర్భ మేర్పడెన్,
వరుసగ మాసముల్ గడచె, భాను నిభుండు దయించె పుత్రుడా
సరసిజనేత్ర, కంత మది సంతసమంది జనాధిపుండు భూ
సురులకు నిచ్చె భూములను శుద్ధ సువర్ణ గవాంబరమ్ములన్

354. తే.గీ. వారుణీ దిశాధిపతి భూపాలు కడకు
వచ్చె సద్బ్రాహ్మణాకార మచ్చుపడగ
నవని పతియును నర్ఘ్యపాద్యాది విధుల
నతని పూజించి భక్తితో నంజలించి

355. చం. తమ రిపు డిట్లు వచ్చిన కతంబదియేమి ధరామరా! యటం
చమిత వినమ్రుడై యడుగ నయ్యవనీసురు డిట్లు పల్కె నో

విమల చరిత్ర! నన్నెఱుగవే? వరుణుండను, యాగమొందు, నా
కమర నొనర్తు నంటివిగదా! సుతుడుద్భవ మందినన్ వెసన్

356. తే.గీ. వమ్ము సేయంగఁదగునె నీప్రతిన నధిప
తనయు బలిపశు వొనరించి తడవులేక
యాగ మొనరింపు మయ్య! యిట్లనృతదోష
మేల పొందెద విది నీకు మేలుగాదు

357. మ. అనినన్ భూపతి నెత్తినన్ బిడుగు పడ్డట్లౌచు కంపించుచున్
వినుమయ్యా! యజనం బొనర్చెదను సంప్రీతిన్ ననున్ నమ్ముమా!
తనకున్ దీరదు నేటికిన్ బురు, డశుద్ధంబైన నాపత్నితోఁ
జనునే జన్నముసేయ, నోర్వఁదగదా సంశుద్ధియౌనంతకున్

358. తే.గీ. ఒక్క మాసము జరిగిన నొప్పిదముగ
బాలు నర్పించి దివిజులు ప్రస్తుతింప
యాగ మొనరింతు నని పల్క నవ్వరుణుడు
సమ్మతిన్ దెల్పివెడలి స్వస్థలముఁజేరె

359. చం. నెలపురుడున్ దొలంగె ధరణీ ధవు డెంతకు నాత్మలోనఁ దాఁ
దలపడు యజ్ఞ కార్యమును, తద్విధ మవ్వరుణుండెఱింగి, భూ
స్థలి కరుదెంచి పూర్వపు విధంబున బ్రాహ్మణవేషమూని; ని
శ్చల మతినున్న రాజుఁగని జన్నము సంగతి హెచ్చరించినన్

360. కం. ఉపనయ సంస్కారం బొన
రుప లేదింత దనుక కొమరున కయ్యా! యి
ట్లుపనయన విధిం బొందక
యుపయోగింపంగఁ దగునె యూపక్రియకున్

361. కం. ఉపవీతుడు గాని తనయు
నపరాధంబెంచ కిట్టు లర్పించుట కి
ష్టపడుట ధర్మ విరుద్ధము
కృపఁ గనుమీ యంతదన్కఁ గేల్మోడిచెదన్

362. మ. అనినన్ బశ్చిమ దిగ్విభుండనియె రాజా! నన్ను వంచింప గా
మనమందెంచుచు నుంటి, వీవపుడు దంబం బూని మున్నెన్కలన్





గనబోకట్లు ప్రతిజ్ఞ చేసి యిటు పల్కన్ జెల్లునే నేడు; నీ
తనయున్ వీడగ లేక యుంటివని యర్థంబయ్యె నింకేటికిన్

363. ఉ. కానక కన్న సంతతిని కాదని యజ్ఞ వధార్థ మీయగా
మానస మొప్పకున్న, దనుమానము లేదు, మరొక్క మారు నీ
కే నవకాశమిత్తు మఱి యెన్నడు రమ్మని పల్కెదో స్థిరం
బైన మనంబునన్ దెలుపు మావల తప్పిన నిన్ శపించెదన్

364. చం. అని బెదిరించి పల్కగ నరాధిపుడున్ గడు నమ్రగాత్రుడై
యనిమిష వర్య! యెట్లయిన నాడిన మాటను తప్పబోనికన్
వినుమిదె నాదు పుత్రు నుపవీతు నొనర్చిన మీద యాగమున్
ఘనముగ చేయు వాడ బలిగా సుతు నర్పణ చేసి, నమ్ముమా

365. మ. అనినన్ సమ్మతిఁ దెల్పి యేగె వరుణుం; డాపైన భూనాథు డె
చ్చిన మోదమ్మున నాసుపుత్రకునకున్ చెల్వొందగా రోహితుం
డను నామంబిడి, వేడ్కతో నుపనయంబత్యంత ముత్సాహుడై
యొనరింపన్, దదనంతరం బత డఘీ నోద్యోగ సంపన్నుడై
వినయంబొప్పగ విద్యలన్ గఱచుచున్ బెంపొందె నింపొందగన్

366. చం. జనకుడు మున్ను పశ్చిమ దిశాపతి కిచ్చిన మాట చొప్పునన్
తనను వధించి యాగమును తప్పక చేయు నటంచెఱింగి తా
మనమున ప్రాణరక్షణకు మార్గముఁ గానక రోహితుండు చ
య్యనఁ జనె దుర్గమాటవుల కన్యులెఱుంగని యట్టు లొంటిగన్

367. ఆ.వె. అవని నాథు డంత నాత్మజు కొఱకునై
వెతకి వెతకి తుదకు సుతునిఁగనక
చింతితాత్ముడౌచు నెంతయుఁగృశియించి
ధర్మ విధుల నెల్లఁ దలప కుండె

368. మ. సరిగా నా గడు వేగినంతనె హరిశ్చంద్రున్ సమీపించి య
వ్వరుణుం డించుక కోపసంగతుడునై ప్రశ్నించె నోభూపతీ!
జరిగెన్ నీవిడినట్టి యా గడువు, యజ్ఞంబేటికిన్ జేయవో
మఱువన్ జెల్లునె, నిన్ను బోంట్ల కిది ధర్మంబౌనె యోచింపుమా!

369. మ. అనినన్ గంపిత చిత్తుడై నృపతి యయ్యా! నాసుతుండెయ్యెడన్
జనెనో, కన్పడ, డెంతయున్ వెదకితిన్ స్వామీ! నిజంబిద్ది, న
న్నను మానింపకు, వాడు లేక యెటు జన్నంబే నొనర్తున్ దయా
వనధీ! నన్ క్షమియింపు మంచు పలికెన్ బాష్పార్ద్ర నేత్రుండునై

370. కం. అది విని వరుణుండెంతయుఁ
బొది గొను క్రోధమ్ము నడపఁ బోలక యోరీ!
మదమున నను వంచించితి
విదిమొదలు "జలోదరము" న వేదనఁ బడుమా!

371. చం. అని శపియించి యవ్వరుణు డచ్చటు వీడి చనెన్గడున్ వెసన్
జనపతి కాక్షణంబుననె సంక్రమ మయ్యెను వ్యాధి, యంతటన్
ఘనులగు వైద్యు లెల్లరును గట్టి ప్రయత్నము తోడ వైద్యమున్
బెనసి యొనర్చు చుండినను పెల్లగు గాని శమింప దింతయున్

372. చం. వరుణుని శాప వాక్యమున పట్టిన రోగము చేత నీగురుం
డురుతర దేహ బాధ నట నొందుచు నుండగ నీవు నిచ్చటన్
గరము సుఖమ్మునన్ గొఱతఁగానక వన్యములన్ భుజించుచున్
తిరుగుట ధర్మమా! యనుచు తెర్వరి యొక్క డెఱుంగఁ జెప్పినన్

373. మ. వినియా రోహితుడంత తండ్రి కడకున్ వేవేగఁ జేరంగ నె
మ్మనమందున్ దలపోయుటన్ గని నిలింప జ్యేష్ఠ డింద్రుండు వి
ప్రుని వేషంబున వచ్చి యాతని కిటుల్ బోధించె పైపైన గ
ప్పిన వాత్సల్యము దోప మిక్కిలి దయావిర్భూత చిత్తుండనన్

374. మ. ధరణీశాత్మజ! యింటికిన్ జనగ నుత్సాహంబుతోనున్న నీ
వరయన్ మూర్ఖుని యట్లు దోచెదవు, రోగార్తుండు నీతండ్రి తా
నరచేతన్ గొని యుండెప్రాణముల, నీవచ్చోటి కేగన్ నినున్
గరుణన్ మాలి వధింపడే వరుణ యాగంబందు స్వార్థార్థియై

375. ఆ.వె. తనయు నైనఁజంపు తన రక్షణమునకై
ఇంత యెఱిగి యచటి కేగఁ దగునె
నేడొ ఱేపొ చచ్చు నీతండ్రి కొఱకునై
నిండు జీవితమును నీఱొనర్తె?





376. కం. అని కపట విప్రు డాడగ
తన బ్రతుకే ముఖ్యమంచు తలపోయుచు నా
జననాథాత్మజుడు వనం
బుననే వసియింపఁదలచె పూర్వపు భంగిన్

377. శా. కాలంబిట్టుల సాగుచుండె తనరోగం బెంతయున్ దగ్గమిన్
వ్యాలోలాత్ముడునై ధరాధిపు డసహ్యావిద్ధ సంవేదనా
శీలుండై గురునిన్ వసిష్ఠుని తపశ్శ్రీరాజితున్ గాంచి నే
త్రాలన్ బాష్ప జలమ్ము గ్రమ్మ నిటులన్ బ్రార్థించె నిట్టూర్చుచున్

378. శా. స్వామీ! యేమని చెప్పువాడ, భరియింపన్ లేని యీబాధచే
నామేనెల్లఁ గృశించె, మానసము చింతావ్యాకులంబయ్యె, నా
కేమీ తోచని భీతి యేర్పడెను, మీరేదైన మార్గంబునన్
క్షేమం బయ్యెడు నట్లు చూడుము మహర్షీ! నన్ను కాపాడుమా!

379. చం. అనికడు దీనుడై యడుగు నవ్వసుధాధిపుతో వసిష్ఠ డి
ట్లనియె, నుపాయ మొండు కలదయ్య ధరాధిప! ధర్మశాస్త్రముల్
వినిచె త్రయోదశాత్మజ విభేదములన్ విను మందు క్రీతుడన్
తనయునిఁ బొంది యజ్ఞమును ధర్మ యుతంబుగ చేయు టొప్పగున్

380. ఉ. భూసుర బాలు నొక్కనిని భూరి ధనంబుల నిచ్చి తెచ్చి సం
తోసమునన్ గుమారునిగ దుందుభికిన్ బలియిచ్చి యాగమున్
భాసుర రీతిఁ జేయుము శుభంబగు, నవ్వరుణుండు మెచ్చు, నిన్
గాసిలఁబెట్టు రోగమది కన్పడ దింకఁ తదీయ సత్కృపన్

381. చం. అని యొక మార్గమున్ దెలుప నయ్యవనీపతి సమ్మతించి యా
జ్ఞనిడె నమాత్యులన్ బిలిచి, సత్వరమే యొక పేద బ్రాహ్మణున్
తనయులు గల్గు వానిఁగని, తద్ధయు నర్థము నాశఁజూపి యొ
క్కని తన పుత్రు నియ్యెడకు గైకొని రమ్మెటులైన నేర్పునన్

382. మ. అని యాజ్ఞాపన సేయ మంత్రులును రాజాజ్ఞన్ దలల్ దాల్చి గ్ర
న్నన గ్రామంబుల, పట్టణంబులను, సందర్శించుచున్ బోయి యొ
క్కని భూదేవుని గాంచి రొక్కెడ, "నజీగర్తా" ఖ్యు దారిద్ర్య మ
గ్నుని, సంతాన యుతున్, గుటుంబ భర సంక్షోభాత్ము,జీర్ణాంగునిన్

383. తే.గీ. అయ్యజీగర్తుఁ గని విషయంబుఁదెల్ప
తనకు గల్గిన ముప్వురు తనయులందు
మధ్యముని శునశ్శేపు నమ్మంగఁ దలచె
నకట! దారిద్ర్యమది యెంతకైన జార్చు

384. ఉ. కోరిన యట్టు లాతనికి కొల్లలుగా ధనమిచ్చి మంత్రులా
పాఱుని పుత్రునిన్ గొని నృపాలుని చెంతకుఁజేరి చూపినన్
భూరమణుండు సంతసముఁబొంది రయంబున యజ్ఞ కార్య సం
భారము లెల్లఁగూర్పుడని మంత్రి వరేణ్యుల కాజ్ఞ యిచ్చినన్

385. వ. వారును త్వరితగతిని యాగమునకు వలయు నేర్పాట్లు గావించిరి అంత

386. ఉ. భూపతి యాజ్ఞతో యజనమున్ దగఁజేయగ ఋత్విజుల్ శున
శ్శేపుని యూప బద్ధునిగఁ జేసి యనంతర యజ్ఞకార్య దీ
క్షాపరిణద్ధులై సవనశాలఁ జరించుచు నుండ కౌశికుం
డాపసివాని రోదనము లాత్మ నెఱింగి దయార్ద్ర చిత్తుడై

387. చం. పరువున వచ్చి యూప పరిబద్ధుని బాలునిఁగాంచి ఋత్వి జో
త్కరముల కెల్ల యీ యజన కార్యము నిల్పుడటంచుఁదెల్పి భూ
వరుఁగని పల్కె, నీకు నిది పద్ధతి యౌనె ధరాధి నాథ! ని
ష్కరుణ ధరామరాత్మజునిఁజంపుట ధర్మమె స్వార్థ బుద్ధితో

388. ఉ. ఈ పసివాని రోదన లహీన గతిన్ నను నొంచుచుండె, ధా
త్రీపతులెల్ల మున్ను తమ దేహములన్ బర రక్షణార్థమై
యోపి తృణంబులట్టుల యథోచితరీతిఁ ద్యజించిరయ్య! నీ
వా పరమోన్నతాన్వయమునందు జనించి యిటుల్ చరింతువే

389. కం. నీ కాయము నీ కెట్లో
ప్రాకటముగ నట్ల కాదె పరులకు నైనన్
భూకాంతుడ! యిది తెలియక
యీ కరణిఁజరింపఁదగునె హీనుల పోల్కిన్

390. మ. పలురీతుల్ గడు ధర్మయుక్తముగ విశ్వామిత్రు డా రాజుతో
చెలువం బొప్ప వచించు చున్నను శునశ్శేపున్ వధింపన్ మదిన్
తలచెన్ భూపతి, మౌనియున్ మిగుల క్రోధంబూని యబ్బాలు, దు
ర్బలునిన్ బ్రాహ్మణ పుత్రు నెట్టు లయినన్ రక్షింపగా నెంచుచున్





391. కం. దరిఁజేరి వరుణ మంత్రం
బురుతర మహి మాన్వితమ్ము నుపదేశించెన్
మరణ భయంబున నెక్కుడు
పరికంపం బొందు విప్ర బాలుని చెవిలో

392. శా. ఆ మంత్రమ్మును చక్కగా మనమునం దత్యంత శ్రద్ధాగతిన్
వేమారుల్ స్మరియింప నవ్వరుణు డవ్విప్రార్భకున్ మెచ్చి, త
త్సామీప్యంబునుఁ జేరి బంధనములన్ దప్పించి, యాపైన నా
భూమీశాగ్రణి రోగ మూడ్చి చనియెన్ మోద ప్రచేతుండునై

393. కం. తన మాట హరిశ్చంద్రుడు
వినలేదని కోపమూని విశ్వామిత్రుం
డనునీతుడుగాక చనియె
గున గున నిజవాసమునకు కొఱకొఱఁగనుచున్

## ఆడీ - బక యుద్ధం

394. మ. చనియెన్ ఘోటక మెక్కి వేడుక హరిశ్చంద్రావనీశుండు ని
ర్జన సాంద్రాటవి కొక్కనాడు మృగయాసక్తుండునై యయ్యెడన్
ఘన సత్త్వంబులఁజంపుచున్ దుదకు నక్కాంతారమందొక్క ఘో
ణిని మధ్యందిన వేళఁగాంచి శరము న్వేయంగ యత్నించినన్

395. కం. అది గని విశ్వామిత్రుడు
ముదు సలి బ్రాహ్మణుని వేషమున నారాజున్
గదిసి యతని యత్నంబును
నదలిచి మాన్పించి యంత నాగక మఱియున్

396. కం. దానముగా గైకొనె నా
భూనాధుని రాజ్యమెల్ల మోసముతోడన్
తానంత హరిశ్చంద్రుడు
మౌనముగా నేగె రాజ మందిరము నకున్

397. చం. మరు దివసంబునన్ గురుని మాన్యు వసిష్ఠునిఁజేరి యావిభుం
దరమర లేక యంతయును నాతని కెక్కగఁదెల్ప నత్తపో

వరుడిది యెల్ల లోనెఱిగి వంచనతో కుశికాత్మజుండు భూ
భరణుని రాజ్యమున్ గపట బ్రాహ్మణుడై గొనెనంచు నెంచుచున్

398. తే.గీ. ఏమి యెఱుగ నట్టు భూమీశు నోదార్చి
తగిన సమయ మెపుడొ తారసిల్లు
ననుచు మదిని తలచి యవ్వసిష్ఠు డెదురు
చూచు చుండె కుశిక సూను కొఱకు

399. ఉ. అంతట నొక్కనాడు కుశికాత్మజు డొక్క వనమ్మునందు ని
శ్చింతగ నేగుచున్ గనె వసిష్ఠ మహర్షిని, నిర్వరంత న
త్యంత క్రుధాగ్ని తప్తులయి యాగ్రహ మోర్వగ లేక యొండొరున్
కొంత వడిన్ మహోగ్ర పరిఘూర్ణిత నేత్రము లేర్చి చూచుచున్

400. ఉ. ముందుగ నవ్వసిష్ఠముని పుచ్చము త్రొక్కగ లేచు సర్పరాట్
చందము దోప కౌశికు దెసన్ గని క్షత్రియ వంశ దూషణా
విందులె నీకు నివ్విధిని వేషములూనుచు దుష్ట బుద్ధితో
నందర మోసగించుట లహంకరణమ్మున విర్ర వీగుచున్

401. తే.గీ. కొంగ జప మొనర్చుచు నిట్లు కుజనుఁబోలె
సంచరించుట తగునె; వంచన యొనర్చి
అల హరిశ్చంద్రు రాజ్యమ్ము నపహరించి
కులుకు చుంటివి కావున కొంగవగుము

402. మ. అని శాపంబిడ కౌశికుండదరి యాజ్యస్పర్శ జృంభిచు న
గ్నినిఁబోలెన్ జెరలాడి ప్రాత పగలన్ మేల్కొల్పుచున్ బల్కె భీ
షణ రావంబున దుర్మతీ! వినుమిదే శాపంబు నేనిత్తు నీ
వును నాడేలు స్వరూపమున్ గొను మిదే పొమ్మంచు గర్జించుచున్

403. వ. పలికి

404. కం. ప్రతి శాపం బిడ నిర్వురు
పతఁగములై పూర్వశత్రు బావము లేచన్
ప్రతి దినము కలహ మాడుచు
ప్రతిఘాత ధ్వనులఁబేర్చి పచరించు నెడన్





405. కం. వారల కూతలు నరుపులు
వారల ఘాతముల ధ్వనులు ప్రతిజీవులకున్
తోరపు టశాంతి నింపగ
వారిర్వురు పోరి రట్లె బహు వత్సరముల్

406. ఉ. అంతము లేని వారికలహమ్ము నెఱింగి సరోజగర్భుడా
చెంతకు సర్వదేవ పరిసేవితుడై యరుదెంచి వారికిన్
స్వాంతనముల్ వచించి తమ శాపములన్ దలగించి యెట్టులో
శాంతులఁ జేసి పంపె నిక సంగడి నుండు డటంచుఁబల్కుచున్

407. ఉ. అంతటి తాపసేంద్రుల కహంకరణంబులు వీడలేదనన్
వింతయె, తక్కు వారలకు వీడ దహంకృతి యన్నమాట, నే
నింతకుఁజెప్ప వచ్చినది యేమన రాజకులేంద్ర! మానసం
బెంతయు శుద్ధి లేనియెడ నేల తపోవ్రత తీర్థ దానముల్

408. సీ. త్రిగుణములను బట్టి త్రివిధంబులైయుండు
శ్రద్ధయన్నది భిన్న సంగతులుగ
అందు సాత్విక శ్రద్ధ పొందించు పరిపూర్ణ
ఫలముల జగముల ప్రాణులకును
రాజస శ్రద్ధ పూర్ణఫల మొసంగదు
స్వార్థమ్మె హేతువై జరుగు కతన
తామస శ్రద్ధ వ్యర్థమ్ము తలంపగ
ఫలిత మిడదు కీర్తి తొలగఁజేయు

గీ. శత్రు షట్కమునకు లొంగి సంచరించు
మనుజ కోటికి తప్ప దిమ్మాడ్కిగతులు
కాన శ్రవణాది భక్తి మార్గముల చేత
చిత్త శుద్ధిని బడయుట క్షేమ మగును

409. కం. దేవీ పూజ లొనర్చుచు
దేవీ క్షేత్రముల కేగి దేవీ మహిమల్
శ్రీవిభవంబులు వినుచున్
భూవర! చరియించు వారిఁ బొందు సుఖంబుల్

410. కం. నావిని మౌనీంద్రునిఁగని
భూవిభు దనఘా! వసిష్ఠ మునివరునకు మై
త్రావరుణుండను నామం
బే విధమున సంక్రమించె నెఱిగింపు కృపన్

411. వ. అని యడుగ వ్యాసుండిట్లనియె

412. కం. మును మిత్రా వరుణులకున్
జనియించె వసిష్ఠుడు నిమి శాప హతుండై
కనుకన్ మైత్రావరుణుం
డని పిలువంబడియె నాత డానాడు మొదల్

413. చం. తమ తమ ధర్మముల్ మరచి తాపస వర్యు లహంకరించి స
త్వము విడి రాజసంబును ముదంబునఁగొంటయు, భూమి నాథులున్
గ్రమమున కామ లోభ పరిరంభులునై యజనంబులన్ బుజు
త్వము విడనాడి సల్పుటయుఁదప్ప కనంబడ వెందు ధర్మముల్

414. కం. త్రిగు ణాత్మక మగు సంసృతి
నగ పడవు త్రికరణ శుద్ధు లారసి చూడన్
జగదంబ యనుగ్రహమే
తగు మార్గము ముక్తిఁబొంద ధారుణి యందున్

415. మ. మును నిక్ష్వాకు వరాన్వయంబున మహాపుణ్యాత్ముడున్, రూప స
ద్గుణ సంపన్నుడు, ధర్మవేత్త, జన సంస్తుత్యుండు జన్మించి ధా
త్రిని పాలించుచు బ్రాహ్మణోత్తములకై దేదీప్యమౌ పట్టణం
బును నిర్మించెను గౌత మాశ్రమతటిన్ పుణ్యప్రదేశంబునన్

416. కం. దానికి ‘జయ’మను పేరిడి
మానితముగ భూ సురులకు మాన్యముగాగన్
భూనాథు డొసగ బ్రాహ్మణు
లానందము తోడఁజేరి యందు వసింపన్

417. వ. “నిమి” యను పేరంబరగు నాచక్రవర్తి

418. మ. సవనం బొండొనరింపగాఁదలచి యాక్ష్మానాథు డిక్ష్వాకు భూ





ధవు నాజ్ఞం గొని వస్తు సంచయము లుత్సాహంబునన్గూర్చి గౌ
రవ మొప్పన్ భృగు వామదేవ పులహ ప్రఖ్యాత ఋష్యాదులన్
వివిధామ్నాయ విధిజ్ఞులన్ బిలిచె సంప్రీతిన్ మహా ప్రాజ్ఞులన్

419. వ. అంతట

420. కం. తన కులగురువు వసిష్ఠుని
ఘన తాపస వంద్యు పాద కంజమ్ములకున్
వినయమున పూజ లొనరిచి
యనఘుడు భూమీశుడిట్టు లభ్యర్థించెన్

421. చం. అనఘులు మీరు, మాగురువు, లాత్మవిదుల్, విను డొక్కయజ్ఞమున్
గొనకొని చేయ నెంచితిని, కూరిమి మీరలు యజ్ఞ కార్యమున్
ఘనముగ నిర్వహింపుడు, జగంబుల నేలెడి యాదిశక్తి తా
మనమునఁ బ్రీతిఁ జెందగఁగ్రమంబున పంచ సహస్ర వర్షముల్

422. చం. అనవిని యమ్మహర్షియు ధరాధిపుఁగాంచి నరేంద్ర చంద్ర! ము
న్ననిమిష నాథు డిట్లె యొకయజ్ఞముసేయగనెంచి దానికిన్
నను నియమించె ముఖ్య యజన క్రియ లెల్లను నిర్వహింప,ఁగా
వున నది పూర్తి చేయుటయె పోలును ముందుగ మాట యిచ్చుటన్

423. ఉ. ముందది పూర్తి చేసికొని మోద మెలర్పగ నీదు యజ్ఞమున్
పొందుగ నే నొ నర్చెదను భూపతి! యోపిక పట్టు మెట్టులో
అందున నాతడింద్రుడు గదా! తగునయ్య యుపేక్షసేయ? నీ
సందియ మేల శీఘ్రముగ శక్రుని కార్యమొనర్చి వచ్చెదన్

424. మ. అనినన్ భూపతి యిట్లు పల్కె మహనీయా! యజ్ఞ సంభారముల్
దనరన్ గూర్చితి, నెల్ల ఋత్విజుల విద్వన్ముఖ్యులన్ బిల్చితిన్,
బనులెల్లన్ జరిపించి యుంటిఁదగునే బ్రహ్మర్షి! నేడివ్విధిన్
ననుఁగాదంచు సురేంద్రు కార్యమునకున్ దామేగ యోచించుటల్

425. మ. ఇనవంశమ్మునకున్ బురోహితుడ వీవేయయ్యు నాకార్యమున్
మనమందెంచక యన్యకార్యమును సంభావించి యర్థార్థివై
చనుటేమాత్రము ధర్మమౌనె? యిటు లాశా మోహసంబంధివై
నను నట్టేటను ముంచకయ్య! యనుచున్ దా వేడ నమ్మౌనియున్

426. ఉ. ఆతని ప్రార్థనల్ వినియు నౌనని కాదని పల్కఁబోక వే
గాతురుడై దివాధిపతి యజ్ఞము సల్పగ నేగె, నంత నా
భూతల నాధుడున్ గలతఁబొంది యెటైన నొనర్తు యజ్ఞ మం
చాతత భక్తి గౌతముని నర్థిఁ గనుంగొని వేడ నాతడున్

427. కం. తన సమ్మతిఁ దెల్పగ న
య్యిన వంశ ప్రభువు తుంగ హిమగిరి చెంతన్
ఘనముగ యజ్ఞ క్రియలన్
వినయమ్మునఁ జేయఁ దొడగె విస్తృత రీతిన్

428. శా. ప్రాలేయాచల సన్నిధిన్ జలధి తీరంబందు యాగంబు భూ
పాలుండొయ్యనఁజేసె బ్రాహ్మణుల సంభావించి గో,భూ,సువ
ర్ణాలంకారము లోపి నట్టులిడి నిత్యం బైదు వేలేండ్లు దీ
క్షాలక్ష్యుండయి సాటి భూమిపతు లాశ్చర్యాంబుధిన్ మున్గగన్

429. కం. అచ్చట మహేంద్రు యజ్ఞం
బిచ్చున్ జరిపించి పృథ్వి కేతెంచి మదిన్
హెచ్చిన సంతోషమ్మున
వచ్చె వసిష్ఠ డధిపుఁగన వలెనను కోర్కెన్

430. తే.గీ. వచ్చి తన రాక నెఱిగింప భటులఁబంప
నలసి నిద్రించుచున్న యయ్యధిపు లేప
సాహసింపక భృత్యులు జాగుసేయ
తడవు నోర్వక యతడు క్రోధమ్ముఁబొంది

431. చం. నను గురువున్ రవంతయు మనంబున దల్పక యన్యునొక్కనిన్
గొని యజనంబొనర్చితివి కొంకక, యంతియకాక యిప్పుడి
ట్లనయ గతిన్ జరించితి వహంకర ణోద్ధతిఁగాన విమ్ము నీ
తనువు నశించి రాలిపడు ధాత్రి, విదేహుడ వౌదు వింతటన్

432. చం. అని శపియింప రాజభటు లాత్రమునన్ జని నిద్రలేపి య
జ్జన పతి కంతయున్ దెలుప సంచలి తాంగుడునై యతండు చ
య్యన పరువెత్తి వచ్చి వినయం బెసగన్ గురు పాదపద్మముల్
తన శిరమంట మ్రొక్కి కడుధర్మయుతంబుగఁబల్కె నివ్విధిన్





433. శా. నా దోషంబిట సుంతయైనఁగలదా! న్యాయంబె యీరీతి నా
మీదన్ గోపముఁ బూని శాపమిడ స్వామీ! సర్వధర్మమ్ములున్
బ్రోదిన్ మీకు నెఱుంగ జాలినవి కావో? యెంతప్రార్థించినన్
కాదంచున్ ధనలోభ సంగతుడవై కన్గొంటివే నన్ గటా!

434. ఉ. నీ వొనరించి నట్టి కడు నీచపు కార్యము నెంచి సిగ్గిలన్
బోవక శాపమిచ్చితివి; పోలునె నీకిది? భూ సురుండ వి
ట్లావిల చిత్తవృత్తి నుచితానుచితంబు లెఱుంగఁ బోక భూ
దేవ! యనార్యునట్లు నను తిట్టిన నిన్ శపియింప దోషమే!

435. ఉ. కోపము భూసురాళికిటు కూడదు, కోపవివర్ధి తుండవై
నాపయి నింద మోపితివి, నావలె నీకును కోప యుక్తమౌ
పాపపు దేహ బంధ మెడఁబాయును; దేహ విహీన దుస్థితిన్
రూపఱి యుండు మంచు కడు రోషమునన్ శపియింప నంతటన్

436. కం. గురు శిష్యు లివ్విధంబున
నిరువురు శపియించు కొనిరి యేమందు విధిన్
ధర నెంత వారలైనను
అరి షడ్వర్గములఁజిక్కి యడలుదు రధిపా!

## మైత్రావరుణుడు

437. మ. తనకున్ గల్గిన శాపమున్ దలచుచున్ ధైర్యంబుఁ గోల్పోయి య
య్యనఘాత్ముండు వసిష్ఠు డాక్షణమ నయ్యబ్జాసనున్ జేరి యో
జనకా! నాకిటు శాపమేర్పడియె పశ్చాత్తాపమున్ జెందితిన్
ననురక్షింపుము శాపమోక్షణముఁ బొందన్ మార్గమున్ దెల్పుమా!

438. ఉ. శాప విముక్తి బొందుట యసాధ్యమటంచుఁదలంతువేని నే
నోపి మరొక్క దేహమును నొందుట కొక్కని తండ్రిఁజూపుమో
పాప విదూర! అత్తఱిని పాయక నేటి మదీయ జ్ఞాన మ
ట్లే పరిపూర్ణమై యనుసరించెడు నట్టు లను గ్రహింపుమా

439. ద్విపద. అనికడు దీనుడై యర్థించు సుతునిఁ
గని యిట్టులనియెను కంజ గర్భుండు
వినుమిదే పుత్రకా! వెఱవంగ నేల

తనువు వీడిన జీవ ధర్మమ్ముఁ బొంది
అనఘు డౌ మిత్రావరుణుని తేజమున
నెనయఁ బ్రవేశింపు మనువున నంతఁ
దనర నయోనిజు దన కీర్తిఁబడసి
జనియింపు మాతని సంతాన మౌచు
అని చెప్పి పంపగా నంత నాతండు
చని వరుణుని లోకమునఁజేరి యచట
తన దేహమును వీడి తగజీవ భావ
మునఁజొచ్చె మిత్రావరుణుని తేజమున
చనగ నిట్టుల కొంత సమయ మాపైన

440. చం. అలికుల వేణి యూర్వశి నవాబ్జ దళేక్షణ యొక్కనాడు నె
చ్చెలులను గూడి వచ్చెఁగడు చెల్వము మీఱగ కామ ముక్త సం
చలిత సుమాస్త్ర మోయన, వసంత సమాగమ మన్నరీతిగన్
పొలుపున వారుణీ ధవుని ప్రోలికి లాస్యవిలాస మొప్పగన్

441. ఉ. ఆవనజేక్షణన్ గనిన యంత మనమ్మొగి సంచలింప మి
త్రావరుణుండు మన్మథ శరమ్ములు తన్నుఁగలంప రాగ సం
భావిత పల్కు లొప్ప సితపద్మదళేక్షణ! నిన్నుఁగాంచి మా
భావము లొక్కటన్ మదన పంచ శరాహతిఁదక్కె స్వాస్థ్యముల్

442. చం. మదనుని బారినుండి మము మానిని! రక్షణ సేయుమీవు మా
హృదయము మిక్కిలిన్ దవిలె నింపగు నీ యెల సోయగమ్మునన్
మదవతి! యంచు వేడుకొన మౌనముగా తలవంచి యామెయున్
ముదమున సమ్మతిన్ దెలిపె మోమున చిర్నగ వంకురింపగన్

443. కం. అంతట నా యూర్వశి కడు
వింతగఁగ్రీగంట వాని వీక్షించుచు వా
సంతపు వనసుందరి యన
నంతి పురికిఁ జేరె వాని కనువర్తనయై

444. కం. తరుణీ మణి సోయగమున్
కర మనురాగమ్ము తోడ కామాతురుడై





పరిపరిఁ దలచెడి మిత్రా
వరుణునకున్ వేగ వీర్య పతనంబయ్యెన్

445. మ. స్ఖలనంబైన తదీయ వీర్య మొక మృత్సంబంధ పాత్రంబునం
దొలుకన్ దక్షణ ముద్భవించి రతి తేజోద్దీప్త గాత్రుల్ మహో
జ్జ్వల మేధానిధు లిర్వురందుఁగడు నాశ్చర్యంబుగన్, వారిలో
తొలి వాడైన యగస్త్యు దుగ్ర తప ముద్యోగించి చేరెన్‌వనిన్

446. కం. మలివాడు వసిష్ఠుండని
తెలియగ నిక్ష్వాకు డతని దినకర తేజున్
వలనొప్ప వెంటఁగొనిచని
యెలమి పురోహితునిఁజేసె నిచ్చున్ దనకున్

447. తే.గీ. అటు లయోనిజుడై పుట్టి యవ్వసిష్ఠు
డవని మైత్రావరుణి యను నాఖ్యఁబొందె
గురు వరేణ్యుని శాపమ్ముఁ గొన్న నిమియు
నవల నేమయ్యెనో తెల్పు దాలకింపు

448. చం. నిమిని గురూత్తముండమిత నిందను మోపి శపించెనన్న వై
నమెతిగి ఋత్విజుల్ దమ మనంబుల మిక్కిలి ఖేదమంది య
జ్ఞమునెటులైన చేయుటయె సమ్మత మంచుఁ దలంచి తత్‌శరీ
రము నుపచార పద్ధతుల రక్షణసేయుచు సత్వరంబుగన్

449. తే.గీ. జన్మమును పూర్తి చేయించి సద్యశమ్ముఁ
గలుగఁ జేసిరి ఋత్విజుల్ గడకు నెటులొ
అనిమిషుల్ మెచ్చి ప్రత్యక్షమైన యంత
భూమిపతి వారి కుపచారముల నొనర్చె

450. ఉ. అంతట దేవతల్ విభు ననంత ముదమ్మునఁగాంచి భూపతీ!
సంతస మందినారము భృశంబుగ నీదగు యజ్ఞ దీక్షకున్;
చింతిలఁ బోకు మెంతయు వసిష్ఠుని శాపముచే శరీర మిం
కెంతయు కాలముండదని; యింతకు నుత్తమ జన్మదక్కెడున్

451. చం. మరుసటి జన్మమం దవని మానవ జన్మనె కోరుకొందువో
వర సుర రూపమున్ గొనెదొ వైళమఁదెల్పిన నవ్వరం బిదే

సరగున నీకొసంగెదము జన్మముఁబొందిన సర్వ దేహముల్
చిరము వసింప వెందును, నశింపక తప్పదు దుఃఖమేటికిన్

452. సీ. అని దివిజవరేణ్యు లనుచున్న యంతలో
నిమి శరీరము వ్రాలి నేలఁబడియె
విగత దేహుండౌట వెలువడి తనయాత్మ
విన్పించె నీరీతి వేల్పులఁగని
దేవతలార! నే తృప్తిఁజెందితి నింక
దేహమ్ముపై వాంఛ తీరిపోయె
వాయు రూపముతోడ ప్రాణికోటుల కను
సన్నలఁజరియింపఁ జాలునట్లు
నన్ననుగ్రహింపుడని వినయ మెసంగ
ప్రార్థనల్ సేయ, వార "లవ్వర మొసంగ
శక్తి చాలదు మాకు నిశ్చల మనమ్ము
తోడ జగ దీశ్వరిని భక్తి వేడు" మనుచు
పలికి నిష్క్రమించి రమర వరులు నెల్ల

453. చం. అనవిని వేగ భూధవుని యాత్మ కడుంగడు భక్తి నాజగ
జ్జననిని స్తోత్రముల్ సలుప సత్కృప నామెయు మెచ్చి కోటి సూ
ర్యనిభ రుచుల్ వెలుంగ నపు డయ్యెడకున్ జనుదెంచినంత నా
జనవిభు నాత్మ యామెఁగని సంతస మందుచుఁబల్కె నివ్విధిన్

454. తే.గీ. నాకు మోక్ష దమ్మైన జ్ఞానమ్ము నిమ్ము
ప్రాణి కోటుల కన్నులం దేను నెపుడు
కాపురమ్ముండు నట్లుగ కరుణ తోడ
వరమొసంగుము వేరొండు వలదు తల్లి!

455. సీ. అనుచుఁబ్రార్థింప నయ్యంబయు మదిమెచ్చి
ప్రారబ్ధ కర్మాను బంధగతిని
ముక్తి దంబగు జ్ఞానమును బొంద గలవింక
నిర్మలంబునుగడు మర్మయుతము,
ప్రాణి కోటుల నేత్ర పద్మములందీవు
వాయు రూపుడవై ప్రవర్తిలెదవు





నీ కారణమ్మున నిమిషమ్ము కలుగును
వసుధ ప్రాణుల నేత్ర పక్ష్మములకు

గీ. అనిమిషుల కిది వర్తింప దనుచుఁ బలికి
దేవి వీడ్కోలు దెల్పి యదృశ్య మయ్యె
అంత ఋషులెల్ల నిమి శరీరాంతికమున
నిల్చి దుఃఖముల్ దమలోన నిల్పుకొనుచు

456. చం. అతనికి పుత్ర సంతతిని నాత్మఁదలంచి సమంత్ర కంబుగా
నతులిత నిష్ఠతో నరణి నట్టె మథించుచు నుండ నొక్క డు
న్నత శుభలక్షణుండు నరనాథుని దేహమునుండి పుట్టె స
మ్మతిఁదన తండ్రిఁబోలిన కుమారుడు చూపరు లక్కజంపడన్

457. చం॥ అరణి మథించు నట్టి సమయంబున పుట్టిన కారణంబు నన్
బరగు నితండికన్ "మిథి" యనంబడి యిద్దర నంచుకొందరున్,
దిరముగ పుట్టెఁదా జనకు దేహము నుండియె కాన నిక్కమి
ద్ధర జనకుం డనందగు నితండని కొందరుఁబల్కు చుండగన్

458. వ. మఱియుఁ గొందరు ఋషు లిట్లు పలికిరి

459. చం. ఎలమి విదేహుడైన నిమియే యిటు లుద్భవ మందెఁగాన ని
య్యలఘు యశున్ "విదేహు" డని యంటయె యొప్పగు, నంతెగాక యా
వల జనియించు నట్టి నిమి వంశజులైన ధరాధి నాథులన్
దెలియుదు రెల్ల వారలు విదేహు లటంచు జగత్ప్రసిద్ధిగన్

460. కం. అని యెవరికి తోచిన రీ
తిని వారలు పిలిచిరంతఁ దేజంబెసగన్
"జనకు"డని రూఢి కెక్కుచు
ననఘుడు నిమి తనయు డేలె నవనీతలమున్

461. చం. విమల తరాంబు పూరముల విచ్చిన పద్మ సుగంధ బంధురో
త్క్రమణ మనోహరానిల విలాస వివర్ధిత గాంగ తీరమం
దమర పురోపమానమగు నద్భుత పట్టణమొండు రమ్యహ
ర్మ్యములు విశాల మార్గములు రంజిల నిర్మితిఁజేసి యొప్పుగన్

462. కం. నిమిసుతుడు "మిథిల"యను పే
రమితోత్సాహమున నొసగి యానగరంబే
తమ ముఖ్య పట్టణముగాఁ
గ్రమమునఁ బాలించె తనదు రాజ్యంబెల్లన్

463. తే.గీ. అతని వంశమ్ము నందలి యవని పతులు
"జనక" నామమ్ములొప్ప ప్రశస్తిఁగనిరి
తత్త్వ విత్తములౌట నద్ధరణి నాధు
లెల్లరును విదేహులనుచు నెన్నఁబడిరి

464. చం. అనవిని కౌరవాన్వయుడు వ్యాసమహర్షినిఁగాంచి సన్మునీ!
అనఘుడు బ్రాహ్మణోత్తము, డనంత తపోధను, డబ్జ గర్భ నం
దనుడు, పురోహితుండు, బహుధర్మ విధిజ్ఞుడు నయ్యుఁగ్రోధమున్
గొని ప్రియ శిష్యు నేల యటు గొంకక తా శపి యించె నా నిమిన్

465. చం. గురువు శపించెఁబో యతని కూరిమి శిష్యుడు, ధర్మవేత్త, భూ
వరుడు సరోజ బాంధవు ని వంశమునందు జనించినట్టివా
డరమర లేక, యోరిమి రవంతయుఁ బూనక శాపమిచ్చె స
ద్గురువున కోమహాత్మ! మదిఁ దోపదు దీనికి హేతువెద్దియో?

466. ఆ.వె. యజ్ఞ దీక్షఁగొన్న యవని నాధుడు నిమి
క్రోధమునకు లొంగి గురువు నట్లు
పలుకుటదియుఁ దలప బహు విడ్డురముగాదె
తెలియఁజెప్పుమయ్య దీని విధము

467. వ. అనిన జనమే జయుంగాంచి వ్యాస సన్ముని యిట్లు పలికెను

## జ్ఞాన స్వరూప ప్రబోధము

468. కం. క్షమ యనునది దుర్లభ, మా
క్షమయున్ సమకూరు నాత్మజయునకు, మఱియున్
క్షమఁజూపుదు రసమర్థులు
క్షమ గల్గుట యరుదు శక్తి సంపన్నునకున్

469. చం. సకల సుఖంబులన్ వదలి సాంద్ర వనమ్ములఁ దాపసక్రియా
ప్రకటిత సన్మునీంద్రులును, భవ్య చరిత్రులు యోగిపుంగవుల్,





వికసిత దివ్య నేత్రులును, పెక్కురు గల్గినఁ గల్గ వచ్చు, జం
కక భువిఁ గ్రోధ లోభ మద, కామ వికారము లూడ్వజాలిరే?

470. చం. అరయగ నీత్రిలోకము లహంకృతి నుండియె యుద్భవించుటన్
దిరముగ సృష్టి యెల్ల గణుతింప నహం కరణ స్వరూపమౌ
నరవర! కారణంబుల గుణంబుల కన్యములౌనె కార్యముల్
పరగఁ ద్రిమూర్తులేనియు ధ్రువంబుగ నీ త్రిగుణస్వరూపులే

471. చం. జగముల యందు కేవలము సత్వగుణుల్ గనిపింప రెచ్చటన్,
త్రిగుణ యుతంబులేయగు మదిన్ దల పోయ చరాచరాత్మకం
బగు త్రిజగంబులన్ సకల, మట్టుల కాదన నొక్కొకప్పు డే
పగును గుణంబు లొక్కొకటి యన్యగుణంబు లడంగి యుండగన్

472. సీ. నిర్గుణుం డనఘుడు నిర్లేపు డవ్యయుం
డప్ర మేయుడు పరమాత్మయొకడె
ఆది పరాశక్తి కాపర మాత్మకు
భేద మించుక యేని లేదు తలప
అవిభాజ్య సంయోగ మాయిర్వురకుఁగల
దది యెఱింగిన వారి యఘము లుడుగు
ప్రకృతి పురుషుల తత్వమ్ము నెఱింగిన
మోహమ్ము తొలగును ముక్తి కలుగు

గీ. త్రిగుణ రహితమ్ము నైన యీ దివ్యతత్వ
మాత్మ నెఱిగిన మహితాత్ము డనవరతము
సార హీనమ్మునైన సంసార జలధి
దాటి సుఖ శాంతులను పొంది ధన్యుడగును

473. ఉ. జ్ఞానము రెండురీతులుగ స్వాను భవంబన శాబ్దికంబనన్,
జ్ఞానులు వల్కు చుందురు; విచారణ తోడుత వేద శాస్త్ర వి
జ్ఞాన మెఱింగి లోన కడు శాంతము నింపి సమస్త దుఃఖ సం
తానముఁద్రోచు నయ్యది ఘనంబగు స్వానుభవంబు నాబడున్

474. ఉ. వేద పురాణ శాస్త్రములఁ బ్రీతిఁ బఠించి తదర్థ భావముల్
మోదమునన్ గ్రహించి పలు బోధలు తర్క వితర్క కల్పనా

వాదము లొప్పగన్ మసలు వారల జ్ఞానము శాబ్దికమ్ము; రా
గాదుల కాలయంబగుట నయ్యది బుద్ధి వినాశ హేతువౌ

475\. తేగీ. అనుభవ జ్ఞాన మది కష్ట మరసి చూడ
జ్ఞాన మయ్యది జ్ఞానితో సంగమింప
నదియు సిద్ధించు ననుభవం బౌచు మదికి
ననుభవము లేని దదియెల్ల వ్యర్థ మంద్రు

476\. కం. 'దీప'మ్మను శబ్దమ్మును
నేపుగ పలుమారు లుచ్చరించిన నైనన్
దీపము వెలిగించనిచో
దీపించునె యెందునైనఁ దెలియుము నృపతీ!

477\. తే.గీ. విద్య యనఁబడు నైపుణీ వృక్షమునకు
పరహితత్త్వమ్ము, ధృతియు, కోపరహితత్వ
మును, క్షమయు ననగ నివి సంపూర్ణ ఫలము
లని తెలియ వలయును బుధు లను దినమ్ము

478\. ఆ.వె. విద్యనైనఁగాని సద్యోగమున నైన
తపము వలన నైనఁ దగిన రీతి
నడచ వచ్చు హృదయ మందలి రిపులను
అంతకన్న మార్గ మన్యమేది

479\. సీ. అతిచంచలము మనం బద్దాని నిలుపంగఁ
జాలరెవ్వరు మూడు జగములందు
కామాది భావముల్ గలుగు నద్దాననే
అదియు నుడిగిన కామాదులుడుగు
క్షత్రియుల్ రాజస సంసర్గ లౌటచే
కష్టమౌ మనసులన్ గట్టివైవ
నిమియు క్షత్రియుడౌట నిగ్రహంబూనక
శపియించె గురువును కుపితుడగుచు

గీ. భృగుసుతుని యయాతి మును శపించ దనిన
అతని నైజమ్ము మిగుల సౌమ్యమ్ము దలప





అట్లె కొందరు సౌమ్యు లందందుఁ గలరు
క్షత్రి యుల లోన పరికింప సచ్చరిత్ర!

## హైహయుల చరిత్ర

480\. కం. మును హైహయ వంశోద్భవు
లనయము ధన లోభులగుట నధికక్రోధం
బున భార్గవులను బ్రాహ్మణు
లనియును తలపక వధించి రతి క్రౌర్యమునన్

481\. కం. ఇది యొక పురాణ చరితము
మదికిని నచ్చెరువు గలుగు మన్నన తోడన్
చదివిన వినినను గావున
ముదమున వినిపింతు వినుము పూరుకులేంద్రా!

482\. చం. కడు బల వంతు దుత్తముడు కార్యవిధిజ్ఞుడు మున్ను కార్తవీ
ర్యుడను ధరాధిపుండు గల డొప్పుగ హైహయవంశజుండు, శూ
రుడును, సహస్ర బాహుడు, విరోధుల పాలిట నుగ్రమూర్తియై,
పుడమిని నేలుచుండె నధిపుల్ దనకెవ్వరు సాటిలేరనన్

483\. సీ. భృగు వంశ విప్రులన్ విఖ్యాతిమై పురో
హితులుగా గైకొని యతి ముదమున
అత్రి నందనుని దత్తాత్రేయు గురువుగా
చేకొని భార్గవుల్ చెప్పినట్లు
యజ్ఞ యాగాదుల నతిదీక్ష నెఱపుచు
భూరి దక్షిణలు విప్రులకు నొసగి
గో భూ సువర్ణ సత్ ఘోట కానేకప
దానమ్ములన్ వారిఁ దనియఁజేసి

గీ. భార్గవాన్వయుల కతి సంపదలఁ గూర్చి
పెద్ద కాలమ్ము పాలించి పృథ్వినెల్ల
కడు సమర్థుడితండని ఖ్యాతి వడసి
కార్త వీర్యార్జునుడు స్వర్గస్థుడయ్యె

484. ఉ. అంతట పెద్ద కాలమున కాన్నృపవంశజులైన హైహయుల్
వింత యదేమొగాని కదు పేదరికమ్మున గ్రుగ్గి సుంతయున్
చెంత ధనమ్ములేక కదుచింతిలి భార్గవ వంశ విప్రులన్
ఎంతయు నమ్రులై ధనము నిమ్మని వేడిరి వీడి దర్పముల్

485. ఉ. భూపతు లిట్లు వేడ మొగమోట మొకింతయు లేక లోభ చిం
తాపరివర్ధ మానులయి ధర్మము నెంచక వారికైన య
య్యాపదలన్ గణింపక ధరామరు లెల్ల ధనమ్ములన్ భువిన్
దాపరి కంబొనర్చి జననాథుల వంచన సేయఁబూనుచున్

486. తే.గీ. ధనము సుంతయు లేదు మా దగ్గరనుచు
పలికి తమ యాశ్రమములను వదలి వేగ
వనములకు నేగి రత్యంత భయముతోడ
కొట్టి బలవంతమున లాగు కొందురనుచు

487. కం. అదిగని హైహయు లెల్లరు
వదలక ధన మవసరమ్ము వచ్చుట కతనన్
వెదకి వెదకి యొక గృహమున్
బదిలమ్ముగ త్రవ్వ ధనము బయలు పడుటచే

488. చం. శ్రమయని మిన్నకుండ కటఁజాలినయంత ధనమ్ము లేమిచే
క్రమమున త్రవ్వి రందుగల బ్రాహ్మణ గేహములెల్ల; నందుతా
మమిత ధనమ్ములన్ గని ప్రయత్నము సత్ఫలితంబు నిచ్చుటన్
సమధిక సంతసంబొదవ చయ్యన వాని గ్రహించుచుండగన్

489. ఉ. భూసురు లెల్లవచ్చి తమ భూరి ధనావళు లెల్ల వోవుటన్
గాసిలి యేద్చుచున్ పతుల కాళుల పైబడి వేడ వారలున్
దోసము నెంచ కాగ్రహము దుర్భర మౌట కృపాణ బాణ బా
ణాసన తీవ్ర ఘాతముల నంతమొనర్చిరి విప్రవర్యులన్

490. ఉ. కొందరు భార్గవుల్ గిరుల కోనలఁబట్టుచు పర్వులెత్త నెం
దెందున దాగిరో వెదకి యెల్లర పుత్ర సతీయుతంబుగా
బ్రుందగఁ జేయుచుండ ముని మాన్యులు వేగమె వచ్చి యడ్డమై
యెందుల కిట్లు వీరల వధింతు రటంచు వచించి రివ్విధిన్





491. ఉ. వీడుదు కోప మింతతన వేతిదులై యిటు పాపకార్యమం
చోడక గర్భముల్ దొలగ నుత్పల గంధుల నిట్లు నొంచుటల్
గూడునె? పాపపున్ ఫలము గోల్పడ దెన్నదు, నేడొ రేపొ వెం
టాడుచు మిమ్ముఁ గూల్చు, శుభమందఁదలంచిన మానుడీ క్రియల్

492. మ. అనినన్ హైహయు లించుకంత తమ కోపావేశముల్వీడి యో
ముని నాథాగ్రణులార! వీరి చరితంబుల్ మిక్కిలిన్ హేయముల్
మును మా పూర్వుల సంపదల్ విరివిగా మోసంబునన్ దోచినా
రనయం బెవ్వియొ యజ్ఞ యాగము లటం చాయత్తులన్ జేయుచున్

493. తే.గీ. వంచకులు వీరు ధూర్తులై పంచఁజేరి
దోచుకొని రెల్ల ధనముల నీచవృత్తి
అవసరమ్మయ్యె మాకిప్పు దర్థమనుచు
నెంత వేడిన సుంతయు నియ్యరైరి

494. కం. రాజుల కవసరమైనన్
భూజనులే యాదుకొనుట పోలున్ జగతిన్
భూజానుల వంచించుట
భాజన మెటులౌను వీరు పాఱులె తలపన్

495. ఉ. యజ్ఞము లాచరింపుదని, యాచక కోటికి పంచుదంచు, ధ
ర్మజ్ఞుదు కార్తవీర్యుదతి మాత్రముగా ధనిమీయ, వీరలో!
యజ్ఞము లాచరింప, కటు యాచక కోటికి దాన మీయ, కి
ట్లజ్ఞతఁ గూడ బెట్టిరి ధనావళు లందిన యంత లోభులై

496. తే.గీ. యజ్ఞ యాగాది క్రతువుల నవలఁద్రోచి
దాన ధర్మమ్ము లవి యెల్ల మాని, తాము
ననుభవింపక ధనముల ననవరతము
దాచుటది విప్రకోటికి ధర్మమగునె?

497. కం. చోర భయ మగ్ని భయమును
భూరమణుల భయము నిత్యమును ధనము నకున్
ధారుణి సహజము, వ్యర్థపు
టారాటము తప్ప నిల్వదది యెట్లైనన్

498. తే.గీ. అట్లు కాకున్న బ్రతికి యున్నంత కాల
మెట్లొ సంరక్షణముసేసి హేయమైన
బ్రతుకు గడపియు ప్రాణముల్ వాయువేళ
వెంటఁగొనిపోవునే కాసు వీసమైన

499. ఉ. కావున నిట్టి వంచకుల గర్వితులన్ ద్విజులంచు నెంచబో,
కీవిధి దండనల్ సలుపు టెంతయు నొప్పదె మౌనులార! భూ
పావళికెల్ల దోషుల నియంత్రణ సేయుట యుక్తమంచు మా
భావములన్ దలంచితిమి, పాప మొకింతయు లేదు మాయెడన్

500. కం. అనినన్ మౌనులు మౌనం
బున నుండిరి హైహయులును భూసుర సతులన్
జెనకక ధనములఁగొని బో
రనఁ జనిరి ముదమ్మున నిజరాజ్యమ్మునకున్

501. వ. అంత బ్రాహ్మణ స్త్రీ లెల్లరు ప్రాణము లరచేతన్ బట్టుకొని
భయ విహ్వలులై హిమ వత్పర్వతమును చేరుకొనిరి.

502. మ. ధరణీ శోత్తమ! లోభ మెంతటి ప్రమాదం బైనదో వింటివే
నరునిన్ దుఃఖమునందు ముంచుఁ దుదకున్ బ్రాణంబులన్ దీయు, నొ
క్కరినే గాదు కుటుంబమున్ విడక చిక్కం బట్టి బాధించు, దు
ర్భరమౌ శత్రువు దీని మించి కలదా పల్మారు యోచించినన్

503. ఉ. పాపము లెన్నియైన జరుపన్ దలపించును, ధర్మమార్గమున్
దోపగ నీయ, దెల్ల ప్రజతోడ విరోధముఁదెచ్చిపెట్టు, చిం
తా పరివృద్ధిఁ జేయు, తలి దండ్రుల బంధుల మిత్రులన్ సదా
వేపుచు చంపఁ జేయు నతి భీకర శత్రువు లోభమెంచగన్

504. మ. కడు ధర్మజ్ఞులు నున్నత వ్రతులు నౌ కౌరవ్యులున్ లోభ సం
గడిచే నాశన మౌట నీ వెరుగవే కల్హార మిత్రాన్వయా!
మడియన్ లేదె కళత్ర పుత్ర హిత సంబంధాళితో; నాపగే
యుడు ద్రోణుండును కర్ణుడున్ పడరె తాముగ్రాహవక్షోణిలో

505. కం. అనవిని జనమేజయు డ
య్యనఘాత్ముని గాంచి మిగుల యానందమునన్





తన కరకమల యుగంబును
వినయంబున మొగిచి యిట్లు వేడెన్ మెల్లన్

506. చం. పలుకుల తల్లి మీ రసనపై నడయాడ వచించు చున్న య
త్యలఘు సుధా రసార్ద్ర మధురాక్షరయుక్త కథావిశేషముల్
పలుగతి మత్ శ్రుతి ద్వయికి పండుగ చేసెను వ్యాససన్మునీ!
కలుగదు తృప్తి కాన విన కౌతుక మౌ వినిపింపు మింపునన్

507. ఉ. ఆ భృగు పత్ను లివ్విధి హిమాద్రికిఁజేరిన మీద నేగతిన్
శోభలు దక్కి వర్తిలిరి సున్నిత దేహలు, వారి వంశమె
ట్లీ భువి నిల్చె; హైహయులు నెల్ల ధనంబులఁగూర్చి యెవ్విధిన్
ప్రాభవ మొప్ప సత్క్రియలఁ బట్టి యొనర్చి రెఱుంగఁ దెల్పవే

508. వ. అనియడిగిన జననాధుంజూచి ముని నాధుండిట్లనియె

509. చం. వినుము ధరాధినాధ! భృగువిప్రుల భార్యలటుల్ హిమాద్రికిన్
జని యొక కొంతకాలము ప్రశాంతిగ పుచ్చి భయమ్ము వాసి యం
తన నొక వాహినీ తటమునన్ దగ నిర్మల సైకత స్థలిన్
ఘనముగ లోక మాతయగు గౌరిని మన్ననఁ జేసి యంతటన్

510. చం. అతి వినయంబునన్ జనని కంచితరీతిని పూజ సల్పి స
మ్మతి నుపవాస దీక్షలఁ గ్రమంబున ప్రాణవియోగ సిద్ధి సం
గతులకు నొప్పి కూర్చొనిరి, కాలము సాగగ నొక్కరేయి య
య్యతివల కంబ స్వప్నమున, నద్భుత రీతిగఁ దోచి యిట్లనెన్

511. తే.గీ. ఇందు ముఖులార మీ దీక్ష కేను మిగుల
సంత సించితి మీలోన సాధ్వికొకతె
కూరు భాగమ్మునుండి కుమారు దస్మ
దంశ జనియించు మిగుల విఖ్యాతిగదుర

512. చం. అని వచియించి యెల్లరును నచ్చెరు వంద నదృశ్యమయ్యె నా
జనని, ధరామరాంగనలు సంతసమందిరి, అంతనొక్క యం
గనకు తదూరు దేశమునఁగన్పడె వింతగ గర్భ చిహ్నముల్
దినదిన వర్ధమానమయి తేజరిలెన్ వనితోరు గర్భమున్

513. కం. భృగు పత్నులెల్ల రామెను
తగు శ్రద్ధన్ జూచు కొనుచు తా నడిగినయ
ట్లొగి నుప చారంబులు దం
డిగ నొనరించుచు గడపిరి డెందము లలరన్

514. వ. ఇట్లు పెద్దకాలంబు గడచిన యంత

515. ఉ. హైహయులున్ బ్రయత్నముల నాపక భార్గవులెందునున్న సం
దేహములేక యొట్టులో వధింపఁదలంచి హిమాద్రిపైన ను
త్సాహము మీఱ సంచరిలు తత్భృగు పత్నులఁగాంచి యింతులం
చోహట మంద కాయువతులున్న ప్రదేశముఁ జొచ్చుచుండగన్

516. ఉ. వారినిఁ గాంచినంత భృగు పత్నులు భీతిలి వ్యాఘ్ర సంఘ సం
చారము దోచినంత రభసంబునఁ బర్విడు నిఱ్ఱులట్టులన్
బారుచు నుండ హైహయులు పట్టుడు చంపుడటంచు వల్కుచున్
భీరువులైన యంగనల వెంట హుటాహుటిఁబర్విరుగ్రులై

517. చం. జనిత నిజోరు గర్భ భర సంగతిఁ బర్విడలేక యార్చుచున్
తన వెను వెంట ఖడ్గములఁదాల్చి రయంబున వచ్చు వారలన్
గనుగొని యూరు గర్భిణి వికంపిత చిత్తముతోడ ముందుకున్
జనగ నశక్తయై నిలిచె సంచలితాక్షి యుగాంబు ధారయై

518. కం. కరముల ముఖమును గప్పుక
గిరి గుహలు ప్రతిధ్వనింపఁ గేక లిడుచు నా
నరసిజలోచన చూలా
లొరిగి పడుచు చిక్కె హైహ యోర్వీశులకున్

519. వ. అంతట

520. మం. తనయూరుస్థిత బాలు డాక్షణమ తద్దైన్య స్థితిన్గాంచి, పె
ల్చన కోపంబును బొంది, యూరువుల నాశ్చర్యంబుగాచీల్చుకొం
చిన బింబంబటు వెల్పలం బడగ నయ్యేపారు తీక్ష్ణార్చులన్
గని యంధత్వముఁ బొంది రానృప వరుల్ కౌరవ్యవంశోత్తమా!

521. ఉ. అందరు నేక కాలమున నంధులు  నౌటకు భీతిఁజెంది యా
చందము గల్గ హేతువు నిజంబుగ నీబుడుతండె యౌనుబో





సందియ మేల యీామె యును చాల పతివ్రత యంచునెంచి య
య్యిందు ముఖీ పదంబుల పయిన్బడి యేడ్చుచు వేడిరివ్విధిన్

522. శా. తల్లీ! మమ్ము క్షమింపుమమ్మ! యప రాధం బెంతయోచేసి మీ
కల్లాటం బొనరించి నార మకటా! యంధత్వముల్ బొంది యి
ట్లల్లల్లాడుచు నుంటి మమ్మ! నిను మేమమ్మా! కనన్ జాలమో
ఫుల్లాంభోజదళాక్షి! నీదు మహిమంబున్ గంటి మిప్పట్టునన్

523. చం. శరణిక నీవెతల్లి! యిది చావున కంటెను మిన్న యంధ సం
చరణము, చూపు నిమ్మికను సత్కృప నిట్టి మహాపరాధముల్
మరల యొనర్పఁ బోమనుచు మాపయి నొట్టిడు చుంటి మమ్మ!మా
నరపతులెవ్వరేని కడు నమ్రత మీ యెడ నుందురింకపై

524. చం. అని కడు దీనులైయడుగు హైహయులన్ గని యామె యక్కజం
బెనయగ జాలిఁబొంది పృథివీశ్వరు లార! మహీసురాంగనన్
వినయముతోడ నిక్కరణి వీరులు మీరలు వేడుటొప్పునే
వినుడొక సత్యమున్ దమకు విన్నెద కోపము లేదు మీ యెడన్

525. చం. ఉరుతర తేజు డీతడు మదూరు భవుం డతి క్రుద్ధుడయ్యె, మీ
రరమర లేక మాపతుల నన్నల మామల తల్లి దండ్రులన్
నరకి వధించుటన్, మఱియు నాతుల గర్భము లెల్ల దుల్చి దు
ష్కరమగు హింసలన్ సలిపికానలఁద్రోలుటసైప కాత్మలో

526. కం. ధీయుతుడై యీ బాలుడు
నా యూరువు నందె యుండి నైపుణ్యమునన్
పాయక నూఱేడులు స్వా
ధ్యాయ మొనర్చెను చతుర్విధామ్నాయములన్

527. చం. ఇపుడతి క్రుద్ధుడై మిము వధించి పితౄణముఁ దీర్ప నీశ్వరీ
కృప జనియించె, నీతని యహీన తనూద్భవ దివ్యతేజముల్
నృపవరులార! మీకనుల కీగతి యాపదఁదెచ్చె,ఁగాన నీ
వ్యపగత దోషు వేడు కొను దర్భకుడంచుఁదలంప కాత్మలన్

528. మ. అనినన్ హైహయు లాక్షణంబ చని భక్త్యావేశముల్ పొంగ న
య్యన ఘాత్ముండగు బాల భార్గవుని పాదాబ్జంబులన్ బట్టుచున్

వినయం బొప్పగ ప్రార్థనల్ సలుప నవ్విప్రార్భకుం డెంతయున్
తనలో మోదమునంది దృష్టు లొసగెన్ దద్భూపతిశ్రేణికిన్

529. వ. అవ్విధంబున దృష్టులన్ బ్రసాదించి భూమి పతులంగాంచి
అబ్బాలకుండిట్లనియె

530. చం. జరుగ గలట్టి దెద్దియును క్షత్రియ పుంగవులార! తప్పునే!
జరిగిన దిట్లటంచు కడు సంకటముల్ వడ కింద్ల కేగి భూ
భరము వహింపు డింతటనఁ బాయుడు క్రోధము లోభ మాత్మలన్
పరగ నధర్మమున్ విడచి పాలనసేయు డశేష భూప్రజన్

531. కం. అని యోదారిచి పంపగఁ
జనిరా హైహయులు మిగుల సంతోషమునన్
జననియు తన పుత్రునిఁగొని
చనియెను నిజగేహమునకు సమ్మతి తోడన్

532. కం. లోభముచే కీడు గలిగె
భూభర్తల కవ్విధాన; భూసురులును నా
లోభము చేతనె మడిసిరి
లోభమ్మది యెవరినైన లోగొను టరుదే!

## హైహయ జననము

533. వ. జనమేజయమహారాజా! యింక నీహైహయుల జననంబును
గూర్చి వివరించెద నాలకింపుము

534. మ. మును రేవంతు డనన్ బ్రసిద్ధుడగు నంభోజాత మిత్రాత్మజుం,
డనలోద్దీపిత తేజుడుండె,ఁగడు భద్రా కారు, డాతండు వి
ష్ణుని దర్శింపఁదలంచి దివ్య హయమున్ సొంపారగా నెక్కి యే
గెను వైకుంఠ పురంబుఁజేరఁ గడు భక్తిన్ దూర్ణవేగుండునై

535. వ. అట్లు సని వైకుంఠ పురంబుఁజేరినంత

536. శా. ఆతండెక్కిన ఘోటకంబుఁగని "యీయశ్వంబు క్షీరాబ్ధి ను
ద్భూతం బైనది గాదలంతు మును నాతోఁగూడి; యుచ్చైశ్రవం





బే తథ్యంబని నిశ్చయించి కనులట్లే విప్పి శ్రీలక్ష్మి సం
ప్రీతిన్ బొందుచు చూచుచున్ నిలిచె నుర్వీనాథ! నిశ్చేష్టయై

537. ఉ. పంకజ నాభుడున్ హయముపైఁ జనుదెంచెడు వాని సుందరున్
పంకజ మిత్ర తేజుఁగని పంకజ నేత్రను లక్ష్మిఁగాంచి "ని
శ్శంక హయంబు నెక్కి సుమ సాయకు నట్లరుదెంచు వీని నే
ణాంక ముఖీ! యెఱుంగుదువె యాఖ్యయదేమియొ వాసమెద్దియో?"

538. చం. అని పలుమారులట్టులె రమాధిపు డామెను పృచ్ఛ చేసినన్
కనులటు త్రిప్పకశ్వమునె గన్గొనుచున్ మరుమాట పల్కకుం
డిన, హరి సైపలేక రమణిన్ గని పల్కెను నల్కఁబూని యో
వనజ ముఖీ! పరాకుఁగొని పల్కక యుల్కక నుంటి వేలొకో

539. చం. హయమును గాంచి యింత యధికాధిక మోహముఁబొందఁజెల్లునే
నియతి వసింప వొక్కయెడ నీవతి చంచల, వేది గాంచి యుం
బ్రియమును బూని వేడుక రమింతువు కాన"రమాఖ్య"గల్గె; ని
ర్భయమున నన్ గణింపవు తురంగముపై మదినిల్పి; కావునన్

540. తే.గీ. బడబవై పుట్టు మికపైన పుడమి యందు
ననుచు శపియించె వెన్ను డయ్యబ్జనేత్ర
నంతఁదెలివొంది 'రమ' భయమావ హిల్ల
భర్తఁగని వేడుకొనె నిట్టు లార్తి తోడ

541. ఉ. ఇంతటి చిన్న దోసమున కిట్లు శపించుట న్యాయమౌనె దై
త్యాంతక! దేవ దేవ! ప్రియ మార ననున్ గను చుందు వెప్డు, నీ
కింతటి కోప మావహిలు టెన్నడుఁగాంచను నింతదన్క; నా
పొంతన నీదు ప్రేమ కడు బూటక మంచు నెఱుంగనైతినే

542. తే.గీ. వజ్రమున్ బ్రయోగింపనౌ వైరి పైన
భార్యపై ప్రయోగించుట భావ్యమగునె
ప్రేమకున్ బాత్రు రాలను బ్రీతి మాలి
శాపమిడ నర్హురాలనె పాప హరి!

543. ఉ. నీ కనుదోయి ముందె మరణింతును నిన్‌విడి. మేన ప్రాణముల్
చేకొని యెట్టులుందు నిక శ్రీకర! శాపము గ్రమ్మరించి నన్

జేకొను, మట్లు కాదన వచింపుము శాపవిముక్తి యెన్నడో
లోక శుభంక రార్థమని లోఁదల పోయుదువేని కేశవా!

544. మ. అనినన్ దాచిఱు నవ్వు నవ్వుచు సరోజాక్షుండు కంజాక్షితో
ననియెన్"ప్రేయసి! మర్త్యలోకమున నీకావిర్భవించున్ సుతుం
డనఘాత్ముండును మత్ సమాను; డటుపై నశ్వాకృతిన్వీడి క్ర
న్నన వైకుంఠమువచ్చి నన్ గలియు మానందంబునన్ గోమలీ!

545. కం. తన యెదుటనె వెన్ను డిటులఁ
గనలి రమకు శాప మిడుటఁ గని భయపడుచున్
జని యింటికి రేవంతుడు
జనకున కిదియెల్లఁదెలిపి స్వస్థతఁబొందెన్

546. తే.గీ. భర్త యిడినట్టి శాపమ్ము వలన రమయు
నపుడ బడబాకృతి ఁగౌని తీక్ష్ణాంశుపత్ని
మున్ను తప మొనర్చిన స్థలమునకు నేగి
శివుని ధ్యానించె నేకాగ్ర చిత్తవృత్తి

547. కం. అది కాళిందీ తమసా
నదులు గలియు పుణ్యభూమి నయనానందం
బొదవ సుపర్ణాక్షోత్తర
సదమల వన మిష్టకామ్య సంపత్ప్రదమున్

548. సీ. శూలాయుధుని చంద్ర చూడుని మదనారి
నర్ధ నారీశ్వరు నహి విభూషు
ఘన సార సితదేహు గజచర్మ పట ధరు
పంచముఖు ఘన కపాల హారు
భస్మరాగాంగుని ఫాల నేత్రోజ్జ్వలు
వృషభ వాహను విషావిష్ట కంఠు
బహుళ జటాజూట నిహిత సురాపగు
దేవ మునిగణ సంసేవితాంఘ్రు

గీ. శివుని మదినిల్పి యా రమ చేసె తపము
దివ్య వర్ష సహస్రముల్ దీక్ష తోడ





సంత సంబంది యపు డుమా సహితుడగుచు
నభవు దరుదెంచె వృషభ వాహనమునెక్కి

549. వ. అట్లు ప్రత్యక్షం బైన శివుండు బడబాకృతినున్న రమన్ గాంచి
యేమియు నెఱుంగని వానివలె

550. మ. కమలాక్షీ! యిది యేమిటమ్మ! బడబాకారంబునన్నిల్చి యి
ట్లమితంబైన తపంబు నాకొఱకు చేయన్ గారణంబేమి? శ్రీ
రమణీ! లోక విభుండు నీ విభుడు ధర్మజ్ఞుండు యోగ్యుండు, న
య్యమలో దాత్తుని వీడి నన్నుఁదలపన్ న్యాయంబె యోచింపుమా

551. మ. పతియే పత్నికి దైవమంచుఁబలుకున్ బ్రాఁబల్కు తథ్యంబు తత్
పతినిన్ గాదని పత్ను లన్యులను సంప్రార్థింపరాదంచు వి
స్తృత శాస్త్రంబులు వల్కుచుండ బుధ సంసేవ్యుండు విశ్వాత్ము డ
ప్పతి యుండన్ నను సన్నుతించుటిది సంభావ్యంబు గా దెవ్విధిన్

552. చం. అనవిని యబ్జనాభుసతి యా శశిశేఖరుఁగాంచి శంకరా!
మనమున వేడి నంతటనె మానక వేగమె భక్తకోటి, కీ
వనుపమరీతి కోరికల నట్టె యొసంగెదు గాదె? నన్నిటుల్
గనలి శపించె నామగడు కంటివె తత్ఫల మీ స్వరూపమున్

553. మ. సుతు డొక్కండుదయింప వైదొలగు నంచున్ బల్కె శాపావధిన్
బతి, యాపైన వికుంఠ మేగనగుఁగానన్ నన్ను నీ వెట్లొ స
మ్మతి రక్షింపఁ దగున్ త్రినేత్ర! యిపుడే మార్గమ్మునన్ నేను సం
తతిఁ బొందందగు భర్తలేక, యిది సాధ్యంబే యుమావల్లభా!

554. కం. శివకేశవులకు భేదం
బవలోకింపంగ గలదె అభవా! కానన్
అవమానంబని యెంచక
ప్రవిమలగతి నిన్నుఁగూర్చి ప్రార్థించి తిటుల్

555. వ. అనిన నక్కజంబంది ముక్కంటి యత్తమ్మికంటిన్ గని యిట్లనియె

556. సీ. హరి హరాభేదమ్ము నరయంగఁ జాలరు
విజ్ఞులు మునులును వేదవిదులు

అజ్ఞాన వశమున హరి హర భేదమ్ము
నెన్నుచు తర్కమ్ము లేర్పడంగ
కలహించు చుందురు కలియుగం బందున
హరిని నన్నును నిందలాడు కొనుచు
ఇవి యెల్ల యెఱుగుదు మేనును హరియును
నీ రహస్యంబెట్టు లెఱిగి తీవు

గీ. నిజము వచియింపు మనగ నా నీర జాక్షి
చంద్రశేఖర! వినుమయ్య శౌరి మున్ను
ధ్యాన మొనరించు చుండె నేకాంతమందు
అక్కజమ్మున నే మెల్ల నరిగితటకు

557. ఉ. ఆతడు ధ్యానమున్ విడుచు నంతకు నచ్చట వేచియుంటి ని
ర్భీతిగ; నంత నచ్యుతుడు ఱెప్పలు మెల్లన విప్పిచూచె, నా
చేతము సంతసిల్ల దరిఁజేరి వినమ్రత నంజలించి వా
క్చాతురి దోప నన్ గలచు సందియ మీగతిఁ బృచ్ఛచేసితిన్

558. శా. దేవా! దుగ్ధ పయోధి జాతనగు నే దేవేంద్రుడున్ మున్నుగా
దేవానీకముఁ జూచి యందు నిను నాదేవుండు గా నెంచితిన్
నీవే శ్రేష్ఠుడ వన్న భావమున; లోకేశుండవై యుండి నీ
వేవేల్పున్ మది నిల్పి ధ్యానమిటు లెంతేఁ జేయుదో తెల్పుమా!

559. మ. అని నిక్కచ్చిగ వేడ నాధుడనె నోయబ్జాక్షి! ముక్కంటి కే
ననినన్ బ్రాణము, నా కతండనగ నత్యంతంబు ప్రాణమ్ము; కా
వున నేనాతని, నాతడెన్నడు నమున్ బొల్పొంద నేకాగ్రవృ
త్తిని ధ్యానించుచు నుందు మెంతయును భక్తిన్; లేదు భేదంబెటన్

560. మ. అని యీ గుహ్యము మద్విభుండు తెలుపన్ ధ్యానించితిన్ నిన్ను న
య్యనఘాత్ముండు త్వదీయ వల్లభు డటం చాలోచనల్ సల్పి, గ్ర
న్నన మమ్మిర్వుర నెట్టులైనఁగృప సంధానింపు మోశంకరా!
తనయున్ బొంది వికుంఠ మేగఁగల నంతన్ స్వస్వరూపమ్ముతో

561. మ. అనుచున్ సాగరకన్య వేడ శివు డమ్మా! దుఃఖమున్ వీడుమా
అనఘుండా జగదీశ్వరుండిటకు నశ్వాకారుడై వచ్చి గ్ర
న్నన నిన్ జేరగఁజేయుదే నెటులొ, అంతన్ నీకు పుత్రుండు వె
న్నునకున్ దుల్యుడు గల్గు నెల్లరకు సంస్తుత్యుండు విఖ్యాతిగన్

562. చం. అతడును "నేకవీర" యను నాఖ్య జగంబుల ఖ్యాతిఁగాంచు న
య్యతులిత తేజుడే ధరణి హైహయవంశపు మూలకర్తయౌ,
పతియును నీవు నంతఁ జన వచ్చును నిచ్చ వికుంఠ సీమకున్
వెతలికఁ దీఱు నీకు; వినిపింతును విన్ము మరొక్కసంగతిన్

563. మ. ఉదధిన్ బుట్టిన శ్వేత వర్ణహయ మయ్యుచ్చైశ్రవంబున్ మహా
ముదమున్ జెందుచు నాడు గాంచినపు డేమోహంబు నీవొందితో
అదియెల్లన్ జగదంబ మాయయగు, నయ్యంబన్ సదానీవు నె
మ్మది ధ్యానించుట విస్మరించితివి సుమ్మా! తత్ఫలంబిద్దియౌ

564. తే.గీ. కాన నిక నుండి దేవిని క్షణమయేని
విస్మరింపక మదినిల్పి విమల భక్తి
ధ్యాన మొనరింపు మని పల్కి తత్ క్షణంబ
భవు డదృశ్యుడైచనియె భవానిఁ గూడి
కమల యును భర్త రాకను గనుచునుండె

565. తే.గీ. శివుడు కైలాస మునకేగి చిత్ర రూపు
డన్నవానిని చతురుని యనుభ వజ్ఞు
కార్య మర్మజ్ఞు ప్రమథు నొక్కనినిఁబిలిచి
పలికె నిట్లని గంభీర గళముతోడ

566. ఉ. వెన్నుని చెంత కీ వరిగి విజ్ఞత దోపగ నాదుమాటగా
గ్రన్నన దెల్పు మీగతిని" కంజదళేక్షణ లక్ష్మి యిప్డు తా
నున్నది యొక్కచోట కడునుత్కట దుఃఖ నిమగ్నయై దినా
లెన్నుచు నొంటిగా నిను నహీనగతిన్ దలపోయుచున్ మదిన్

567. కం. కడు వేగమెచని నీవా
కడలిసుతన్ దుఃఖ మగ్నఁగని తద్దుఃఖం
బడగింపఁ బూను మెంతయుఁ
దడయక" యని తెలుపు మనుచు త్ర్యంబకుడనగన్

568. చం. చనియటం గాంచె నాతడు ప్రశస్తిగ వైష్ణవ బృంద హర్ష ని
స్వనమును పూలతావృత విభాసిత సౌరభ భూరి సాలమున్
అనుదిన హంస సారస విహార సుశోభిత నీరజాకరం
బును సముదగ్ర సౌధ చయమున్ సువిశాల వన ప్రదేశమున్

569. కం. అట వెన్నుని సౌధము ముం
గిటంగల జయవిజయులం గని కేల్మోడ్చి "శివుం
డిట కంపగ వెన్నుని జూ
చుటకై వచ్చితి వెస" ననుచున్ వచి యింపన్

570. చం. జయుడును లోనికేగి వెస శౌరికి మ్రొక్కి "పినాకపాణి దూ
త యొకడు వేచియుండె తమ దర్శనమున్ మదింగోరి కార్యమె
ద్దియును వచింప డాతనిని దేవర! లోనికి పంపవచ్చునా!
దయంగొని యాజ్ఞ యిం"దనిన దానవ వైరియు సంతసించుచున్

571. కం. రయమున ప్రవేశ పెట్టుము
భయమేల యటంచుంబల్క పరువునంజని యా
జయుడపుడు చిత్ర రూపుని
ప్రియమునంగొనివచ్చి నిల్పె వెన్నుని యెదుటన్

572. తే.గీ. ఫాల నేత్రుని దూత యప్పద్మనాభుం
గాంచి సాష్టాంగ పడి లేచి కరయుగమ్ము
మోడ్చి నిలుచున్నంగని సర్వమును నెఱింగి
ఏమి పనిమీద వచ్చితి విటకు ననిన

573. ఉ. సారస లోచనా! వినుము సర్వ జగమ్ములలోన కార్యముల్
నేరగ రాని వున్నవియె నీకు త్రికాలములందు, కానిచో
మారవిరోధి మాప్రభువు మన్నన మీ కెఱిగింపుమంచు నన్
జేరగంబిల్చి తెల్పినది చెప్పెద నొక్కటి యాలకింపుడీ

574. కం. కమలాక్షి లక్ష్మి యొక్కెడ
యమునయు తమసయును గలియు నమల తటమునం
దమర నుతా! బడబాకృతి
యమర తపమొనర్చుచున్న దతి దృఢదీక్షన్





575. కం. మనుజులు దనుజులు దివిజులు
ననవరతముం గొల్వ దేవ నమరెడి నలి నా
నన యిపుడొంటిగ తపమి
ట్లనయం బొనరించుటెంత యాశ్చర్యంబో!

576. ఉ. ఏ వన జాక్షి వీక్షణము లిద్ధర మానవ కోటికెల్ల సౌ
ఖ్యావహ చంద్రికా సముదయంబులొ ఆభువనైక మాత ని
ట్లీవిపు దేల దూర మొనరించితి వియ్యది నీకు సౌఖ్యమే
భావము నం దలంపుము శుభంబగునే సతిం బాయుటేరికిన్

577. తే.గీ. ఎంత బలహీనుడైనను, చెంత చిల్లి
గవ్వయైనను లేని బికారియైన
సతిని కాపాడు కొనుంగాని సత్యపథము
వీడి యెడబాసి యుండడు తోడు లేక

578. మ. అపరాధం బొకయింత సేయకయె అర్ధాంగిన్ రమాదేవి ని
ట్లపరాధమ్మును మోపి వీడుటది యేలా? తెల్పుమా యింతులన్
గృప లేకిట్టుల కష్టపెట్టు మగలన్ గ్లేశంబు లొందున్ జుమీ
రిపువర్గంబులు నవ్వుకొందురుగదా! రేయింబవళ్లచ్యుతా!

579. తే.గీ. కాన శీఘ్రంబ యేగి యక్కమలనేత్ర
స్వీకరింపుము నీకది శ్రేయమగును
భార్య నెడ బాయుటెంత దుర్భరమొ మున్ను
నేనెఱుంగుదు మాధవా నిక్కమిద్ది

580. కం. ముని దక్షాధ్వరమున నా
యనుగున్సతి నన్ను వీడి యసువులు వాయన్
మనమున నెవ్విధిఁగుందితొ
వినిపింప నసాధ్యమయ్యె! విబుధగణనుతా!

581. ఉ. కావున పిచ్చిభావనలు కట్టి హయాకృతింబూని వేగమే
యావన జేక్షణన్ గలసి హాయిగ నుండుడు, పుత్రుడొక్కరుం
డావల నుద్భవించు, తురగాకృతులిర్వురకున్ దొలంగు, స
ద్భావము లొప్పం జేరు డటుపైన వికుంఠము సంతసమ్మునన్

582. చం. అని మా శంకరు లన్న మాటలను మీకట్లే నివేదించితిన్
వనజాక్షా! యని చిత్రరూపుడట నిల్వన్ వెన్నుడున్ శ్రద్ధగా
విని యట్లే యని పల్కి యంత నతనిన్ వీడ్కోలు గావించి య
వ్వన జాతోదరు డందమైన హయరూపంబున్ ధరించెన్ వెసన్

583. వ. అట్లశ్వరూపంబు దాల్చి

584. ఉ. శ్రీపతి యేగి కాంచెనొక చెంత నదీతట మందు నశ్వినీ
రూపము తోడ నొప్పెడు సరోరుహనేత్రను ధ్యానమగ్నను
ద్దీపిత దివ్య తేజమున దిక్కుల వెల్గులు నింపుచున్ హరిన్
తేపును మాపు నెమ్మది స్మరించుచునున్న యనుంగు పత్నినిన్

585. చం. అలికిడి విన్న యంతనె నిజాంబక యుగ్మము విప్పి చూచి ముం
గల హయరూపధారిఁగని కంజ దళాక్షు డటంచు నెంచి క
న్నుల జలబిందువుల్ గదల నూరు పదేళ్ళ వియోగవేదనల్
దొలగ హరిన్ పరాత్పరుని తోయజనాభుఁగవుంగిలింపగన్

586. చం. హరియును గుండియల్ కదల నశ్రుకణంబులు జాలువార యా
సిరి ననురాగ వల్లరిని చెంగటఁ జేర్చుక మన్మథార్తి తో
పరవశు డౌచు నక్కమల భావమెఱింగి యనంగ కేళి వి
స్తర తర సౌఖ్య వార్నిధిని సంచరిలెన్ యమునా తటంబునన్

587. కం. వారల సంగమ ఫలమై
వారిజ ముఖి పుత్రునొకని ప్రసవించె నటన్,
వారువముల రూపంబులు
వారలు విడనాడి రంత పరితోషమునన్

588. శా. ఆనందమ్మున పద్మనాభు డపు దర్ధాంగిన్ విలోకించి స
మ్మానంబొప్పగఁ బల్కె చిర్నగవుతో మస్తంబు చే దువ్వుచున్
కానిమ్మింక వికుంఠ ధామమునకున్ గల్యాణి! యేగన్ వలెన్
మౌనం బేటికి నీవియోగ మికపైనన్ సైపఁ జాలన్ జుమీ

589. చం. అనవిని యిట్లు వల్కె జలజాక్షి జనార్దన! యెట్లు వత్తు నీ
తనయుని చిన్నివాని కనుదమ్ముల విప్పని మాంస పిండమున్





దినకర తేజు వీడి; యిట దిక్కెవరీ పసివాని కింకపై
మనమిటు లేగినన్; వినుము మాధవ నే సుతు వీడి రానెటన్

590. మ. అనినన్ శ్రీహరి మిన్నకుండె; నపుడత్యాశ్చర్యమున్ గొల్పుచున్
ఘన దివ్యాకృతులేర్పడెన్ దమకు; నాకాశంబు నందుండి చ
య్యన దివ్యంపు విమాన మొండచట కుద్యత్ సూర్య బింబాకృతిన్
చనుదెంచెన్ దివిజాళి సన్నుతులు విశ్వంబందు ఘోషింపగన్

591. తే.గీ. శ్రీహరియు దాని నెక్కంగ చెంతకేగె
సున్నితమ్ముగ లక్ష్మి యావెన్ను నపుడు
వలదు వలదంచు వారించి పల్కెనిట్లు
పుత్ర వాత్సల్య భావ సంపూర్ణయగుచు

592. శా. స్వామీ! వీనిని వీడి వచ్చుటకు నాస్వాంతంబు సిద్ధంబుగా
దేమో వింతగ నున్న;దీతడన నాకెంతో ప్రియంబయ్యె, యీ
మోమున్ జూడుము మీదు రూపమును సంపూర్ణంబుగా బొంది, నా
ప్రేమన్ జూఱగొనెన్ బ్రభూ! యితని నావెన్వెంట దెత్తున్ జుమీ

593. చం. అని బ్రతి మాలుచుండఁ గని యాహరి యిట్లనె ప్రాణనాయికా!
తనయుని వీడి వెళ్ళుటది తప్పదు; వీనికి రక్షణ క్రియల్
గొనకొని చేసియుంటి విను కుంభినిఁ దుర్వసుడన్ యయాతి నం
దనుడు గడున్ బ్రసిద్ధిఁగనె ధాత్రి పయిన్ హరివర్మపేరునన్

594. ఉ. ఆతడు పుత్ర సంతతికినై యిట చేరువ నొక్కతీర్థమం
దాతత నిష్ఠతో దశదశాబ్దములాది తపంబొనర్చుచున్
ఖ్యాతి వహించె, వాని కొఱకై సృజియించితి నీ సుపుత్రు, నే
నాతని చెంతకేగి యెటులైనను వీనిఁ గొనంగఁ జేసెదన్

595. ఆ.వె. "అతడు వీనిఁ బెంచు నత్యంత ముదమున
దిగులు పడగ నేల దేవి!" యనిన
ఆమె సంతసించి వ్యోమ యానంబెక్క
తరలి వెళ్ళిరి నిజ ధామమునకు

## హరివర్మకు ఏకవీరుడు దక్కుట

596. తే.గీ. అంత చంపాఖ్యుడనెడి విద్యాధరుండు
భార్య మదనాలసను గూడి బాలుడున్న
యెడకు నరుదెంచి కేరింత లిడుచు దివ్య
కాంతు లీనెడు నప్పసి కందుఁగాంచి

597. తే.గీ. పేద పెన్నిధిఁ గాంచిన విధము దోప
సంబరమ్మున చంపాఖ్యుడంబరమ్ము
నంటి బాలుని గుండెకు హత్తుకొనుచు
భార్యచేతుల కందించె పరమ ప్రీతి

598. మ. తనకే పుట్టిన బిడ్డయన్న విధమై తత్పత్నియున్ సంతసం
బెనయన్ ముద్దుల ముంచి యెత్తుచు మొగం బిట్టట్టులన్ ద్రిప్పుచున్
దన ప్రాణేశున కిచ్చుచున్ గొనుచు నానందంబుతో నిర్వురున్
జనిరా బాలుని తోడ స్వర్గమునకున్ స్వర్గాధిపున్ జూడగన్

599. కం. మానవుడా? దానవుడా?
మానుగ గంధర్వవంశ మండను డౌనా?
వీని విధము నెఱిగి మఘవు
నానతి నెదియైన చేయ నర్హంబనుచున్

600. చం. అని తలపోసి యింద్రునకు నాతనిఁ జూపి, యనుజ్ఞ యిచ్చినన్
నెనరున, పెంచుకొందు మితనిన్ సుతుభంగి యటంచుచఁబల్క. న
య్యనఘుడు తెల్పె లక్ష్మికిని నంబుజనాభున కుద్భవించె నీ
దినకర తేజు డీతనిని తెచ్చుట కూడ దదేల యన్నచో

601. కం. ఇతనిని యయాతి సుతునకు
నతి ధార్మిక వర్తనునకు హరివర్మకు న
చ్యుతు డీయఁదలచె నొకయ
ద్భుత కార్యము దీర్పనెంచి పొలుపొందంగన్

602. కం. హరిచే ప్రేరితుడై యా
హరి వర్మయు వచ్చునచట కతి శీఘ్రముగన్
సరగున నీవున్‌జని యా
చిరజీవిని విడిచిరమ్ము శ్రేయంబౌతన్





603. వ. ఈ బాలుం 'డేకవీర'యను నామంబున జగద్విఖ్యాతిన్
బడయునని మహేంద్రుడన నాగంధర్వుండాబాలుని
యథాస్థానంబునన్‌డించి గంధర్వ లోకంబున కరిగెనంత

604. చం. సకల సుఖమ్ములన్ విడిచి సత్సుతుఁబొంద తపమ్ముసేయు సత్
ప్రకట చరిత్రు డైన హరివర్మకు దర్శన మిచ్చి కేశవుం
డొక వరమిత్తు కోరుమన నుబ్బక మందుచు నాకు నొక్కనిన్
సకల గుణాఢ్యుడౌ సుతునొసంగు మటం చధిపుండు వేడినన్

605. కం. హరియును సంతసమందుచు
నరవర తమసానది యమునన్ గలిసెడు నా
పరమ పవిత్ర తటమ్మున
కరుగుము నీకగపడు నొక యర్భకు డచటన్

606. కం. నాకును లక్ష్మికిఁగలిగిన
యా కొమరుని స్వీకరింపు మాత్మ సుతునిగా
నీకున్ మేలగు నని యా
శ్రీకాంతు డదృశ్యుడయ్యె చిత్రముగాగన్

607. శా. ఆమాటల్ వినినంత భూధవు డమందానంద చిత్తుండునై
శ్రీమంతంబగు తత్ప్రదేశమునకున్ శీఘ్రంబుగానేగి యా
భూమిన్ గాంచెను బాలు నొక్కనిని నుత్ఫుల్లాబ్జ పత్రేక్షణున్
కామున్ బోలిన వాని రూపమున, సాక్షాద్విష్ణు సంకాశునిన్

608. మ. కని యా బాలుని పైకి నెత్తుకొని భూకాంతుండు ముద్దాడుచున్
తన హృత్ సీమన హత్తుకొంచు తనయా! ధన్యుండనైతిన్ నినున్
వనజాక్షుండు వికుంఠ ధాము డొసగెన్ భవ్యప్రసాదంబుగా
నిను నూరేండ్ల తపఃఫలం బనుచు నే నిక్కంబుగా నెంచెదన్

609. కం. నా కొఱకై నిను నిచ్చుట
తా కమలయు వదలి వెళ్ళె దయ యెంతటిదో!
లేకున్న నిట్టి కొమరుని
నే కోమలి విడిచి చనుట కిష్టపడు మదిన్

610. చం. అని కడు పారవశ్యమున నా పసి వానిని సున్నితమ్ముగా
తన కరయుగ్మమం దతి ముదమ్మునఁజేరిచి చేరె నింటికిన్
వినయముతో నమాత్యులును విప్రులు మిత్రులు స్వాగతోక్తులన్
ఘనముగఁబల్క నయ్యవని కాంతుడు పత్నికిఁజూపువేడుకన్

611. ఉ. ఆ పసి వాని నాతడు నిజాంగన కీయగ, మన్మథాకృతిన్
దీపిలు నీతడెవ్వ?డెటఁదెచ్చితి?వెవ్వరు కన్నవారలం
చేపగు సంశయమ్ముల మహీశునిఁ బృచ్ఛయొనర్ప నాతడున్
పాపని గూర్చి యంతయును భార్యకుఁదెల్పి యనంతరమ్మునన్

612. కం. తన రాజ్యము నెల్లెడలను
ఘనతరముగ నుత్సవమ్ముఁగావించి తగన్
తనయునకు నేకవీరుం
డని నామకరణ మొనర్చె నార్యులు మెచ్చన్

613. తేగీ. జాత కర్మాది సంస్కార సంగతులను
చక్క నొనరిచె హరివర్మ సంతసమున
దిన దినమ్మును నాతడు తేజమెసగ
వృద్ధి చెందుచునుండె సంతృప్తి గలుగ

614. తే.గీ. పదునొకండవ యేట నబ్బాలకునకు
నుపనయంబును గావించి యొజ్జల కడ
విద్యలన్నియు నేర్పించె విశదముగను
అన్ని విద్యల నతడును నారితేరె.

615. ఉ. అంతట మంచి మూరుతమునం దతి వైభవమొప్ప వానికిన్
దంతి ఘటాశ్వ గోతతుల తామరసాదుల భూసురాళి క
త్యంతముగా నొసంగి ప్రజలందరుమెచ్చ నమాత్యవర్యులున్
సంతసమంద పట్టమును సమ్మతి గట్టె ధరాధి నాథుగన్

616. తే.గీ. కొమరునకు పట్టమున్ గట్టి కువలయేశు
డాత్మసతిఁగూడి యడవుల కరిగి యచట
శ్రేష్ఠ తమమైన మైనాక శిఖరమందు
నాది శక్తిని గూర్చి యత్యంత నిష్ఠ





తపమొనర్చుచు దేహముల్ ధాత్రి విడచి
స్వర్గధామమ్ముఁజేర నవ్వార్త దెలిసి
ఏకవీరుండు సుంత దుఖించి యంత
నుత్తరక్రియ లెల్ల శాస్త్రోక్త విధిని
వారి కొనరించి సాగించె పాలనమ్ము

## ఏకావళీ వృత్తాంతము

617. శా. ఆలో నొక్కట నేక వీరుదు నిజాశ్వారూఢుడై చేరె ను
ల్లోలాంభఃకణ సేవితానిల తటిన్ రోలంబ సందోహ హ్రా
ల్లోలాధిక్య మరందపూర్ణ సుమ వల్లుల్గల్గు భూజావళిన్
కాలౌచిత్య పికాది మంజు రవళిన్ గంగానదీ ప్రాంతమున్

618. చం. పొదిగొని మంత్రులున్ మఱియు భూసుర వర్యులు వెంటరాగ స
మ్ముదితములై శ్రుతిధ్వనులఁబొల్చెడి యాశ్రమ హోమశాలలన్
సదమల వారి పూర్ణ వికస న్నవ పద్మ సరోవరంబులన్
వదలక గాంచుచున్ ధరణి పాలుడు వెళ్ళుచు నుండ నంతటన్

619. కం. పరిపూర్ణంబుగ విచ్చిన
సరసిజమొక్కటిని పత్ర శతసుందరమున్
పరిమళ మిళితంబుఁగనియె
సురనది చెంగటన నతడు చోద్యము గాగన్

620. చం. కని కడు ముగ్ధుడౌచు నటు కన్నుల నించుక త్రిప్పి చూడ తాఁ
గనె నొక కన్యకామణినిఁగంజ దళేక్షణఁ గంబు కంఠిఁ ద
ద్వనరుహ పార్శ్వసంస్థితను పల్లవగాత్రిని నీల దీర్ఘ కే
శినిఁదనుమధ్య నవ్విభుడు చెల్వపురాశిని దుఃఖసంయుతన్

621. చం. అదిగని ఏక వీరుడపు డవ్వనజాక్షినిఁజేరి సుందరీ!
ఎదికత మొంటి నుంటివిట నెవ్వరి దానవు దేవకన్యవా!
మది ననుమానమున్ విడిచి మా కెఱిగింపుము నిన్నుఁగన్న యా
సదమల శీలురెవ్వ?రిటు జాలిగ కూర్చొని యుంటి వేటికిన్

622. తే.గీ. పెండ్లి యైనచో నీభర్త విధముఁదెలుపు
మవసరంబైన నిన్ను నే నాదుకొందు

ధరణి నాథుడ నేను నో తరల నేత్ర!
నాదు రాజ్యాన భయమేమి లేదు నీకు

623. మ. అనినన్ మెల్లగ భూమి నాథుఁగని యయ్యబ్జాత పత్రాక్షి, యో
జననాథా! వినుమీ సమీపమున రాజ్యంబొక్కటుండున్. గడున్
ఘనుడౌ రౌమ్యుడు దానినేలు నతి చక్కన్,రుక్మరేఖాఖ్య స
ద్గుణమాన్యన్ గడు సుందరిన్ సతిగ సంతోషంబునన్ బెండ్లియై

624. మ. తన కెన్నాళ్ళకు సంతు గల్గమికి సంతాపమ్ముతో నాథునిన్
గని దుఃఖించుచు రుక్మరేఖ యనె నోనాథా! విచారింతు నే
ననయంబున్ మది సంతులేకునికి, వంధ్యాజీవనం బివ్విధిన్
గొని యేరీతిగ మేనఁబ్రాణములతో కూర్చుందు నిశ్చింతగన్

625. ఉ. సంతతికై ప్రయత్నములు సల్పుము: యజ్ఞము నెద్దియైన చే
యింతము మంత్రులన్ ద్విజుల నెల్లరఁబిల్చి; ఫలంబు గల్గునం
చెంతు ధరాధినాథ! యని యెంతయు వేదనతోడ వేడ భూ
కాంతుడు సమ్మతించి కులకాంతను నూఱటఁ బుచ్చి యంతటన్

626. ఉ. వేద విధిజ్ఞులన్ ద్విజులఁబిల్చి కడున్గడు శ్రద్ధతోడ నా
భూదయితుండు యజ్ఞము నపూర్వ విధిన్ జరిపించుచుండ భా
గ్యోదయ చిహ్నమన్నటుల నుద్భవమందె తదగ్ని కుండమం
దాదరణీయ యౌచు కమలాక్షి యొకర్తుక యక్కజంబుగన్

627. తే.గీ. పూర్ణ చంద్ర నిభానన స్వర్ణదేహ
నబ్జ పత్రాక్షిఁదన్వంగి నభ్ర నీల
కచ భర నరుణాధర నటఁగాంచి హోత
భూమి పతి తోడ నిట్లనె పొందుపడగ

628. మ. ధరణీ నాథ! ఫలించె నీయజనమున్, దన్వంగి జన్మించె, నీ
యరవిందాక్షిని నీకొసంగె నిపు దయ్యబ్జోదరుం డెంతయున్
గరుణన్, పుత్రుని వోలెపెంచుకొను మింకన్ దీని నంచొయ్యనన్
ధరణీదేవుడొసంగ భూపతియు మోదంబందుచున్ నెమ్మదిన్

629. ఉ. గైకొని భార్యవంకఁగని కంజదళాక్షిరొ! పుత్రు నీతనిన్
జేకొను మంచు తా నొసగ చేతమునన్ సుతుడంచు నెంచుచున్





గైకొనె పత్నియున్; యజన కార్యము పూర్తియొనర్చి యంతటన్
ప్రాకట మొప్ప విప్రులకు పంచెను కాన్కలు రౌమ్యు దున్నతిన్

630. కం. ఆమెకు 'నేకావళి'యను
నామం బిడి పెంచె భూమి నాథుం డెంతో
ప్రేమన్ పుత్రునివలె; నే
నామెకు సఖినైతి సమవయస్కుల మగుటన్

631. కం. నాపేరు యశోవతి; యా
భూ పాలుని మంత్రి సుతను, పొల్పొందంగన్
తేపును మాపును గడపెద
మే పొర పొచ్చెములు లేక యిర్వుర మొకటై

632. చం. నరసిజ సౌరభంబులన సారస నేత్రకుఁబ్రీతిమెండు, తా
నరయుచు వెళ్ళుచుండు నెటకైనను పద్మము లున్నచోటికిన్,
సురనదినైన దాటుటకు సుంతయు జంకదు పద్మగంధ సం
భరిత మనోజ్ఞ వాయువులు పైకొని తన్ను స్పృశించె నేనియున్

633. చం. అది యెపు డామెకున్ వ్యసన మౌట మనంబున భీతిగల్గ నే
నదరుచు నుందు నెప్పుడెదియౌనొ ప్రమాద మటంచు;కాన నే
నదలిచి చెప్పితిన్ వలదటంచు, ప్రయోజన శూన్యమయ్యె, నిం
కెదియును పాలుపోక తుద కేలిక కంతయు విన్నవించితిన్

634. చం. నృపతియు వెంటనే భటుల నెల్లరఁ బిల్చి సరోవరంబు నం
తిపురి సమీపమందొకటి తిన్ననఁద్రవ్వగఁ బంచి యాపయిన్
విపుల సుగంధ బంధుర విభిన్న సరోజములం గొలంకు నం
దెపుడు వికాసమొందునటు లేర్పరచెన్ గనువిందుఁగూర్పగన్

635. ఉ. ఐనను సుంత యేనియును నత్తరుణీ మణి మారదయ్యె, భూ
జానియు పాలుపోక భట సంఘములన్ నియమించె రక్షణన్
బూని చరింపుడంచు; నది మున్నుగ సైన్యము తోడురాగ న
మ్మానినిఁగూడి యేమును గ్రమంబున గంగకువత్తు మెప్పుడున్

636. ఉ. ఎప్పటియట్ల వేడుక మహీపతి పుత్రినిఁగూడి వచ్చి మే
మొప్పిదమైన యా కమల మున్న ప్రదేశముఁ జేరియుండ తా

నప్పుడ రాక్షసుండొక భయంకర రూపుడు కాలకేతుడన్
గొప్ప బలాఢ్యుడయ్యెడకు క్రూరుడు వచ్చె బలమ్ము వెంటరాన్

637. ఉ. వచ్చిన వాడు వచ్చినటు పంకజనేత్రను రాజపుత్రికన్
గ్రుచ్చి కరంబు పట్టుకొని కొంకక స్యందనమందు నిల్పి తా
హెచ్చిన రోసమూని భటు లెల్లరఁ జిందర వందరౌనటుల్
పెచ్చుగ నొంచుచున్ మిగుల వేగమ నేగుచునుండె కన్యతోన్

638. ఉ. చేవఁదొఱంగి సైన్యములు చెట్టుకు పుట్టకు నొక్కరౌట, ఏ
కావళి భీతయై మిగుల నార్చుచు నుండగ వెంటనంటి యా
త్రోవన నేనునున్ జనితి తొయ్యలి వీడు మటంచు బిట్టుగన్
రావమొనర్చు దాననయి, రాక్షసుడున్ ననుగాంచి మెల్లగన్

639. చం. అరదము డిగ్గి వచ్చి నను నాదర మొప్పగఁబల్కరించి యో
తరుణి! భవత్ సఖిన్ భయముఁ దక్కు మటంచు వచింపు మల్లదే
యరదము రమ్ము నాహృదయ మామెపయిన్ దృఢ మౌచుఁజిక్కె నే
తిరముగ నింక దాసుడ తదీయ పదమ్ముల కో తలోదరీ!

640. కం. అని యనునయించి నన్నును
తన యరదమునందు నిల్పి దద్దయు వేగన్
జని నిజ నగరమ్మున, న
ద్దనుజుడు మమ్ముంచె నొక్క ధవళ గృహమునన్

641. కం. మరు దివసంబున నుదయమె
యరుదెంచి రహస్యగతిని నభ్యర్థించెన్
తరుణీ! నీ సఖి నన్నున్
వరియించెడునట్లు చేయ వలయు నటంచున్

642. కం. అన నే తిరస్కరించుచు
తననే బ్రతిమాలు కొనుము తగదిది నాకున్
జనుమని యనగా నతడును
వినయమ్మున నామెకడకు వెళ్ళియిటు లనెన్

643. మ. రమణీ! నాహృదయమ్ము దోచితివి చిత్రంబయ్యె, కాముండు నన్
సుమబాణంబుల నొంచుచుండె నను దాసున్ బ్రోచి రక్షింపుమా!
నిముసంబైనను సైపఁజాలనిక తన్వీ! నన్ను పెండ్లాడినన్
అమరుల్ పొందగరాని సౌఖ్యముల నీ కాహ్లాదమున్ గూర్చెదన్





644. కం. యౌవనము చంచలంబిది
పోవున్ గడు వేగ నదిని పొంగు జలముల,
ట్లే విధమున రాదు తిరిగి
యావల చింతింప ఫలిత మబ్బునె చెపుమా!

645. మ. అని దీనమ్ముగ వేడు రాక్షసుని కోపావేశ సంభూతయై
గని యేకావళి సుంత నిగ్రహము లోఁగైకొంచు నిట్లాడె "నో
దనుజా! మాజనకుండు నన్ను మునుపే తానొక్క ధాత్రీశు పు
త్రున కీయన్ దల పెట్టె, నేనును గడున్ రూపాన్వితున్ వాని నే
ఘన శౌర్యోన్నతు హైహయాన్వయుని నిక్కంబాత్మలో గోరితిన్
జనకున్ గాదని వేరు మార్గమును నెంచన్ జూచుటిద్ధాత్రిపై
జనునే? ధర్మవిరుద్ధ మౌనుగద! యేచందాన నిన్ బొందెదన్"

646. మ. అనినన్ వాడును సమ్మతింపక క్షణం బాలస్యమున్ జేయ కా
వనజాక్షిన్ గొనిపోయి యొక్కటఁగడున్ భద్రమ్ముగా నుంచి చు
ట్టును సైన్యమ్ముల నుంచె రక్షణగ; నెట్లున్‌సేయ గాలేక తా
ననిశం బొంటిగ నేడ్చుచున్న దచటన్ వ్యాకీర్ణ చిత్తంబునన్

647. తే.గీ. ఎదురు చూచుచు నుంటి నయ్యింతి కొఱకు
అని యశోవతి పల్క తా నచ్చెరు వడి
ఏకవీరుడు మది ముదం బేర్పడంగ
పల్కె నామెను గాంచి యిప్పుగిది నంత

648. తే.గీ. వాని కడనుండి నీవెట్లు వచ్చితిటకు
హైహయాన్వయుడను నేనె అవని యందు
నాకు నీయంగ నెంచెనే రాకుమారి
నవని నాథుడు; తెల్పుమో యంబుజాక్షి
అదియు నిజమైన నిప్పుడయ్యసురుఁజంపి
కన్యకన్ దెత్తు చెప్పుము కలతెఱుంగు

649. చం. జరిగిన యీ యుదంత మది సర్వమెఱుంగునె మీ ప్రభుండు? తా
నెఱిగియు మిన్నకుండెనె? యొకింతయు కూతును తెచ్చుయత్నమున్
జరుపడె? ధైర్యహీనుడె? నిశాటు నెదుర్కొన లేక పోయెనా?
త్వరిత గతిన్ వచింపు మిదె తత్తరుణీమణి యున్న ప్రాంతమున్

650. చం. అనిపలుకన్ యశోవతియు నాతని హైహయుగా నెఱింగి తా
మనమున సంతసం బెనయ, క్ష్మాపతి నందన! క్రూరుడైన యా
దనుజుని బారినుం డెటుల తప్పి యిటన్ జనుదెంచి యుంటినో
వినిచెద విన్ము, నే మిగుల పిన్నవయస్సున నున్న యత్తఱిన్

651. మ. ఒకనా డొక్క ద్విజుండు సిద్ధ పురుషుం దుత్కృష్ట మంత్రమ్ము నా
కకలం కాత్ముడొసంగె లోకజననీ వ్యాప్తమ్ము, బీజాక్షరీ
ప్రకటంబున్; గడుభక్తి దానిని మదిన్ భావించి ధ్యానించితిన్
సకలారాధ్యను చండికన్ నిరతమున్ శౌర్యోగ్రరూపస్థితన్

652. కం. సృష్టిస్థితి లయ పోషణ
లిష్టంబున నిర్వహించు నీశ్వరి కృపచే
నష్టైశ్వర్యములు గలుగు
కష్టము లెట్టివియు నైనఁగడచనకున్నే

653. కం. ఆ మంత్రము నొకమాసం
బేమరక జపించి తేను హృదయములోనన్
శ్రీమాతను నిల్పి;యపుడు
కామేశ్వరి స్వప్న మందు గన్పడిఁ గృపతో!

654. ఉ. ఇంకను నిక్కడుంటి విదియేమి వడిన్ జను "మేకవీరు" డా
వంకకు జాహ్నవీతటికి వచ్చు, పరాక్రమశాలి వాడు, ని
శ్శంక వధించు రాక్షసుని, సంతత మాతడు నాదు మంత్రమున్
పొంకముగా జపించు పరిపూర్ణయుతంబగు భక్తియుక్తులన్

655. కం. దత్తాత్రేయుం డతనికి
నుత్తమ మగు నాదు మంత్ర ముపదేశించున్
చిత్తంబున నను విడువం
డుత్తము డాతండు నమ్ము ముత్పల నేత్రా!

656. తే.గీ. అతని కేకావళి నొసంగి యాదరమున
పెండ్లి జరిపింపు మని యతి ప్రీతిఁబలికి
తా నదృశ్యమై చనె నంబ, తక్షణంబ
యెఱుక పరచితి నిదియెల్ల యిష్టసఖికి





657. చం. అదివిని రాజపుత్రికయు నాత్మఁగడున్ గడు సంతసించి, స
మ్ముదమగు వార్తఁదెల్పితివి; మోక్షము నాకగునింక, సత్యమౌ
నదియె వచించుదేవి; యటు లౌట రయంబున నీవు జాహ్నవీ
నది కిపుడేగు మంచు నయనంబుల నశ్రులురాల పల్కినన్

658. ఉ. నేనును జాగుసేయ"కటులే"యని దేవిని మానసంబునన్
ధ్యాన మొనర్ప శీఘ్ర గమనంబు నొసంగెను తల్లి నాకు; నిం
తేనియు కష్టమున్ దెలియ కిచ్చటఁ జేరితి ఱెప్పపాటునన్
దీనత నిట్టులుంటినిట తెర్వులు చూచుచు నీదు రాకకై

659. చం. అనవిని రాకుమారు డబలా! విను లక్ష్మికి విష్ణుమూర్తికిన్
దనయుడ నేకవీరుడను నామముతోడుత నొప్పుదేను; నీ
యనుఁగు సఖిన్ గుఱించి విని నంతనె నే విరహార్తి మున్గితిన్
తనకడ కేగు మార్గమును, దానవు నున్కియు, వేగఁదెల్పుమా

660. ఉ. దానవు నుక్కడంచి యిదె తప్పక రాజకుమారిఁదెత్తు మీ
మానవ నాధుకిత్తు వెస మానిని! నీ సహకార మున్నచో
వేనలి దెచ్చుటెంత? నెరవేరును కార్యము, చూడుమిప్డె నా
దైన పరాక్రమం,బనుచు నాతడు వల్కగ నంత నామెయున్

661. ఉ. రాజకుమార! నీదగు పరాక్రమ మొక్కటి చాలదయ్యా! య
వ్యాజము సర్వసిద్ధిదమునైన జగజ్జనయిత్రి మంత్రమున్
రాజిత తేజమున్ గొనుము, రాక్షసునిన్ వధియింప తీవ్రమౌ
నాజి యొనర్పగా వలయు నాత డమేయ చమూ సమేతుడున్

## ఏకవీరుడు కాలకేతుని వధించుట

662. కం. అనుచు యశోవతి తెల్పగ
తనకున్ లభియించె నపుడె దత్తాత్రేయుం
డనఘుం డొసగగ దేవీ
యనుపమ మంత్రంబు హైహయాన్వయ మణికిన్

663. కం. దానన్ సర్వజ్ఞత్వము
నానా మార్గముల నేగు నైపుణ్యంబున్

భూనాధ సుతున కబ్బెన్
మానసమున లోకమాత మంత్రముఁదలపన్

664. ఉ. అంత యశోవతిన్ గొని సురారి పురంబును జేరె నప్డు భూ
కాంతుని పుత్రు, డాతనిని గాంచిన రాక్షస వీరు లెల్ల ర
త్యంత భయమ్ముఁ జెందుచు రయమ్మున పర్విడి లోనికేగి యా
చెంతన కాలకేతుఁగని చేరి వినమ్రతఁబల్కి రివ్విధిన్

665. మ. దనుజాధీశ్వర! చేటు వచ్చె మనకున్ దథ్యంబ, ఏకావళీ
వెనుకన్ మున్నరుదెంచినట్టి చెలి యీ వేళన్ చమూయుక్తుడౌ
దినరాట్ తేజుని వీరవర్యు నొకనిన్ దేవేంద్ర సంకాశునిన్
గొనివచ్చెన్; పరికింప ఘోరరణ మౌనో యేమొ సందేహమౌ

666. తే.గీ. సిద్ధ మగుమయ్య వేగమే యుద్ధమునకు
అట్లు కాదేని యీ తరళాక్షి నతని
కప్పగించుట శ్రేయమౌ ననుచుఁ బలుక
రాక్షసేంద్రుడు క్రోధ తామ్రాక్షు డౌచు

667. శా. సేనానాయకు లెల్లరన్ బిలిచి రాశీభూత రౌద్రాకృతిన్
"సేనల్తోడయి రా వెసన్ జనుడిదే చెండాడు డాశత్రు సై
న్యానీకంబును, వానిఁబట్టుకొనిరం డాలస్య మింతేనియున్
బూనం బోకు డటంచు నాజ్ఞ యొసగెన్ భ్రూయుగ్మ మల్లాడగన్

668. వ. అట్లాజ్ఞ నొసంగిన కాలకేతు దేకావళి చెంతకేగి ప్రణయ
రాగముట్టిపడ, నిట్లు పలికె.

669. ఉ. వచ్చిన యాత డెవ్వడు భవజ్జనకుండొ మరెవ్వరో గడున్
హెచ్చగు సైన్య సంఘముల నీగతి రాఁగతమేమి? తెల్పుమా
మచ్చిక, తండ్రియే యనిన మానిని! నే విరమింతు యుద్ధమున్,
పొచ్చెముగాదు వానికిదె పూజలొనర్చెద నాదరమ్మునన్

670. చం. పరుడెవడైన వాని విడువన్ నిశితాంబక సంహతిన్ వడిన్
కర చరణమ్ములన్ నరికి కాలుని ప్రోలికి సాగనంపెదన్
సరసిజ నేత్ర! తెల్పుము నిజమ్ముగ కాలము మూడి యాతడి
ట్లరమర లేక వచ్చె నత డారయ నెవ్వడొ బుద్ధి హీనుడౌ!





671. మ. అన నేకావళి యిట్లువల్కె దనుజా! యాతం డెవండో యెఱుం
గను;"నే నియ్యెడ నుంటి నంచు నెటులో కాపాడు డం"చేరికిన్
పనుపన్ లేదొక వర్తమాన, మయినన్ వాడెట్టి కార్యార్థియై
తన సైన్యమ్ములఁగూడి వచ్చెడినొ యా దైవం బెఱుంగున్ సుమా!

672. చం. అనవిని రక్కసుండనియె నబ్జదళేక్షణ! యట్టు లైనచో
నినువిడి నీ యనుంగు చెలి నేడెటు వోయెను, నీకునైన, న
వ్వనితకు నైనఁజెందక యెవండిటు వచ్చును నామెఁగూడి, న
న్నని నెదిరించగల్గు రిపులన్యులు లేరెట ముజ్జగంబులన్

673. కం. వీరల సంభాషణమ్ము
లీరీతిగ సాగుచుండ నిట్టటు లౌచున్
చారులు మఱి కొందరటకు
నారాటముపడుచు వచ్చి యసురునిఁగనుచున్

674. ఉ. ఇంకను నిచ్చటన్ గబురు లిచ్చమెయిన్ గడు నాడు చుంటి వీ
పంకజ నేత్ర తోడ నధిపా! కను మల్లదె శత్రుసేన న
ల్వంకలఁజుట్టు ముట్టె మన పట్టణమెల్ల, నటంచుఁబల్కఁ గన్
గొంకర లెఱ్ఱనై దనుజకుంజరు డప్డు మహోగ్ర రూపుడై

675. చం. అరదము నెక్కి చేరుకొనె నాగ్రహకీల లెసంగ రాక్షసుం
డరిభట సంఘముల్ సెదర నయ్యెడ, కంతట నేక వీరుడున్
తురగము నెక్కివచ్చె; రణదుందుభులున్ మొరసెన్, రణంబు భీ
కరముగ సాగె తీవ్ర శర ఘర్షణలన్ బెను చిచ్చువుట్టగన్

676. చం. సమ బలులైన వారలటు శస్త్రము లస్త్రము లొక్కరీతి న
శ్రమమున వేసికొంచు సమరంబొనరించుచు నుండ నంతలో
సమయము చూచి యొక్కగద చక్కగ చేకొని ఏకవీరు డ
య్యమర విరోధి శీర్షము సహస్ర కణంబులుగాగ వైచినన్

677. ఆ.వె. వజ్ర ఘాతమునకు పర్వతంబట్టుల
కాలకేతు డపుడు నేలఁగూలె
రాక్షసేంద్రుసేన రయమున నల్దెసల్
పరువులెత్తె ప్రాణ భయముతోడ

678. చం. పరువున నాయశోవతియు ప్రాణ సఖిన్ దరిఁజేరిప్రేమతో
పరిపరి కౌగిలించు కొని భండనమందున కాలకేతు డె
ట్లొరిగెనొ అంతయున్ దెలిపి యోకుటిలాలక! రమ్ము నీకునై
స్మర నిభు డేక వీరుడదె శక్ర పరాక్రము దుండె చూచుచున్

## ఏకావళీ ఏక వీరుల పరిణయము

679. కం. అని తన చెలి చెప్పగ న
వ్వన జాక్షియు సిగ్గు మఱియు భయమును హెచ్చన్
తన చెలి వెనుకనె జనె మె
ల్లన విడిది గుడారమునకు వడకు నడకలన్

680. చం. అనుపమ సుందరాంగి యగు నామెను దవ్వులఁజూచి నంతనే
మనమున సంతసం బెనయ క్ష్మాపతి పుత్రుడు లేచివచ్చి యో
వనజముఖీ! నినున్ గన దివంబులు రాత్రము లక్షియుగ్మమున్
పనిగొని చూచుచున్నయవి పక్ష్మము లార్పక దప్పిగొన్నటుల్

681. చం. అనికడు పారవశ్యమున నామె సమీపముఁజేరి కౌగిలిన్
గొన తలపోయు వానిఁగని కొంకక యించుక నడ్డగించి మ
న్నన చెలి పల్కె నోయనఘ! నైతిక మార్గ మెఱుంగు మయ్య! యీ
పెను తన తండ్రి చెంత కతివేగమె చేర్చుటయుక్త మిత్తఱిన్

682. ఉ. ఈమెను నీ కొసంగ మది నెంచుచు నుండెను భూతలేశుడున్
మీ మనముల్ పరస్పర సమీహితముల్ గద! వేచియుండుడీ
సేమముగల్గు; శాస్త్ర విధిఁ జేయు వివాహము మీకు భూవిభుం
డేమియు సంశయింప వల దీయమఁగైకొని పోదమిత్తఱిన్

683. చం. అని చెలికత్తె చెప్పగ ధరాధిపసూనుడు మౌనయుక్తుడై
చనియెను వారిఁగూడి తన సైన్యముతో వెస రౌమ్యు పట్టణం
బునకు, ధరాధిపుం డపుడు మున్నుగ చారుల వల్ల వీరి రా
కనువిని స్వాగతమ్ము పలుకన్ సతితో నెదురేగె వేడుకన్

684. మ. తనపుత్రిన్ గడు దుఃఖమగ్నఁగని నంతన్ తల్లి వేగమ్ముగా
జని గాఢమ్ముగ కౌగిలించు కొని యాశ్చర్యమ్ము దుఃఖమ్మునున్





బెనగొన్నట్టుల చూచుచుండఁగని తద్వృత్తాంత మెల్లన్ గడున్
వినయం బొప్పగ నయ్యశోవతియు చెప్పెన్ మోద మానమ్ముగన్

685. శా. ఆమాటల్ విని రౌమ్యుడున్ మనము నందానందమున్జెంది యా
భూమీ శాత్మజు నేకవీరు నతి సంపూజ్యంబుగా లోనికిన్
శ్రీమంతున్ గొనిపోయి తృప్తి కలుగన్ జేయించె మర్యాదలన్
ప్రేమన్ బిమ్మట నాతిథేయములు కల్పించెన్ భటశ్రేణికిన్

686. తే.గీ. అంత నొక మంచి మూరుతం బరసి కూతు
నేకవీరున కిచ్చి మహీశు డెలమి
పెండ్లి జరిపించి బహుమతుల్ వివిధ గతుల
నొసగి సాగనంపెను వైభవోన్నతమున

687. మ. తనపత్నిన్గొని ఏకవీరుడు మహోత్సాహంబుతో పట్టణం
బునకున్ జేరి సుఖోప భోగముల సంపూర్ణమ్ముగా తేలుచున్
దినముల్ పుచ్చుచు నుండ వారలకు జన్మించెన్ గులోద్దీపకుం
డనఘాత్ముండు సుపుత్రకుండు కృతవీర్యాఖ్యున్ బ్రసిద్ధంబుగన్

688. తే.గీ. అంతఁగృత వీర్యునకు పుత్రు డమిత తేజు
డుద్భవించెను కార్త వీర్యుం డనంగ
అతని పేరున కార్తవీర్యాన్వయమ్ము
వృద్ధి చెందెను పిదప ప్రసిద్ధి వడసి.

689. ఉ. హైహయ వంశ వృత్తమును వ్యాసుడిటుల్ వివరించుచుండ సం
దేహ మొకండు గల్గ కురు దీపకుడౌ జనమే జయుండు ని
ర్మోహ చరిత్రు వ్యాసుఁగని మ్రొక్కుచు నిట్లనె నోమహాత్మ! ము
న్నా హరి దేవదేవు డటు లశ్వశరీరముఁగొంట చిత్రమౌ

690. కం. పురుషోత్తముడగు నాతడు
పరతంత్రుం డౌనొ లేక స్వాతంత్ర్యమునన్
చరియించుచు నుండునొ నా
కెఱిగింపుము మౌనివర్య! యేర్పడఁ గరుణన్

691. కం. అనవిని వ్యాసుండిట్లనె
జననాథా! నాకునిట్టి సందేహంబే

మును కలుగగ సుర ముని వ
ర్యుని నారదు నడిగి తిట్టు లుత్తమ చరితున్

692. కం. సరసిజ భవ భవ! యీ సం
సరణిన్ సుఖమేది జీవ సంతతి కెల్లన్
పరిపరి విధముల నిరతము
తెరు వెరుగక దుఃఖ వార్ధిఁదిరుగుడు తప్పన్

693. సీ. తక్కు వారలఁగూర్చి తర్కింప నేటికి
అరయంగ నే నుదాహరణ మయ్య!
ద్వీపమ్ము పుట్టిల్లు విడిచిరి తలిదండ్రు
లడవులన్ బెరిగితి నండ లేక
పర్వతాగ్రమున తపం బొనరించితి
పుత్రార్థినై యభవుని గుఱించి,
సుతుడు జన్మింపగ శుకుడను పేరిట
వేద శాస్త్రముల నేర్పించి నాను

గీ. తుదకు నను వీడి సుతుడేగ దుఃఖభరము
తోడ తపియించితిని వాని జాడఁగనక
ఊఱడించితి వీవె నన్నొక్క దినము
అన్ని తెలిసియు నే వెఱ్ఱి నైతి నపుడు

694. ఉ. అంతట మేరువున్ విడిచి అమ్మను చూడగ వేగవచ్చి యా
చెంతన నామెఁగాన కట చింతిలుచుండగ; తల్లినొక్క భూ
కాంతుడు పెండ్లియాడెనని గౌరవమొప్ప నెఱుంగఁజెప్పిరా
ప్రాంతమునందు వార, లటుపై నిటవచ్చి సరస్వతీతటిన్

695. ఉ. వాసము చేయుచుంటి; తన భర్త గతింపగ తల్లి తాను గం
గాసుతు రక్షణన్ దనదు కన్నకుమారుల నిర్వురన్ బ్రియం
బేసర పెంచుచుండె ధరణీశునిగా తనయాగ్ర పుత్రునిన్
జేసి యటంచు వింటి నటచేరిన పాంథుల భాషణంబులన్

696. తే.గీ. అగ్ర సుతుడు చిత్రాంగదు డవనిఁగొద్ది
కాల మేలిన యంత స్వర్గస్థుడయ్యె
ననెడి వార్త నెఱింగి నే నచటి కేగి
తల్లి నోదార్చి వచ్చితిఁ దగినరీతి

697. కం. అంతట ద్వితీయ పుత్రుని
కంతు నిభు విచిత్రవీర్యుఁగడు పసివానిన్
శాంతనవుడు వేడ్కన్ భూ
కాంతునిగాఁజేసె మిగుల ఖ్యాతి దలిర్పన్

698. కం. కాశీపతి సుత లిర్వుర
ప్రాశస్త్యము మీఱఁదెచ్చి పరమప్రీతిన్
ధీశాలి పెండ్లి యొనరిచెఁ
దా శాంతనవుండు కూర్మి తమ్మున కెలమిన్

699. శా. ఆ సంతోషము కొద్దికాలమె, సుతుండత్యంత కామక్రియా
వ్యాసంగంబున రోగపీడితుడునై ప్రాణంబులన్ గోల్పడన్
తా సైరింపగ లేక నా జనని సంతాపించుచున్ బాష్ప ధా
రాసంకీర్ణ నిమీలి తాక్షియయి పుత్రా! యంచు నన్ జీరినన్

700. ఉ. నేనును సత్వరంబ జననిన్ గను కోరిక నేగి మ్రొక్క న
మ్మానిని నన్నుఁజూచుచు కుమార! మదాత్మజులిట్లు పుత్రసం
తానము లేకయే చనిరి నాక పురంబున; కింక వంశమున్
దీనత నంతరించునను తీరని శోకము నన్ గలంచెడిన్

701. తే.గీ. అనుచు దుఃఖించు తల్లిని అనునయించి
భీష్ముడిట్లనె నను౦ జూచి వినయ మెసగ
నీ వలన వంశ మభివృద్ధి గావలయును
తల్లి కోర్కెయు నిదియె యో తాప సేంద్ర!

702. కం. తమ్ముని భార్యలతో నీ
విమ్ముగ పుత్రులను బడసి యీ కౌరవ వం
శమ్మును నిలబెట్టుము ధ
ర్మమ్మిది, యే సందియమ్ము మదిఁదలపకుమీ!

703. మ. అనినన్ నాకిది ధర్మ హానియని నింద్యంబంచుఁదోచన్ మదిన్
జననీ! పాపపు కార్యమిద్ది దగునే సల్పంగ, ధర్మంబు లె

ల్లను మున్ జెప్పితి, వేదశాస్త్రములంc దెల్లం బౌనటుల్ జేసితిన్
నను నీ కార్యము చేయుమంట తమ కన్యాయంబుగా తోచదే?

704. కం. తమ్ముని భార్యల నెవ్విధి
సమ్మతమున పొంద గలను సంబంధమునం
దిమ్ముగ చెల్లెంద్రని శా
స్త్రమ్ములు దగ నిర్ణయించె తమ్ముని సతులన్

705. చం. తనయులంc బొంది వంశమును ధర్మ పథంబున నిల్పబూనుటే
మనుజులకెల్ల యుక్త, మదిమాని యధర్మపు వృత్తితోడ తా
తనయులబొంద పాతకము తప్పదెటుల్; పితృదేవులైన త
త్తనయులొసంగు తర్పణ విధానములన్ దరియింప రెందునున్

706. కం. అని యిట్లెన్నో రీతుల
జననికి నే చెప్పిచూడ సమ్మతింగొన క
వ్వనజాక్షి మిక్కుటంబుగ
వనరుచు నిట్లనియె కనుల బాష్పము లురలన్

707. మ. ఇది నాయాజ్ఞ సుమా! సుపుత్ర! వినుమిందే దోషమున్ లేదు నీ
కదియున్ దుష్టమెయైన వృద్ధజన వాక్యంబౌట ధర్మంబెయౌ
నిది యాచారము సంశయింప వలదోయీ! వంశమున్ నిల్పి నా
మదికిన్ శోక ముcదీర్పు మయ్య! యనుచుం బ్రార్థించె దైన్యస్థితిన్

708. ఉ. అంతట భీష్ముడున్ జనని యాజ్ఞకు మెచ్చుచు వంతపల్క నే
చింతిలి యింక తప్పదని చేతమునం దలపోసి ముందుగా
నింతిని అంబికన్ గలియ నేగగ నామెయు నాదు రూపమున్
స్వాంతమునందు మెచ్చ కట సంగమ వేళల మూసె కన్నులన్

709. తే.గీ. అంధుడుదయించు నీమెకం చమ్మతోడc
బలుక నామెయుcగడు శోక వార్ధి మునిగి
పుట్టి ఫలమేమి తెల్పుము పుట్టుగ్రుడ్డి
అర్హుడే రాజ్యమేలంగ నాతడెందు?

710. కం. అని నను నంబాలిక కడ
కనునయమునcబంప నామె యా సమయమునన్
నను<gaanchi వెడగు పాటున
తనువెల్లను వెల్లనౌట, తడబడి వడకెన్

711. ఉ. ఈమెకు పాండురోగి జనియించు నటంచు నెఱుంగcదెల్పి నే
నా మరు నాడు తల్లికడ నానతిcబొంది నిజేచ్ఛ నేగితిన్
కామిను లిర్వు రాపయిన గర్భములన్ ధరియించి రంతటన్
నే మును చెప్పినట్లుగ జనించిరి పుత్రులు వారి కొయ్యనన్

712. ఉ. ఒక్కడు గ్రుడ్డివాడు, మఱి యొక్కడు పాండుడు, లేదు వీరికిన్
హక్కు ధరిత్రి నేల నకటా! విధియిట్టుల చేసె నంచు, తా
నెక్కుడు దుఃఖ మగ్నయయి యేమియుతోచక సంస్మరించె న
న్నొక్క దినమ్ము తల్లి మఱి యొక్కని పౌత్రుని పొందcగోరుచున్

713. ఉ. నేనును నామె కోరినటు లేగితి; నాకు మరొక్క పౌత్రునిన్
కానుక గా నొసంగుమని గద్దము నంటుచు వేడె తల్లి, త
న్మానసమున్ గ్రహించి యనుమాన మికేలని యొప్పుకొంటి, నా
పై నను నంబికన్ గలియcబంపె సుపౌత్ర ఫలాభి లాషయై

714. తే.గీ. అంబికయు నన్ను మెచ్చక యామె దాది
నంపె సౌందర్య వతిని పుష్పాది భూష
ణమ్ముల నమర్చి నాచెంత; కమ్ముదితయు
వినయ మేర్పడ నన్ను సేవించెcబ్రీతి

715. ఉ. నేనపు డామె సేవలకు నెమ్మది మెచ్చి ప్రసన్నభావ సం
ధానుడనై వరమ్మిడితి,“తామర సాక్షి! సుపుత్రు దుత్తమ
జ్ఞానియు సర్వలక్షణ విశారదు దార్యుడు గల్గు నీకు స
మ్మానితుడౌ నతండు బుధ మాన్యుల చే ధరణీ తలంబునన్”

716. కం. ఆమెకుcగలిగెను విదురుడు
ధీమంతుడు, సత్యవాది దినకర తేజుం
డోముని వర! క్షేత్రజు లౌ
నాముఫ్వురcగనుచు మరచి తాత్మజు శుకునిన్

717. ఉ. లేదొక రూపమున్ మఱియు లేదొక యూతయు మాయకెందు మౌ
నీ! దృఢమై నిరంతర మహీన గతిన్ బడజేయు మోహ మం

దా దివి జేంద్రునైనను, మహాత్ముల, యోగుల నైన; విశ్వమం
దౌదల లొగ్గి తీర వలెనయ్య! బలంబగు మాయ కెల్లరున్

718. చం. అడవులఁజేరి యాశ్రమమునందు వసించుచు నుంటిగాని నా
యెదదకు శాంతిలేదు, సుతులెవ్విధి నుండిరొ చూచు కోర్కెతో
నడవికి వచ్చుచున్ మఱియు హస్తిన కేగుచునుంటి; నెవ్వ రీ
కొడుకులు? నే నెవండ? నను కొంచెపు యోచనఁదక్కి నిత్యమున్

719. ఉ. వీరలు నాకు శ్రాద్ధములు పెట్టుట కర్హులె? పెట్టిరేని చే
కూరునె నాకు సద్గతులు; గొంకక నేనిటు వీరికై మదిన్
ఆరటఁ జెంద నేటికి మహర్షి వరేణ్య! యెఱింగి యిట్టులీ
తోరపు మోహ వార్నిధిని దోగితి నప్పుడు మూర్ఖునిన్ బలెన్

720. సీ. భార్య లిర్వురఁగూడి పాండు డడవి కేగె
నను వార్త తెలిసిన యప్పుడేని
సతినిఁబొంది యతడు శాప కారణమున
నమర పురికిఁజన్న యప్పుడైన
పాండవుల్ కుంతితో భస్మమై రట లక్క
యింట ననెడి వార్త యెఱిగి నపుడు
పందెమ్ము నందోడి భార్యా సమేతులై
పాండవు లడవులం దుండు నాడు

గీ. నెంత దుఃఖమ్ము నొందితో యెవరి కెఱుక,
అట్లె యొక్కొక్క సమయమం దమిత సుఖముఁ
బొంది తవ్వారు శుభముల నందినపుడు
నేల జంజాట మిదినాకు నెఱుగఁ జెప్పు
మయ్య మునివర్య! యన నాతడనియె నిట్లు

## నారదుని పూర్వజన్మ వృత్తాంతము

721. చం. సకల పురాణ వేత్తవును సంయమి వర్యుడవైన నీ విటుల్
వికలత బొంది నన్నిటుల వేడుట చిత్రము వ్యాసమౌని! యీ
సకల జగంబులం దరయ సంసరణంబను మోహవార్ధి ము
న్గక చరియించు వాడొకడు గల్గెనె మున్ను వచింపు మింతకున్





722. చం. సనకసనందనాది ముని సత్తము లేని,ఁద్రి మూర్తులేనియున్
మునుగుచు నుందు రీగతిని మోహ సముద్రము నందు నిత్యమున్
మునివర! యింత యేటికి విముక్తుడ వంచును జ్ఞానివంచు న
న్ననిశముఁ బ్రస్తుతింతురు బుధాళి నిజంబె? తలంచి చూడగన్

723. చం. వినుమిదె తెల్పెదన్ నిగమవిత్తమ! ముందటి నాదు జన్మమం
దనయము నేను భార్య కొఱకై విలపించిన తీరు; పర్వతుం
డనునొక మిత్రుడుండె నపు డాతనిఁగూడి యొకప్డు భారతా
వనిఁగన నెంచి వచ్చితి దివంబును వీడ్కొని భూమిమీదకున్

724. ఉ. వచ్చెడి వేళ నిర్వురము బాసయొనర్చితి మెట్టులన్న, మే
మచ్చట నున్న కాలమున నాత్మ చలించిననైన, నెద్దియేన్
ఇచ్చ జనించినన్ శుభమ యేనియు, వాకొనరానిదేని, యే
పొచ్చెము లేక తెల్పవలె భోజన దార ధనాది కంబులన్

725. చం. అని సమయంబుఁజేసికొని యాక్షణ మాత్రన మారు రూపముల్
దనువులఁదాల్చి వచ్చితిమి ధాత్రికి; నిచ్చట సంచరించుచున్
జనితిమి "సంజయుం"దనఁబ్రశస్తిని గన్న ధరేంద్రు పట్టణం
బున;కట నాతడున్ గడు ప్రమోదమునన్ మము స్వాగతింపగన్

726. కం. చేతము లలరగ మేమున్
చాతుర్మాస్యంబు నచట సల్పఁగడగి యా
భూతల నాధునికిఁదెలుప
నాతండును సమ్మతించె నానందమునన్

727. చం. అతనికి సుందరాంగి "దమయంతి" యనంబడు కూతురుండె న
య్యతివ నతండు మోదమున నబ్జదళాక్షిని మాకు సేవలన్
చతురతఁ జేయఁబంపెఁ;గడు శ్రద్ధగ నామెయు భోజనాది స
త్కృతుల నిరంతరమ్ముఁగడు తృప్తుల చేయుచునుండె మమ్ములన్

728. చం. ఇరువుర మిట్టు లొక్కక్షణ మేనియు తీరిక లేక వేదముల్
స్థిరముగ నభ్యసించుచు వసించుచు నుంటిమి; నేను వీణపై
నరుదుగ సామగానముల నభ్యసనం బొనరించుచుండ న
న్నరపతి కూతు రెంతయు మనంబున సంతస మందుచుండెడున్

729. తే.గీ. అంత కొంత కాలమ్మున కామెలోన
రాగ ముదయించె నాయందు; రానురాను
నాకునున్ బ్రేమ జనియించె నాతిపైన
ఆదరం బెక్కువయ్యె నే ననిన తనకు

730. సీ. స్నానమాడగ నుష్ణ జలములు నాకిచ్చు
సంగడీడున కిచ్చు చల్లనీరు
ప్రేమతో నాకిచ్చు పెరుగు భోజనమందు
హితునకు మజ్జిగ నిచ్చుచుండు
ప్రతి దినమ్మును నాదు పాన్పు శుభ్ర పరచు
అతనికి నపుడప్పు డట్లు చేయు
నావంకఁ జూచును నవ్వుచు ప్రియ మార
పట్టి పట్టక వాని వంక చూచు

తేగీ. ఇన్నియును పర్వతుడు గమనించుచుండె
ఏమిటిది యని మది విచారించి యంత
ఏకతమ నన్నుఁజేరి తానిట్టు లడిగె
మనసులోపల తన కనుమాన మొదవ.

731. ఉ. ఏమిది నారదా! సరసి జేక్షణ వర్తన మెల్లఁ జూడ నా
కేమియొ సందియం బొదవు;నీవిడ నిన్ మదిఁ గోరుచున్నటుల్
నామది కయ్యె; నీవును మనంబున నిత్యము నీమెపై కడున్
ప్రేమము గల్గి యుంటివని పించును, నియ్యది నిక్కమేకదా!

732. కం. దాచక తెల్పుము మునివర!
నీ చేష్టలు చూడ నదియె నిజమని పించున్
నీ చేతమ్మున నొక పరి
యోచింపుము మన ప్రతిజ్ఞ నుక్కివ మేలా?

733. చం. అని నిలదీసి తా నడుగ నగ్గలమై నను సిగ్గుముంచ, మో
మును కడుడించి వాని మొగమున్ గనఁబోవక పల్కి తిట్టు, లో
యనఘ! వరించె నన్ బతిగ నత్తరుణీమణి, యామె భావమున్
మనమున నెంచి నేనును క్రమంబున నింపితి బ్రేమ నామెపై





734. మ. అనినన్ బర్వతు డాగ్రహించి యధరం బల్లార్చుచున్ నిప్పులన్
గనులన్ గ్రక్కుచుఁబల్కె "నాడటు ప్రతిజ్ఞన్ జేసి యీరీతిగన్
నను వంచించుట నీకు ధర్మమగునే? నన్నివ్విధిన్ మోసగిం
చిన నీ విద్ధర వానరాననుడవై జీవింపుమా యింకపై".

735. చం. అని శపియింప నే మిగుల నాగ్రహమూని సహింపలేక నీ
వును ధరపై వసింపుమిక పొమ్ము, నివాసము లేదు నీకు న
య్యనిమిష లోకమందనుచు నాతనికిన్ బ్రతి శాప మీయగా
మనమున కుందుచున్ వెడలె మౌనముగా నత, దంత నాకునున్

736. తే.గీ. వాన రాకృతి కల్గె నా యాననమున
కళవళం పడె దయయంతి కాంచినన్ను
ఏమి చెప్పుదు నాదుఃఖ మెవరి కెఱుక
భయమునన్ బుచ్చు చుంటిని పగలు ఱేయి

737. ఉ. ఇంచుక చింతఁ బొందియు మహీపతి కూతురు ప్రేమతోడ నా
కంచిత రీతి సేవల నన్య మనంబున చేయుచుండె సా
గించితి వాస మచ్చటనె ఖిన్న మనస్కుడనై నిరంతరం
బించుక భీతితో మరల నేమగునోయని సంశయించుచున్

738. ఉ. అంతట సంజయుండు తన యాత్మజకున్ గడు యోగ్యుడైన ధీ
మంతుని శూరునిన్ వరుని మాన్యుని చూడుడటంచు మంత్రులన్
చెంతకుఁజేర్చి యాజ్ఞనిడ చిత్తమటంచును పల్కిరిట్లు "భూ
కాంతుల పుత్రు లీధరణి గల్గుదు రుత్తము లెందరోప్రభూ"!

739. ఉ. ఐనను మీ తనూజ మది నన్యుని మున్వరియించి యుండెనేన్
మానవనాథ! వ్యర్థమగు మా యతనంబులు, కానమీర ల
మ్మానిని నిప్పుడే పిలిచి మన్నన తత్ హృదయం బెఱుంగు టె
ట్లైనను మేలెయౌ పిదప నావలి కార్యము చూతమెట్టులేన్

740. మ. అనినన్ రాజును సమ్మతించె;జనకుండత్యంత మోదమ్మునన్
దనకున్ బెండ్లి ప్రయత్నముల్ సలుపు చున్నాడన్న వార్తన్ గ్రహిం
చిన యారాజ కుమారి తా మనమునన్ జింతించి యేకాంత మం
దున దాదిన్ గని చెప్పె తా సురమునీంద్రున్ గోరుచున్నట్లుగన్

741. చం. అదియును వేగమే జని ధరాధిపుఁగాంచి మహానుభావ! తా
హృదయమునందు నారద మునీంద్రునిఁ గోరెదు మీ తనూజ య
మ్ముదిత మరొక్కరిన్ బతిగఁబొందుట కొప్పదు;వాని గాన సం
పదలకు మోహమున్ గొనెను పంకజ నేత్ర నిజమ్ము భూవరా!

742. ఉ. నావుడు భూతలేశుడు మనంబున నించుక చింతఁజెందుచున్
దేవిని కైకఁగాంచి యనె "నీవును వింటివి గాదె చూడుమా
తా వరియించె నంట సుత తాపసి నారదు నక్కురూపినిన్
ద్రోవనఁబోవు భిక్షువుకు తొయ్యలి నిచ్చుట కేను వెఱ్ఱినే"

743. తే.గీ. ఇది యసంభవము గనుక నెట్టులైన
నీవు దమయంతికిన్ జెప్పి నీరజాక్షి!
దాని బుద్ధిని మరలించు తక్షణంబ
యనుచు నాజ్ఞాపన మొనర్చి యధిపుడరిగె

744. తే.గీ. అంత కైకేయి దమయంతి నాక్షణంబ
పిలిచి తన మందిరమునకు పలికెనిట్లు
తల్లి! నీలోని భావమ్ము దాది యిపుడె
తెలుప వింటిమి;యీబుద్ధి కలిగెనెట్లు?

745. సీ. అంద గాడని యెంచి అతనినిఁ గోరితో
వానరాస్యుడతడు వనజ నేత్ర!
ధన వంతుడని యెంచి మనసు పడితి వేమొ
నిర్ధనుండాతడో నీలవేణి
ధరణీశుడని మదిఁ దలచి ప్రేమించితో
మునివృత్తి యతని దో పువ్వుబోణి
తనువు సౌంగంధ్యమౌ నని యెంచి వలచితో
భస్మమే మైపూత పద్మగంధి

గీ. మాలతీ లత యొక తుమ్మ మాని నంటి
అల్లు కొనినట్లు గాదె నీ వతని తోడ
కలసి యుండుట; యెంత వికార మమ్మ!
తగదు నీకిట్టి యోచన తలగుమింక





746. చం. అనవిని యిట్లు వల్కె దమయంతి వినమ్రత దోప తల్లి! నీ
వనినటు రూపమున్ ధనము యౌవన ముండియు మూర్ఖుడైన, న
మ్మనుజుని తో సుఖంబెటుల మానిని పొందును, గాన మాధురీ
జనిత సుధాబ్ధిమునుగ్గెడు రసజ్ఞుడతండగు;గాన విద్యలో
నెనయగు వాడు లేడు పరికింపగ వానికి ముజ్జగంబులన్

747. తే.గీ. అట్టి విద్వాంసుఁగాదని యన్యు నొకని
మూర్ఖుఁబెండ్లాడి సుఖమేమి పొందగలను
ధనము రూపము గల్గియు గొనములేని
రాజపుత్రుని మైత్రి దుర్భరము గాదె

748. కం. గర్విత మతులౌ రాజుల
నుర్వరఁ బెండ్లాడి యిడుము లొందుట కన్నన్
సర్వ విధమ్ముల వీనిన్
సర్వస్వర విజ్ఞుఁగొనుట సౌఖ్యము గాదే!

749. కం. సంగీతస్వర మాధురి
కంగీకారమ్ము తెలుపనట్టి యతడు దీ
ప్తాంగుండైనను పశువౌ
నంగజ సముడైన నింద్రుడైనను జగతిన్

750. మ. మురళీగానము నాలకించి కడు సమ్మోదించు గోసంఘముల్
హరిణంబుల్ ఫణి కేకి పంక్తులును మేలౌగాదె! సంగీత మా
ధురి "కోహో"యని యుత్తమాంగముల నెందున్ ద్రిప్పలేనట్టి యీ
నర లోకంబున కంటె నోజనని! పంతంబేల నన్వీడుమా!

751. చం. అని తన నిశ్చయమ్ము దమయంతి వచింపగ మారుమాట పే
ర్కొన మదిరాక భర్తకడకున్ జని కైక యథాతథమ్ముగా
తన సుత భావమున్ దెలుప తానును సమ్మతిఁదెల్పి వైభవం
బున జరిపెన్ వివాహ మొక మూరుత మందున నాకు నామెకున్

752. కం. మునివర! వానర ముఖు ననుఁ
గని దమయంతి యెపుడున్ వగవలే దైనన్
నను సేవింపగ వచ్చిన
తన నున్ గనినప్పుడేను తపనన్ బడితిన్

753. తే.గీ. కాల మీరితి నెట్టులో గడచు చుండె
నంత నొక నాడు పర్వతుం డక్కజముగ
నూడిపడె నన్నుఁజూడంగ నుత్సహించి
తీర్థయాత్రాభిలాషియై తిరుగుచుండి

754. చం. అతనినిఁగాంచి నేను కడు నాదర మొప్పగఁ బల్కరించి స
మ్మతిఁదగ పూజ సల్పి బహుమాన పురస్కృతి నాసనంబు జూ
పితి నతడందు కూర్చొనుచు బిట్టుగ నేడ్చె మదీయ వానరా
కృతిఁగని, యంతఁగొంత వడికిన్ శమమున్ గని పల్కె నివ్విధిన్

755. శా. ఆనాడట్లు శపించి తేను నిను మామా! ఆగ్రహాధిక్యసం
ధానాత్ముండను నౌట; నేడిచట నీ ధాత్రీశు పట్టిన్ నినున్
గానన్ మిక్కిలి జాలి యయ్యెడును పుణ్యక్షేత్రయాత్రాఫలం
బీనాడబ్బెను నాకు; దానన తొలంగింతున్ వెసన్ శాపమున్

756. కం. ఇకపై నీ వదనం బీ
వికృతత్వము తొలగి పూర్వ విధమున నలరున్
సకలంబిక శుభమగు నని
యకలంకుడు పర్వతుడపు డనియెన్ గృపతో

757. కం. నేనును సంతోషించుచు
వానికి శాపమ్ము తొలగఁ బలికితి, నటుపై
వానర రూపమ్మును నా
యాననమునఁ దొలగి పూర్వ మట్టులఁ దోచెన్

758. తే.గీ. సంతసము నొందె మది దమయంతి మిగుల
ఆమె తలిదండ్రు లిర్వురత్యంత ముదముఁ
బొంది కట్న కానుకల నాపోవ నొసగి
గౌరవించిరి నన్ను ప్రఖ్యాతి గదుర

759. ఉ. కావున సంయమీంద్ర! బహు కష్టము లిట్టులఁ బొందినాడ; మా
యావృత సంస్మృతిన్ సుఖము నందెడి వాడ రుదయ్యా! చూడ నీ
జీవ వితాన మందెట; నశేషముగా నరిషట్క తీవ్రతన్
భావము నందడంచఁగల వాడగుపించడు ముజ్జగంబులన్





760. చం. నుడివెద నింకనున్ గడు వినోదము; మున్నొక కాలమందు నే
నడవుల చక్రితోఁగలసి హాస్యవినోద విచార సంగతిన్
గడపుచునుండ నక్కజముగా నొకనాడు తటాలునన్ గనం
బడితిని యింతినై, మఱియు క్ష్మాపతి పత్నిగఁగంటి పుత్రులన్

761. వ. ఆవృత్తాంతం బెఱింగించెద సావధానుండవై వినుము

## నారదుడు స్త్రీగా మారుట

762. శా. శ్వేత ద్వీపమునందు శ్రీహరిని దర్శింపన్ మదిన్ గోరి సం
ప్రీతిన్ వీణను మీటు కొంచుఁ జనితిన్ వేదోక్తులన్ స్తోత్రముల్
చేతో మోదముతో పఠించుచు; నటన్ శ్రీకాంతు డిచ్ఛాగతిన్
శ్రీ తన్వీమణితో వినోద రతుడై చెల్వొందుచున్ గన్పడెన్

763. చం. ననుఁగనినంత శ్రీసతి వినమ్ర ముఖామృతపాద బింబయై
చనియె హుటాహుటిన్ మిగుల సంభ్రమ చిత్తముతోడ లోనికిన్
వినయముదోప నేనపుడు వెన్నునిఁ జూచి మహానుభావ! నన్
గని వనజాక్షి లోనికరుగన్ గతమేమి యెఱుంగఁజెప్పుమా!

764. చం. తపసిని నే జితేంద్రియుడ, ధార్మిక చింతన నొప్పువాడ న
న్నపగత దోషుఁగాంచి చన నక్కఱ యేమన, వాసుదేవుడున్
గృప ననుఁగాంచి యిట్లు పలికెన్ మునికుంజర! సాజమయ్య స్త్రీ
కెపుడును భర్త తప్ప మఱి యెవ్వడునైన పరాయి వాడెయౌ

765. ఉ. "ఏను జితేంద్రియుండను జయించితిమాయ" నటంచు బల్కితో
మౌని వరేణ్యా! సంభవమె? మాయను గెల్చుట, నీకె కాదు నా
కైనను బ్రహ్మకైన రజ తాద్రి నివాసునకైన దుస్సహం
బౌను తలంప, నట్టి యెడ నన్యుల నింక వచింప నేటికిన్

766. కం. త్రిగుణాత్మక మగు దేహము
లొగి దాల్చిన యట్టి యుత్తమోత్తము లైనన్
జగముల మాయను గెలువన్
దగుదు మనెడి మాట లెల్ల దంభములు సుమా!

767. కం. అనియిట్లు జగన్నాథుం
డనుచుండగ నేను మిగుల నాశ్చర్యముతో

వినయ మెసగ నమ్మాధవుఁ
గని యిట్లడిగితిని విబుధ గణ సంసేవ్యా!

768. ఉ. పంకజ నాభ! నాకెఱుగఁ బల్కుము మాయ యనంగ నేమి? యే
వంకన నుండు? రూప మెటు వంటిది? యెంతటి శక్తిగల్గి ని
శ్శంకఁ జరించు? నిన్నియును. సాంతముగా వివరించి నా మనః
పంకిల మెల్లఁ బాపుము గృపన్ దయసేయుము నాకు జ్ఞానమున్

769. చం. అని యడుగంగ నద్దనుజ హంతకు డిట్లనె సంయమీంద్ర! యే
మని తెలుపం గలాడ త్రిగుణాత్మక యైన తదీయశక్తి యిం
తనుచు, ననేక రూపముల నంతట నిండినదై సమస్తమున్
తన కను సన్నలన్ నడపు తన్మహిమంబు నెఱుంగ సాధ్యమే!

770. తే.గీ. అమ్మహో మాయ నిపుడె నీ కద్భుతముగ
చూపు వాడను, నామెను చూచినంత
హృది విషాదమ్ముఁబొందెద వేమొ, కాన
మనసు దృఢ మొనర్చు కొనుమో ముని వరేణ్య!

771. చం. అని నను హెచ్చరించి యపు డండజముఖ్యుని సంస్మరించినం
తన కడువేగవచ్చి వినతా సుతు డచ్చట నిల్వ వానిపై
వనజ దళాక్షుతో నరిగి వైళమ నేనును గూరుచుంటి నె
మ్మనముఁ దిరంబుఁ జేసికొని మౌనముగా హరి సంస్మరించుచున్

772. ఉ. అంతట వాయు వేగమున నాఖగ ముఖ్యుడు సాగ, పట్టణ
ప్రాంతములన్ సరస్సులను భవ్య మునీంద్రుల యాశ్రమంబులన్
వింతలు గొల్పు పక్షి మృగ విస్తృత సాంద్ర వనప్రదేశముల్
సంతస మొప్ప గాంచుచు ప్రశాంతతఁ బొందుచు ముందు కేగగన్

773. శా. కన్యాకుబ్జ సమీప భూమి నొకచో కాసారమున్ గంటి, మ
న్యోన్యక్రీడల నొప్పు హంస బక చక్రా కీర్ణమున్ భ్రామరీ
విన్యాసంబును నుత్పలాబ్జసుమ సంప్రీతంబు నాదిత్య స
మ్మాన్యంబున్ విమలాంబు పూతమును శ్రీమంతంబు నుత్కృష్టమున్

774. కం. కని వెన్నుడపుడు మన మీ
వనజాకరమందు స్నాన పానాదికముల్
మును సల్పి పట్టణమునకుఁ
జనదగు నని, గరుడునకును సంజ్ఞ యొనర్పన్

775. చం. గరుడుడు మెల్లగా కొలని గట్టున వ్రాలెను; చక్రియంత ను
ర్వరకును డిగ్గి నా కరముఁ బట్టుక మెల్లన దించి పంకజా
కరమును మెచ్చుకొంచు వెనుకన్ నను రమ్మని మెల్లమెల్ల న
ద్దరికిని నేగి యందొక లతావృత వృక్షపు ఛాయ నిల్చుచున్

776. కం. నారద! మును నీ వీ కా
సారమ్మున జలక మాడి సమ్మోదమునన్
తీరమునకు రమ్మా! యిం
పారగ నేనందు స్నాన మాడుదు నటుపై

777. చం. అని నను పంప నేను ముదితాత్ముడనై జని, పద్మపత్రసం
జనిత సుగంధ బంధురము, సజ్జన మానస నిర్మలంబునౌ
వన పరిపూర్ణ శోభితము, పావనమౌ గమలాకరంబునం
దనువగు రేవు చూచుకొని యల్లన లోనికి నేగి ముందుగన్

778. కం. పాదమ్ములు హస్తమ్ములు
మోదమ్మున కడిగి కొప్పు ముడి విప్పి యటన్
స్వాదు జలంబుల మున్గితి
శ్రీదయితుడు చూచుచుండె చిర్నగ వొలుకన్

779. చం. ముద మొదవంగ నంబువుల మున్గి తటాలున పైకిలేచి నా
వదనముఁగాయమున్ గని య వాక్కయితిన్ మునివర్య! యేమి చె
ప్పుదు నొక యింతినైతి; నిజపూరుష రూప మదృశ్యమయ్యె నే
మదిఁగడు సంభ్రమించుచు రమాధవుఁదీరమునందు జూచితిన్

780. కం. ఏమని చెప్పుదు మునివర!
నా మహతి నజినమునుగొని ననుఁ జూడకయే
క్షేమంబుగ గరుడునిపై
శ్రీమహితుండెక్కి చనియె శీఘ్రగతుండై

## నారద తాళధ్వజుల పరిణయము

781. శా. స్త్రీరూపమ్మును బొంది నంతటనె నాచిత్తమ్మునన్ బూర్వ సం
స్కారం బంతయు మాయ మయ్యె, స్మృతిలో కంజాక్షుడున్‌లేడు, వీ
ణారావంబును నిట్టి చర్మమును లోనన్ దోప, వెట్టెట్టులో
తీరం బెక్కితి; దిక్కు తోచ కచటన్ దీనుండనై నిల్చితిన్

782. వ. అంత కొంతవడికి

783. కం. తాళధ్వజుడను నొక భూ
పాలుండటు రథము నెక్కి బలముల తోడన్
మేలౌ బంగరు భూషల
నోలిన్ ధరియించి మదను డోయన వచ్చెన్

784. ఉ. వచ్చినయంత నన్నుఁగని పద్మముఖీ! యెవరీవు? చూడగా
నచ్చపు దేవ కన్యవని యాత్మకు దోచెడు సుందరాంగి! నీ
విచ్చట నిర్జనాటవిని నెక్కటి నుండ కతంబదేమి? నీ
వచ్చుగ రూప యౌవనములందు రతిన్ దలపింతు వంగనా!

785. ఉ. ఇందుముఖీ! నిజమ్ము వచియింపుము మాకు, సరోవరమ్ము వై
పెందుల కిట్లు చూచెదు మృగేక్షణ! యింతకు నీవు కన్యవా!
సుందరి! యైనచో నను వసుంధర నాథు వరించి యిచ్చమై
పొందుము రాజ్యభోగముల పూర్ణముగా గజ మంద గామినీ!

786. చం. అని యత దవ్విధంబున ప్రియంబులు వల్కుచు నుండ సుంత నా
మనమున యోచనన్ సలిపి మానవ నాథునిఁగాంచి భూపతీ!
ననుఁగని నట్టి వారెవరొ నాదు నివాస మదేదియో యెఱుం
గ; నిచటికెట్లు వచ్చితినొ కన్గొన కుంటిని హేతు వింతయున్

787. కం. నా యను వారలు లేరెట
నోయధిపా! దిక్కు దైవ మొకడే తలపన్
నీ యభిమత మెట్లట్లే
నే యనువర్తింతునయ్య నిర్మల చరితా!

788. కం. అని నే పలుకగ నాతం
డెన లేని ముదంబుఁ బొంది యిందువదనకున్





ఘన భూషాన్విత శిబికన్
గొని తెమ్మని పంచె భటుల కూరిమి మీఱన్

789. చం. పనిచిన వారు పల్లకిని వైళమ గైకొని వచ్చి, రంతటన్
ననుఁ గొనిపోయి యాతడు ఘనమ్ముగ పెండిలి యాడి రాజ్య పా
లనకు నమాత్యులన్ నిలిపి లాలిత కామకళా నిరంతరో
న్మనుడయి సంచరించె మధుమత్తుడు నై పలురమ్యదేశముల్

790. తే.గీ. నన్ను సౌభాగ్య సుందరి యన్నపేర
ముద్దులొల్కగ పిల్చుచు భూమి విభుడు
గిరుల నదులను వనముల తిరిగి తిరిగి
కామ కేళీ విలాస సంగతుల మునిగె

791. ఉ. ఆతని కౌగిలింతలును, నాతని చుంబన మర్దనాదులున్,
ఆతని సంగమక్రియలు, నాతని పల్కుల మాధురీ ధునుల్,
ప్రీతి యొనర్ప నేనును చరించితి పూర్వపు పూరుషత్వమున్
చేతమునన్ స్ఫురింపకయె చిత్రముగా నొక ద్వాద శాబ్దముల్

792. కం. మా కలయిక ఫలితముగా
నా కమరెను చూలు;నెలలు నడచిన పిదపన్
నా కొక కొమరుడు గల్గెను
భూకాంతుడు సంతసించె పుత్రునిఁగనుచున్

793. చం. అతనికి వీరవర్మ యను నాహ్వయ మేర్పడఁ జేసి భూసుర
ప్రతతికి దానముల్ వివిధ భంగుల నిచ్చ నొసంగి ధారుణీ
పతి కడుఁబ్రీతి చెందె, పరి పాలితులెల్లరు రాజ్యమందు స
న్మతులయి నుత్సవమ్ముల ఘనమ్ముగఁ జేసిరి వాడ వాడలన్

794. తే.గీ. అట్లు రెండేండ్లు గడచిన యంత నేను
మరల గర్భమ్ము ధరియించి మగ శిశువును
బడసితి, "సుధన్వు"డని వాని కిడియె నామ
మవని నాథుడు కడు ప్రియం బావహిలగ

795. వ. అవ్విధంబున నాకు క్రమమ్ముగ నిరువది మంది
కొమరు లుద్భవించిరి.

796. ఉ. వారల యాలనల్ మఱియు పాలన లెల్లనుఁజూచుకొంచు సం
సార విమోహ వార్ధిఁబడి సంచరణం బొనరించుచున్ ముదం
బారగ నాదు జన్మ చరితార్థముఁ బొందె నటంచు నెంచుచున్
తీరిక లేక నేఁగడపితిన్ బహు వర్షము లంత నొయ్యనన్

797. సీ. యౌవనమ్మున వారి కతి వైభవమ్ముగా
జరిపించి తిమి పెండ్లి సంతసమున
కొడుకులు కోడండ్రు కొమరొప్ప మనుమలు
మనుమ రాండ్రును గూడి మసలుచుండ
కడుసందడిగ గీము కళకళ లాడగ
సంత సించితి నొక్క సమయమందు
వారి యారోగ్యముల్ భంగమ్ములైనప్డు
విల విల లాడితి విస్తృత గతి
కొడుకుల కలహముల్ కోడండ్ర సిగపట్లు
మనుమల యల్లరి మదిని కలచ

గీ. బాధ పడితిని లోలోన బహు విధముల
ఇట్లు సుఖదుఃఖముల తోడ నెట్టు లెటులొ
మునిగి తేలితి సంసార వనధి లోన
పూర్వ విజ్ఞాన మంతయు పొల్లు వడగ

798. మ. శత వర్షమ్ములు వేగ నీగతిఁ గడున్ సంతోష సంక్లిష్ట సం
గతి నాజీవిత మెల్లసాగె ననఘా! కాలమ్మొకే రీతిగా
ప్రతి భావంతునకైన సాగదు గదా! భావింప; దౌర్భాగ్యమున్
జతయై తీరని దుర్దశన్ బడియె నా సంసార మామీదటన్

799. చం. అతి బల వంతుడౌ రిపు ధరాధిపు డొక్కడు వచ్చె నొక్కనా
డతుల చమూ సమూహముల నండగఁగైకొని మాదు రాజ్యమున్
చతురత నాక్రమింప; నది చారులు తెల్పగ విన్న మత్సుతుల్
వితత బలమ్ములన్ గొనుచు వేగమ యేగిరి యుద్ధ భూమికిన్

800. చం. సుతులకుఁదోడు పౌత్రు లతి శూరులు నేగిరి యుద్ధభూమి క
త్యతులిత వేగులై; యని భయంకర మయ్యెను, కాలయోగమున్





గతిసెడి నాదు పౌత్రులును కన్నకుమారులు దారుణమ్ముగా
పతనముఁజెందిరయ్య! విధి వంచితులై రణభూమి నెల్లరున్

801. కం. అది విని నాపతి మిక్కిలి
యదరుచు విలపించు చుండ నా సమయమునన్
మదిలో పొంగెడి దుఃఖము
నదుము కొనగ లేక యప్పు డతి వేగముగన్

802. మ. రణరంగమ్మున కేగి చూచితి నటన్ బ్రాణంబులన్ వీడి ధా
రుణిపై కూలిన పుత్ర పౌత్రులను, దద్రూపంబులన్గాంచి నే
నణపన్ జాలని వేదనన్ దిశలు వ్రయ్యల్గాగ రోదించుచున్
గుణ హీనున్ రిపు రాజుఁ దిట్టుచు నటన్ గూర్చుంటి దీనస్థితిన్

## స్త్రీ రూపుడైన నారదుడు పురుషుడుగా మారుట

803. ఉ. ఆ సమయమ్మునందు ధవళాంబరముల్ ధరియించి వృద్ధ పృ
థ్వీసుర వేషుడై యటకు వెన్నుడు వచ్చి యిదేల తన్వి! నీ
వీ సరణిన్ విచార పడనేటికి? పుత్రులు పౌత్రులంచు నా
యాసము తోడ మోహ తరళాబ్ధి మునింగితి వింతకాలమున్

804. మ. ఎవరీ పుత్రులు! నీ వెవర్తుకవు? వీరెవ్వారు నీ పౌత్రులే?
యవలోకింపుము వాస్తవమ్ము; పరలోకావేశికుల్ వీరికై
ధవళాబ్జాక్షి! తిలోదకంబు లిడుటే ధర్మంబు; తీర్థంబు నం
దవగాహం బొనరించి రమ్మిదియె యుక్తా చారమౌ నియ్యెడన్

805. మ. అనినన్ మానస మందు నూఱడిలి నే నంతన్ బతిన్గూడి య
య్యనఘాత్ముండగు విప్రు వెంటఁజని దివ్యంబైన కాసారమున్
గని యాతండు వచించినట్లచట స్నానం బాడగా నేగి పా
వనమౌ తజ్జల మందు మున్గి వెలికిన్ భద్రంబుగా లేచితిన్

806. తే.గీ. లేచి నారూప మప్పుడు చూచు కొనగ
పురుష రూపమ్ముతో నుంటి పూర్వమట్లు
నాదు మహతిని కృష్ణాజినమును. చేత
పట్టుకొని యుండె పద్మాక్షు డట్టె దరిని

807. ఉ. అంతట నాకు పూర్వ విషయమ్ములు జ్ఞప్తికి రా నొకప్పు డీ
చెంతకు పక్షి రాజు పయి శ్రీహరితో నరుదెంచినట్టి ధీ
మంతుడ నారదుండ నని, మానిని నైతిని యిందు ముగ్గి యం
చంతయు గోచరించె మది కక్కజ మౌనటు లాక్షణంబునన్

808. చం. నను గని యప్డు శ్రీహరియు నారద! రమ్మిక జాగుసేయబో
కని నను పిల్చు చుండ మది నచ్చెరు వందుచు నాదు భర్తయున్
దన ప్రియురాలు గన్పడక తద్దయు దుఃఖముఁజెంది యిప్పుడీ
మునివరుడెట్లు వచ్చె కడుమోసము గల్గెను హేతువెద్దియో?

809. కం. అని పరి పరి విధముల తా
వనరుచు నుండంగ వాని బాధను గని య
వ్వనరుహ నేత్రుడు పల్కెను
మనుజాధిపు శోక భార మగ్నుని తోడన్

810. సీ. శోకింప నేటికి భూకాంత నీవిట్లు
నీకాంత యెవ్వరు నీవెవడవు
కలయికయును వియోగంబును తలపంగ
నొక ప్రవాహము వోలె నొప్పు చుండు
బాటసారుల రీతి పతియు సుతులు సతుల్
కలియు చుందురు మీద తొలగు చుంద్రు
కాక తాళీయమై కలిసి కొంటిరి మీర
లారీతి విడిపోతి రంతెసుమ్ము

గీ. శాస్త్ర పాండిత్య మెల్లను సంతరించి
విబుధ వర్యుల వలన వివేక మెఱిగి
మరల దుఃఖింప నేటికి మనుజ నాథ!
మరలి వత్తురె పోయిన మనుజులెందు

811. కం. కాలము దురతి క్రమ మది
కాల వశమ్ముననె వచ్చు కష్ట సుఖంబుల్
కాలగతిన నవి తొలగును
నేలా! శోకింప వెడలు మేలుము ధరణిన్





812. కం. అని హరి యుపదేశింపగ
విని తాళధ్వజుడు వినయ వినమితుడై యా
వనజోదరున కెఱగి య
వ్వనజాకరమున మునింగె భ్రాంతి తొలంగన్

813. కం. అంతట సమరావనిలో
నంతక పురికేగినట్టి యాత్మీయులకా
చెంతన తిలోదకములిడి
యంతిమ క్రియ లాచరించి యరిగె నగరికిన్

## మాయా విలాసము

814. ఉ. శ్రీరమణుండు నన్నటులె చిర్నగ వొల్కగ చూచుచుండ నే
శౌరికి మ్రొక్కి యంటి బుధ సన్నుత! సంతస మయ్యెనేడు నిం
పారగ మాయఁగూర్చి కడు నందముగా వచియించితీవు త
త్త్రోరపు శక్తి యెట్టిదియొ తోచెను నామది కద్భుతమ్ముగా

815. శా. స్త్రీరూపమ్మును దాల్చి నే నెచట నేరీతిన్ బ్రవర్తించితో
ఆరీతుల్ సకలమ్ము నేడు స్మృతి యందట్లే స్థిరంబయ్యె నో
శౌరీ! యింతిగ నైన తక్షణమునన్ సర్వంబు తత్పూర్వ వి
స్తారోదంతములెల్ల నాస్మృతికిఁ దోచన్ లే దొకింతేని యున్

816. కం. నారీ రూపముఁ గొనుటకు
భూరమణుని పెండ్లియాడి మోహ జలనిధిన్
కూరు కొనుట, కిచట మరల
చేరుటకును కారణమ్ము చిక్కదు మదికిన్

817. వ. పురుషోత్తమా! నాయీ సందియముఁ దీర్పుమని యడుగ
శ్రీహరి ననుఁగాంచి యిట్లనియె

818. సీ॥ నారద! యిది యెల్ల పారమ్ముఁగనరాని
మాయా విలాసమే మదిఁదలంప
ప్రాణుల కెల్లను పరగ జాగ్ర త్స్వప్న
గాఢ నిద్రలనగ కలవు దశలు
తనువు విడచి వేరు తనువును గొనుటది

నాల్గవ దశ మరణం బనంగ
నిదురలో మానవుం డెదియును వినలేడు
జాగ్ర దవస్థలో సకల మెఱుగు
స్వాప్నిక దశలోన చలియించు చిత్తమ్ము
పలువిధముల మనో భావ గతుల

గీ. సుఖము దుఃఖముఁగలలోన చూచు చుండు
నవియె నిజమని మురియును నరచు నొకట
మేలుకొన్నంత నదియెల్ల మిథ్య యనుచు
తలచి తనకార్య ములయందు మలగు చుండు

819. చం. కలఁగను వేళ నెల్లరది కల్ల యటంచుఁదలంప, రట్టులే
కలయనఁబోలు సంసృతినిఁగల్గు ననేక యవస్థ లెల్ల నన్
గలచుచు నున్నవన్న తమకంబున నుండునె గాని యెవ్వడున్
దలపడు కేవలం బిది వృథా భ్రమ యౌనని మాయఁజిక్కుటన్

820. చం. మునివర! తద్యథార్థగతి మున్ను విధాతయు శంకరుండు నై
నను నెఱుగంగఁ జాల, రది నాకును దుర్ఘటమయ్యె! యెవ్వరేన్
మనుజుడు దీని తత్త్వమును మానుగ సర్వ మెఱుంగు దే నటం
చనుకొనె నేని యాతడగు నచ్చముగా నొకపిచ్చి వాడిలన్

821. ఉ. స్థావర జంగమాత్మక విశాల జగంబు గుణత్రయంబుచే
చేవదలిర్ప నిర్మితము చేయ బడెన్ మునినాథ! తద్గుణా
భావమునన్ జరింపదు నిబద్ధిగ సంసరణం బొకింతయున్
కావున ముజ్జగంబులను కల్గడు నిర్గుణు డొక్కడేనియున్

822. సీ. సత్వగుణుడ నేను సత్వేతర గుణంబు
లడగి యుండును లోన నల్పముగను
రాజస గుణమున రంజిల్లు బ్రహ్మయం
దణగి యుండును తక్కు గుణము లెపుడు
తామస గుణుడయ్యు కామారి యందును
సత్వ రజము లుండు సద్దు మణగి
కేవల సత్వమ్ము కేవల రజమును
కేవల తమమును లేవు తలప





గీ. గుణరహితులు లేనట్టి కారణము వలన
మాయలో జిక్కి సంసార తోయధిఁబడి
మునిగి తేలుచు నుందురు జనులు సతము
అనుభ వించియు నీవిట్టు లడుగనేల?

823. కం. అని మాయా విలసనమును
మును నాకెఱిగించె విష్ణు మూర్తి; యదియు నీ
కనఘా! నే తెల్పితిపుడు
వనరంగా నేల యింక వ్యాస మునీంద్రా!

824. వ. అని నారదుండు నాకెఱింగించిన విషయమెల్ల నీకిపు
డే నెఱింగించితిని. నారదుని యుప దేశముతో నాదుఃఖ
ముప శమించినది జనమేజయా! నేనింకను నమ్మహర్షి
నిట్లడిగితిని

825. కం. అయ్యా! నారద మునివర!
తియ్యమ్మున నీవు నాకు తెలిపిన దెల్లన్
నెయ్యమున వింటి నటుపై
నయ్యనఘుని గూడి యెచటి కరిగితి రయ్యా!

826. కం. అనియడుగ నారదుండనె
మునివర్యా! వినుము పిదప పురుషోత్తముడున్
జనియెను వైకుంఠమునకుఁ
జనితిని నాతండ్రి బ్రహ్మ సన్నిధి కేనున్

## నారద కమలజ సంభాషణము

827. ఉ. ఆతడు నన్నుఁగాంచి తనయా! యెటు వెళ్ళితి వింత కాలమున్
చేతమునందు మిక్కుటపు చింత కనంబడు, నెవ్వరేని నిన్
యాతనఁబెట్టిరో? విషయ మన్యము నద్భుత మెద్ది యేనియున్
భీతిలి చూచితో? తెలుపు వేగమ హేతువదేమొ పుత్రకా!

828. చం. అని యడుగంగ నే విషయ మంతయు నాతని కెక్కఁజెప్పి యో
యనఘ! వివేక హాని కరమై యెసరేగుచు మోహవార్ధిలో

మునుగగఁ జేయు మాయ కెది మూలమొ తెల్పుము తండ్రి! దీని నే
యనువున నీవు గెల్చితివొ యట్టి యుపాయ మెఱుంగఁ జెప్పుమా!

829. చం. అనిన చతుర్ముఖుండు చతురాననముల్ వికసింప నవ్వి యి
ట్లనియె కుమార! యియ్యది మహా మునివర్యులకేని యోగసా
ధన చరియించు వారికిని తథ్య మెఱుంగగరాదు, నాకునున్
వననిధి శాయికిన్ వృషభవాహనుకైన నెఱుంగ కష్టమౌ

830. తే.గీ. ఆ మహా మాయ దుర్జ్ఞేయ మఖిల మునకు
కాల కర్మస్వభావాది కారణముల
నెఱుగఁదగుఁగాని తన్మూల హేతు వరయ
నేరికైన నసాధ్యమం చెఱుగు మయ్య!

831. మ. అని నా తండ్రి వచింప నేనును నిరాశా విద్ధ చేతంబునన్
జనితిన్ యాత్రల కంచు నాతని యనుజ్ఞన్ బొంది యాపైన నే
దిన మొక్కొక్క ప్రదేశమున్ గనుచు నీ దివ్యాశ్రమ ప్రాంతమున్
మునివర్యా! దరిసించి తిప్పుడిటు సంపూర్ణ ప్రమోదంబునన్

832. కం. వేదవ్యాస మహర్షీ!
నీ దైన్య స్థితిని తెల్పి నెలకొని మదిఁబెం
పొదవెడి దుఃఖభరమ్మిక
మీదన్‌దొలగింపు మనుచు మీరలు వేడన్

833. కం. నే నెఱిగిన యది చెప్పితి
మౌనీ! నీ చిత్త విభ్రమంబును విడువన్
బూనుము సుఖమున్ శాంతిన్
మానసమున నింపుకొనుచు మసలు మిచటనే

834. కం. అని నా కుపదేశ మొసగి
చనె నారదు డంతనేను సంతృప్తుడనై
మనుచుంటి నాశ్రమమునం
దనిశము తద్వచనములను నాత్మఁదలచుచున్

835. వ. కాన నో జనమేజయా!





836. చం. కరమున చెక్కబొమ్మొకటిఁగైకొని నేర్పున నింద్రజాలికుం
డిరవుగ నిచ్చవచ్చినటు లెవ్విధిఁద్రిప్పునొ, యవ్విధంబునన్
స్థిర చర రూపమైన జగతిన్ దనయిష్టమువచ్చినట్లు సం
బరమునఁద్రిప్పు చుండు నృప! "మాయ" నిజాద్భుత శక్తిచే కడున్

837. సీ. పంచేంద్రియములకు పరగ నధిష్ఠాత
మనసని యెఱుగుమో యనఘ! యెపుడు
మనసు చలించుట కనయమ్ము గుణములే
కారణంబై యొప్పుఁగాన జగతిఁ
గారణ గుణములు కార్యమ్ము లందుండు
ననుచు వేరుగ చెప్ప నవసరమ్మె
మాయా వికల్పిత మౌ గుణమ్ము లవియె
వివిధ స్వభావ హేతువులు దలప

గీ. శాంతికి నశాంతికిని మూఢ సాధు భావ
ములకు నెల్ల గుణమ్ములే మూల మగును
గుణముల కతీతు నెందుఁగన్గొనగ లేము
దారములు లేని వస్త్రమ్ము, ధరణి మన్ను
లేని కుండయు నెందైనఁ గాననగునె

838. తే.గీ. సత్వ గుణమున నున్నచో జలజభవుడు
శాంతుడై యుండు నెపుడు నిశ్చల సమాధి
నాతడే రజోగుణుడైన యపుడు మిగుల
భీకర స్వరూపుడగు నప్రీతి గలిగి
తమముఁబొందిన వేళ నతండు తలప
మూఢుడై కడు నలసతఁ బొందియుండు

839. కం. హరి హరు లైనను ధాత్రీ
వరులైన సకల దిశాధి పతులైనను నీ
కరణిన్ త్రిగుణాధీనులె
నరవర! యిది సత్యమనుచు నమ్ము మెడందన్

840. తే.గీ. ఆ మహా మాయ పరతత్వమందెయుండు
నదియు పరతత్వ ప్రేరణ నఖిల జగము

నాట లాడించు చుండు తా ననవరతము
మాయఁదనలో నిమిడ్చి సంభావ్యమౌచు
నున్న సంవిత్ స్వరూపమే సన్నుతింప
బడును పరమేశ్వరి యనంగ, భగవతియన

841. ఉ. ఆ పరమేశ్వరిన్ నిరత మన్య మనస్కుడు గాక బుద్ధియం
దేపున నిల్పి ధ్యాన మొనరించు నెవం డతిభక్తి, వానికిన్
బ్రాపయియుండు తల్లి; భవ బంధములన్ బెడఁబావు, శీఘ్రమే
చేపడఁ జేయు మోక్ష సరసీరుహ నేత్ర సమాగమస్థితిన్

842. తే.గీ. ఈ పురాణమ్ము నెవ్వ దహీన భక్తి
పఠన మొనరించి పరులకు పరవశమున
చెప్పుచుండునొ వానికి, చిత్తమలర
వినెడి వారికి, గ్రంథమున్ వేడ్కతోడ
బహుకరించెడి వారికి పరమ గతులు
గల్గు నఖిల సంపదలు పుష్కలము లగును.

## ఓంతత్ సత్

843. వ. ఇది శ్రీదేవీ కరుణా కటాక్షలబ్ధ విభవుండును, కమలాంబా సుబ్బరాయుల ద్వితీయ పుత్రుండును, కౌశికసగోత్రుండును అగస్త్యరాజ వంశోద్భవుండును నగు సుబ్బారావు కవి ప్రణీతంబగు శ్రీదేవీ భాగవతమను మహా పురాణము నందు వృత్రాసుర వృత్తాంతము, వృతునిజననము ఇంద్రుని భంగ పాటు; వృత్రుని తపస్సు, దేవతలు జృంభికను సృష్టించుట, దేవత లొనర్చిన దేవీస్తుతి, వృత్ర సంహారము, ఇంద్రుని కంగారు, నహుషుని యింద్రపదవి వరించుట, శచీ రక్షణకు బృహస్పతి యోచన, శచీ దేవికి జగన్మాత అనుగ్రహము నహుషుడు ఋషి వాహన మెక్కివచ్చుట; వివిధ కర్మగతి భేదములు, వ్యాసుడు యుగ ధర్మముల నెఱింగించుట; వరుణుడు హరిశ్చంద్రు నకు శాపమిడుట; ఆడీ బక యుద్ధము, మైత్రావరుణుడు, జ్ఞాన స్వరూప ప్రబోధము, హైహయుల చరిత్ర; హైహయ జననము, హరివర్మకు ఏకవీరుడు దక్కుట; ఏకావళీ వృత్తాంతము ఏక వీరుడు కాలకేతుని వధించుట; ఏకావళీ ఏకవీరుల పరిణయము, నారదుని పూర్వజన్మ వృత్తాంతము; నారదుడు స్త్రీగా మారుట, నారద తాళధ్వజుల పరిణయము, స్త్రీరూపుడైన నారదుడు పురుషునిగా మారుట; మాయా విలాసము; నారద కమలజ సంభాషణము అను కథలు గల షష్ఠమస్కంధము.







# శ్రీ దేవీ భాగవతము (ఆంధ్రము)
## సప్తమ స్కంధము

1. శ్రీ పద్మ గర్భు రసనన్
దీపించెడి వాణిఁగొల్తు తేజో మూర్తిన్
ప్రాపై విలసిల్లి సతము
నాపద్యకృతికి తగిన గుణంబులు గూర్పన్.

2. వ. సూతుండు శౌనకాది మహర్షులంగాంచి, ఋషీంద్రులారా!
మద్గురు వర్యులైన వ్యాస భగవానుని వలన
మాయాశక్తి స్వరూపము నెఱింగిన జనమేజయుండు
సంతసించి ముకుళిత హస్తుండై మరలనిట్లు ప్రార్థించె.

3. చం॥ వనజాసను దేవిధమున
జనులను సృష్టింప గలిగె సత్కృప నెవరా
యనఘునకు నుపాయమ్మును
వినిపించిరొ తెలుపుమయ్య విద్వన్ముఖ్యా!

4. కం॥ ఇన శశి వంశ ధరాధిపు
లనిశము శ్రీదేవియందు ననుపను భక్తిన్
గొని తరియించి రనుచు నే
వినియుంటిని, వారిఁగూర్చి వివరింపు కృపన్

5. వ. అని జననాధుండు ప్రార్థింప ముని నాధుండిట్లనియె

6. మ॥ హరినాభీ కమలోద్భవుండు మును నయ్యంబన్ మదిన్ నిల్పి సు
స్థిరమై యొప్ప తపం బొనర్చి జగముల్ సృష్టింపగా నామెచే
వరముల్ బొంది సృజించె సర్వమును సంభావ్యంబుగా నైన తా
నరులన్ సృష్టి యొనర్పఁజాల కతిచింతా క్రాంతుడైయుండగన్

7. చం॥ తనకు నుపాయ మొందపుడు తళ్కుమనన్ మది సంతసించి తా
మనుజుల నొక్కటన్ భువి నమంద గతిన్ సృజియింపలేక ము
న్ననువుగ మాన సోద్భవుల నద్భుత తేజుల నేడ్గురన్ తపో
ధనుల సృజించె నొయ్యన విధాత ప్రజా పతులన్ బ్రసిద్ధిగన్

8. తే.గీ. అంగిరసుడు, మరీచియు, నత్రి, క్రతుడు
పులహుడు, వసిష్ఠుడు, పులస్త్యు, డెలమి నొకట
బ్రహ్మ మానస పుత్రులై వసుధ యుందు
నుద్భవించిరి యేడ్గు రి ట్లొప్పిదమున

9. తే.గీ. నలువ కోపింప తత్ఫాల తలము నుండి
రుద్రు డుదయించె కడు రౌద్ర రూప మెసగ,
ఒడిని నారదు డుదయించె, నొనర బొటన
వ్రేల దక్షు డుద్భవ మయ్యె ప్రీతితోడ

10. చం॥ సనకస నంద నాదులగు సమ్మని వర్యులుసైత మంబు జా
సనుని మనోద్భవుల్, మఱియు చక్కని రూపము తోడ నొక్క స్త్రీ
జననము నందె ధాతయపసవ్య కరప్రథమాంగులిన్ మహా
గుణవతినాఁ ప్రసిద్ధయయి కూరిమి"వీరిణి" యన్నపేరునన్

11. తే.గీ. ఆమెకు "నసిక్రీతి" యను నా మాంతరమ్ము
గలదు, దక్ష పత్నియగు నక్కమల నేత్ర
కమర ముని నారదుడు పుట్టె నవనినాథ!
యిది కడు విచిత్ర మని మది నెంచవలదు

12. ఉ॥ అంబుజ గర్భు నంకమున నమ్ముని వర్యుడు పుట్టెనంచు పూ
ర్వంబు వచించి యిప్పుడిటు పల్కెద వేమని యందువేమొ స
త్యంబది, నీదు సందియము నావలఁ ద్రోయుము సావధాన చి
త్తంబున విన్ము మీది కథ, తప్పక నీమది శంక వీడెడున్

13. ఉ॥ దక్షుని, వీరిణిన్, గని విధాత "ప్రియంబున మీర లింకపై
దక్షత తో ప్రజావళిని తామర తంపరగా సృజింపుడీ
యక్షయ మౌ విధాన" నని యాన యొసంగగ వారలున్ గడున్
దీక్ష సృజించి రాపయిన తెప్పలు కుప్పలు గాగ సంతతిన్

## నారదునకు దక్షుని శాపము

14. ఉ॥ పంచ సహస్ర సంఖ్య భువిపై తమ సంతతి నిండ, వారలన్
గాంచుచు నవ్వి యిట్లనియె నారద మౌని "యిదేమిటయ్య! యీ





మించిన సంతతిన్ గనుట, మేదినికిన్ గల మేర యెంతయో
యించుక యేనియున్ దెలియ కిట్లు సృజించుట హాస్యహేతువౌ"

15. కం॥ అని సురముని పల్కగ త
త్తనయులు "నౌనౌ" నటంచు తలలూ పుచు ది
క్కునకొక కొందరు చొప్పునఁ
జని రీ భువి మేరఁదెలియ సత్వర గతులై

16. చం॥ తన సుతులెల్ల రిట్లరుగ దక్షున కేమియుఁ దోచదయ్యె, ని
ర్జన మగు గేహమున్ గనుచు చాల తపించుచు నింక కొందరన్
తనయుల సృష్టిచేసె, ధర తద్దయు వర్ధిలి వారి సంతతుల్
వనధి పరీత భూతలముపై గనుపించిరి మిక్కుటమ్ముగన్

17. చం॥ అది గని దేవ మౌని యప హాస్యముసేయుచు మూర్ఖులార! యి
ట్ల దటున నాదు మాట వినరైతిరి, భూపరిమాణ మెంతయో,
సదమలవృత్తిఁ గన్గొనక సంతతి నిట్టుల వృద్ధిచేయు టి
య్యది తగునయ్య యంచుఁ గడు నాగ్రహమూనుచు హెచ్చరించినన్

18. కం॥ నారదు పల్కులు విని య
వ్వారలు సమ్మతినిఁ దెల్పి పలు దిక్కులకున్
తారేగి రవని తుది మొద
లారయ గము లౌచు వేడ్క నతి సంభ్రములై

19. చం॥ అమర మునీంద్రు మాటలకు నాత్మజు లెల్లరు నిల్లువీడి య
శ్రమమున నేగ దక్షుడది సైపక ఆగ్రహమూని నారదా!
క్రమము నిట్లు నాసుతులఁ గానలఁ బట్టగఁ జేసి పుత్ర శో
కముఁ గలిగించి తీవు కనుకన్ నశియింతువు నీవు నవ్విధిన్

20. చం॥ అని శపియించి యంతటను నాగక యింతటి పాప కార్యమున్
మునుకొని సల్పి దుఃఖమును బొందగఁ జేసితి గాన నీవు నా
తనయుడవై జనింతువిక తప్పదు దుర్భర గర్భవాస సం
జనిత మహోగ్ర దుఃఖ మది స్వానుభవమ్మగు పొమ్మునీకికన్

21. కం॥ అని దక్షుడు శపియింపగ
వనజజు నుత్సంగ భవ్య భవుడయ్యును న

మ్ముని, దక్ష వీరిణులకున్
దనయుండై జననమందె తదనంతరమున్

22. ఉ॥ అంతట దక్షు డాత్మజల నఱ్వది మందిని బొందె, వీరిణీ
కాంతయు తత్తనూజలను గాంచి ముదంబును బొందె, వారలం
తంతకు వృద్ధిఁ జెందుచు ప్రియంబున యుక్తవయస్కలౌట, ధీ
మంతుడు తండ్రి యెల్లర కమందగతిన్ జరిపించె పెండిళుల్

23. సీ॥ పదుమువ్వరను కశ్యప మహర్షికి నొసంగి
పెండిలి జరిపించె ప్రియము తోడ
పదుగురు తనయల పరగ ధర్మున కిచ్చి
వియ్యమందెను కడు వేడ్క మీఱ
ఇరువది యేడ్గుర నిందున కిడి కడు
నక్కజమ్ముగ వివాహమ్ము జరిపె
ఇరువుర భృగువున కిచ్చె, నరిష్టనే
మికి నల్వుర నొసగె ప్రకటితముగ

గీ॥ ఇర్వురను నంగిరసునకు నిచ్చి, మరల
కొంత కాలమ్ము నకు తన కూర్మిసుతల
మఱియు నిర్వుర నొసగె నమ్మౌని వరున
కా ప్రజాపతి దక్షుండు క్షిప్రగతిని

24. ఉ॥ వారల కెల్ల పుత్రులును పౌత్రులు గల్గి మహాబలాధికుల్
ధీరులు నౌచు దానవులు, దివ్యులునై నిరతంబు వారిలో
వారలు శత్రుభావ పరి వర్ధితులై సమరోద్గమక్రియా
చారులునై పరస్పరము స్పర్ధలతో చరియించి రేపునన్

## సూర్యవంశ చరిత్ర

25. కం॥ జనమే జయ! వినుమిక న
య్యిన శశి వంశముల చరిత లెల్ల తెలిపెదన్
మును దివిజుల యందున్ గడు
ఘనుడన సూర్యుండు జగతి ఖ్యాతిన్ బొందెన్





26. కం॥ అతడు వివస్వతుడనగా
నుతికెక్కెను, వాని నందనుం డిల వైవ
స్వతమనువనఁ బడు, వానికి
సుతుడై యిక్ష్వాకుడు కడు శూరుడు పుట్టెన్

27. వ. ఇక్ష్వాకుం దుదయించిన పిమ్మట వైవస్వత మనువునకు
నా భాగుడు, ధృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, ప్రాంశువు,
నృగుడు, దిష్టుడు, కరూషుడు, పృషధ్రుడు నను తొమ్మండుగురు
పుత్రు లుదయించిరి. అందు ప్రథమ పుత్రుండైన యిక్ష్వాకుండు
సూర్యవంశ వివర్ధనుండయ్యె

28. సీ॥ ఇక్ష్వాకునకు నూర్గు రెలమి పుత్రులు గల్గి
రందు వికుక్షి జ్యేష్ఠాత్మజుండు
నాభాగు తనయుండు నయశీలి ధర్మజ్ఞు
డంబరీషుడన సత్యావలంబి
ధృష్టుడి పుత్రుడు దివ్య తపశ్శాలి
ధార్ష్ట్యకుడన సత్వ ధనుడు నొప్పె
శర్యాతి కుదయించె సత్పుత్రు డానర్తు
డాత్మజయు సుకన్య యనగఁ బుట్టె

గీ॥ ఆ సుకన్యను చ్యవనున కంధునకును
నిచ్చి శర్యాతి పెండ్లి చేయించె నంత
వారికుదయించె సద్గుణ వార్ధియైన
నందనుడు సులోచనుడను నామ మొప్ప

29. కం॥ అన విని జననాధుం డో
మునివర! శర్యాతి యట్లు ముగుదను తనయన్
జనపతి కొక యంధునకున్
వెను కాడక యెట్టు లిచ్చె వెఱ్ఱియుఁబోలెన్

30. కం॥ గుణ వతియు రూప వతియగు
వనితామణి దీని కద్దు వలుకగలేదో?
కన నియ్యది చిత్రంబై
మనసునకున్ దోచె దీని మర్మముఁజెపుమా!

31. మ॥ అనినన్ మోమున మందహాస మొదవన్ వ్యాసుండు భూనాధునిన్
గని రాజా! యిది యెంత వారలకు నైనన్ గల్లు సందేహమే!
విను శర్యాతికి పెక్కురున్ గలరు దేవేరుల్ గడున్ సుందరాం
గన, లైనన్ సుత యామె యొక్కటుగుటన్ గారాబుగా వర్ధిలెన్

32. మ॥ చనియెన్ దా నొక నాడు శుభ్ర జల విస్తారంబునై నిత్యమున్
వనజామోద సుగంధ బంధురమునై వ్యావృత్తవృక్షావళీ
ఘన సౌందర్యమునై మరాళశుక పైకక్రౌంచ సమ్మోహన
స్వన కర్ణామృత పేయమై తనరు కాసారంబు వీక్షింపగన్

33. ఉ॥ అచ్చట భార్గ వాన్వయు డనన్య మనస్కుడు శాంత చిత్తుడున్
సచ్చరి తాత్మ్కు డింద్రియ విచార విరక్తుడు భోజనాదులం
దిచ్చను వీడి నిశ్చలత నీశ్వరి నాత్మదలంచుచున్ తపం
బచ్చుగ చేయుచుండె చ్యవ నాఖ్యుడు మీలిత నేత్రయుగ్ముడై

34. ఆ.వె. అతని మేని చుట్టు నధికమ్ముగా లతల్
వృద్ధి చెంది పుట్ట లేర్పడంగ
ముని వరుండు పైకి పొడచూప కుండెను
వచ్చి పోవునట్టి పాంథతతికి

35. చం॥ తన చెలి కత్తెలన్ గలసి తద్దయువేడ్క సుకన్య యచ్చటన్
వనమున సంచరించుచు జవంబున పూవులఁ గోసి కొంచు నె
మ్మనమున సంతసించుచు క్రమంబున పాటలు పాడుచున్ ప్రియం
బెనయగ నాటలాడుచును నేగె నటన్‌గల పుట్ట చెంతకున్

36. తే.గీ. అచట శర్యాతియు తన భార్యలను గూడి
అంబుజాకరమ్మున స్నాన మాడుచుండె
ఆ సుకన్యయు మిక్కిలి యలసి సొలసి
వల్మికము చెంత చతికిలం బడియె పుడమి.

37. చం॥ పడిన సుకన్య వల్మికము ప్రక్కకు కన్నులు త్రిప్పిచూడగా
మిడుగురు లట్లు రెండు కడు మిన్కుచు రంధ్రమునందుఁ దోప తా
జడియక యొక్క పుల్లఁ గొని చయ్యన తద్వివరంబులోనికిన్
పొడవునఁ జొన్ప నందలి తపోధను డా చ్యవనర్షి యిట్లనెన్





38. చం॥ కమల విశాల నేత్ర! ననుఁ గానవు సుంతయు, తాపసక్రియన్
శమము వహించి యుంటి నిట చంద్రముఖీ! యిటు చేయఁబోకు, వే
గమె చనుమంచుఁ బల్కగ సుకన్యయు నవ్వులు కాలకింప క
య్యమల తపఃప్రశస్తు నయనాంబుజముల్ పొలివోవ గ్రుచ్చినన్

39. చం॥ చ్యవనుడు గ్రుడ్డియయ్యె; నలినాక్షి యదేమియు లోఁ దలంప కే
జవమున నేగె నెచ్చెలుల సంజ్ఞ యొనర్చుచు నాట లాడ; నా
చ్యవనుడు క్రుద్ధుడయ్యె తన చక్షు యుగంబునకైన బాధకున్
వివశతఁ బొంది; యంతఁ గడు విస్మయ మౌనటు లా క్షణంబునన్

40. ఉ॥ భూపతి సేనకున్ మఱియు భూపునకున్ మల మూత్ర బంధన
ప్రాపణ మౌటచే పొడము బాధ భరింపగ లేక హేతు వే
పాపమొ దీనికంచు తన వారల నెల్లరఁ బిల్చి మీర లి
ట్లేపగు బాధకున్ కత మదేమొ యెఱుంగు డటంచుఁ బల్కినన్.

41. ఉ॥ వారలు పల్కిరిట్లు నరపాలుని గాంచి మహాను భావ! కా
సారము చెంతనే చ్యవన సన్ముని తాపస వృత్తినుండె, నె
వ్వారలొ అమ్మహర్షికి ధ్రువంబుగ హాని యొనర్చి యుందురం
చారయఁ దోచు; నమ్మునిక్రుధాగ్ని ఫలంబిది నిక్కువంబుగన్

42. కం॥ అన నమ్మాటలు విని యా
వనజాక్షి సుకన్య తండ్రి పజ్జకుఁ జని తె
ల్పెను మును జరిగిన విషయం
బును నెల్ల నమాయికత్వము మదినిఁదోపన్

43. చం॥ విషయ మెఱింగి రాజు వెను వెంటనె పుట్టను చేరి చూడ నా
ఋషి వరుడందుఁ గూరు చొని యేపగు బాధ భరింపలేక ని
ర్విషయ సుఖాత్ముడయ్యు కడు బిట్టుగ మూలుగు చుండఁగాంచి వి
ద్విషజితుడా మహీశుడు హృదిన్ పరితాప మెసంగ భీతితో

44. చం॥ భటులకుఁ జెప్పి వల్మికము బ్రద్ద లొనర్పగఁ జేసి మెల్లగా
పటుతర భక్తి యుక్తి ముని పాద యుగాంబుజ సీమ సోకగా
నిటలము వ్రాల్చి లేచి కడు నిర్మల చిత్తమునన్ స్తుతించి తా
నటమటమొంద కిట్లనియె నమ్ముని వర్యుని తోడ నమ్రుడై

45. శా॥ స్వామీ! మా పసి బిడ్డ మీకుఁ గడు కష్టం బిట్లు గల్గించె, తా
నేమీ మంచియు చెడ్డఁ గానదు మహర్షీ! కోపమున్ మానుమా!
ప్రేమన్ దాని క్షమింపు, మెందు తపసుల్ పేరల్కలన్ జెందరం
చే మున్ వింటిని, శిష్యకోటులము సుమ్మీ! మమ్ము బ్రోవందగున్

46. మ॥ అని వేడన్ ముని వర్యుడిట్లనియె రాజా! నేను మున్నెన్నడున్
జనితామర్షుడఁగాను మీకిపుడు నే శాపం బిడన్ లేదు న
న్నను మానింపకు, డెట్టి పాపమును చేయన్ బోక నాయంతటన్
ముని వృత్తిన్ వసియింతు లోక జననిన్ బొల్పొంద ధ్యానించుచున్

47. కం॥ దేవీ భక్తుల కొక కీ
డేవారలు సల్ప వారి కిడుములుతప్పున్
బోవని యెఱుంగు మజహర
భావజ జనకులకు నైన పాకారికి నేన్

48. మ॥ అసలే వృద్ధుడ; నేడు నీతనయచే నంధత్వమున్ బొందితిన్
వసుధా ధీశ!యికేమి చేయుదును నెబ్భంగిన్ బ్రవర్తింతు, తా
పసినౌ నాకిక సేవ లెవ్వ రొనరింపన్ జాలువారంచు వె
క్కసమౌ దుఃఖమునన్ వచించె ముని భూకాంతున్ విలోకించుచున్

49. చం॥ చ్యవనుని పల్కులన్ విని ధరాధిపుడిట్లనె నోమహర్షి! మీ
కవసర మెందరో భటుల నందరఁ బంపెద సేవ చేయ, ని
క్కువము తపస్వు లల్పతర కోపనులన్న ప్రసిద్ధ వాక్యముల్
ప్రవిమల తేజ! మాయెడ కృపన్ వెలయించి క్షమింప వేడెదన్

50. కం. అని యభ్యర్థించెడి పతిఁ
గని యా మునివర్యుడనియె కరుణన్ గని యో
యనఘా! సేవక జనములు
నను ప్రియమునఁ జూతురనుచు నమ్మను మదిలో

51. ఉ॥ కావున నన్ క్షమింపుమని గట్టిగ వేడెదవేని భూపతీ!
భావమునందు సంశయముఁ బాసి సుకన్యను నీదు పుత్రికన్
సేవలొనర్పఁ బంపు మతి శీఘ్రమె యామె యొనర్చునట్టి యా
సేవల కేను సంతసముఁ జెందిన మీకును గల్గు సౌఖ్యముల్





52. చం॥ అని ముని పల్క భూవిభున కట్టులె గుండియ బ్రద్దలై వెసన్
తనువున కంపముల్ గలిగి తాపసి కేమియు చెప్పలేక నె
మ్మనమున నెంచె నిట్లు"సుకుమారి కుమారిని యీ కురూపి, కం
ధున కెటులిత్తు, నిచ్చినను దుఃఖము గాక సుఖంబు గల్గునే!

53. శా॥ నా యారోగ్యము స్వస్థతన్ గనుటకై అంభోజ పత్రేక్షణన్
ప్రాయం బేగిన వాని కిచ్చు టిది ధర్మం బౌనె, యెవ్వారలే
నీ యప్రాచ్యపు కృత్యమున్ దలతురే; యెందైనకన్యామణుల్
ప్రాయంబున్న మనోహరున్ వలతు; రిబ్భంగిన్ పతిన్ మెత్తురే?

54. తే.గీ. మును నహల్యను నంద గత్తెను వరించి
గౌతముడు వివాహంబాడెఁ గాని పిదప
నింద్రుచే నామె యట్లు వంచింపఁ బడుట
భర్తచే శాపమున్ బొంద వలసి వచ్చె

55. కం॥ అననుగుణ, వివాహము లెపు
డనుకూల ఫలంబు లొసగ వఖిల జగములన్
ఘన రోగమైన నోర్తును
తనయను నే నితని కీయఁ దల క్రిందైనన్

56. చం॥ అని తల పోసి మాఱు పలుకాడక భూపతి రాజధానికిన్
జనియె; సుకన్య తన్మది విచారము నెల్ల యెఱింగి నవ్వుచున్
జనకునిఁ జేరి దీనికిటు చాల కలంగగనేల తండ్రి! నే
జని చ్యవనర్షి కెంతయును సల్పుదు సేవల నూఱడించెదన్

57. చం॥ అన విని తండ్రి యక్కజమునంది యిదేమిటి తల్లి! యొక్క వృ
ద్ధునకు సపర్యసేయఁ జనెదో? కడుఘోర వనాంతరమ్మునన్;
ధనమును రూపమున్ వయసు తద్దయు జ్ఞానము గల్గు వానికే
తనయ నొసంగ నెంచు నిల తండ్రి! తదన్యున కీఁ దలంచునే

58. మ॥ నిను నంతః పురసీమ నుండఁ దగు నింతిన్ ఘోర సాంద్రాటవిన్
జని కష్టంబులు బొందుమం చనుట కన్నన్, నేను, నా సైన్యముల్
ఘన రోగమ్ములఁ గుంది చచ్చుట యె సౌఖ్యంబంచు యోచింతు, నే
ననుమోదింపను తల్లి! దీని కెది యేమైనన్ భయం బేటికిన్

59. చం॥ స్థిరమగు నిర్ణయం బిటుల తెల్పిన తండ్రిని గాంచి పుత్రి, యో
నరవర! యమ్మహర్షిని మనంబున నే వరియించి, తింక నీ
వరమర లేక నన్నతని కాదర మొప్పనొసంగి వైభవో
త్కరమున పెండ్లి సేయుము సుఖంబగు మీకును మీదు సేనకున్

60. తే.గీ. మీరు సుఖపడు టొక్కటే కోరు దెపుడు
సంతసమ్మున నా భర్త చెంత నేను
సేవ లొనరించి తరియింతు చెలిమి గలిగి
వృద్ధసేవకు మించిన తృప్తి గలదె

61. మ॥ అనినన్ మంత్రులు దండ నాధులును నాహా!యంచు వీక్షించి ర
వ్వనజాక్షిన్; జనకుండొకింత వడికిన్ బాధాపరీరంభుడై
తనపుత్రి స్థిర చిత్తవృత్తికతి మోదంబంది యా వెంటనే
తనయన్ గైకొని యేగె నమ్ముని వరున్ దర్శింప నుత్సాహుడై.

62. మ॥ చని యమ్మౌని వరేణ్యుఁ గాంచి నతుడై సాష్టాంగయుక్తంబుగా
ప్రణతుండై కరుణానిధీ! తమకు సేవల్ చేయ నా పుత్రికన్
గొని యేతెంచితి నీమెఁ గైకొను మిదే కూర్మిన్ సమర్పించు చుం
టిని సంప్రీతిగ నంచు కూతు నలివేణిన్ దా సమర్పింపగన్

63. కం॥ సంబరమున నా చ్యవనుం
డంబరమును దాకి నట్టు లై యటుపై న
య్యంబుజముఖిఁ గైకొని తత్
సంబంధము తోడఁ గడు ప్రసన్నుండయ్యెన్.

64. కం॥ భూపునకు, సైనికులకును
నాపై మల మూత్ర బంధ నాదులు తొలగెన్
భూపతియు సేనలును నపు
డేపగు సంతోషమొంది రింతింతలుగన్

65. చం॥ ముదమున నెల్లరున్ దిరిగి పోవ ప్రయత్నము సల్పుచుండ న
మ్ముదిత సుకన్య తండ్రి పదముల్ స్పృశియించి నమస్కరించి స
మ్ముదమునఁ బల్కె నోజనక! భూషలు వస్త్రము లేల నాకు నిం
పొదవగ నార చీరలను యుక్తముగా ధరియింతు నింకపై





66. తే.గీ. భర్త తోడఁగూడి తప మొనర్తు తండ్రి!
భూషలున్ వస్త్రముల్ గొని పొందు మీరు
మీదు కీర్తిని జగముల పాడు కొల్పు
దనయ మును భర్తమార్గమ్ము ననుసరించి

67. చం॥ తనసుత పల్కులన్ వినిన తండ్రి కడున్ విలపించి యంతఁ జే
యునదిక లేక ధైర్యమున నూఅటఁ బొందుచు నారచీర లా
క్షణమున తెండటంచు తన సైన్యము నంపగ వారు వేగమే
చని గొని తెచ్చియీయ, కడు సంతస మంది సుకన్య గైకొనెన్

68. తే.గీ. నార చీరలు ధరియించి నగల నూడ్చి
వాలు జడ త్రిప్పి ముడివైచి భర్త పథము
ననుసరింపగఁ బోవు నత్తనయఁ గాంచి
మ్రానువడి చూచు చుండె శర్యాతి యపుడు

69. కం॥ ఈదృశ్యముఁ దిల కించుచు
వేదనతో కుమిలి రతని ప్రియదేవేరుల్
ఓదార్ప నశక్యమ్ముగ
రోదించిరి యెల్లరు ననిరుద్ధాశ్రువులన్

70. కం॥ తేరుకొని చివర కెల్లరు
చేరిరి తమ రాజ్యమునకు స్థిరచిత్తులునై
వారక సుకన్య తనపతిఁ
గోరికకున్ దగిన రీతిఁ గొల్చుచు నుండెన్

71. సీ॥ ధర్మము తప్పక తనపతి యొనరించు
సత్కర్మలకు నెల్ల సహకరించు
కందమూలాదుల నందందుఁ గొనితెచ్చి
యొనర భర్తకు నిచ్చు నోగిరముగ
ఉష్ణోదకము సిద్ధమొనరించి యుదయమే
స్నానమాడించును శ్రద్ధతోడ
నీవార ధాన్యమ్ము నిత్యమ్ముఁ గొనివచ్చి
వండి పెట్టును తనివార రుచిగ
భోజనమైనంతఁ బొల్పొంద తాంబూల
మందించి యాస్తరం బమరఁ జేయు

గీ॥ వీచు వింజామరల తోడ ప్రేమమీర
భర్త యనుమతిఁ గొని కుడువంగఁ బోవు
దిన దినమ్మును నీరీతి వినయమెసగ
సలుపు సేవలు భర్తకు సారసాక్షి

72. కం॥ ఆయా కాలములందున
నాయా కృత్యముల జ్ఞప్తికొనటు తెలుపున్
ఏయే వేళల నతిథుల
కాయా రీతులను భోజనాదు లమర్చున్

## సుకన్యా నా సత్యసంవాదము

73. వ॥ అట్లుండనొకనాడు.

74. చం॥ రవిసుతు లశ్వినుల్ మిగుల రమ్య వనాశ్రమ భూవిహారముల్
వివిధముగా నొనర్ప మది వేడుక పుట్ట తదాశ్రమస్థలిన్
జవమునఁ జేరి కాంచి రట స్నాతను, శుద్ధ జలార్ద్ర వల్కల
ప్రవిమల దేహ నంగనను పద్మముఖిన్ జల పాత్ర ధారిణిన్

75. చం॥ కని దివిజాంగనన్ బలెప్రకాశిలు నామెను చేరి సుందరీ!
క్షణ మట నాగు మెవ్వతెవు? కాంతుడెవం? డిట కేలవచ్చితో
వనజ దళాక్షి యొంటిగ, భవత్పద పంకజయుగ్మ మిట్టు లీ
ఘన కఠినాశ్మకంటక నికాయము తాకిన కంది పోవదే!

76. కం॥ దినకర సుతులము మే మ
శ్వినులము వన విహరణములు చేయగ నాలో
చన సలిపి వచ్చితిమి యి
మ్మునివరు నాశ్రమము కడకు పూర్ణేందు ముఖీ!

77. చం॥ నిను తనివారఁ జూడఁ గల నీడజ పంక్తులు, జంతు సంతతుల్
మును కడుపుణ్య కార్యములు పొల్పుగ నెట్టు లొనర్చియుండెనో?
అనయము నీ పదాబ్జ రజ మంటగ నోచిన యీ ధరాతలం
బనుపమ సత్కృతంబు లెవి యాదర మొప్పగ మున్నొనర్చెనో?

78. తే.గీ. ఇంతయేటికి నీ విధం బెల్ల మాకు
తెలియఁ జెప్పుము సుకుమారి యలుగఁ బోక





నిన్ను పత్నిగఁ బొందిన నీ విభుండు
మిక్కిలి యదృష్ట వంతుడు నిక్కువముగ

79. చం॥ అని యినపుత్రు లట్లడుగ నయ్యమ నివ్వెఱవోయి సిగ్గుతో
తన తలదించి యిట్లనియె ధైర్యము నించుక కూడగట్టి యో
అనిమిష వర్యులార! చ్యవనాఖ్య నిటన్ దప మాచరించు స
న్మని వరు పత్ని నే, ననయమున్ చరియింతు తదాజ్ఞనియ్యెడన్

80. తే.గీ. ధరణి పతియైన శర్యాతి తనయ నేను
నను సుకన్య యని పిలుతు రనఘు లార!
నాదు భర్తను చూడ మనమ్ములందు
తలపు గలదేని రండు మానెలవు నకును

81. మ॥ అని యాహ్వానము వల్క దస్రులపు డత్యంతమ్ము సంకోచముల్
బెనయన్ గ్రమ్మఱఁ దేరి యామెఁ గని తన్వీ! నిన్ను నీ తండ్రి యి
మ్ముని కెట్లిచ్చెను? చూడ నాతడు కడున్ మూర్ఖుండుగాఁ దోచు ని
వ్వనమం దీ పతిఁగూడి యెవ్విధమునన్ వర్తింతువో సుందరీ!

82. సీ॥ నార చీరలు నీకు సారసాక్షీ! యేల
పట్టు పుట్టంబులే భావ్యమగును
వనతరు కుసుమ భూషణములు నీకేల
రత్న భూషణములె రమ్యమగును
కంద మూలాదుల కల్కిరో తిననేల
షడ్రసోపేత భోజ్యములె తగును
ముసలి మగని పొత్తు ముగుద! నీ కేటికే
నవమన్మథుని పొత్తు నాణ్యమగును

గీ॥ అప్సరోవనితల మించు నంద గత్తె
విట్లు యౌవన మంతయు హీన గతిని
వ్యర్థ మొనరింపఁ దగునె తన్వంగి! నీకు
సుందరాకారు నన్యుని చూచుకొనుము.

83. ఉ॥ యౌవన మెల్ల పారు నదియం దుదకంబుల వంటి దో లతాం
గీ! వెను దిర్గి రా దొకట నేగిన మీదట, కాన నీవు స

ద్భావము తోడ మమ్మొకని బాగుగ నచ్చిన వాని కోరు కొ,
మ్మావల సౌఖ్యమున్ గొనెద వబ్జముఖీ! యనుమాన మేటికిన్

84. చం॥ దురుసుగ నిట్లు వల్కు నల తోయజ మిత్రు కుమారులన్ గనన్
తరుణికి భీతి యేర్పడి మితంబుగ నిట్లనె పూజ్యులార! మీ
రరుణ తనూజు, లార్యులు, మహాత్ములు నన్నిటు లాడ ధర్మమే
పరిణయ మైతి మున్ను ముని వర్యుని, వానిని వీడు టొప్పునే?

85. ఆ.వె. కట్టుకున్నవాని నట్టేటి లో ముంచి
పరుని వరుని యెట్లు పడయ గలను
తమకు తెలియ దయ్య ధర్మ మదేమిటో?
పెక్కుమాట లేల వెళ్ళుడింక

86. కం॥ తనయను నే శర్యాతికి
అనఘాత్ముండగు చ్యవన మహర్షికి పత్నిన్
చనుడిక మర్యాదగ, లే
దనినన్ శపియింతు పెక్కులాడిన యెడలన్

87. మ॥ అన నా దస్రులు నివ్వెఱంపడుచు నీ యబ్జాక్షి కోపంబునన్
గని శాపం బిడునేమొ, లేనియెడ నిక్కల్యాణి ప్రాణేశు డా
మునివర్యుండును నైన శాపమొసగున్బో, తథ్య, మట్లొట నీ
మెను శాంతింపగఁ జేయు టొప్పనుచు నమ్మీనాక్షి వీక్షించుచున్

88. మ॥ నలినాక్షీ! భవదద్భుతంబగు నుదంతంబెల్ల డెందమ్ములన్
దలపన్ సంతస మయ్యె మాకు తరుణీ! తథ్యంబు నీ మానసం
బలరన్ మేము వరమ్ము నిచ్చెదము, శ్రేయంబౌను నీకింక ది
వ్యులకున్ వైద్యుల మంచు మమ్మెఱుగవే యుత్ఫుల్లపద్మాననా!

89. చం॥ ముదుసలియైన నీ పతిని పొల్పుగ యౌవన రూప సంపదల్
పదిలపడంగ, మాకు సరి వచ్చు తెఱంగున మార్చి వైతు మీ
యదనున, నీవు మామగుర యందు భవత్ పతి యెవ్వడౌనొ నే
ర్పొదవగ తెల్పినన్ ముదము నొందెద మెంతయు మానసమ్ములన్

90. చం॥ అనవిని యాసుకన్య కడు నక్కజ మందుచు భర్త చెంతకున్
జని విషయమ్ము నంతయును సొంతముగా వివరించి యశ్వినుల్





నను నిటు మోసగింపగ మనంబుల నెంచిరొ యేమొ నాథ! యే
యనువున నే చరింపవలె నవ్విషమస్థితి దాట నియ్యెడన్

91. కం॥ మీరెటు లాజ్ఞా పించిన
వేరొండు తలంప కేను వినయాన్వితనై
వారి యెడ నను సరించెద
నేరను నే నెద్ది యేని నిక్కము నాథా!

92. కం॥ అనినన్ చ్యవనుం డిట్లనె
వనితా! వారల నిచటకు వైళమ గొని తె
మ్మనుమానింపగ నేలా?
చని వారలు నుడివినట్లె సలుపుము జయమౌ

93. చం॥ తనపతి యట్టు లాజ్ఞ నిడ తామర సేక్షణ యేగి వారలన్
గని యిన పుత్రులార! తమ కట్టడ కేమది సమ్మతింతు మీ
రనఘులు సంతసంబున మ దాశ్రమ భూమికి రండు; నా పతిన్
మునివరు మీకు సాటియగు మోహన రూపునిఁ జేయు డాదృతిన్

94. మ॥ అనినన్ సంతసమంది యశ్వినులు నయ్యబ్జాక్షితో నమ్ము నీం
ద్రుని దివ్యాశ్రమ భూమికేగి చ్యవనున్ ధూతాఘు దర్శించి యో
మునివర్యా! మముఁ గూడి రండనుచు సమ్మోదమ్ముతో నేగి రొ
య్యన కాసారము చెంత కమ్మునియు భార్యన్ గూడి వెన్నంటిరాన్

95. ఉ॥ అంతట నశ్వినుల్ చ్యవను నా సరసిన్ దిగి స్నానమాడు మం
చెంతయుఁ బ్రీతిఁ దెల్పగ మునీంద్రుడు మున్గె జలంబులందు తా
మంతట సూర్యపుత్రులును నాక్షణమే యట కేగి మున్గి రా
చెంత సరోవరాంబువుల, చిత్ర మదేమి యొ మున్గిలేచినన్

96. కం॥ సమ యౌవన సౌందర్యము
లమరగ నాముప్వు రప్పు డగపడ, కడు సం
భ్రమమును నాశ్చర్యము లో
గమికొనగ సుకన్య వారిఁ గనుగొనుచుండన్

97. వ. అయ్యశ్వినులును

## పరీక్షలో నెగ్గిన సుకన్య

98. మ॥ అలివేణీ! మముఁ జూచితే యిపుడు మాయందెవ్వరిన్ గోరెదో
కలయన్ జూచి వరింపు మంచు సమమౌ కంఠ ధ్వనుల్ రూపముల్
గలుగన్ బల్కగ, నా సుకన్యయు మదిన్ గంపంబు పెంపెక్క, వీ
రలు నన్నిట్టుల మోసగించి రకటా! రక్షించు వారేరికన్

99. ఉ॥ ఏవిధి నీ పరీక్షకిపు డేను నిలంబడు దాన, వీరిలో
నావిభుడెవ్వరో తరణి నందను లెవ్వరొ తేల్చు టెట్లొకో
దైవమ! యొక్కనింగని యితండె విభుండని పల్కుదేని నా
భావన తప్పునేమొ తలవంపులగున్ గద! యట్లె యైనచో

100. చం॥ అని కడు పెద్ద కాలమిటు లాత్మఁ దలంచియు నా సుకన్య తా
కను గొనఁ జాలదయ్యె తగు కార్యము; చేయుటకేమి తోచ క
వ్వనజ దళాక్షి శాంకరిని భావమునం దలపోసి యివ్విధిన్
వినయ గతిన్ స్తుతించె కడు విజ్ఞత దోపగ పెక్కురీతులన్

101. చం॥ హరిహర పంకజోద్భవుల కంబవు; సర్వజగంబు లెప్డు నీ
కరుణ సుభద్రమై నిలుచు, జ్ఞాన విహీనుల కెల్ల జ్ఞానమున్
పరమ పదంబు నిచ్చెదవు; భక్తజనాళికి దీనకోటికిన్
వరదవు నై ప్రపూర్ణ సుఖ వర్ధని వై విలసిల్లు దీశ్వరీ!

102. చం॥ మునిగితి నేడు దుఃఖమున ముచ్చురిలో పతి రూప మెద్దియో
కనుఁగొన జాలకుంటిని జగజ్జననీ! కడు మోసమయ్యె, యే
యనువున నింక నిట్టి విపదంబుధి దాటుదు నమ్మ! నా పతిన్
గనఁగల శక్తినిమ్ము నను కావుము సత్కరుణన్ మహేశ్వరీ!

103. చం॥ అని కడు దైన్యచిత్తమున నాసతి వేడగ లోకమాతయున్
కనికర మూని తత్ హృదయ కంజమునన్ వడి వచ్చినిల్చి, య
వ్వనిత కొసంగెఁ బ్రీతి తన భర్తను గన్గొన జాలుశక్తి, నె
మ్మనమున పొంగి యంత ముని మాన్య పతిన్ గనె నాసుకన్యయున్

104. కం॥ సంతసమున నశ్వినులా
యింతిన్ స్తుతియించి తన్మహి మమునకు నిజ
స్వాంతమ్ములలర నిలిచిన
యంతన్ మునివరుడు చూచి యానందమునన్

105. చం॥ ముదుసలి నైన నాకిటుల పొందుగ యౌవన రూప సంపదల్
సదయులరై యొసంగితిరి, సత్కృతి యింతకు మించి కల్గునే?
ముదితకు సౌఖ్య మింతయును మున్నిడఁ జాలక పోతినంచు నే
నెదఁగడు దుఃఖ మందితిని, యిప్పుడు తీరె విచార మంతయున్

106. చం॥ ఉపకృతి నిట్లు సల్పిన మహోన్నతులౌ తమ కేను నిప్డు ప్ర
త్యుపకృతి చేయకున్న మది కూఱట కల్గునె? జన్మ వ్యర్థ మై
కృపణుడ నౌదుఁగాన తమ కెయ్యది కావలె కోరుడయ్య నన్
గృప ఋణముక్తుఁ జేయుడు త్వ దీప్సితమున్ నెరవేర్పఁ జేయుడీ!

107. చం॥ అనవిని యశ్వినుల్ పలికి రమ్ముని వర్యునిఁగాంచి మ్రొక్కి, యో
యనఘ! కొఱంత మాకు నిసుమంతయుఁగల్గదు, మాదు కోర్కెల
య్యునుని యనుగ్రహంబున నహీనగతిన్ నెఱవేరుచుండ స
న్మునివర! కోరదగ్గదిక మూడు జగంబుల లేదు మాకెటన్

108. ఉ॥ ఐనను మీకుఁ దృప్తి యగు నట్లుగ నొక్కటి కోరుచుంటి మో
మానిత సత్తపో విభవ! మాకు చిరంతనమై మనంబులన్
మానక సోమ పానము నమర్త్యులఁ గూడి యొనర్చు వాంఛ మెం
డైనను దేవవైద్యులము నౌట నిషిద్ధము వజ్రి యానతిన్

109. వ. మాయీ కోర్కె నెరవేర్పగల్గినచో మేము సంతసించెదము

110. మ॥ అని వేడన్ చ్యవనుండు సూర్యసుతులారా! తీర్తు మీకోర్కె యిం
ద్రునకున్ గోపము వచ్చినన్ వెఱవ నన్నున్ నమ్ముడీ! శీఘ్రమే
జననాథుండును నాకు మామ యును నౌ శర్యాతి యజ్ఞమ్మొన
ర్చును, తద్యజ్ఞమునన్ త్వదీప్సితము తీరున్ పొందు నిక్కమ్ముగన్

111. కం॥ అన విని దేవ భిషక్కులు
చనిరి నిజ నివాసములకు సంతోషమునన్
మునియును సుకన్యతోఁ జనె
తనయాశ్రమ భూమికంత తద్దయు వేడ్కన్

112 మ॥ తన యల్లుండిటు సుందరుండయిన వృత్తాంతంబు శర్యాతి కిం
కను రాలేదొక వార్తయేని; కడు దుఃఖంబంది తత్పత్నియున్
తనయన్ జూడగ కోర్కెగల్గ తన భర్తన్ జేరి యోనాథ! చ
య్యన మున్యాశ్రమ మేగి వత్తము సుకన్యన్ జూడ నెంతున్ మదిన్

## శర్యాతి సుకన్యను శంకించుట

113. కం॥ అనినన్ శర్యాతియుఁ దా
తనయను చూడంగ మదిని తహ తహపడుచున్
వనమున కేగుద మిపుడని
తనసతి దుఃఖమును బాపి తత్ క్షణమందున్

114. చం॥ అరదము నెక్కి యిర్వురు రయంబున నాశ్రమ భూమికేగి కాం
చిరి నవయౌవనాకృతుని, స్నిగ్ధశరీరు, నిమీలితాక్షునిన్,
తరణి సమాన తేజు, పరతంత్రుని, నిత్య జపానురక్తు న
చ్చెరువు మనంబులన్ గదుర చిత్ర గతిన్ గడు చంచలాత్ములై

115. చం॥ కని, యిదియేమి? నిక్కముగ కాడిత డల్లుడు, క్రొత్తవానిగాఁ
గనబడు, చేయరాని దొక కార్యము కూతు రొనర్చెనేమొ, య
మ్ముని వరునిన్ వధించి యిటు మోహన రూపుని వీని పొందు గై
కొనెనని తోచు కామమునకున్ వశమై యపకీర్తి కొగ్గుచున్

116. మ॥ మను వంశమ్మున కప్రతిష్ఠ కలుగున్, క్ష్మానాథులున్ నవ్వరే, !
తన కూతున్ గుణహీనఁ గాంచి మనునే తండ్రెవ్వడైనన్ భువిన్;
ఘన పాపంబులు మూటఁ గట్టు కొని దుఃఖప్రాప్తికై యివ్విధిన్
తనయల్ పుట్టుచునుందు రక్కటకటా! తథ్యంబు లోకంబునన్

117. ఉ॥ ఇంతటి పాతకమ్మునకు నిట్లొడి గట్టిన దీనిఁ జంపుటే
యెంతయు ధర్మమౌ, నయిన నింతిని కూతును సంహరించు ట
త్యంతము పాప మౌను గద యంచుఁదలంచుచు వార లిర్వు ర
ల్లంతట దవ్వులన్ రథము నందు నిలంబడి యుండి రార్తులై

118. ఉ॥ అంత సుకన్య కొంతవడి కాశ్రమమున్ విడివచ్చి చూచె నా
చెంతన తల్లిదండ్రులను; చేతము సంతసిలంగ పర్వునన్
చెంతకు వచ్చి యేమిటిది చింతిలు చుంటిరి, రండు లోనికిన్
స్వాంతము లందు పూర్వపు విచారము లింకను వీడ కుంటిరే





119. కం॥ వదలుడు మీ దుఃఖమ్ముల
నదె చూడుడు మదన తుల్యు డల్లుడు చ్యవనుం,
డదవద చెందక యాతని
పదములకున్ మ్రొక్కు డవలఁ బడయుడు శాంతిన్

120. మ॥ అన శర్యాతి మహోగ్రుడై పలికె నాహా యెంత విడ్డూర, మి
ట్లనగా నోరెటు వచ్చె, వృద్ధుడగు నీ యాత్మేశు డేమయ్యె, న
మ్ముని వర్యున్ వధియించి యీ యువకునిన్ మోహించితే పాపివై?
నినుఁ గన్నందుకు సూర్యవంశ మది పొందెన్ ఘోర పాపం బిలన్

121. మ॥ అని కోపంబున తండ్రి పల్క నపు డయ్యబ్జాక్షి మందస్మితా
ననయై యోజనకా! యితండె కద నా నాథుండు, మీకేల యీ
యనుమానంబు, ప్రభాకరాత్మజుల దివ్యానుగ్రహంబీ తపో
ధను మార్చెన్ గడు దివ్యరూపునిగ, సత్యంబిద్ది ముమ్మాటికిన్.

122. కం॥ నను నీకూతును తండ్రీ!
యనఁదగునే యిట్లు; వీరి నడుగుడు మీకున్
వినిపించు నిజమ్మని య
మ్మునిఁ జూపె సుకన్య మిగుల మోదము తోడన్

123. కం॥ తన తనయ పలుకులన్ విని
జనపతి శర్యాతి సుంత శాంతాత్ముండై
ముని వరునకు మ్రొక్కినిలిచి
వినిపింపుము విషయమనుచు వేడె నతుండై.

124. ఉ॥ ఆతని వేదనన్ గనిన యమ్ముని వర్యుడు నవ్వి పల్కె నో
భూతల నాథ! యశ్వినుల పూర్ణ యనుగ్రహ సంపదున్నతిన్
నా తను విట్లు యౌవనమునన్ దనరారుచు నుండె, దీనికిన్
భాతిగ నే నొనర్పవలె ప్రత్యుప కారము వారికెట్లనన్

125. తే.గీ. తమరొనర్చెడి యజ్ఞ కార్యమున నేను
వారిచే సోమ పాన మ్మువారితముగ
సురల తోడున చేయింతు సుమ్మటంచు
వరమొసంగితి దాని తీర్పంగ వలయు

126. కం॥ కావున సందియ మందక
నీ విక యజ్ఞమ్ము సేయ నియతాత్ముడవై
కావలసిన సంభారము
లేవియును కొఱంతలేక యేర్పరపు మొగిన్

127. చం॥ సురపతి యాగ్రహించునని సుంతయు శంక వహింపఁ బోకు మో
నరపతి! నా తపో బలమునన్ దివిజేశుని నిల్వరింతు, న
త్తరణి తనూజు లశ్వినులు తద్దయు వేడుక సోమపానమున్
విరివి నొనర్పఁ జేయుదును వేల్పుల పంక్తి నవారితంబుగన్

128. చం॥ అని ముని పల్క సంతసమునంది ధరాధిపుడంత భార్యతో
తన గృహమేగి మంత్రులను, దాంతు వసిష్ఠుని తక్కు విప్రులన్
గొనకొని పిల్వఁ బంపి కడు కూరిమి వారల సమ్మతంబునన్
ఘనముగ యజ్ఞ వాటికను గట్టగ శిల్పుల నాజ్ఞ సేసినన్

129. కం॥ వారలతి శీఘ్రు గతి కడు
నేరుపునన్ హవన వాటి నిర్మితి సలుపన్
పౌరోహిత్ు లొక మూరుత
మారసి తెలుపంగ భూపు డపుడు ముదమునన్

130. చం॥ కుల గురువౌ వసిష్ఠు, నతికూరిమి తక్కిన వేద వేత్తలన్
పలువురఁ బిల్చి యెల్లరకు భక్తి సపర్య లొనర్చి యంతటన్
బిలువగఁ బంపె నల్లుని ముని ప్రవరున్ చ్యవనాఖ్యు గౌరవం
బలవడ; నాతడున్ గడు ప్రియంబున వచ్చె సతీ సమేతుడై

131. మ॥ అత దధ్వర్యముఁ బూన; సాగె నపు డయ్యజ్ఞంబు; వేగంటి దే
వతలన్ దోడ్కొని వచ్చె; సూర్య సుతులున్ బ్రత్యక్షమై రంతటన్
దితిజారాతి విభుండు వారిఁగని సందేహించి, వీరిట్లు రాఁ
గతమేమీ యని దేవతాళి నడిగెన్ గాంతాళ ముప్పొంగగన్

**అశ్వినీదేవతలకు సోమపానార్హత**

132. చం॥ దివిజులు వల్క కట్టిటుల దిక్కులు చూచుచు నుండి, రంత లో
చ్యవనుడు వచ్చి దస్రులకు సమ్మతి సోమరసంబు నిచ్చె; నా
దివిజ విభుండు దానిఁగని తెల్పె నసమ్మతి; నంత మౌనియున్
పవిధరుఁ గాంచి శాంతముగఁ బల్కెనిటుల్ గడు యుక్తసంగతిన్

133. ఉ॥ వీరును దివ్యులే గద వివేచన సేయుము దేవ నాథ! యే
తీరున వీరనర్హులని తెల్పెదు సోమరసమ్ముఁ ద్రావగన్
వీరికి నే వరంబిడితి ప్రీతిగ సోమరసంబు నిత్తునం
చారయ వీరి దోషమెది యౌనా? యెఱంగగఁ దెల్పుడింతకున్

134. మ॥ అమరేంద్రా! విను వీర లిర్వురును నా యాకారమున్ మార్చి నన్
రమణీ యాకృతు గా నొనర్చిరిటు, వీరల్ నన్ను యజ్ఞమ్ము నం
దమరా నీకముతోడ సోమరస మాహారింపఁ జేయంగదే
శమితాత్మా! యనివేడ నట్లెయని నే సంతోషి నై పల్కితిన్

135. కం॥ వీరికిపుడు ప్రత్యుపకృతి
కూరిమి నే సలుప వలయుఁ గొంకుట తగునే
వారింపకు మోయింద్రా!
వీరికి నే నిడిన మాట వీడ నిజముగన్

136. మ॥ అనినన్ దేవ విభుండు వల్కె ముని వర్యా! వైద్యులౌ వీరికిన్
జనదీ సోమరసం బొసంగ సురలీ చందంబునన్ నిర్ణయం
బొనరన్ జేసిరి; మీ ప్రయత్నమును దివ్యుల్ మెచ్చఁ బోరంచు హె
చ్చిన కోపంబునఁ బల్క నమ్మునియు కించిత్ క్రోధ సంజాతుడై

137. ఉ॥ శాంతి వహింపుమయ్య యిక చాలును కోపము వృత్ర హంత! వీ
రింతకు చేయరాని దొసగేమి యొనర్చిరి, దేవ వైద్యులై
నంతనె సోమపానమున కర్హులు గారొకొ, ఇట్టి నిర్ణయం
బెంతయు గర్హణీయము సురేంద్ర! యికేల వృథా ప్రసంగముల్

138. కం॥ అని ముని గద్దించి పలుక
ననిమిషు లెవ్వరును మాట లాడక యుండన్
తనదు తపో బలమున ముని
యినసుతులకు సోమరసము నిచ్చెన్ వేడ్కన్

139. చం॥ అదిగని క్రుద్ధుడై యనిమి షాధిపు డోచ్యవనా! యిదేమి దు
ర్మదమున మమ్ము నిట్టు లవమాన మొనర్చితి, వింకచాలు, ని

న్వదలను సైపఁ జాలనిక వారల కిచ్చిన సోమ పాత్రలన్
గదుకక మున్నె గైకొనుము కాదనఁ గుత్తుక నుత్తరించెదన్

140. మ॥ అని యింద్రుండిటు లుగ్రుడై పలుక తా నావంతయున్ లెక్క సే
యని మౌనీంద్రుడు సోమపాత్రముల నట్లందింపగా నప్పు డ
శ్వీను లానందము బొంది రంతటఁ గడున్ శీఘ్రంబుగా వజ్రియున్
యినకోటి ప్రభమైన వజ్రమును తానేసెన్ మునిన్ ద్రుంపగన్

141. చం॥ దివిజులు తక్కు మౌనులును దీన గతిన్ దిలకించు చుండ నా
చ్యవనుడు తీక్ష్ణ దృక్జ్వలన సంతతులన్ ప్రసరింపఁ జేసి యా
పవి నట నిల్పి యంత బలభంజను ద్రుంపఁ దలంచి యగ్నియం
దవిరళ రీతి నాహుతుల నప్పుడ వ్రేల్చె సమంత్రకంబుగన్

142. వ. అయ్యవసరంబున

143. చం॥ బలియుడు గ్రూరుడున్, విపుల వజ్రకఠోర శరీరు, డుగ్ర సం
చలిత లలాట నేత్రయుగ సర్వభయంకరు డొక్క రక్కసుం
డలఘు మదోద్ధతుండునయి యాక్షణ మందె జనించె "కృత్య" యా
బలరిపు సంహరింప ఘన పర్వతమోయన పూరుషా కృతిన్

144. సీ॥ తన నాల్గు కోరల నిన శశి యుడురాశిఁ
బట్టి పిప్ట మొనర్చు భంగిఁ దనర
తనదీర్ఘ బాహుల ఘన పర్వతావళిఁ
బెకలించి విసరెడి విధము గదుర
అరుణారుణ జ్వాల లలరు నాలుక తోడ
దివిఁ జప్పరించెడి తెఅగు పరగ
అంజనాద్రికి సాటి యన నొప్పుదేహమ్ముఁ
గనువారి గుండెలన్ గలతవెట్ట

గీ॥ గిరి శిఖరమును బోలెడు గ్రీవమొప్ప
అవని నంబరమ్మునుఁ దాకు దవుడ లమర
గునపముల వోలె వెంట్రుకల్ గూడి యుండ
నసురు దుదయించె మదుడను నాఖ్య నచట





145. చం॥ అతనిని గాంచి నంత దివిజాధిపుతో దివిజావళుల్ వికం
పితమతులైరి; రక్కసుడు విస్తృతమౌ నిజవక్త్ర సీమయం
దతులిత రౌద్రుడై యశని నట్టులె పట్టుక నిశ్చల స్థితిన్
దితిజులు సంతసంపడగ దివ్యులు భీతిల నిల్చె నుద్ధతిన్

146. చం॥ నిలిచిన రక్కసుం డటులె నింగి వడంక మహేంద్రు మీదకున్
చలమున దూకి నిన్నిపుడె చంపుదు చూడు మటంచుఁ బట్ట, న
గ్గలమగు భీతి దేవపతి కాళులు సేతులు నాడకుండుటన్
కళవళ మంది దిక్కెదియుఁ గానక లోఁ దలచెన్ బృహస్పతిన్

147. చం॥ తలచిన యంతనే కడు నుదాత్తుడు దేవ గురుండు వచ్చి యు
మ్మలికముఁ గొన్న యింద్రుఁ గని మన్నన నిట్లనె యోమహేంద్ర! యి
య్యలఘు శరీరు డీచ్యవను యజ్ఞకుటిన్ జనియించె నీతనిన్
కలన జయింప కష్టమగు, కట్టు వడం దురు మంత్రశక్తికిన్

148. కం॥ కాన నిపు డొక్క మార్గము
నేనాలోచించినాడ నీవా చ్యవనున్
దీనుడవై వేడు కొనుము
తా నభయం బొసగు నీకు తప్ప దరుగుమా!

149. చం॥ అనఁదన దోష మమ్మఘవు డాత్మనెఱింగి మనంబునందె య
మ్ముని వరు రూపమున్ దలచి మ్రొక్కుచు నేగి తదీయ పాదముల్
తన శిరమంట పృథ్విఁబడి తప్పును సైపు మహాత్మ! యింక నీ
దనుజు మరల్పు మయ్య! జవదాటను మీ వచనంబు నింతటన్

150. ఉ॥ సోమ రసమ్ముఁ ద్రావుటకు సూర్యకుమారులు నర్హులింక నో
స్వామి! తలంప విఘ్నము, నిజమ్ముగ నీ ధరణీశు కీర్తియున్
మీ మహిమంబు నల్దెసల మేదినికిన్ దెలియంగఁ జెప్పగా
నా మది నెంచి యివ్విధి నొనర్చితి నమ్ముము మౌని సత్తమా!

151. చం॥ అని బ్రతిమాలు చున్న యమరాధిపుఁగాంచి మహర్షిశాంతుడై
తనమది కోపమున్ విడచి దానవ వైరిని లేవనెత్తి త
న్మనమున కూఱటన్ గొలిపి మాంసలు రక్కసు కాయమెల్ల ఖం
డన మొనరించి జీర్ణము నొనర్చెను తక్షణ మచ్చటచ్చటన్

152. కం॥ ద్యూతమ్ముల, మద్యములన్
నాతుల దేహముల యందు, నానా మృగయా
రీతుల, నా మదుని తనువు
నాతడు జీర్ణం బొనర్చె నమరులు మెచ్చన్

153. తే.గీ. అంత చ్యవనుడు యజ్ఞ కార్యమ్ము నెల్ల
పూర్తిగావించి శర్యాతి ముదము బొంద,
ననిమిషుల పంక్తిఁ ద్రావించె నశ్వినులకు
సోమ రసమును సర్వులు చూచు చుండ

154. మ॥ జననాథా! యిటు లశ్వినుల్ చ్యవను చే సంతృప్తులై సోమమున్
గొన తామర్హతఁ బొంది; రయ్యది మొదల్ కొండాడి రెల్లప్రజల్
ముని, నవ్వాని కుటీరమున్, మఱియు నా భూభాగమున్, ఆ కొలం
కును లోకంబులలో పవిత్రములనన్ గూర్మిన్ ప్రసిద్ధంబుగా

## రేవతుని సత్యలోకయాత్ర

155. సీ॥ సూర్యాన్వయుండైన శర్యాతి కుదయించె
ఆనర్తుడను సుతు డలఘు యశుడు
వాని తనయుడు రేవతుడు సాగర మందుఁ
గట్టెఁగుశస్థలి పట్టణమును
శాత్రవ రుద్రుడై సకల భోగమ్ముల
ననుభవించెను మఖవుని విధమున
అతనికి నూర్గురు సుతు లుద్భవించిరి
కడమ నొక్క తనయ కలిగెఁ బ్రీతి

గీ॥ సకల శుభలక్షణయగు నా చంద్ర ముఖికి
రేవతి యను నామ మిడి యా భూవరుండు
పెంచు చుండంగ మిక్కిలి ప్రేమ తోడ
యౌవనంబున నడుగిడె నా మెలంత

156. ఉ॥ రేవతు డంత రైవత గిరిప్రవరంబున కేగి పుత్రికిన్
భావజ సుందరుండయిన భర్తను చూడగ నెంచి రాజ పు
త్రావళినెల్లరన్ గనుచు నర్హునిఁ గానక యొక్కనాడు తా
రేవతి తోడ నేగెను విరించిని వేడఁ దలంచుచున్ మదిన్





157. ఉ॥ అచ్చట బ్రహ్మలోకమున నాగమముల్, నిగమంబులున్, ఋషుల్,
హెచ్చగు యజ్ఞముల్, గిరులు, నేపగు సాగరముల్, నదుల్ వడిన్
వచ్చి వినమ్రతన్ నిలిచి వారిజ గర్భుని మ్రోల భక్తి మై
నచ్చగు దివ్యరూపముల నర్థిధరించి నుతించుటల్ గనెన్

158. కం॥ అని కృష్ణ ద్వైపాయను
డన విని జనమేజయు డిటు లడిగెను మౌనీం
ద్రునిఁ గని వినయాన్వితుడై
తన మదిఁ గల సంది యమును ధార్మికబుద్ధిన్

159. చం॥ అనయము శాంతచిత్తుడును నాఢ్యుడు బ్రహ్మవిదుండు నైన బ్రా
హ్మణునకు మాత్రమే కలుగు నర్హత యబ్జజు లోక మేగ గా
నని మును చెప్పియుంటిరి గదా! యిపుడొక్క ధరాధి పుండు కూ
తును గొని యెట్టు లేగె నల తోయజ గర్భునిఁ గాంచ సన్ము నీ!

160. ఉ॥ మానిత సత్తపో విభవ! మానవ దేహముతోడ బ్రహ్మ లో
కానకు నెవ్వరైనఁ జనఁ గల్గుదురే? యటు లేగిరేని యా
మానవు లింక భూస్థలికి మార్పులు లేక యథాతథమ్ముగా
రానగునే మునీంద్ర? వివరమ్ముగ నా కెఱుగంగఁ దెల్పుమా!

161. మ॥ అనినన్ నవ్వుచు వ్యాసు డిట్లనియె రాజా! సర్వలోకమ్ములున్
గననౌ మేరు ధరాధరాగ్రమున, స్వర్గంబేగి యైదేండ్లు తా
ననఘుం డర్జును డుండి వచ్చెఁ గద! మర్త్యాకారుడై; యట్లె యిం
కను కాకుత్సుడు, పెక్కు రక్కసులు నాకం బేగినారల్ గదా!

162. చం॥ మునునొక కాలమందు తన పుణ్య బలోన్నతిచే మహాభిషుం
డను ధరణీశు డబ్జభవు నర్మిలిఁ జూడఁదలించి యేగుచున్,
గనియెను గాలి తాకిడికిఁ గ్రన్నన పయ్యెద వైదొలంగ త
క్షణమున నర్ధనగ్నయగు గంగను కామవికారచిత్తు డై

163. కం॥ ఆమెను గని యాతండును
నామెయు నాతనిని గాంచి యనురాగముతో
నేమరచి నవ్వు కొనుటన్
తామరస భవుండు గాంచి తద్దయు నలుకన్

164. తే.గీ. ఉర్వి జనియింపుదని శాపమొసగె నపుడు
దాన వారలు పృథ్విపై మానవులుగ
జన్మమెత్తిరి, పూర్వమీ సంగతి యును
తెల్పియుంటిని గద! నీకు తెల్లముగను

165. చం॥ దనుజులు దైత్యులున్ మునుపు దండడి వెన్నుని లోకమేగి యం
దొనరు విశేషముల్ గనుచు నొయ్యన వెన్కకు వచ్చు వారుగా
వినబడుఁ గాని, యిప్పుడది విన్నడ దెచ్చట వారిదృష్టు ల
య్యనిమిషలోక మేగి దివిజాధిపు నోర్చుట యందె నిల్చుటన్

166. చం॥ అమరులు మాత్ర మిప్పటికి నవ్వనజాక్షుని చెంతకేగి ని
త్యము నసురాళిచే తమకు నయ్యెడి బాధలు చెప్పుకొంచు దై
న్యమున నుతించు చుందురు; మహాత్ములు తాపసు లేడకైన న
శ్రమమున నేగి రాగలరు స్వార్జిత పుణ్య విశేష సంహతిన్

167. వ. మఱియు యజ్ఞము లొనర్చిన వారును మహారాజులును నిరాటంకము గా అన్ని లోకములకు వెళ్లి రాగలరని పల్కి వ్యాసుడు రేవతుని యుదంతము నిట్లు కొనసాగించె

168. చం॥ అతుల సుధాకరాన్వయ సుధాబ్ధి శశాంక! ధరాధిపుండు రే
వతుడు చతుర్ముఖున్ గని సభక్తిఁ గరంబులు మోడ్చి పుత్రి రే
వతినటు చూపి యీమెకు వివాహము చేయఁ దలంచినాడఁ గా
న తగిన వానిఁ జూచి కరుణన్ దెలుపన్ దగు యోగ్యునొక్కనిన్

169. ఉ॥ చూచితి రాకుమారుల వసుంధరఁ బెక్కుర నైన నొక్కడున్
దోచడు చక్కనై మదికి తొయ్యలి కీడగు వాడు, గావునన్
దాచక రాచపట్టి నతి దాన గుణున్ బలశాలి యోగ్యు ధ
ర్మాచరణున్ వరున్ దెలుపు మయ్య! తనూభవనిత్తు వానికిన్

## రేవతీ బలరాముల వివాహము

170. కం॥ అని రేవతు డభ్యర్థిం
చిన సారసగర్భు డపుడు చిఱునవ్వులు మో
మున చిందించుచు మనమున
క్షణమాలోచించి పలికె క్ష్మాపతిఁ గనుచున్





171. మ॥ నరనాథోత్తమ! నీవు చూచిన ధరానాథాత్మజుల్ శీఘ్రమే
పరలోకమ్మున కేగు వారలె; ధరా భారమ్ముఁ దీర్పంగ నా
పరమాత్ముండు వికుంఠు డిద్ధరణి పై వర్ధిల్లు చున్నాడు. దు
ర్భర దుర్మార్గుల రాకుమారుల వధింపన్ గృష్ణ నామంబునన్

172. కం॥ అతనికి బలరాముండన
నతుల గుణుం డగ్రజుండు హలధరుడు గలం
డతి వీరుడు శేషాంశజు
డతనికి నీ తనయ నొసగు మవనీ నాథా!

173. కం॥ యదు వంశజులగు వారిపు
డదె ద్వారక నున్నవార లవనీ భారం
బదిమెడి కార్యంబునకై
యదను కొఱకు వేచి;యిప్పు డచటికిఁ జనుమా!

174. చం॥ అని కమలాసనుండనగ నద్ధరణీశుడు కూతుతోడ చ
య్యనఁ జని ద్వారాకా నగర మందు హలాయుధుఁగాంచి వానికిన్
దనయ నొసంగి పెండిలి ఘనమ్మగు రీతి నొనర్చి యంతటన్
వనములకేగి భీకర తపం బొనరించుచు వీడె దేహమున్

175. తే.గీ. రేవతుడు కూతు తోడ విరించి కడకుఁ
జనుటఁ గని రక్కసులు కుశస్థలిని ముట్ట
డించి యతని సంతతి నెల్లఁ ద్రుంచు చుండ
ప్రాణభయమున కొందరు పర్విలిడిరి

## ఇక్ష్వాకు శశాదుల చరిత్ర

176. మ॥ మను పౌత్రుండు క్షువంతు సత్సుతుడు సంభావ్యుండు నిక్ష్వాకుడన్
జననాథుం డిన వంశకర్తయనగా సత్కీర్తి నార్జించియున్
తనయుల్ లేరను చింత, నారద మునిన్ దర్శించి ప్రార్థింప న
మ్ముని వర్యుండొక మంత్రమున్ గడుఁ గృపాపూర్ణుండు నై యిచ్చినన్

177. కం॥ ఆ దేవీ మంత్రమ్మును
మోదమ్మున స్వీకరించి భూమీశుండున్
వేదన యెఱుగక సతతం
బాదరమున జపమొనర్చె నతి తీవ్ర గతిన్

178. తే.గీ. తత్తపః ఫలితమున నతనికి సుత శ
తంబు గలిగె కడు సుగుణ ధనులు వీరు,
లందు నగ్రజుడు వికుక్షి యమిత బలుడు
జనకు నాజ్ఞను తలఁ దాల్చి సాగుచుండు

179. కం॥ తన తనయులలో నిర్వురఁ
దనకున్ రక్షకులఁ జేసి తక్కిన వారిన్
బనిచెను మిగిలిన దిశలకు
ననయము రక్షింపు డనుచు నాజ్ఞ యొసగుచున్

180. కం॥ ఇనకులపతి యొకదినమున
తన పితరుల శ్రాద్ధకర్మ తద్దయుభక్తిన్
గొనకొని చేయగ మాంసముఁ
గొనితెమ్మని పంచె పెద్ద కొడుకు వికుక్షిన్

181. చం॥ పనిచిన నా వికుక్షి యును వైళమ యాయుధ మొందుదాల్చి ని
ర్జన వన సీమ కేగి మృగ సంతతులన్ వధియించి యంతటన్
తన యుదరాగ్ని బాధ కడు తల్లడపెట్ట భరింప లేక క్ర
న్నన శశ మాంసమున్ దినె మనమ్మున నెంచక శ్రాద్ధసంగతిన్

182. చం॥ మిగిలిన యామిషమ్ముఁ గొని మిక్కిలి సంతస మందుచున్ సుతుం
డగణిత భక్తిఁదెచ్చి తన యప్పకొసంగగఁజూచి యాజ్ఞికుల్
తగదిది శ్రాద్ధకర్మలకు తప్పొనరించెను నీ సుతుండు, ముం
దుగ భుజియించె కొంత, యిది దోసము కూడ దటంచు బల్కినన్
"భుక్తశేషంతునశ్రాద్ధే ప్రోక్షణీయ మితిస్థితిః"

183. శా॥ పక్షద్వంద్వము సంచలింప నపుడిక్ష్వాకుండు కోపమ్మునన్
రూక్షేక్షుండయి పుత్రునిన్ బిలిచి యోద్రోహీ యిటుల్ ముందు నీ
కుక్షిన్ నింపిత్వదుజ్ఝితామిషము జంకున్ గొంకునున్ లేక యి
ట్లక్షీణోత్సవ మొప్పఁదెచ్చితివి న్యాయంబౌనె యీకృత్యముల్

184. కం॥ అని గర్జించుచు నిక పై
తన దేశమునందు నుండఁ దగ డిత డనుచున్
బనిచెను ఘోరాటవులకు
తనయుండని యైన మదినిఁ దల్పక వేగన్





185. కం॥ ఆ దినము నుండి యతడు "శ
శాదు" డనెడి పేర నొప్పి సాంద్రాటవులం
దాదిమ జాతులఁ గూడుక
నాదరమునఁ దిరుగసాగె ననవర తంబున్

186. వ. అంతకొంత కాలంబున కిక్ష్వాకుండు పరలోక గతుం
డగుటచే శశాదు డయోధ్యకు వచ్చి రాజ్యపాలన సాగించె

187. కం॥ అతనికి కకుత్సుడను నొక
సుతుడుద్భవ మందె మిగుల సుగుణోపేతుం
డతుల పరాక్రము డాతడు
నుతి కెక్కె జగమ్ములం దనూన యశుండై

188. తే.గీ. ఆ కకుత్సున కింద్ర వాహను డనియు, పు
రంజయుండని యును రెండు ప్రథిత నామ
ములు గలవు! వానిఁ దానెట్లు పొందెననిన
కారణమ్ములు వినుమయ్య! కౌరవేంద్ర!

189. కం॥ తన తండ్రి శశాదుడు తా
తనువును వీడంగ నంతఁ దా నరపతియై
వినుతిఁ గనె కకుత్ స్థుడు స
ద్గుణఖని యని లోకమెల్లఁ గొనియాడంగన్

190. ఉ॥ ఆ సమయమ్మునం దమరు లాహవ మందున రాక్షసాళి చే
గాసిలి యోడి యందరునుఁ గంజ దళాక్షునిఁజేరి దీనులై
దోసిలి లొగ్గి వేడుకొనఁ దోయజ నాభుడు వారిఁ గాంచి మీ
రీ సమయమ్మునన్ ధరణి కేగి కకుత్స్థుని వేడు డొప్పుగన్

191. చం॥ అతడు మహేశ్వరీ కృప ననంత పరాక్రముడై ధరాతలిన్
వితత యశంబు నొందె పృథివీ పతులందు; రణోర్వినిల్చి తా
శిత విశిఖాళిచే దనుజ శీర్షములన్ భువిఁ దుల్లఁ జేయు, మీ
వెతలునుఁ దీఱు పొందనిన వేల్పులు వెన్నుని యాజ్ఞ చొప్పునన్

192. కం॥ వడి వడి నయోధ్యకుంజని
తడబడుచు కకుత్స్థుఁగాంచి తమ గోడెల్లన్

జడియక తెల్పగ సంబర
పడి యా భూపతియు నాక వాసులఁ గనుచున్

193. కం॥ నిలిచెద మీ పక్షమ్మున
నలయక నయ్యసుర గణము నణచెద; నైనన్
కలనున వాహనమై వే
ల్పుల పతి నా కమర వలయుఁ బొల్పొందంగన్

194. మ॥ అనినన్ దేవత లెల్లరున్ గలసి నాకాధీశుతోఁ గూడి మె
ల్లన చర్చించి స్వకార్య నిర్వహణ కేలాయింక సిగ్గెగ్గులున్
జననాథుండు వచించి నట్లతనికిన్ సంగ్రామరంగాన వా
హనమైయుండుట మీకు తప్పదని స్వర్గాధీశు నొప్పించినన్

195. తే.గీ. వృషభ రూపము ధరియించె నింద్రుడపుడు
అపర రుద్రుని యట్టు లయ్యవని పతియు
వృషభ వాహన మెక్కి వేవేగ నరిగె
యుద్ధభూమికి నసురుల నుక్కడంప

196. కం॥ కకుదస్థితు డౌటన్ దా
ప్రకటింపంబడె కకుత్స్థవర నాముండై
కకుదాకృతి నింద్రుడు వా
హకు డౌటను నింద్రవాహ నాఖ్యన్ బడసెన్

197. కం॥ దితిజ పుర విజేత యగుట
నుతియింపంబడె పురంజనుడను వరాఖ్యన్
క్షితిని కకుత్స్థాన్వయులని
యతని వలన కీర్తిగాంచి రందలి నృపతుల్

198. సీ॥ ఈ కకుత్స్థుని సుతుం డీశ్వరీ భక్తుడు
పృథుచక్రవర్తి సద్వినుత యశుడు
పృథు సుతుం డనఘుడు విశ్వరంధి విమలు
డతని సుతుడు చంద్రు డతుల గుణుడు
బలశాలి యవనాశ్వు డల చంద్ర సూనుడు
వాని తనయుడు శావంతు డవని





నమరావతికి సాటి యగు నగరముఁ గట్టె
శావంతి యను పేర సమ్మతమున

గీ॥ అతని పుత్రుడు బృహదశ్వు డనగ నొప్పె
కువల యాశ్వుడు వానికిఁ గూర్మి సుతుడు
దుంధుడను రాక్ష సాధముఁ ద్రుంచి యితడు
దుంధు మారుండనంగఁ బ్రస్తుతిని గొనియె

199. తే.గీ. ఇతని యౌరసుడు దృఢాశ్వు డతుల బలుడు
వాని సుతుడు హర్యశ్వుడు, పరగ నతని
తనయుడు నికుంభు, డతని యాత్మజుడు బర్హ
ణాశ్వు డతని పుత్రుండు కుశాశ్వు డనఘు
డతని సుతుడు ప్రసేన జిత్తనగ నొప్పె
యౌవ నాశ్వుడు వానికి నాత్మజుండు
వాని సుతుడు మాంధాత యవార్యశౌర్య
ధనుడు తండ్రి గర్భమునుండి జనన మందె
నతని పుట్టుకఁ దెల్పెద నాలకింపు

## మాంధాత జన్మవృత్తాంతము

200. చం॥ వరుసగ నూర్గురన్ సతుల వారిజ నేత్రలఁ బెండ్లియాడియున్
చిరమును సంతతిన్ గనక చింతిలి చింతిలి యౌవనాశ్వు డ
స్థిరమతుడై వనమ్ములకుఁ జేరి యటన్ ఋషి వర్యులన్ దపో
వరులను గాంచి దుఃఖిలుచుఁ బల్కెనిటుల్ కరముల్ మొగుడ్చుచున్

201. చం॥ వినుడు మహర్షులార! యిదె విన్నప మొక్కటి, రాజ్య భోగముల్
ఘనముగఁ బొందియుంటి, తురగంబులు పెక్కులు గల్గు, మంత్రులున్
వినయ వివేకు, లంగనలఁ బెండిలి యాడితి నూర్గురన్, భువిన్
నను నెదిరించి నిల్వగల నాథు డొకండును లేడు దిక్కులన్

202. ఉ॥ ఐనను సంతతిన్ గనగ నైతి నటంచు విచారమొందు నా
మానస మందుఁ గల్గు ముని మాన్యులు మీ కెఱుగంగరాని దెం
దైనను లేదు; సద్గతుల కర్హుడె పుత్రులు లేని వాడు, సం
తానముఁ బొందు మార్గమును నాకెఱిగింపుడు మీకు మ్రొక్కెదన్

203. చ॥ అన విని యమ్మహర్షులు జనాధిపు నూఱటఁ బుచ్చి దీనికై
మనమున దుఃఖ మింతటను మానుమటంచు వచించి, వానిచే
గొనకొని యిష్టి నొక్కటిని కూర్మి నొనర్పగఁ జేసి యంతమం
దొనరఁద దిష్టి పూర్ణ కలశోదక మవ్విభుచేతి కిచ్చుచున్

204. కం॥ మరు దివసంబున నీ జల
మరుణోదయ వేళ నీదు నంగనలకు నే
మరక యొసంగు మనుచు త
త్పరమర్షులు వల్కి చనిన పార్థివుడంతన్

205. ఉ॥ ఆదిన మర్ధరాత్రి సమయంబున నెక్కుడు దప్పిఁ బొంది సూ
ర్యోదయ వేళ దన్క మది నోపిక పట్టగలేక యజ్ఞ పూ
తోదక కుంభమున్ గొని యయుక్తమటంచుఁ దలంపఁ బోక యా
భూదయితుండు ద్రావె జలమున్ ఋషిపల్కుల నెంచ కాత్మలోన్

206. మ॥ తెలవారం గని రాపురోహితులు తత్తీర్థమ్ము లాపాత్ర యం
దు లవం బేనియు లేక యుంట; యెవరీ తోయంబులన్ ద్రావిరం
చలుకల్ బూనుచుఁ బల్క నవ్విభుడు నే నయ్యంబువుల్ ద్రావితిన్
తెలివిన్ దప్పియటంచుఁ జెప్ప విని భూదేవుల్ వివేచించుచున్

207. తే.గీ. దైవ యోగమ్ముగా వారు తలచు కొనుచు
నిష్టిఁ బరి సమాప్తమ్ము గా వించి యంత
నిజగృహమ్ముల కేగి రాద్విజ చయమ్ము
యజ్ఞ జల పానమున యౌవ నాశ్వుడంత

208. తే.గీ. గర్భమున్ దాల్చె నెలలును గడచె నంత
ఉదర కోశమ్ము చీల్చుక నుద్భవించె
పుత్రుడొక్కడు; కాని యా భూవిభుండు
దైవ వశమున ప్రాణమ్ముఁ దాల్చియుండె

209. ఉ॥ఇ॥ పుట్టిన తత్తనూభవుడు బోరున నేడ్చుచునుండె, నాతనిం
బట్ట నసాధ్యమౌట నట మంత్రులు చేయున దేమిలేక యి
ట్టట్టును చూచుచుండ దివిజాధిపు డయ్యది గాంచి వేగ నా
చిట్టి నిసుంగునోట నిడె శ్రీకరమౌతన తర్జనిన్ గృపన్





210. కం॥ తన తర్జనిఁ జీకుట నా
తనికిడె మాంధాత యనెడి యభిధానమ్మ
య్యనిమిషపతి యది మొద ల
జ్జనపతి కా నామ మవని సార్థక మయ్యెన్

211. చం॥ భుజ బల శాలియై యతడు భూవల యమ్మును నేలె; శాత్రవుల్
నిజబల విక్రమోన్నతికి నిల్వగలేక భయాతిరేకు లై
గజగజ లాడి పర్విడిరి గాఢ వనమ్ముల కెల్లవారు; త
ద్విజయముఁ గాంచి యింద్రుడును వేడుక నవ్విభు గౌరవించుచున్

212. కం॥ త్రస దస్యుండను బిరుదము
నొసగెన్ మాంధాత కంత నుర్వీపతు ల
య్యస మాన వీరుఁ బొగడుచు
వెస నొసగిరి కానుకలను వేడుక లెసగన్

213. తే.గీ. బిందుమతి యనబడు శశ బిందు తనయ
యితని పట్టపు రాణియై యెల్లగతుల
పతిని సేవించు చుండ నప్పడతి కంత
తనయు లిర్వురు గల్గిరి వినయమతులు

214. కం॥ పురుకుత్సుం డగ్రజుడై
గరిమన్ ముచుకుందు డనగ కడపటి సుతుడై
తరుణీ మణికిన్ గల్గగ
నరపతి కానంద మయ్యె నందనులఁ గనన్

215. వ. అందు పురుకుత్సునకు పరమ ధార్మికుండైన అరణ్యకుండును
అరణ్యకునకు బృహ దశ్వుండును, బృహదశ్వునకు హర్యశ్వుండును
హర్యశ్వునకు త్రిధన్వుండును, త్రిధన్వున కరుణుండును, అరుణు
నకు సత్యవ్రతుండును జన్మించిరి

## సత్యవ్రత చరిత్ర

216. సీ॥ అరుణ తనయుడు సత్యవ్రతుండు మిగుల
కామలోలుండు దుష్కర్మకరుడు
ఒక దినమ్మున నాత డొక విప్ర కన్యక

పెండ్లి పీటల మీద వేడ్కనుండ
బలవంత ముగ దానిఁ బట్టి యెత్తుక పోవ
బ్రాహ్మణోత్తము లెల్ల బావురనుచు
నరుణున కెఱిగింప నాత డాగ్రహమున
తనయు నడవులకుఁ దరిమివైచె

గీ. అచట శ్వపచులఁ గూడి సత్యవ్రతుండు
కడు నికృష్ట జీవనమును గడపు చుండ
మార్గమధ్యంబునందు సన్మాన్యుడైన
కుల గురువు వసిష్ఠుని కడు కూర్మిఁ గాంచి

217. మ॥ తనకున్ గల్గిన యాపదన్ దెలిపి యోధన్యాత్మ! మీ రెట్టు లేన్
జనకున్ శాంతిలఁ జేయు మంచుఁగడు విశ్వాసంబునన్ వేడ, న
య్యనఘుం డాతని తండ్రి చర్య కడు యోగ్యంబైనదే యంచు నీ
తని యభ్యర్థనఁ ద్రోసి పుచ్చె కడు నిర్ద్వంద్వంబుగా నయ్యెడన్

218. కం॥ నా కీ శిక్ష విధింపగ
నీకుటిలుడె కారణమని యెంచుచు గురునిన్
చేకొనక నిందలాడుచు
వీకన్ ఘోరాట వులకు వెడలె రయమునన్

219. మ॥ అరుణుండంతట వంశవర్ధనుడు లేడయ్యెన్ గదా! యంచు దు
ర్భర చింతాకులు డౌచు రాజ్య సుఖ సంబంధమ్ములన్ వీడి తా
నరిగెన్ ఘోర వనాంతరమ్ములకు మోక్షా సక్తుడై సత్తపో
నిరతిన్ బూనుచు; నంత రాజ్యమిటఁ బొందెన్ దీవ్ర సంక్షోభమున్

220. మ॥ పది రెండేండ్లుగ నా ధరా తలముపై వర్షమ్ము లేదయ్యె, సం
పదలెల్లన్ గృశియించె, పైరు లెచటన్ బాడయ్యె, సత్యవ్రతుం
డెద శంకింపక ధర్మ దూరుడయి వర్తిల్లన్ మదిన్ సైప లే
కిదె శిక్షన్ విధియించె ఘోరముగ దేవేంద్రుండు క్రుద్ధాత్ముడై

221. తే.గీ. ఆ సమయ మందె అర్ధాంగి నాత్మజులను
పర్ణకుటి యందు వదలి తపమ్మొనర్ప
కౌశికీ తీరమున కేగె కౌశికుండు
ద్వాదశాబ్దము లవ్విధిన్ బ్రబలె కఱవు





222. ఉ॥ ఆకలి మంటలన్ గలగి యాత్మజులెల్లరు బావురంచు శో
కాకుల చిత్తులౌటఁ గని యాకుశికాత్మజు భార్య బిడ్డలన్
సాకగ లేక వారలను చంపు కొనంగను లేక దైవమున్
వాకొని దూఱుచున్ విభుని వర్తన కెంతయుఁ గంట గించుచున్

223. మ॥ అకటా! కట్టిడి దైవ మీగతిని చేయన్ జెల్లునే? భర్తయున్
సకలంబున్ విడి ముక్కు మూసికొని యేచక్కిన్ దపోనిష్ఠుడై
యకలంకస్థితి నున్నవాడొగద! ఆహా యెవ్వరున్నారు భ
ర్తకు మాకష్టము లెల్లఁ జెప్పఁ గల కర్తల్ చూడ నేడియ్యెడన్

224. మ॥ అని తానిట్టుల యేడ్చి యేడ్చి యిక నేలా యిట్లు శోకింప; నొ
క్కనిఁ బుత్రున్ దెగనమ్మి తక్కు సుతులన్ గాపాడుటే ధర్మమౌ
నని దర్భల్ పెనవైచి రజ్జువున తా నాత్మోద్భవున్ మధ్యమున్
చిన వానిన్ మెడ చుట్టిఁ గట్టికొని తెచ్చెన్ విక్రయింపన్ బురిన్

225. మ॥ చను మార్గంబున నొక్కచో వనమునన్ సత్యవ్రతుం డీమెఁ గ
న్గొని యమ్మా! ఇది యేమి! యేడ్చుచు నిటుల్ గొంపోదు వీబాలు, నె
వ్వని పుత్రుం, ? డిటులేల యాతడును నేడ్వన్ సాగె,? నిక్కంబుఁ దె
ల్పిన నాచే నగు సాయ మేదయిన తల్లీ! చేయుదున్ నమ్ముమా!

226. కం॥ అనవిని యామెయు నిట్లనె
ననఘా! మీ రెవరొ యెఱుగ నైనను విన నెం
చిన కతమున నావిధమున్
వినిపించెద వినుము మీకు వివరము గాగన్

227. మ॥ వనసీమన్ దప మాచరింపఁ జనె విశ్వామిత్రు డాత్మేశు; డీ
చినవా డాత్మజు, డేమి చెప్పగల నిస్సీ! దుర్భరం బౌచు హె
చ్చెను దుర్భిక్షము రాజ్యమందు; కడకున్ జీవించుటే కష్టమై
యనఘా! వెళ్ళుచు నుంటి వీనిఁ బురమందమ్మంగ హీనాత్మనై

228. ఉ॥ ఈతని విక్రయింప లభియించిన విత్తముతోడ, నాకటన్
యాతనఁ జెందు తక్కుఁగల యాత్మజులన్ బ్రతికించు కొందు, నా
కీతతి నింతకంటె మఱి యెద్దియు మార్గము దోపదయ్యె, నం
చాతత దుఃఖమగ్నయయి యామె వచింపగ నాత డార్ద్రతన్

229. ఉ॥ ఆ మహిళా మణిన్ గనుచు నమ్మరొ! వీడుము నీదు దుఃఖమున్
సేమము తోడ నీ సుతునిఁ జే కొని యేగుము పర్ణ శాలకున్
నీ మగ దేగుదెంచు వర కే సమకూర్చెద మీకు నింకపై
నేమరఁబోక నిత్యమును నింపగు చక్కని భోజనమ్ములన్

230. తే.గీ. ప్రతి దినమ్మును మీదు నాశ్రమము ముందు
నున్న యొక పాదపమునకు నోగిరమును
గట్టి పోయెద నామాట కల్లగాదు
అరుణ భూపాలు తనయుడ నమ్మ!నేను
నన్ను సత్యవ్రతుం డండ్రు నమ్ము మమ్మ!

231. చం॥ అనిపలుకన్ ముదం బొదవ నాత్మజు బంధ విముక్తుఁ జేసి య
వ్వనిత నిజాశ్రమంబునకు వచ్చి సుఖంబున నుండె, నంత తా
ననుదిన మా నరేంద్రసుతు డామిషమున్ గొనివచ్చి యాశ్రమం
బున నొక వృక్షశాఖ కతి పొందికఁ గట్టుచు వెళ్ళుచుండగన్.

232. కం॥ ముని సతియును నా పలలముఁ
గొని వచ్చి నిజాత్మజులకు కూరిమితోడన్
దిన దినముఁ బెట్టి తానున్
దిను చుండెను; సాగుచుండె దినములు వరుసన్

233. వ. గళబంధన విముక్తుడగు నాబిడ్డడు గాలవు డనన్
బ్రసిద్ధికెక్కె

234. చం॥ అరుణ ధరాధిపుం దురతరాటవులన్ దప మాచరింపగా
నరిగిన నాటి నుండి గురువైన వసిష్ఠుడె రాజ్య పాలనా
భరము వహించు చుండె, నరపాల సుతుండు వనాంతరమ్మునన్
దిరుగుచు నుండె వీడక మదిన్ గురు వర్యుని మీది కోపమున్

235. తే.గీ. పెళ్ళి పీటల పై నున్న విప్రసతిని
అపహరించెను వీడని యాగ్రహించి
గురు వరేణ్యుడు తానుండె గుర్రుమనుచు
సప్త పదియును జరుగని సమయ మందె
అపహరించితిఁ గాన నయ్యది నిజమ్ము





విప్ర కన్యాపహరణమే, విప్ర భార్య
నపహరించుట కాదని నృపసుతుండు
తలచి గురుదేవు పైన క్రోధమ్ముఁ బూనె

236. ఉ॥ ఈతడు ధర్మ సూక్ష్మముల నెల్ల నెఱింగియు నాకు నిట్లు ని
ర్ఘాత సమంపు శిక్షనిడగా ధరణీశుని ప్రోత్సహించె నం
చాతడు ద్వేష భావమున నాగురుదేవు వసిష్ఠు నెంతయున్
చేతము నందు మెచ్చక వసించుచు నుండె వనాంతరమ్మునన్

237. చం॥ అతడొకనా డరణ్యమున నామిషమున్ గొన వేట కేగి వి
స్తృతముగ సంచరించియును నెయ్యెడ నొక్క మృగంబుఁ గానమిన్
వితత మనోవ్యథుండగుచు వెగ్గల మైన నిజక్షుధాగ్నికిన్
మతిఁ జలియింప కయ్యెడల మౌనిసతీసుతులన్ దలంచుచున్

238. ఉ॥ నా గతి యెట్టులైన ముని నాథుని సంతతి కెట్టులిప్పు డే
నోగిర మిత్తునంచు మది యోచన సేయుచు నుండ నంతలో
లేగను గూడి దూరమున లేఁ గసవున్ దిను గోవుఁ గాంచి తా
జాగొన రింప కాక్షణమ సాయకమున్ గొని దాని నేయగన్

239. చం॥ అదియును బిట్టు నార్చి యకటా! ధరఁ గూలగ దాని మాంసమున్
పదిలముగా గ్రహించి ముని వర్యుని యాశ్రమ వృక్ష శాఖకున్
ముదమునఁ గట్టిపోవ, ముని పుంగవు భార్యయుఁ దానిఁ దెచ్చి యిం
పొదవగ పుత్ర వర్గమున కొయ్యనఁ బెట్టి యనంతరమ్మునన్

240. ఉ॥ తాను భుజించు చుండ రుచి తప్పుట నాత్మనెఱింగి సందియం
బూని మృగామిషంబనగఁ బోలదు దీని నటంచు నెంచి య
మ్మానిని భోజనంబుడిగి మౌనమునన్ జని వెల్వలన్ వినన్
దీని గుఱించి కొందరిటు తెల్పిరి నిక్కువ మక్కజంబుగన్

241. తే.గీ. ముని వసిష్ఠుని పాడి యావును వధించి
మాంసమున్ గొని చనియె దుర్మార్గు డెవడొ
చర్మమును నస్థులను నొక చక్కి వదలి
యనుచు దెల్పగ విని గుండె లవియఁ గనుచు

242. వ. తాము భుజించినది గోమాంస మని యెఱింగి యామె
నిశ్చేష్టురాలైయుండె నంత

243. చం॥ అచట వసిష్ఠుదున్ విషయ మాత్మనెఱింగి క్రుధాగ్నితప్తుడై
విచలిత మానసుండగుచు "వీఁడిడివై యిటు హోమ ధేనువున్
శుచి యగు దానిఁ జంపితివి చోరుని భంగి నృపాల పుత్ర! నీ
కుచితమె యిట్లొనర్ప" నని యుగ్రగతిన్ గను లెఱ్ఱ వారగన్

244. చం॥ కలఁగుచు"నోయి! నీదయిన కాయము నందు త్రిశంకువుల్ గడున్
బలముగ నాటు నింక, నటు పైన త్రిశంకు డనంగ నెల్లరున్
బిలుచుచు నుండ నీయటవిఁ బెల్చ పిశాచుడవై చరింపు మం
చలుక వసిష్ఠుడిచ్చె నపుడా నృప సూతికి నుగ్ర శాపమున్

245. ఉ॥ శాప వశమ్మునన్ గడిది శంకువు లాక్షణమందె చొచ్చె నా
భూప కుమారు దేహమున మూడును, నంత పిశాచ రూపమున్
బ్రాపణమయ్యె; సిగ్గును విరక్తియు నేర్పడ నాశ్రమంబునన్
తాపస వృత్తిఁ జేకొనె నతండు జగజ్జననిన్ స్మరించుచున్

## త్రిశంకుని దేవి అనుగ్రహించుట

246. కం॥ దేవీ మంత్ర జపమ్మును
భావించి యొనర్చి యతడు పావను డయ్యెన్
ఆవల దశాంశ హోమము
గావింపఁ దలంచి మిగుల గౌరవ మొప్పన్

247. ఉ॥ హోమము సేయ నెంచితి మహోన్నతులౌ ఋషివర్యులార! నా
క్షేమముఁ గోరి మీరలు ప్రసిద్ధులు దీనిని నిర్వహింపుడీ!
నే మును చేసినట్టి కడునింద్యములన్ గణియింపఁ బోకు డో
ధీ మహితాత్ములార! యని దీనత వేడె నటన్ మహర్షులన్

248. చం॥ అనవిని యమ్మహర్షు లపహాస్యము సేయుచు నోత్రిశంక! గో
హననుడ, వార్యశాప దహనార్చి విదగ్ధుడ, వంతె గాక నీ
జనకుడు నిన్ద్యజించెను; పిశాచుడవున్ శ్వపచుండ వౌట, దు
ర్జనుడవు కాన హోమమును సల్ప ననర్హుడ వీవు వెళ్ళుమా!





249. కం॥ అనినన్ సత్యవ్రతునకు
తనపైన నసహ్యమౌట తద్దయు శోకం
బెనయగ నిట్లని తనలో
ననుకొనియెను బ్రతుకు మీద నాశ వదలుచున్

250. చం॥ జనకుడు శాప మిచ్చి నను సాంద్ర తరాటవికంపె; నా గురుం
డును శపియించె నీగతి కఠోర పిశాచపు రూప మేర్పడన్,
మనుగడ యేటి కింక నవమానముఁ బొందుచు నా కటంచు నా
క్షణమున కాష్ఠముల్ పరచి సత్వర మగ్నిని వ్రేల్చి యంతటన్

251. శా॥ ప్రాణత్యాగము సేయ నెంచి శుచియై భక్తిన్ మదిన్ చండికన్
దీనుండై నుతియించి యగ్నిఁబడ యత్నింపన్ మహాదేవి యా
భూనాధాత్మజు కన్ను దోయి కెదుటన్ బొల్పొందఁ గన్పట్టి తత్
ప్రాణోన్మూలన యత్న మయ్యెడల నాపన్‌జేసి తా నిట్లనెన్

252. ఉ॥ పాప మటంచెఱుంగ కిటు ప్రాణములన్ దృజియింప నేల యీ
శాప ఫలంబులైన శ్వపచత్వము దుష్ట పిశాచ రూపమున్
దోపవు నీకు నింక; పరితోషము నందుచు నీదు తండ్రి నీ
పాపము లెంచ కియ్యెడకు వచ్చి నినున్ గొనిపోవు తథ్యమున్

253. కం॥ రేపే కొని పోవును నినుఁ
దా పట్టముఁ గట్టు నీకు ధరణీ స్థలికిన్
పాపము లెఱుగక యికపై
స్థాపింపుము ధర్మయుక్త సామ్రాజ్యంబున్

254. చం॥ అని వచియించి యంబ చనె; నంతఁ ద్రిశంకుడు సంతసించుచున్
జనె తన యాశ్రమంబునకు; సర్వ మెఱింగిన నారదుండు తా
వినిచె నయోధ్యకేగి యట వృద్ధులు నౌ సచివాళి కా జగ
జ్జనని నృపాల సూను నతి సత్కృపఁ బ్రోచిన వైన మాదృతిన్

255. చం॥ వినిచి యమాత్యులన్ గలసి వేగమ యయ్యరుణుండు సత్తపం
బొనరిచు చోట కేగి కడు నుత్సవ మొప్ప వచింప, నంతయున్
విని ధరణీశు డప్డు కడు వేడుక మంత్రులఁ గూడి యేగి య
వ్వనమున పుత్రుఁ గాంచి గొని వచ్చె ముదంబున రాజధానికిన్

256. చం॥ తనయుని మున్ను నే మిగుల దారుణ శిక్షల నొంచి నాడ, దు
ర్జనుడ నటంచు లోఁ గుమిలి సాంత్వన వాక్యము లెల్లఁ బల్కుచున్
గనుగవ బాష్పముల్ గదలఁ గన్న సుతున్ దరిఁ జేర్చి ప్రేముడిన్
జనపతి కౌగిలించుకొని సమ్మతిఁ దెల్పెను ధర్మసూక్ష్మముల్

## అరుణడు చేసిన ధర్మబోధ

257. ఉ॥ తప్పకు ధర్మ మార్గము; నధర్మము నెన్నడు నీమనంబునన్
చొప్పడ నీకు మయ్య! మనుజుల్ సుఖియించెడిరీతి న్యాయమౌ
చొప్పున రాజ్యమేలుము విశుద్ధ గతిన్ ధనమున్ గ్రహించు చున్;
మెప్పుగ శాస్త్ర వాక్యముల మీరకు; వీడకు సత్యమెన్నడున్

258. చం॥ తపసుల శిష్టులన్ ద్విజుల ధార్మికులన్ దగ గౌరవించుచున్
గృప విడనాడి దస్యులను గీడ్వడఁ జేయుము; సత్త్వ హీనులం
చెపుడును శత్రు యత్నముల నేమఱఁ బోకుము; వారిపట్టునన్
నిపుణుల సూచనల్ గొనుచు నేర్పున రాజ్యము నేలు మొప్పుగన్

259. శా॥ నీ మంత్రమ్ముల శత్రు భూపతుల కందింపంగ లుబ్ధాత్ములై
నీ మంత్రుల్ తఱి వేచి యుందురు సుమా! నీ వట్టి వారిన్ గడున్
ధీమంతుండవు నై యడంపు మతి యుక్తిన్; మాటికిన్ మాటికిన్
నీ మాహాత్మ్యము లెక్కుడున్ బొగడు మంత్రిన్ నమ్మబోకెన్నడున్

260. కం॥ చారులను నియోగింపుము
నేరిమితో శత్రు మిత్ర నివహముల యెడన్;
కూరిమి నటించి కొందరు
నేరము లొనరింతు రవని నీచ మనుష్యుల్

261. తే.గీ. దాన ధర్మమ్ములను నిరతమ్ము సలుపు
మర్థ హీనంపు వాదమ్ము లాడ కెపుడు
దుష్ట సాంగత్య మది కడు దోషమొసగు
యజ్ఞ యాగాది కర్మల నాచరింపు
మాదరింపుము ఘనుల మహర్షి వరుల
జారిణుల, జూదరుల పొత్తుఁ గోరఁ దగదు
దుర్వ్య సనముల నేడిటిన్ ద్రోయు మవల
సత్య పథమును వీడక సాగుమెపుడు.





262. మ॥ ఇరవందన్ ప్రతి నిత్యమున్ నియతి బ్రాహ్మీవేళలన్ లేచి వే
గిరమే స్నానము సంధ్యయున్ సలిపి భక్తిన్ లోక మాతన్ మదిన్
స్థిరచిత్తంబునఁ గొల్చి యా పయిన తత్తీర్థ ప్రసాదంబులన్
పరమానందమునన్ గ్రహింపు మది కైవల్యమ్ము బొందించెడున్

263. సీ॥ ఆ జగన్మాతయే యఖిలమ్మునకు సాక్షి
యని మది తలపోయు మనుదినమ్ము
ధర్మ బుద్ధియుఁ గడు ధైర్యమున్ గలిగించు
నమ్మహాదేవి క్షేమమ్ము గలుగ
వేద వేదాంగ సంవేద్యు లౌ విప్రుల
దర్శించి యెఱుగుము ధర్మ గతుల
గో భూ సువర్ణాది గురుతర దానమ్ము
లిమ్ము యోగ్యులఁ గని యిష్టగతిని

గీ॥ విద్య లేనట్టి మూర్ఖులౌ విప్రులకును
అన్న మొక్కటె దాన మీయంగ వలయు
లోభమును బూని ధర్మ విలుప్త మైన
కర్మముల నాచరింపకు కాల మెల్ల

264. చం॥ తపసుల విప్రవర్యుల కుతర్కము లాడి యసత్కృతంబులన్
గుపితులఁ జేయ కయ్య! ధరకున్ ధరణీశుల కెల్లవేళలన్
దపసుల దివ్యశక్తి యది తప్పక రక్షణ యౌనుగాన నీ
వెపుడును వారితో వినయ మేర్పడ వర్తిలు చుండు టొప్పగున్

265. కం॥ న్యాయమ్ముగ కోశమ్మును
శ్రీయుత మొన రించు టదియె శ్రేయము పతికిన్
ధీయుక్తి దండన క్రియ
చేయందగు ధర్మశాస్త్ర చింతన తోడన్.

266. మ॥ అని యీరీతిగ ధర్మ సూక్ష్మముల నెయ్యంబొప్ప బోధించు నా
జనకున్ జూచి త్రిశంకు డాదర గతిన్ సమ్మోదమున్ దెల్ప; నా
జననాధుండును సంతసించి ద్విజులన్ సమ్మాన పూర్వంబుగా
ఘన విద్వాంసులఁ బిల్చి యంత సుతునిన్ క్ష్మానాధుఁ జేసెన్ వెసన్

267. చం॥ తనయుని రాజుఁజేసి తనధర్మ సతిన్ గొనియాత దంతటన్
వనములకున్ దపంబు సలుపన్ జని యచ్చట జాహ్నవీ తటిన్
అనయము తీవ్రమౌ తప మనన్య మనంబుల సల్పి యిర్వురున్
తనువుల వీడి యయ్యమర ధామముఁ జేరిరి సౌఖ్యపూర్ణమున్

268. ఉ॥ ఆ పరదేవతా కృప ధరాధిప సూనుడు శాపముక్తుడై
భూపతి యయ్యెనంచు మదిఁబొంగె వసిష్ఠుడు; సత్యనిష్ఠుడై
భూపరి పాలనమ్ము ౘగడు పొందికఁ జేయుచు నాత్రిశంకుడున్
శ్రీపర దేవి మెచ్చగ విశేషగతిన్ జరిపించె యజ్ఞముల్

269. కం॥ ఇతనికి శుభలక్షణుడౌ
సుతుడు హరిశ్చంద్రుడనగ సుమశర సముడై
వితత యశుం డుదయించెను
మతి మంతుడు సూర్యవంశ మండను దుర్విన్

270. చం॥ అతనికి రాజ్యమిచ్చి తదనంతర, మిట్టులె మేనుఁ దాల్చి స
మ్మతి దివికేగి యచ్చట నమానుష భోగము లెల్ల బొందగా
మతిఁ దల పోసి నమ్రుడయి మాన్యుని సద్గురువున్ వసిష్ఠునిన్
అతుల తపః ప్రభావుఁ గని యాదర మొప్ప త్రిశంకు డిట్లనెన్

## త్రిశంకుడు సశరీరుడై సురలోకమేగ యత్నించుట

271. చం॥ గురువర! కల్గె నాకునొక కోరిక యిట్టు లె దేహధారి నై
సురపురి కేగి యందుఁ గల సుందర నందన చారు సీమలన్
సురతరుణీ మణుల్ గలసి జోడయిరా విహరించుచున్ గడున్
వెర వగు నప్సరోఽంగనల వీనుల విందగు గానముల్ వినన్ (వెరవు=యుక్తము)

272. తే.గీ. అట్టి అవకాశ మెదియైన యమరు నట్టి
యజ్ఞ మొక్కటి చేయింపు మఘ విదూర!
నిన్ను మించి సమర్థు డీ నేల యందుఁ
గలడె వేరొండు పురుషు డె క్కాలమందు

273. మ॥ అనినన్ నవ్వి వసిష్ఠు డిట్లనియె రాజా! దేహమున్ దాల్చి యి
ట్లనిమే షాలయ మేగ సాధ్యమెటు లౌ నయ్యా! ప్రపుణ్యాత్మకుల్
మనుజుల్ దేహము వీడినన్ దివము సంప్రాప్తించు నెవ్వారికేన్
వినుమీ! యజ్ఞము లింకపై సలుపుమీ పెక్కుల్ గడున్ దీక్షతో





274. ఉ॥ అంతట పుణ్య సంచితుడవై సురలోకముఁ జేరవచ్చు ని
శ్చింత సురాంగనా మణులఁ జేరి సుఖంబులఁ బొంద వచ్చు నం
చెంతయుఁ బ్రీతిఁ బల్కెడు మహీసుర వర్యు నధఃకరించి దు
శ్చింతుడు నై త్రిశంకుడు వచించె నహంకృతిదోప నివ్విధిన్

275. చం॥ కుల గురు వన్న భావమునఁ గూరిమి నిన్గని నాదు కోరికన్
దెలుప, నహంక రించుచు మదీయ మనోరథ మర్థ హీనమం
చలసతఁ బల్కితిట్లు, భువియం దిక లేరొకొ నిన్ను మించు వా
రలఘులు, వారితోడ నెటు లైనను నే జరిపింతు యజ్ఞమున్

276. చం॥ అనిన వసిష్ఠు డెంతయును నాగ్రహమూని నరాధిపాధమా!
నను గణియింప కివ్విధి ననాగరి కమ్మునఁ బల్కితీవు; క్ర
న్నన శ్వప చాకృతిన్ గొని దినమ్ములు పుత్తువు గాక యింకపై;
తనువును వీడియైన సురధామముఁ బొందవు ధూర్త! పొమ్మికన్

277. మ॥ అని శాపం బటులా వసిష్ఠుడిడ దేహం బొక్కటన్ మార్పుఁ బొం
దెను చండాలుని పోల్కి; నంత తన దేదీప్యంబులౌ స్వర్ణ భూ
షణముల్ దోచె నయస్కృతంబులుగ; తత్ సౌగంధ్యముల్ దుర్భర
మ్మన దుర్గంధ యుతంబులయ్యె తనదేహంబందు, వస్త్రంబులున్
గని పించెన్ మలినమ్ము లౌచు, తనువున్ గంధేభ దేహంబటుల్
ఘన కాఠిన్యముఁ బొంది నెట్టియలునై గన్పట్టె నచ్చో త్రిశం
కున కాశ్చర్యముఁ గొల్పి తత్ క్షణమె; చేకూరున్ గదా యాపదల్
దినరాట్ తేజుల సత్తపో నిధుల నిందింపంగ నెవ్వారికేన్

278. మ॥ తన రూపమ్మునుఁ జూచి యాత డతి చింతావృత్తుడై యక్కటా!
తను విట్లాయెను; రాజధాని నిక నే దర్శించు టెట్లో గదా!
తనువున్ నేడిటుఁ గాంచి నా సతియు సత్కారంబునన్ జూచునే?
తనయుండున్ గడు దుఃఖ మగ్నుడగు తథ్యం, బేది కర్తవ్యమో!

279. ఆ.వె. అని యను కొంచు నాతడు మహాటవిఁ జేరి యికేల జీవితం
బని మది నెంచి యగ్నిఁ బడియైన, విషమ్మును ద్రావియైన, భో
జనమును మాని యైన నిటఁ జచ్చుట మేలని తత్ప్రయత్నమున్
గొనకొని చేయుచున్ మరల కొంత వడిన్ దలపోసె నివ్విధిన్

280. ఆ.వె. ఆత్మహత్య వలన నడగునే శాపమ్ము
జన్మ జన్మలకును సాగిరాదె
కర్మ మనుభ వమునఁ గాక తొలంగునే?
అట్టి యెడల నాత్మ హత్య లేల?

281. ఉ॥ కావున నెట్టులైన నిజ కర్మ ఫలంబును స్వీకరింతు, స
ద్భావము తోడ తీర్థముల, పావన భూములఁ జూచుచున్, మహా
దేవిని లోన నిల్పుకొని దీక్ష జపించుచు, సజ్జ నాళికిన్
సేవ లొనర్చుచున్ వెస నశింపగఁ జేయుదు నాదు పాపముల్

282. కం॥ అని తలచి త్రిశంకుండపు
డనిమిషనది చెంత కరిగె; నతని విషయమున్
దనసుతుడు హరిశ్చంద్రుడు
విని సచివులఁ బంపె జనకు వేగమె కొనిరాన్.

283. ఉ॥ వారును తక్షణంబు చని పావన దివ్యనదీ తటంబునన్
భూరమణున్ త్రిశంకుని ప్రభూత వికార శరీరుఁ గాంచి బి
ట్టారట పాటుఁ జెంది వినయాన్వితులై కరముల్ మొగుడ్చుచున్
జేరి వచించి రిట్లతని చేతము నూఱటఁ బొందఁ జేయుచున్

284. మ॥ ధరణీ శాగ్రణి! మీ తనూభవుడు మీ దైన్యస్థితిన్ మానసం
బెరియంగన్ విని మమ్ముఁ బంపె మిము నెట్లేనిన్ గడున్ గౌరవ
స్ఫురణన్ దోడ్కొని రమ్మటంచు; నిక మీ శోకమ్ముఁ బోఁ ద్రోలి స
త్కరుణన్ మా వెనువెంట రమ్ము ప్రజలున్ త్వద్దర్మనా కాంక్షులే

285. చం॥ జరిగిన దంతయున్ మఱచి శాంతిని గైకొను, మా వసిష్ఠునిన్
స్థిరముగ సన్నుతించి తన చిత్తము శాంతిలఁ జేయు వార మం
చరమర లేక తెల్పుమనె నయ్య! భవత్ సుతు డాదరమ్మునన్
ధరణి పతీ! విచారమును దక్కుము రమ్మిక రాజధానికిన్

286. ఉ॥ వారల విన్నపంబుల నవారణ విన్న త్రిశంకు డాక్షణం
బోరిమి యోచనల్ సలిపి యొయ్యన నిట్లనె మంత్రులార! మీ
గౌరవ వాక్య సంపదకు కల్గె ముదం; బది యట్టులుండ మీ
కోరిక చొప్పునన్ సుఖముఁ గోరి పురంబున కేను రానికన్





287. చం॥ చనుడిక మీరు; మా సుతుని చక్కగ రాజ్యము సేయు మంచు; స
జ్జనులగు విప్ర వర్యులకు సత్కృతి చేయుచు యజ్ఞ యాగముల్
పనిగొని చేయు మంచు; కడు బాధ్యత తోడుత దీనులన్ సదా
గనుగొను మంచు తెల్పు డతి గౌరవ మేర్పడ నాదు మాటగన్

288. చం॥ అన విని మంత్రు లెల్లరును నార్తి మునింగి నమస్కరించి యా
తనికడ వీడు కోల్గొని యథఃకృత యత్నులునై యయోధ్యకున్
జని కడు వైభవమ్ముగ త్రిశంక సుతున్ ధరణీశుఁ జేయ; స
జ్జన బుధ మాన్యు డాతడును చక్కగ నేలుచు నుండె రాజ్యమున్

## విశ్వామిత్ర - శ్వపచుల కథ

289. తే.గీ. కౌశికీ నదీ తీరాన కఠిన తపము
పూర్తి యౌట, విశ్వామిత్ర ముని వరుండు
తిరిగి యాశ్రమ భూమికి నరిగి యచట
సతిని సుతులనుఁగని కడు సంత సించి

290. చం॥ పదియును రెండు వర్షములు వర్షము లేక ధరాతలమ్మునన్
పొదలు నశింప సస్యములు పూజ్యములై తిన తిండి లేమి చే
వదలిరి పెక్కు రొక్కటన ప్రాణము లంచును నేను వింటి నో
సుదతిరో! యట్టిచో బ్రతుకు చొప్పడె నెవ్విధి నీకు వీరికిన్?

291. చం॥ తపసున మున్గి యుండిన కతంబున రానయితిన్ మిమున్ గనన్,
తపము ముగించి వచ్చినను దక్షుడనే? ధనమింత లేక మీ
యపనయ మెట్టు లేనియును నాఱుప; మీ విధమున్ దలంచి నే
నపు డెటు లైతినో యెఱుగ నౌనె సితాబ్జ దళాయతేక్షణా!

292. చం॥ ఒకదిన మేను నాకటికి నోర్వగలేక తపించి యెట్టులో
యొక శ్వప చాలయంబునకు నొయ్యన చోరుని భంగి నేగి యి
చ్చకమున నుట్టియందు గల జాగిలపున్ బలలంబు దీసి జం
కక తిన బోవు చుండ కలగన్నటు లా శ్వపచుండు మేల్కనెన్

293. ఆ.వె. లేచి యతడు నన్ను చూచి సమీపించి
యెవరి వాడ విట్టు లింత రాత్రి

యిల్లు సొచ్చి ఘటము నేటికి దించితి
వనుచు క్రుద్ధు డగుచు నరచె నంత

294. చం॥ తనువును నంగముల్ వడకె, దప్పి జనించెను; కంఠసీమ నా
ఱెను తడి; యెట్టులో నిలువరించుక మెల్లగ వానిఁ జూచి యో
యనఘ! ద్విజుండ తాపసుడ నయ్య! భరింపగ రాని యాకటన్
గనలుచు మార్గమేదియునుఁ గానక పూనితి చోరవృత్తికిన్

295. చం॥ ఇట ఘటమందు నోగిర మదేదియొ యుండు నటంచు నెంచి నే
నెటులొ శ్రమించి దించి భుజియింపఁ దలంచుచు నున్న యంతటన్
చటుకున నీవు లేచితివి; సమ్మతి నన్ను క్షమించి నే భుజిం
చుట కిక నడ్డు సెప్పకుము సోలెదు నన్ బ్రతికింపుమా కృపన్.

296. మ॥ అనినన్ దా శ్వపచుండు నిట్టులనె యయ్యా! నీవు విప్రుండ, వే
ననయంబున్ మృగ సంతతిన్ దునిమి యాహారించు నీచుండ, పృ
థ్విని జన్మంబులలో మనుష్య జననంబే యుత్తమంబందు, రం
దును మీ బ్రాహ్మణ జన్మఁబొందుట కడున్ దుర్లభ్య మౌ నెంచగన్

297. చం॥ శ్వపచుడ నేను, కర్మల వశంబున నేడ్గుర నంత్య జాతులం
చెపుడొ వచించె నమ్మనువు; హీనుడ మద్గృహ మందు మీర లి
ట్లిపుడు భుజింపఁ గోరుటకు నేను సహింపను, "లోభబుద్ధిచే
కృప విడ నాటి యిట్లు పలికెన్ గద! వీడ"ని యెంచఁ బోకుమా!

298. తే.గీ. వర్ణ సంకర దోషమ్ము వచ్చు మీకు
ననుచు నేనిట్లు పలికితి నంతె గాని
అతిథి కన్నము వెట్టని యధమ బుద్ధి
గల్గు వాడను కాను నిక్కము మహాత్మ!

299. ఉ॥ ఇంతటి ధర్మ సూక్ష్మమును నివ్విధిఁ దెల్పెడి వానిఁ గాంచి నే
నెంతయు సిగ్గుఁ జెంది మొగమెత్తి వచించితి నో మహాత్మ! ప్రా
ణాంతక వేళలందు తన యాయువు నిల్పుట కెద్దియైన ని
శ్చింత భుజింప వచ్చునని చెప్పెను శాస్త్రము ధర్మసూక్ష్మమున్

300. కం॥ ప్రాణము కాపాడు కొనుటె
మానవ ధర్మమ్ము గాన, మంచి యొ చెడుగో
మానసమున నెంచక తన
ప్రాణమ్మును నిలుప వలయు; పదపడి మరలన్

301. కం॥ ప్రాయశ్చిత్తము తోడన్
బాయంగన్ వచ్చు నెల్ల పాపమ్ము లొగిన్
నాయీ యాకలి నెటులేన్
మాయించుక మనుట మిన్న మరణము కన్నన్

302. ఉ॥ ఆకలి తోడ ప్రాణముల నర్పణ చేయుట పాపహేతు వౌ
చేకుఱు దుర్గతుల్ గనుక చేయగఁ బూనితి నిట్టి చౌర్యమున్
నా కెదియైన నిక్కతమునన్ దురితం బొన గూడె నేని నా
యాకటి కెల్ల హేతువగు నాతడె యద్దురితంబు బొందెడున్

303. కం॥ సరియగు వర్షమ్ములు భువిఁ
గురియక దుర్భిక్ష మౌటఁ గుందిరి మనుజుల్
తిరముగ పర్జన్యున కీ
దురితమ్ములు చెంద వలయు ధ్రువముగ శ్వపచా!

304. మ॥ వనితా! నేనటు లన్న యాక్షణమునన్ వర్షించె పర్జన్యు డే
పునఁ గుంభమ్ములఁ బోసినట్టులుగ; నుప్పొంగెన్ మనోంభోధి; చ
య్యనఁ బర్వెత్తితి లోన నుండి వెలి కత్యంతమ్ము సంతోషి నై
చినుకుల్ గాంచితి నౌర! నేటికనుచున్ జిందుల్ ప్రదర్శించుచున్

## విశ్వామిత్రుడు త్రిశంకునకు ప్రత్యుపకృతి యొసర్చుట

305. మ॥ అది యట్లుండగ నిమ్ము కంజ ముఖి! నీ వక్కాల మందే గతిన్
పదిలంబై బ్రతు కీడ్వగల్గితివి? యెప్పాటన్ తనూజాతులన్
సుదతీ! ప్రోచితి? వే మహాత్ముడపు డిచ్చో మిమ్ముఁ గాపాడె? నా
సదయున్ దెల్పు మటంచుఁ దా నడిగె విశ్వామిత్రు డమ్మానినిన్

306. చం॥ అడిగిన భర్తఁ గాంచి మొగ మల్లన నెత్తి వచించె నాథ! యా
కొడుకులఁ బెంపగా నెటుల కుందితొ నే వివరింప శక్యమే!
అడవుల సంచరించి యచటచ్చట నివ్వరి ధాన్యమింత చే
పడ బ్రతు కీడ్చుచున్ నెలల పట్టి వసించితి మెట్టు లెట్టులో

307. ఉ॥ ఈగతి కొన్ని వత్సరము లేగగ నాకులలంబు లేనియున్
ద్రాగుట కింత నీర మయినన్ గని పించక, కార్యమెద్దియో
బాగుగ దోప కెట్టులొ యుపాయ మొకండు మదిన్ స్ఫురింప, నే
నోగు దలంప కొక్క తనయున్ దెగ నమ్మఁదలంచి యంతటన్

308. కం॥ పురమున కేగుచు నుండగ
కరుణన్ సత్యవ్రతుండు గన్పడి మీ కె
ల్లరకును నిత్యమ్మును నో
గిర మే నిడుదు ననుచు పలికెను సమ్మతితోన్

309. కం॥ అంత నతడు ప్రతిదిన మీ
చెంతన్ దరువునకుఁ గట్టు స్నిగ్ధామిషమున్;
చింతలు విడి దానిఁ దినుచు
సంతసమున మేము బ్రతుకఁ జాలితి మయ్యా!

310. చం॥ అనుదిన మాత డట్లు శుచియౌ పలలంబును తెచ్చి పెట్ట మే
మును భుజియించు చుండ దినముల్ సనె నిట్టులె; యొక్కనాడు తాఁ
గనుఁగొన జాల కెందును మృగంబుల, నొక్కెడ నవ్వసిష్ఠు గో
వునుఁగని చంపి మాంస మిట భూరుహ శాఖకుఁ గట్టి వెళ్ళినన్

311. ఉ॥ ఆ విషయమ్మెఱింగి కడు నాగ్రహ మంది వసిష్ఠుడంత నా
భూవిభు "నంత్యజుండ వయి భూమి వసింపుము నీశరీరమున్
చేవ దొఱంగు శంకువులు చేరుట, నంత త్రిశంక నామమున్
నీవు ధరింతు వింకపయి నిక్కమటంచు" శపించె నక్కటా!

312. కం॥ మన కొఱకై యాత డిటుల
మునివరుచే ఘోర శాపమును బొందెఁ గదా!
ముని నాథా! నీవు తపో
ధనుడవు రక్షింపు మతని దాక్షిణ్య నిధీ!

313. కం॥ అన విని విశ్వా మిత్రుడు
తనసతి యిక్కట్లు తలచి తద్దయు దుఃఖం
బెనయగ నో వనితా! నీ
వనినట్లు త్రిశంకుశాప మడగింతు నికన్





314. చం॥ మది నిక నూఱటన్ గొనుము మానిని! యంచు వచించి వాని కె
య్యది యొనరించు వాడనని యాత్మఁ దలంచి యయోధ్య కేగగా
కదలి యరణ్య మార్గమున కౌశికు డేగుచునుండ దారిలో
నెదురుగ నా త్రిశంకు డతి హీనగతిన్ గనిపించి దీనుడై

315. చం॥ వడి వడి వచ్చి మౌని వరు పాదము లంబడి యేడ్వ! నాతనిన్
దడ బడు చున్నవాని ముని తల్లజు డెత్తి కవుంగి లించి నీ
వుడుగు త్రిశంక! శంకయిక, నుగ్ర గతిన్ శపియింపబడ్డ నీ
యిడుములు దీర్తు కోరు కొను మెయ్యది కావలె నో యొసంగెదన్

316. తే.గీ. అతని మాటలకు త్రిశంకు డా క్షణంబ
వర్షఋతువున జలద సంపదలఁ గాంచి
నాట్యమాడెడి నీల కంధరము వోలె
సంతసం బందె మదియెల్ల సంచలింప

317. మ॥ "అనఘా! స్వర్గముఁ జేర నెంచితిని దేహం బిట్టులే దాల్చి తత్
ఘన సౌఖ్యంబులు బొంద; దాని కను యుక్తం బైన యజ్ఞంబు మ
న్ననఁ జేయింపు" మటంచు మద్గురు వరున్ బ్రార్థింప నాతండు నా
మనవిన్ గైకొన" కట్లు కూడదన" నమ్మౌనీంద్రు వీక్షించుచున్

318. చం॥ మునివర! మీరు కాదనిన మోదము నన్ మఱి యొక్క విప్రునిన్
గనుగొని వేడి నా యజన కార్యము నెట్టులొ పూర్తి చేయ మీ
రనుమతి యిండనన్ గనలి యాతడు నన్ శ్వచుండవై యికన్
వనమున సంచరింపుమని పల్కి శపించె దయా విహీనుడై

319. మ॥ కుశికాంభోనిధి చంద్ర! నా విధము నీకున్ దెల్పితిన్ సర్వమున్
వశముల్ మీకు సమస్త శక్తులును భవ్యం బౌచు నెల్లప్పుడున్
భృశమౌ నాదు మనోరథమ్ముఁ దమరే యెట్లైనఁ దీర్పన్ దగున్
దిశలం దెల్ల భవ దృశమ్ము మిగులన్ దీపించు నట్లైనచో

## త్రిశంకునకు సశరీర స్వర్గం

320. మ॥ శ్వపచుండైన త్రిశంకు డట్లడుగ విశ్వామిత్రు డాలోచనా
నిపుణత్వంబున నిశ్చయమ్ము మదికిన్ దెల్లంబుగాన్ మెల్లనన్

నృపతీ! వస్తుచయమ్ముఁ గూర్చు కొనుమా నీ చేత యజ్ఞమ్ము స
తృ్పఁ జేయించెద నంచుఁ బల్కె మది ధాత్రీ నాథు డుప్పొంగగన్

321. కం॥ అనుచుఁ ద్రిశంకున కాజ్ఞా
పననిడి గాధి సుతు డపుడు వనమందలి స
న్మని వర్యుల నెల్లర ర
మ్మని యాహ్వానముల బంపె యజ్ఞముఁ గాంచన్

322. ఉ॥ ఈ యజన మ్మొనర్చుటకు హేతు వెఱింగిన మౌను లెవ్వ రా
చాయలఁ జేరరైరి; ఋషి సత్తము డైన వసిష్ఠు నానతిన్
డాయరు కొంద రయ్యది విడంబ మఖంబగుఁ బో యటంచు; క
ట్టా! యిది యేమటంచు కుశికాత్మజు డాత్మ వివృద్ధ కోపుడై

323. శా॥ ఔరా! యేమిది? యజ్ఞమున్ గనగ రమ్మాయంచు నాహ్వానముల్
పేరున్ బేరునఁ బంప నొక్కరును నా విజ్ఞాపనల్ గైకొనన్
బోరే! యిద్ది వసిష్ఠు కృత్యమగునేమో! యైన కానిమ్మికన్
వారల్ చూడగ మత్తపో మహిమచే స్వర్గమ్ము నిన్ జేర్చెదన్

324. వ. అని ప్రతిజ్ఞ యొనర్చి

325. శా॥ గాయత్రీ మహనీయ మంత్ర జప యోగంబైన పుణ్యంబుతో
తోయంబుల్ తన హస్తమందుఁ గొని తద్భూనాధునిన్ జూచుచున్
నీ యీదేహము తోడ నాకమునకున్ నిశ్చింతతో వెళ్ళుమీ!
శ్రేయంబౌనని ధారవోసె నపు డర్థిన్ గాధి పుత్రుండటన్

326. చం॥ అనిన మరు క్షణంబుననె యా శ్వపచాకృతినున్న భూవరుం
డనిల జవంబునన్ జనియె నండజ మట్టుల నూర్ధ్వగాముడై
చనిచని సంతసంబెనయ శక్రపురంబును డాయఁ బోవ నం
దనిమిషు లెల్లరేగి దివిజాధిపునిన్ గని సంభ్రమమ్మునన్

327. మ॥ సురనాధా! శ్వపచుం డెవండొ దివికిన్ చోద్యంబుగా నల్లదే
దరియన్ వచ్చెను చూడుమన్న విని యుద్యత్ క్రోధుడై యింద్రు డ
న్నర పాలుండు త్రిశంకుడం చెఱిగి నిందా వాక్య సంసక్తుడై
అరెరే నీచుడ! దేవలోక మిది యేలా వత్తు వర్షూండవే?





328. కం॥ రాఁదగ దిచటకు నీవో
భూదయితా! శ్వపచుడవు నపుణ్యుడ వగుటన్
లేదిట నీకున్ స్థానము
వేదన యిక నేల భువికి వెళ్ళుము వేగన్

329. చం॥ అని కడు బిట్టు నార్వగ రయంబున నా శ్వపచుండు క్షీణ పు
ణ్యుని వలె నేల పైఁ బడుచు“నో మునివర్య! యిదేమిటయ్య! పృ
థ్విని బడుచుంటి, దీనుడను వేగమె నన్ గరుణించి బ్రోవుమా!
అని భయ కంపితుండగుచు నార్చుచు నున్న త్రిశంకు గాంచుచున్

330. శా॥ విశ్వామిత్రుడు సంభ్రమం బెనయ పృథ్విన్ గూలు నాభూపతిన్
ఆశ్వాసించుచు నో త్రిశంక! నిలుమీ ఆకాశ మందట్టు లే
విశ్వంబందిక నూత్నమై వెలయుఁబో వేరొండు స్వర్గంబు, నన్
విశ్వాసంబునఁ జూడుమంచు నట నిల్పెన్ వాని విన్వీధిలోన్

331. చం॥ నిలిపి యనంతరమ్ము కడు నిష్ఠగ నాచమనం బొనర్చి తా
సలుపఁ గడంగె యజ్ఞమును, స్వర్గము నొండు సృజింప నెంచి; వే
ల్పులపతి వాని యత్నమును లోన నెఱింగి మరుక్షణంబునన్
కలఁ గుచు వచ్చి మౌని వరుఁ గాంచుచు నిట్లనె సౌమ్యపద్ధతిన్

332. కం॥ కోపమ్మున నీవిప్పుడు
చేపట్టిన యజ్ఞమింక చేయకు మయ్యా!
ఏ పరమార్థముఁ గోరుచు
నీ పని యొనరించుచుంటి విచ్చెదఁ జెపుమా!

333. కం॥ అన విని విశ్వా మిత్రుం
డనిమిష పతిఁ గాంచి యట్లయగునే నితనిన్
గొనిపొ మ్మిటులే స్వర్గ
మ్మున కతి గౌరవ మెనయ త్రిభువనాధీశా!

334. మ॥ అన నింద్రుండొక యింత మౌన యుతుడై యమ్మౌనిశక్తిన్ మనం
బున భావించుచు సమ్మతిన్ దెలిపి యా భూపాలు దివ్యంబులౌ
మణి భూషాంబర యుక్తుఁ జేసి కడు సమ్మానించి గొంపోయెఁ గ్ర
న్నన స్వర్గంబున కెల్లరున్ గన విమానంబెక్కి మోదంబునన్

335. కం॥ జనకుడు సశరీరుండై
యనిమిష లోకమున కేగె నను విషయంబున్
విని సుతుడు హరిశ్చంద్రుడు
తన వారలఁ గూడి కడు ముదంబునుఁ బొందెన్

336. మ॥ సకలోర్వీభర ధుర్యుడయ్యును హరిశ్చంద్రుండు నిత్యమ్ము పు
త్రకు డొక్కండును లేని కారణమునన్ దైన్యస్థితిన్ బొందుచున్
సకలజ్ఞుండగు నవ్వసిష్ఠు కడకున్ సంరంభుడై యేగి య
య్యకలంకాత్మునిఁ గాంచి యిట్లనియె సాష్టాంగ ప్రణామమ్ములన్

337. చం॥ అగణిత సత్తపోధన! మహామహిమాన్విత! ధర్మ తత్త్వ పా
రగుడవు, మీరు మిక్కిలిఁ దిరంబుగ మాకు పురోహితుండవై
తగునె మహాత్మ! నన్ను మదిఁ దల్పక యుండుట యింతకాలమున్
బొగులుచు నుంటి నే సుతులఁ బొందక, మీ కెఱుగంగ రానిదే

338. తే.గీ. ధర నపుత్రకునకు గతి నరక మండ్రు
సకల జీవులు తమ తమ సంతతిఁ గని
మురియు చుండుటఁ గన నేత్రములు చెమర్చు
సుతులు గల్గెడి మార్గమ్ము చూపు తండ్రి!

## హరిశ్చంద్రుని పుత్ర వాంఛ

339. చం॥ అని కడు దీనుడై యడుగు నద్ధరణీశుని యాత్మవేదనన్
విని మునివర్యు డిట్లనియె, వీడుము దుఃఖ మికన్ ధరాధిపా!
తనయులు లేని దుఃఖమది దారుణ మన్నది నిక్క; మైనచో
తనయులఁ బొందు మార్గమది ధాత్రి ప్రసిద్ధము విన్ము తెల్పెదన్

340. తే.గీ. పురుష కారమ్మునకు దైవమును సహాయ
పడిన కార్యము జరుగు భూవర! నిజమ్ము
వరుణ దేవుని కరుణ సంప్రాప్తమైన
సంతతిన్ బొందఁ గల్గుట సాధ్యమగును

341. ఉ॥ కావున నీవు నవ్వరుణు గట్టిగ మానస మందునిల్పి సత్
భావము తోడ నిత్యము నుపాసన చేయు మతండు తృప్తుడై
నీవెతఁ దీర్చు పొమ్మన భువీశుడు సంతస మంది జాహ్నవీ
పావన భూమి నవ్వరుణు భక్తి జపించుచునుండ నంతటన్





342. చం॥ జరిగెను పెక్కు వర్షములు సంతస మందుచు వారుణీశు డ
న్నరపతి చెంతకున్ జని"మనంబున నెయ్యది కోరి యివ్విధిన్
స్థిరముగ నన్ భజించితివి తెల్పుము భూవర! తీర్తునన్న; సత్
కరుణ తనూజు నొక్కని సుఖప్రదు నిమ్మని కోరె భూపుడున్

343. మ॥ అనినన్ భూవరుఁ గాంచి యవ్వరుణు డాప్యాయమ్మునన్ భూపతీ!
తనయున్ సద్గుణ గణ్యు నీ కొసగెదన్ దథ్యంబు నీ వంత నా
కెనయన్ ప్రత్యుపకార మేమిడెదొ యిందేతెల్పుమా! నీ కుమా
రుని నాకున్ బలియిచ్చి యజ్ఞ మొక టార్యుల్ మెచ్చ జేయింతువే?

344. చం॥ అన విని సంతసంబున నరాధిపు డవ్వరుణాధి దేవునిన్
గని యనఘా! యొనర్చెద మఖంబును నీకయి మత్తనూజు నె
ట్టన బలియిచ్చి; నమ్ముము విడంబన గా, దొక పుత్రు దుద్భవిం
చిన నది చాలు దుర్గతులు చేకుఱ, వంతట శాంతినొందెదన్

345. మ॥ స్థిర చిత్తంబున నిట్లు పల్కు నతనిన్ చేతంబునన్ మెచ్చి య
వ్వరుణుం డో ధరణీశ! కల్గునొక సత్పాత్రుండు పుత్రుండు, నన్
మరువంబోకు తనూజునిం గనుచు సుమ్మా! యంచు తానేగినన్
పరమానందముతోడ నేగె ధరణీ పాలుండు రాజ్యానకున్

346. ఉ॥ అంతి పురమ్ముఁ జేరి విషయం బెఱిగించె నిజాంగనాశతం
బెంతయం సంతసింపగ మహీపతి; గర్భము దాల్చె నంత భూ
కాంతుని పట్టపున్ మహిషి; కాలము సాగుచునుండ నొక్కనా
డింతికి పుట్టె కంతునకు నీడగు పుత్రుడు శోభితాంగుడై

347. కం॥ దైవజ్ఞు లెల్ల రాతని
భావిన్ గని యద్భుతమని పలుకుచు వానిన్
దీవించి వెళ్ళ; ద్విజులను
భూవిభుడున్ భూరిదాన ములతోఁ దనిపెన్

348. కం॥ తనయునిఁ గనుఁ గొని మురియుచు
వనమున మును వరుణు నెదుట పలికిన పలుకుల్
మనమున మఱచెను జనపతి,
వనముల కధిపతి మరువక వడివడి నటకున్

349. తే.గీ. బ్రాహ్మణాకారమున వచ్చి ప్రభువుఁ గాంచి
మఱచితే? మున్నొసంగిన మాట నేడు
తొలగెఁ గద నీదు వంధ్యత్వ, మెలమి నాటి
నీదు పల్కుల నేటికి నిల్పు కొనవు?

350. మ॥ అనినన్ భూమి విభుండు మ్రాన్పడిన యట్లై దుఃఖమున్ మ్రింగుచున్
తన దౌర్భాగ్యముఁ లోఁ దలంచు కొనుచున్ ధైర్యమ్ముతో నాతనిన్
గని దేవా! తమ కే నొసంగిన ప్రతిజ్ఞన్ దీర్తు నమ్మందగున్
వినుమీ! మీ కెఱుగంగ రాని వరయన్ వేరున్నవే ధర్మముల్

351. చం॥ సదమల చిత్త! పాపనికి జన్మ నొసంగిన యంత నెందునున్
పదియు నొకండు నాళ్ళరుగఁ బాయు నశౌచము కన్న తండ్రికిన్
బదపడి యొక్క మాస మయినన్ శుచియౌఁగద కన్నతల్లి, నె
మ్మదిఁ దల పోయ నర్హులమె మానుగ యజ్ఞ మొనర్ప నిత్తఱిన్

352. ఉ॥ ఓపిక పట్టు మొక్క నెల యో మహితాత్మ! యనంతరంబు నే
నాపక చేయుదున్ దమరికై యొక యజ్ఞము, మత్కుమారు సం
తాపముఁ జెంద కిత్తు బలి దానము నమ్ము మనంగ నాతడున్
భూపుని వీడు కొంచుఁ జనె మోదముతో నిజ పశ్చిమాశకున్

353. కం॥ అంత హరిశ్చంద్రుడు కడు
సంతసమున సంకటమ్ము సమసె నటంచున్
చింత విడిచి నామ కరణ
మెంతయు వైభవమున జరిపించె సుతునకున్

354. చం. సుతునకు రోహితుండన సుశోభిత నామ మొసంగి భూధవుం
డతులిత ప్రేమఁ బెంచుచు జలాధిపు మాటఁ దలంపకుండె సం
తత సుత లాలనారతి; దినంబులు ముప్పది సాగె, నంత ది
కృతి వరుణుండు గన్పడియె బ్రాహ్మణ వేషము దాల్చి యచ్చటన్

355. ఉ॥ వచ్చిన యాతనిన్ గని నృపాలుడు భీతిలి కంపి తాంగుడై
చెచ్చెర వాని పాద సరసీజములన్ బడి మ్రొక్కి లేచి బల్
మెచ్చుగ నాతి థేయములు మెల్పున సల్పి మహాత్మ! మీరిటుల్
వచ్చుట మద్గృహంబు కడు పావనమై చెలు వొందె నియ్యెడన్





356. చం॥ యజన మొనర్తు నిక్కము మహాత్మ! ననున్ మది విశ్వసింపుమా!
యజన మొనర్ప సిద్ధపడి నంతనె పండితు లెల్లఁ జూచి యీ
ద్విజ రహితుండు జన్మమునఁ ద్రెంప ననర్హుడటంచుఁ బల్క నే
నిజముగ తత్ప్రయత్నమును నిల్పితి లేదొక హేతు వింతకున్

357. తే.గీ. దంతములు వచ్చి నంతనె తప్పకేను
వీని బలియిచ్చి యజ్ఞమున్ బ్రీతి తోడ
చేయఁ గలవాడ నందాక చెలిమి గలిగి
వేచి యుండుము నాతప్పు సైచి యెటులో

358. చం॥ అన మది సమ్మతించి చనె నవ్వరుణుండు; దినమ్ములేగగన్
తనయుని నోటఁ గన్పడెను దంతము; లంతట లోన భీతిలెన్
జనవిభు; డేమి చెప్పుదును చయ్యన నవ్వరుణుండు వచ్చి ని
ల్చెను తన గుమ్మమందు; మది చింతిలి భూపుడు పల్కె నివ్విధిన్

359. సీ॥ బిడ్డ కింకను పుట్టు వెంట్రుక లున్నవి
జరుగలే దతనికి చౌల కర్మ
గర్భకేశుడు యజ్ఞ కార్యమ్మునకు బలి
పశువుగా నర్హుడే వరుణ దేవ!
ఇంతకాలమ్మింటి వికకొన్ని దినములు
నిలువు మోరిమి తోడ నిర్మలాత్మ!
అనిపల్క వరుణు డత్యాగ్రహమ్మును బూని
ఎన్నిమార్లిట్లు వంచింతు వయ్య!

గీ॥ ఇంక మీదట నీ విట్లు బొంకి తేని
శాప మొసగెద ననుచు నా శాప హస్తు
దరిగె పశ్చిను దిక్కున; కంత విభుడు
నంతి పురికేగె నాటికి చింత వీడి

360. చం॥ జరిగెను కొంత కాలము, త్రిశంక తనూజుడు చిన్న వానికిన్
జరిపెను చౌలకర్మ; తన సంగతి యేమని వచ్చె వేగమే
వరుణుడు; కంపమంది నరపాలుడు దిక్కృతిఁగాంచి యజ్ఞమున్
జరిపెద నిప్పుడే యయిన సందియ మొక్కటి కల్గె నామదిన్

361. సీ॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్యబాలురు ద్విజు
లౌదు రుపనయన మైన యంత
ఉపనయ మ్మొనరింప కున్నచో వారల
శూద్రులందురు భువి సూరిజనులు
యజ్ఞమునకు శూద్రు దర్హుడెట్లగు నయ్య
బలిపశువును జేయ వరుణ దేవ!
కాన నుప నయమ్ము వీనికి జరిపించి
యాపైన యజ్ఞ కార్యము నొనర్తు

గీ॥ ఎనిమిదవ యేట విప్రుల, కెలమి క్షత్రి
యులకు పదు నొకందున; నిక యూరు సంభ
వులకు పండ్రెండున జరుప వలయు నుప న
యనమని బుధులు వల్కిరో అఘ విదూర!

362. ఉ॥ కావున వీనికిన్ పదునొకండవ యేటనె శాస్త్ర పద్ధతిన్
భూవరు లందరన్ బిలిచి పొందుగ నే నుపవీత కార్యమున్
దేవర! చేయుదయ్య! కడు దీనుడనై నిను వేడుకొందు స
ద్భావము తోడ కోపమును దక్కుము శాంతి వహించి యేగుమా!

363. చం॥ అన వరుణుండు మెత్తవడి యట్టిటు వల్కక నిష్క్రమించె; యిం
కను పదియేండ్లు పైన జరుగన్ వలె నాటికి చూచు కొంద మం
చనిశము రాజకార్యముల యందు మునింగె నృపాలు, డంత పు
త్రునకు పదేండ్లు నిండగ పురోహితులన్ బిలిపించి వేడ్కతో

364. తే.గీ. మంచి మూరుతమ్మెఱిగి యాక్ష్మాధవుండు
తనయు నుపవీతుఁ గావించె తగిన రీతి
విషయ మెఱిగిన వరుణుండు వేగ వచ్చి
ఎదుట నిల్చెను భూపతి యదరి పడగ

365. చం॥ నిలిచి నృపాల వర్యునెద నెగ్గురనన్ గడు తీక్ష్ణ దృక్కులన్
గలయగఁ జూచి “యోనృపతి! కార్యము నెల్లను విస్మరించి యి
ట్లలసత నుంటివా! యుపనయం బయినంతనె యజ్ఞకార్యమున్
సలుపుదు నంచు మాట యిడి జారు కొనన్ గమకించు చుంటివా!





366. చం॥ అని తన తర్జనిన్ వడిగ నాతనిమోమున కేసి చూపుచున్
వినయము చాలు నీ కపట వేషము లెల్లను నేను నమ్మ, నిం
కను నటి యింపఁ జూచి యధికంబుగ నన్ గనలింపఁ జేయుదేన్
నిను శపియింతు సుమ్ము ధరణీ వర! చూడు మటంచు బల్కినన్

367. తే.గీ. భయమునన్ హరిశ్చంద్రుండు వరుణుఁ గాంచి
యజ్ఞమును నెల్లి చేయింతు నాగ్రహింప
కనుచు వినయమ్ముదోప తా నాతిథేయ
ముల నొసంగి యతనిని శాంతిలగఁ జేసె

## రోహితుని పలాయనము

368. చం॥ వరుణుడు వచ్చి తండ్రినటు పల్కుటయున్ జనకుండు వానికిన్
వెఱచుచు యజ్ఞ కార్యమును వేగ నొనర్పగ సిద్ధమౌట, ని
ష్కరుణ తనన్ వధించుటకు సమ్మతిఁ దెల్పుట యెల్లఁ గాంచి భూ
వరుని సుతుండు రోహితుడు పర్విడె భీతి నరణ్య భూమికిన్

369. చం॥ మరు దివసంబునన్ దన కుమారుని జాడ యెఱుంగ కా ధరా
వరుడు దురంత దుఃఖమున పశ్చిమ దిక్పతిఁ జూచి మ్రొక్కి యో
పరమ దయానిధే! వినుము బాలుడు కన్పడ డయ్యె నాత డెం
దరిగెనొ తేల కున్న, దిసు మంతయు దోసము లేదు నాయెడన్

370. చం॥ వెతకిరి మద్భటాళి; కనిపింపడెటన్ దురదృష్టమేమొ? యో
నుతగుణ! యంచు వేడ, వరుణుం డిది వంచన యంచు క్రోధ వి
స్తృత పరికంపి తాంగుడయి దిగ్గన లేచి జలోదరామయ
స్థితి వెత నొందు మింక నని తెప్పున వాని శపించి యేగినన్

371. తే.గీ. అంత నా హరిశ్చంద్రున కాక్షణంబ
అగ్గలించె జలోదర వ్యాధి యంత
బాధ భరియింప లేక యప్పార్థివుండు
క్రిందు మీదయి మిగుల దుఃఖించు చుండె

372. చం॥ జనకునకున్ జలాధిపు డొసంగెను భీకర శాపమంచు న
వ్వనమున నున్న రోహితుడు పాంథులు దెల్ప నెఱింగి యక్కటా!

జనకుని యీ యవస్థకు నిజమ్ముగ కారణ మేనె యౌదు, నా
జననియు దీన నెంతటి విషాదముఁ బొందుచు నున్నదో కదా!

373. తే.గీ. తండ్రి దుఃఖమ్ము దీర్పని తనయు దేల
ఇంక నే నుండ క్షణమైన నిచట ననుచు
బయలు దేరెను రాజ్యమ్ము బాట పట్టి
రాచపట్టి రోహితుడు సంరంభ మెసగ

374. ఉ॥ ఆతని యత్నముస్ గని సురాధిపు డప్పుడ బ్రాహ్మణాకృతిన్
నీతి వచించు పోల్కి ధరణీ స్థలికిన్ జనుదెంచి వానికిన్
ప్రీతిగఁ బల్కె వత్స! యెటువెళ్ళుచు నుంటివి? తండ్రి యొద్దకా!
చేతమునన్ దలంపు మటు చేరిన నిల్చునె నీదు ప్రాణముల్

375. చం॥ వరుణునికై యొనర్చును జవంబున యజ్ఞము నీదు తండ్రి నీ
వరిగిన యంత; నిన్నచట పాశికి తా బలియిచ్చు; లోకమం
దరయగ నేరికైన తన యాయువు కంటెను మిన్నయెద్ది; యీ
ధరణియు, పుత్రులున్, ధనము, దారయు ప్రాణముతో సమానమే!

376. కం॥ తన సుఖముఁగోరి యిప్పుడు
నిను బలిపశువుగ వధించు నీతండ్రి సుమా!
తనకై తనయునిఁ జంపెడు
జనకునకై యుసురు వాయఁ జనునే నీకున్.

377. కం॥ నేడో రేపో తనువును
వీడును నీ తండ్రి యపుడు వెనుకయు ముందున్
జూడక పురమునకున్ జని
వేడుకతో నేలు మయ్య పృథ్విన్ గరిమన్

378. మ॥ అనినన్ రోహితు డించు కంత హృదయంబందున్ విచారించి తత్
క్షణమే యొక్కటి నిశ్చయమ్ము మదిలో సంకల్పమున్ జేసి య
య్యనిమేషాధిపు మాట గైకొనక యేలా! యింక సందేహముల్
జనకున్ గష్టములందు నాదు కొనుటే సంభావ్యమం చెంచుచున్.

379. కం॥ తన రాజధాని కప్పుడ
చనుచుండగ మరల నొక్క సద్బ్రాహ్మణ వృ





ద్ధుని వేషంబున నింద్రుడు
చను దెంచి నిలిచె నృపసుతు సమ్ముఖ మందున్

380. ఆ.వె. నిలిచి తగినరీతి నీతిని బోధించి
యతనిఁ జనగ నీక యడ్డగించె
అచట రోగ బాధ యధికమై భూవిభుం
డోర్వలేక గురువు నొద్దకేగి

## అజీగర్తుని చరిత్ర

381. చం॥ గురువర! రోగ బాధ కడకున్ ననుఁ జంపెడు నట్టులుండె స
త్కరుణను వారుణీపతి మఖం బొనరించు నుపాయ మెద్దియే
నరసి వచింపు మయ్య! యని యాతని పాద సరోరుహమ్ములన్
శిరమున నంటి మ్రొక్కు నృప శేఖరుఁ జూచి వసిష్ఠుడిట్లనెన్

382. చం. భయపడకో నృపాల! యొక బ్రాహ్మణ బాలునిఁ జూచి మిక్కిలిన్
ప్రియమున కన్న వారలకు శ్రేయము గూర్ప ధనమ్ము లిచ్చి తె
చ్చి యతని వారుణీశునకు శీఘ్ర గతిన్ బలియిమ్ము, దాన నిన్
దయ, వరుణుండు మెచ్చి పరితాప మడంచును తీరు శాపమున్

383. కం॥ అని గురుదేవుడు పల్కగ
జనవిభు డాక్షణమ యేగి సచివులఁ గనుచున్
విను డెంతైన ధనంబిడి
కొనితెండొక విప్రబాలు కూరిమి తోడన్

384. కం॥ అని యాజ్ఞాపింపగ వా
రును భట వర్గమ్ముఁ గూడి ప్రోలున్ బ్రోలున్
గనుగొనుచు వెళ్ళు చుండగ
కని రొకచో విప్రునొకని కటిక దరిద్రున్

385. తే.గీ. అత డజీగర్తుడను పేర నప్పురాన
బ్రతుకు నీడ్చుచుండెను పలు పాట్లు వడుచు
ముగురు పుత్రులు గల్గిరా భూసురునకు
వారి పరి పోషణము కడు భారమయ్యె

386. వ. శునః పుచ్ఛుడు, శునఃశేపుడు, శునో లాంగూలుడు నను
ముప్వురు పుత్రుల తోడ పడరాని పాట్లు పడుచున్న ఆ
బ్రాహ్మణ దంపతులు

387. తే.గీ. తనయు నొక్కని నమ్మి యా ధనముతోడ
బ్రతుకు నీడ్చుట యెంతయు భావ్యమనుచు
నాత్మలందెంచి యెవ్వాని నమ్మవలయు
ననుచు తర్కించి యొక నిశ్చయమ్ముఁదలచి

388. తే.గీ. అర్ధ్వ దుత్తర క్రియలకు నగ్రజుండు
వాని నమ్ముట తగ దెట్టు లైన నింక
నిష్ట దౌట కనిష్ఠు నెట్లీయఁ గలము
కాన మధ్యము నమ్ముటే కార్యమనుచు

389. తే.గీ. గోవులన్ నూరిటిన్ గొని కొంకులేక
అమ్మెఁదా శునశ్శేపుని; అంగటింటి
వస్తువును బోలె నక్కటా! వారలెంత
క్రూరులో గద! తలప నీ కువలయమున

390. చం॥ వల వల యేడ్చు చుండ పసి బాలుని గైకొని వచ్చి సేవకుల్
గొలుసుల తోడ యూపమునకున్ బలిమిన్ బిగియించి కట్ట ని
శ్చల మతి భూపు డంత ద్విజ సత్తములన్ బురికొల్పి యజ్ఞమున్
సలుపు డటంచు నాజ్ఞ యిడ సమ్మునులున్ ద్విజు లెల్ల రయ్యెడన్

391. చం॥ పడిపడి యేడ్చుచున్న పసి వాని వధించుట చూడ లేక ప్రా
న్పడినటు లుండ తత్క్రియ యొనర్చెడి విప్రుడు సైత మంగముల్
దడబడ యిట్టి ఘాతుకము తా నొనరింపగ లేను పొమ్మటం
చడిదము క్రింద వైచి చనె నా ధరణీశుడు చూచు చుండగన్

392. ఉ॥ భూపతి యేమి చేయుటకు పొందిక గానక సభ్యులార! మీ
రీ పని పూర్తి యౌనటుల నెయ్యది యైన నుపాయ మొక్కటిన్
చూపు డటంచు వేడు కొను చుండగ దిగ్గన లేచి యా శున
శ్శేపుని తండ్రి పల్కెనిటు ఛీయని యెల్లరు పల్లటిల్లగన్





393. కం॥ నిరుపేద నైన నాకున్
పరితృప్తిగ నిత్తు మనుచుఁ బల్కితి రేనిన్
ధరణీశా! వీని నిపుడె
వెరవక నేఁ జంపుదయ్య! వేరొండేలా?

394. కం॥ అందులకు హరిశ్చంద్రుడు
సందేహములేక నూరు చక్కని గోవుల్
పొందుగ వత్సమ్ములతో
నిందే నీ కిత్తు ననుచు నేర్పడఁ బలుకన్

395. కం॥ అంత నజీగర్తుడు కడు
సంతసమునఁ గొడుకుఁ జంప సన్నద్ధుండై
అంతకుని భంగి నడిదము
పంతమ్మునఁ గొనియె పరమ పాపా త్ముండై

396. చం॥ ఇతడొక తండ్రియే? మిగుల హీన చరిత్రుడు పాపకర్ముడున్
సతతము లోభ వృత్తి నిటు సత్సుతుఁ జంపగ నిచ్చగించె, నీ
కృతమున కీతడున్ గడు నికృష్టపు జన్మముఁ బొందకుండునే
పతితు డటంచు నచ్చటి సభాసదులెల్లరు నాడుచుండగన్

397. కం॥ వడి నటకు వచ్చి కౌశికు
డడలెడి యా బాలుఁ గాంచి యావేదనతో
పుడమి పతిని గని రాజా!
యుడుగుము నీ యత్నమింక నూఱటఁ గొనుమా!

398. చం॥ క్రతు విది పూర్తి యౌను, నినుఁ గాసిలఁ బెట్టెడి వ్యాధి తగ్గు, సం
తతము దయా గుణమ్మునకుఁ దక్కిన పుణ్యము వేరు లేదు, నీ
బ్రతుకునకై మరొక్కని యభాగ్యునిఁ జంపుట పాడిగాదు, భూ
త తతిని సర్వమున్ గడు నుదారతఁ జూచుట శాంతి హేతువౌ

399. తే.గీ. "ఆత్మవత్ సర్వభూతాని" యనెడు వేద
ధర్మమున్ మదిఁ దలపుము ధారుణీశ!
ఏమి వైరమ్ము గలదు నీ కితని పైన
కల్ల యితరులఁ జంపి సుఖమ్ముఁ గొనుట

400. కం. ఈత డజీ గర్తుడు కడు
పాతకు, డటు గాక యున్న పసి వాని నిటుల్
నీతివిడచి యమ్ముకొనెడి
కాతరు డెందైన గలడె కాశ్యపి యందున్

401. ఉ॥ ధారుణి నెవ్వరైన మది దండిగ పుత్రులఁ గోరుకొందు, రి
ట్లోరిమిఁ దప్పి విత్తమున కొప్పి తనూజుని విక్రయించునే
కూరిమి నొక్కడైన, తనకున్ గయలో తిలతర్పణాది సం
స్కారము లాచరించునని సమ్మతి నెంచునె గాని యారయన్

402. మ॥ ఇన వంశోత్తమ! నీదు పాలనమునం దీరీతి దుర్మార్గముల్
చనునే? యంతియగాక యీపనులు నైచ్యంబంచు శాసింప కో
జననాథా! యిటు పుత్ర విక్రయము ప్రోత్సాహించు టన్యాయ మౌ
నిన వంశోన్నతి యెల్ల మంటఁ బడె గాదే? నీదు మూలమ్మునన్

403. శా॥ నా మాటల్ విని వీని విప్ర తనయున్ దాక్షిణ్య భావంబునన్
భూమీశా! విడి పింపు మయ్య! శమమున్ బొందింతు నీ రోగమున్
సేమం బయ్యెదు; నీదు తండ్రి యదుగన్ జేర్పించితిన్ గాదె స్వ
ర్ధామంబున్ మును దేహయుక్తముగఁ దీరన్ జేసి తత్ శాపమున్

404. కం॥ నా యభ్యర్థన మిది భూ
నాయక! కాదనిన నీ కనర్థము గలుగున్
పాయక యజ్ఞ సమయముల
నేయది బుధులడుగ నిచ్చు టెంతయు శుభమౌ

405. కం॥ అని విశ్వామిత్రుడు ప
ల్కిన విని భూపాలు డంత కేల్మో డ్చుచు నో
మునివర! జలోదరమునన్
దినదిన మేఁ బడెడి బాధ తెలియదొ మీకున్

406. కం॥ నే పడెడి బాధ చూచుచు
నీ పగిది వచింప మీకు నెవ్విధిఁ జెల్లున్
ఈ పసి వానిన్ విడువను
పాప మయినఁ బుణ్యమైన బంధన మైనన్





407. ఉ॥ నావుడు మౌని వర్యుడు మనమ్మున నాగ్రహమూని, పైకి తత్
భావముఁ దోపనీక ద్విజ బాలకు చెంతకు నేగి ప్రేమ సం
భావిత మైన దీవెనలు పల్కుచు నిచ్చెను వారుణీశు భా
వావృత మంత్రరాజము ననంత శుభంకరమున్ పవిత్రమున్

408. చం॥ ముని వరు డట్లు మంత్రమును భూసుర బాలున కిచ్చి వత్స! దీ
నిని జపియింపు మీ! నియతి నెమ్మది నిల్పి, శుభంబు గల్గు నీ
కనిన, నతండు దాని మది నట్టులె నిల్పుచు నిశ్చలాత్ముడై
మననము సేయ, మెచ్చి యట మాన్య డపాంపతి వచ్చి నిల్చినన్

409. ఉ॥ భూపతి యక్కజంపడుచు బోరన వచ్చి జలాధి నాథు పై
చూపులు నిల్పి నమ్రగతి స్తోత్రమొనర్చి మహానుభావ! నే
పాపుడ మూర్ఖుడన్ క్షమకు పాత్రుడగా, నయినన్ క్షమించి నన్
శాప విదగ్ధు కావు మిదె సన్ముని సన్నుత! పశ్చిమాధిపా!

410. ఉ॥ నావుడు నీటి ఱేడు వదనంబున చిర్నగ వంకురింప నో
భూవర! నీది దోషమనఁ బోలదు నిక్కము పుత్రవాంఛతో
నీవటు నన్ను వేడితివి, నే నిను వంచన సేయ బూనితిన్
నీవును పుత్రుఁ జంపుకొన నేరక యిట్లు మొఱంగి తంతియే

411. చం॥ వరుణుని మాటలన్ విని యవాక్కయి మెల్లగ తేఱుకొంచు భూ
వరుడు మహాను భావ! నను వంచన చేసి కుమారు దేగుటన్
వెర వొక టేది లేక యిటు వీనినిఁ దెచ్చితి నాదు మాట సు
స్థిరముగ నిల్పఁబూని తమ తృప్తికి నై యజియింప నెంచుచున్

412. కం॥ అని యిట్లు హరిశ్చంద్రుడు
వినయమ్మునఁ బల్కుచుండ విని యా వరుణుం
డనఘా! యీ బాలుడు నను
వినుతించెన్ గాన వీని విడువుము ప్రీతిన్

413. శా॥ నీ యజ్ఞంబు సమాప్త మయ్యె, నికపై నీ వ్యాధియున్ పూర్తిగా
పాయున్ బొమ్మని యయ్యపాంపతి వచింపన్, వింతగా తక్షణం
బా యుర్వీశుని మేన రోగమది మాయంబయ్యె; బంధమ్ములున్
కాయం బందుఁ దొలంగె బాలునకు లోకంబెల్ల హర్షింపగన్

414. కం॥ జయజయ మనుచున్ యజనా
లయమునఁ గల సభ్యులెల్ల లాస్యములాడన్
ప్రియమున వరుణుం డంతట
పయనంబై చనియె వేగ పశ్చిమ దిశకున్

## శునశ్శేపుని సందేహ నివృత్తి

415. ఉ॥ ఆ పగిదిన్ విముక్తు డయినంత సదస్యులఁ జూచి యాశున
శ్శేపుడు వల్కె, నెల్లరు నశేష విధిజ్ఞులు, ధర్మవేత్తలున్
దీపిత సత్తపోధనులు, ధీరులు మీరలు తెల్పుడయ్య నా
కే పురుషుండు తండ్రియగు నిందు నిజమ్ముగ ధర్మపద్ధతిన్?

416. వ. అనియడిగిన

417. సీ॥ ఔరసుం డితడౌట నయ్యాజీ గర్తుడే
యగు తండ్రియని కొంద రనుచునుండ
కొడుకు నమ్మిన యట్టి క్రూరు డతం డెట్లు
తండ్రి యౌననుచు కొందరు తలంప
క్రయ పుత్రు డితడు భూకాంతున కటు గాన
అత డయ్యయని కొంద రనిరి బుధులు
మంత్ర మ్మొసంగిన మౌనియే తండ్రి యౌ
ననిరి కొంద రచటి యార్యులెలమి

గీ॥ పాశముక్తుని చేసిన వారుణీశు
డప్పయగుటకు నర్హు డీ యర్భకునకు
ననుచు కొందరు వల్కగ, నందరొక్క
నిర్ణయము చేయ లేరైరి నిక్క మచట

418. ఉ॥ ఆ సమయమ్ము నందటకు నంబుజ గర్భ సమాన తేజు డు
ద్భాసిత మూర్తియై కదలి వచ్చె వసిష్ఠుడు సూర్యతేజమే
వాసిగ నాకసమ్ము విడి వచ్చుచు నుండెనొ యన్నరీతిగా
నా సభ నెల్లవారు ముదమార నమస్కృతు లందఁ జేయగన్

419. ఆ.వె. అతనిఁ జూచి సభ్యు లా సమస్యను దెల్పి
ధర్మ మెదియొ దీని మర్మ మేమొ





తెల్పుడనుచుఁ బలుక తెలిపె నెల్లరఁ జూచి
యమ్మహర్షి సమ్మతమ్ము గలుగ

420. ఆ.వె. తనయు డన్న ప్రేమ తన కింతయును లేక
ధనముఁ గోరి యమ్మె దారుణముగ
కాన నితడు తండ్రి కా డజీగర్తుడు
అమ్మి నపుడె బంధ మడగి పోయె

421. కం॥ కొనెను హరిశ్చంద్రు డితని
తనయునిగా, నేల యనిన తన యజ్ఞమునన్
గొనకొని బలియీయఁ దలచి
కనుక నితం డతని కొడుకు కాదెన్నటికిన్

422. కం॥ స్తుతులకు సంతోషించుచు
నితనిన్ విడిపించె వారుణీశుడు, గానీ,
మతిఁ దలపఁ బ్రేమ గాదది
యత డెట్లగు తండ్రి యితని కవలోకింపన్

423. కం॥ ప్రేముడి విశ్వామిత్రుం
డేమియు ప్రతి ఫలముఁ గోర కీబాలునకున్
సేమ మొసగ మంత్ర మొసగె
నీ మౌనియె యితని తండ్రి యెల్ల విధములన్

424. చం॥ అనవిని సంతసించి కుశికాత్మజు డా ద్విజపుత్రు హస్తమున్
గొని, ప్రియవత్స! రమ్మనుచుఁ గూరిమిఁ గైకొని పోయె నింటికిన్
అనఘులు తక్కు మౌనులును యాజ్ఞికులున్ పరితోష మానులై
చనిరి సమస్య తీరె నని సమ్మతిఁ దెల్పి యథేచ్ఛ నిండ్లకున్

425. కం॥ అంత హరిశ్చంద్రుండును
సంతసమున నేలుచుండె శాత్రవ తేజం
బంతము సేయుచు రాజ్యము,
నంతట విషయ మ్మెఱింగి యా రోహితుడున్

426. చం॥ భయమును వీడి తక్షణమ పట్టణమేగి వినమ్ర శీర్షుడై
నయన యుగమ్ము చెమ్మగిల నన్ను క్షమింపు మటంచు తండ్రికిన్

ప్రియమున మ్రొక్క నాతడును వేగమ బిడ్డను కౌగిలించి, నే
త్రయుగళి మోదబాష్ప జల ధారలు తోరములై స్రవించగన్

427. కం॥ శిరమును మూర్కొని యొడిలో
కర మనురాగమున నుంచి కన్నీటన్ తత్
శిరమున్ దడుపుట యొప్పెన్
సరిగా పట్టాభిషేక సంరంభ మనన్

428. వ. అంత నొక శుభ ముహూర్తంబున యధావిధి కుమారునకు యౌవరాజ్య పట్టా భిషేకంబొనరించి హరిశ్చంద్రుండు రాజ్యము సేయుచుండె

## వసిష్ఠుని స్వర్గలోక గమనము

429. మ॥ జరిపించెన్ దగ రాజ సూయమును శశ్వత్ కీర్తి వెల్గొంద భూ
సురవర్యుల్ గడు సంత సింపగ వసిష్ఠున్ హోతగాజేసి; వి
స్తర దానమ్ములొసంగె, నాపయి మహా సంతోష ముప్పొంగ నా
గురుదేవున్ గడు వైభవోన్నత గతిన్ గొల్చెన్ సురల్ మెచ్చగన్

430. శా॥ ఆ పూజా ఫల మేమొ గాని యపు డయ్యాచార్యు డాశ్చర్యమున్
దోపన్ జేయుచు స్వర్గలోకమునకున్ దూర్ణంబుగా నేగి య
చ్చో పాకారి సమీపమందు నిలువన్, జోద్యంబుగా కౌశికుం
డా పుణ్యాత్మునితోడ నేగి పరిహాసార్థంబుగా నిట్లనెన్.

431. తే.గీ. ఎవరి పూజలు గొని యిపు డిచట కీవు
వచ్చి నాడవు తెల్పుమో స్వామి! యనుచు
పృచ్ఛసేయ వసిష్ఠుడు వెరవ కపుడు
తెల్పె విషయమ్ము నీరీతి తెల్లముగను.

432. మ॥ జన నాధుం డిన వంశ జాతుడు హరిశ్చంద్రుడు వీరుండు స
జ్జన మాన్యుం డిల రాజసూయ మను యజ్ఞంబున్ గడున్ శ్రద్ధతో
నొనరించెన్; దదనంతరంబ మదిలో నుత్సాహసంపూర్ణుడై
నను పూజించె నపూర్వ సంగతి మునీంద్రా! యెల్లరున్ మెచ్చగన్

433. తే.గీ. తత్ఫలంబున నేను స్వర్ధామ మునకు
చేరఁ గల్గితి ననుచు వసిష్ఠుడనగ





కోప ఘూర్ణిత నయనుడై కుశిక పుత్రు
డిట్లు వాకొనె నాక్షేప మెసకొనంగ

434. ఉ॥ ఆతని నేనెఱుంగనె మహా మహితాత్ముడటంచు గొప్పగా
కోతలు కోయుచుంటి విటు, కుత్సితు డాత దసత్యవాది ని
ర్భీతి నపాంపతిన్ మొఱగె, విప్రసుతున్ వధియింపఁ బూనె, నా
భూతల నాధునిన్ బొగడఁ బోలునె నీవు వసిష్ఠ! మిక్కిలిన్

435. ఉ॥ ఆత దసత్య వాదియు ననార్యుడటంచు నిరూపణమ్ము మీ
చేత మెఱుంగఁ జేయు, దటు చేయనొ మత్కృత పుణ్యమెల్ల సం
ప్రీతిగ నే త్యజింతు, మఱి మీరును మీ సుకృతమ్ము నెల్ల ని
ర్భీతిఁ ద్యజింతురే పణము వెట్టుడు నా వచనంబసత్యమేన్

436. కం॥ అన విని వసిష్ఠు డందుకు
తన సమ్మతిఁ దెల్పినంత తమ తమ యిచ్చన్
జని రిర్వురు నొకరి నొకరు
కనుగొనుచున్ జురచుర మని కను బొమ లెగయన్

## హరిశ్చంద్రునకు పరీక్ష

437. మ॥ చనియెన్ దానొక నాడు వేట కొఱకై సాంద్రాటవీ భూమికిన్
జన నాధుండు త్రిశంకు పుత్రుడు హరిశ్చంద్రుండు; మధ్యాహ్న మౌ
దనుకన్ క్రూర మృగమ్ములన్ దునిమి తత్ ప్రాంతమ్ము నందొక్కచో
కనియెన్ సుందరి నొక్కతెన్ మిగుల దుఃఖ ప్రాప్త నబ్జేక్షణన్

438. మ॥ కని, యో పద్మ దళేక్షణా! యిటుల నిక్కాంతార మందొంటి వై
మన నేలా? యిటు లేల యేడ్చెదవు దుర్మార్గుం డెవండేని నిన్
వనితా! నొంచెనొ? నీ విభున్ దెలుపు; మెవ్వారల్ నినున్ గన్నవా
రు, నిజం బేర్పడఁ దెల్పుమా కడువడిన్, రోదింపఁ బోకింతటన్

439. శా॥ ఈ రాజ్యంబున కే ప్రభుండ, వినుమీ యిందెవ్వడేన్ పాప సం
చారుం డుండుట కే సహింపఁ, జెపుమా సత్యమ్ము, నిన్నీ గతిన్
క్రూరత్వంబున హింస వెట్టు నతనిన్ రోలంబ నీలాలకా!
వారింతున్ తదుదగ్ర రాక్షస మనో వ్యాపార సంరంభమున్

440. మ॥ అన నా సుందరి దుఃఖ మాపు కొని యయ్యా! విన్ము నిత్యమ్ము ని
వ్వన సీమన్ దప మాచరించు ముని విశ్వామిత్రు డీరీతిగా
నను బాధించుచు నున్నవాడు ధరణీ నాథా! ననున్ గోరుచున్;
జనునే యిట్టి యకృత్యముల్ తమరి రాజ్యంబందు సూర్యాన్వయా!

441. ఉ॥ నా విని భూపుడంత కరుణన్ సరసీరుహ నేత్రఁ గాంచి త
న్వీ! విను మిప్పుడే యతని నిష్ఠను మానుపఁ జేయుదున్, మదిన్
నీవిక నూఱడిల్లుమని నెయ్యము మీఱగఁ బల్కి వేగమే
తా వన భూమి కేగి ముని తల్లజునిం గని మ్రొక్కి యిట్లనెన్

442. శా॥ స్వామీ! యీ తపమేల యిట్లు తనువున్ శల్యంబుగాఁ జేసి యీ
భూమిన్ దేనిని పొందఁ జూచెదవు, సమ్మోదమ్మునన్ గారణం
బేమో తెల్పుము తీర్తు నేను, చనుమీ యింకేటి, కిట్లన్యపీ
డా మార్గమ్ములు నౌ తపమ్ములకు నడ్డం బౌదు నేనెప్పుడున్

## సూకరాకార దానవ సృష్టి

443. కం॥ అని భూపాలుడు వల్కగ
ముని విశ్వామిత్రుడు తపమును మాని మదిన్
జనితామర్షమునన్ దా
మ్రనయను డై యరిగె నాశ్రమమునకు వేగన్

444. కం॥ తా మును వసిష్ఠుతో స్వ
ర్ధామమునం దొడ్డినట్టి తత్పణము మదిన్
వేమరుఁ దలచుచు ప్రతిగా
నేమైనను చేయ వలయు నిపుడని వేగన్

445. ఉ॥ దానవు నొక్కనిన్ మిగుల దారుణ దీర్ఘ మహోగ్రరూపు, ఝం
ఝానిల తీవ్రవేగు, పరుషాధిక తామ్రతరోరు కేశ సం
తాను, విలోల పుచ్ఛు, దృఢ దంత నఖున్, ఘన సూకరాకృతున్
మౌని సృజించి పంపెను తమాల సమాంగుని రాజధానికిన్

446. ఉ॥ భీకర రావ సంహతిఁ బ్రభిన్న దిశా పటలీ ప్రచండు డై
సూకర దైత్యు డప్పురముఁ జొచ్చి, కడున్ రమణీయ శోభతో
నాక వనోపమంబుగు వనంబునుఁ జేరి భటాళి భీతిలన్
వీక దలిర్ప వృక్ష తతిఁ బెల్చన నుర్వరఁ గూలఁ జేయగన్

447. కం॥ మాలాకారులు కొందరు
కాళులకున్ బుద్ధి చెప్ప,c గాండప్రతతిన్,
శూలంబుల భటు లపు డా
భీల గతిన్ రణ మొనర్చి విఫలక్రియులై

448. చం॥ భయమున వారు భూమి పతి పజ్జకు నేగి ధరాధి నాథ! ని
ర్భయమున భీకరాకృతిని పర్వుచు సూకర మొందు వచ్చి, మీ
ప్రియ వన మెల్ల ధ్వంస మొనరించెను, దానిని నిల్వరింపగా
నియతి రణం బొనర్చియును నిష్ఫల మయ్యెను మాప్రయత్నముల్

449. వ॥ అని పలుక

450. మ॥ భట వర్గంబుల మాటలన్ విని, ధను ర్బాణంబులన్ దాల్చి, తా
నిటలాక్షున్ బలె లేచి భూవిభుడు నిర్ణీత ప్రదేశానకున్
పటు వేగం బునఁ జేరి కాంచెనట దుర్వారోద్ధతిన్ ఘుర్ఘురా
ర్భటి నుద్యాన వనంబునన్ సుడివడన్ బారాడు నాక్రోడమున్

451. చం॥ కని కడు నుగ్రుడై నిశిత కాండములన్ వడినేయ, క్రోడమున్
తన నిపుణత్వ మేర్పడగ తచ్ఛర సంహతికిన్ దలంగి యా
జనవిభుఁ దాక నెంచి పరుసంబున నార్చుచు ముట్టెవంచి యా
తని కెదురౌచు పర్విడుట తద్ధరణీశు డెటింగి శీఘ్రమే

452. చం॥ వెనుకకు పాదముల్ జరిపి, వింటి గుణంబును లాగి, నేర్పునన్
ఘన తర శాత మార్గణ నికాయ పరంపర లేయ, నార్చుచున్
వెను దిరిగెన్ వరాహ మతి భీతి; నృపుందును వెంబడింబడెన్
ధనువున బాణమున్ దొడిగి ధైర్యవివర్ధిత వాయు వేగుడై

453. కం॥ కనఁబడు నొక్కట, మరలన్
గనబడ దింకొకట, నొక్క క్షణకాలమునన్
గనుమరుగై పరువెత్తును
జన నాథుని మదికి నధిక చలముదయింపన్

454. చం॥ చనిచని దాని వెన్క నొక సాంద్ర వనమ్మునుఁ జేరె; భానుడున్
గన పడె నెత్తిపైన నధికంబగు తాపముఁగల్గఁ జేయుచున్,
గనపడ దయ్యె సూకరము, కంఠమునన్ దడి యాఱె, దారియున్
గనుగొనఁ జాల దయ్యె, తురగంబును వేసటఁ జెందె మిక్కిలిన్

455. చం॥ జలఖగ కూజితంబు లొక చాయ వినంబడు చుండ భూపుడా
వలనయి పోయి శుద్ధజల వాహిని గన్పడ ప్రాణమొక్కటన్
బలిమిని లేచినట్టు లుద పాన మొనర్చి తురంగ రాజమున్
జలములఁ ద్రావఁ జేసి యట చల్లని నీడన సేదఁ దేఱుచున్

456. చం॥ చనవలె నింక ప్రోలునకు, సైన్యము లెచ్చట నున్నవోగదా!
అనుకొనుచుండ బ్రాహ్మణుని యట్టుల కౌశికు డాధరాధినా
ధుని యెదుటన్ నిలంబడగ తూర్ణగతిన్ గరముల్ మొగిడ్చి యా
జనపతి మ్రొక్కినిల్చె ద్విజ సత్తము దీవెనలంది చెంగటన్

457. కం॥ భూపతిఁ గని భూసుర వరు
డేపని వడి వచ్చితి విటు లీ యడవికి నీ
వీ పగిది నొంటి నుండన్
భూపాలా! కారణమ్ము పొసగన్ జెపుమా.

458. మ॥ అనినన్ మానవ నాథు డిట్లనియె నయ్యా! భీకరంబైన యా
ననమున్ గల్గిన సూకరం బొకటి యున్మత్తస్థితిన్ వచ్చి గ
న్నన మాకేళి వనంబుఁ జొచ్చి యట నందం బైన వృక్షమ్ములన్
తన దంతమ్ములఁ బెల్లగించి కడు విధ్వంసంబు గావింపగన్

459. చం॥ ధనువును బాణముల్ గొనుచు దాని వధింపఁ దలంచి వెంబడిన్
జనిచని యిట్లు వచ్చితిని, చయ్యన నయ్యది మాయమయ్యె, నా
వెనుకనె వచ్చు సైన్యములు వేసరి వెన్కనె నిల్చి రెచ్చటో?
ఘన తృషఁజెంది తోయములకై యిటు లీనది చెంతఁ జేరితిన్

460. తే.గీ. అనఘ! నే నయోధ్యాపతి, నర్కవంశ
జుడ హరిశ్చంద్రుడను; రాజ సూయ యాగ
ము నొనరించి బ్రాహ్మణులకు భూరి దక్షి
ణల నొసంగితి నెల్లరానంద మంద





461. ఉ॥ మీరును రండు మా పురికి మిక్కిలి గన్ ధన మిత్తు; నెద్ది యే
నారసి యజ్ఞమున్ సలుపుదయ్య మహాత్మ! పురంబుఁ జేరగా
దారి నెఱుంగఁ దెల్పుడనఁ, దద్దయు నవ్వుచు విప్రుడిట్లనెన్
భూరమణా! యిదెంతయునుఁ బుణ్య తరంగిణి గాన వేగమే

462. ఉ॥ స్నానమొనర్చి పూర్వులకు చయ్యన తర్పణ లిమ్ము పొందుగన్
దాన మొసంగ నిద్ది శుభ దాయక మౌ సమయంబు, సత్ఫలం
బౌ నిపుడేది యిచ్చిన, రయంబున నేగుము, వేళమించినన్
దాన ఫలంబు సన్నగిలు తప్పదనన్ నృపవర్యు డుబ్బుచున్

463. చం॥ తన నృప వేషమున్ విడిచి తత్తటినిన్ దిగి స్నానమాడి యొ
య్యన జలమందె నిల్చి ద్విజునానతిఁ దర్పణలిచ్చి వచ్చి, య
య్యనఘుని చెంత నిల్చి వినయంబునఁ బల్కెను భూసురోత్తమా!
కొనుమిదె దానమిచ్చెదను కూరిమి నీ వెది కోరినన్ వెసన్

464. చం॥ వసుధయొ, గోవులో, వసువొ, వారణ పంక్తులొ, వారువమ్ములో
అసదృశమౌ రథమ్ములొ, సితాబ్జ దళేక్షణలైన కన్యలో,
వెస నెఱుగంగఁ దెల్పు మిక వేరెదియైన నొసంగు వాడ, నల్
దెసల మదీయ కీర్తి కడు దీపిలఁ జేయుము బ్రాహ్మణోత్తమా!

465. మ॥ వసుధేశుం డిటు వల్క మోదమున విశ్వామిత్రు డో భూపతీ!
వసుధన్ నీదు ప్రశస్తి యెల్ల మును నే స్వర్గంబునన్ మీ గురుం
డసమానుండు వసిష్ఠ మౌని తెలుపన్ సాంతమ్ముగా వింటి, సం
తస మయ్యెన్ నృప వర్య! నేటి తమ యౌదార్యంబు వీక్షింపగన్

466. వ॥ నేను విశ్వామిత్రుండనని తన నిజరూపమున్ జూపి

467. కం॥ సుతునకు వివాహమును నే
నతులితగతి జరుపఁ దలచి యడుగుచు నుంటిన్
నుత చరితా! వలసిన ధన
మతి కృప నాకిత్తువేని యానం దింతున్

468. కం॥ అనవుడు భూపతి యనియెన్
వినయంబున నతనిఁ జూచి విప్రవరేణ్యా!

మనమున సందేహింపకు
ధన మెంతయు నైన నిత్తు తప్పను మాటన్

469. కం॥ అని విభుడు ప్రతిన సేయగ
తన మాయా విద్య తోడ, తనయుని మఱియున్
వన జేక్షణ నొక కన్యను
క్షణమున సృజియించియంత క్ష్మాధవుఁ గనుచున్

470. ఉ॥ వీరి వివాహ కార్య మతి వేడుకఁ జేయఁ దలంచి నాడ నో
భూరమణా! గృహస్థునకు మోదము గల్గ వివాహ కార్యపున్
భారము దీర్ప భారమని భావన సేయక యిచ్చు దాతకున్
చేరును రాజసూయ ఫల సిద్ధికి నెక్కుడు సత్ఫలంబిలన్

471. కం॥ ధనమును వివాహ సమయం
బున నిత్తువు పోదము పద భూవర! యనుచున్
ముని వరుడు వల్క నందరు
జని రాశ్రమ భూమి కపుడు సమ్మతి తోడన్

472. తే.గీ. అంత కౌశికు డగ్నిహోత్రాది కముల
సిద్ధమొనరించి తనయు నా చిన్నదానిఁ
జేర్చి కూర్చుండఁ బెట్టి ప్రశస్తి గదుర
దాన మొనరింపు మింక నేదేని యనిన

## రాజ్యదానము

473. చం॥ మునివర యిత్తు నేదయిన మోదము తోడుత కోరుకొమ్ము, నె
మ్మనమున సంశయింపకని క్ష్మాపతి పల్కగ, గాధి సూను డో
యనఘ! రథాశ్వరత్న బలహస్తి ధనాదుల తోడ రాజ్య మీ
యనలుని సాక్షిగా వరున కర్పణ సేయము మాట చొప్పునన్

474. చం॥ అనియడుగన్ విభుండు మది నట్టిటు చూడక యిచ్చి వేసితిన్
గొనుమిదె రాజ్య మెల్ల ధన, గో, రథ, ఘోటక సైన్య యుక్తమున్
మునివర!, యంచుఁ బల్కె కడు మోదముఁ జెందుచు పుచ్చుకొంటి నే
ననియెను కౌశికుండు సమయంబు ఫలించు నటంచు నెంచుచున్





475. కం॥ ఇన్నియుఁ గై కొని యాతడు
మన్నియడా! యింత యిచ్చి మఱి దక్షిణ లే
కున్నను దాన ఫలం బీ
వెన్నటికిని పొందఁ జాల వినవంశ మణీ!

476. తే.గీ. అన హరిశ్చంద్రు డీ వేమి యడిగె దనిన
సరిగ నేబది మణువుల స్వర్ణ మొసగు
మనుచు ముని పల్కె; భూపుడు వెను దిరుగక
ఇచ్చెదను నిక్కమని మాట యిచ్చె వేగ

477. శా॥ మాయా మోహితుడై నృపాలు డిటు సామ్రాజ్యంబు దానంబుగా
నీయం జాలుటె కాక వృద్ధియనగా హేమమ్ము సైతమ్ము బా
కీయై, దుఃఖ సముద్ర మగ్నుడగుచున్ గీడ్పాటు లో నెంచుచున్
డాయన్ వచ్చిన సేనతోడఁ జనె మౌనం బొప్పగా నింటికిన్

478. తే.గీ. తపసి నన నేల నొసటన ధాత యిట్లు
వ్రాసి యుండిన తప్పింపఁ బడునె యెందు
పంచ భక్ష్యాన్నములు గల్గి భాగ్యవంతు
డార గించునె తాను రోగార్తు డేని

479. చం॥ అతని ముఖమ్మునం దలమి నట్టి విచారముఁ గాంచి మాధవీ
లత తన పట్టపుస్సతి కలంగుచు మెల్లన చెంతఁ జేరి యో
వితత యశోవిశాల! యిటు వేదన తోడ నిరంతరమ్ము స్వ
స్థతచెడి యుండ నేల నృప సత్తమ! తెల్పుము హేతువెద్దియో?

480. కం॥ చేసితివి రాజ సూయము
భూసురులున్ మెచ్చ; సుతుడు పురికిన్ వచ్చెన్
నీ సములు లేరు శత్రులు
వాసిగ వరుణుండు మెచ్చి వరముల నిచ్చెన్

481. చం॥ ఇక దిగులేల నీకు పృథి వీశ్వర! యెద్దియు నారగింప కి
ట్లొకడవె యుండ నేల? యని యోరిమి పృచ్ఛ యొనర్చు దేవితో
నొకటియు రెండు పల్కులటు లొయ్యనఁ బల్కి ధరాధిపుండు తా
వికల మనస్కుడై గడపె వీఱిడి యట్టుల రాత్రి యంతయున్

482 కం॥ అటు తూర్పున నుద యించెను
చటుల గతిన్ భానుడంత చండ కిరణుడై
ఇటు గుమ్మమ్మున నిలిచెను
కట కట! యా కౌశికుండు కనలుచు వడిగన్

483. కం॥ ముని విశ్వామిత్రుం డట
కనిపింపగ భటుడు వెళ్ళి క్ష్మాపతికి తగన్
వినిపించెనొ లేదో తా
వెనుకనె ముని వచ్చి నిల్చె విభునకు నెదురై

484. చం॥ నిలిచి నృపాలుఁ గాంచి ధరణీ వర! రాజ్యము నా కొసంగి యా
వల కికఁ బొమ్ము! స్వర్ణము జవంబున తెమ్ము విలంబమేల యం
చలయకఁ బల్క భూపతి మహాత్మ! యిదే చనుచుంటి నేను భూ
వలయము నేలు కొండిక నవారణ సర్వము ధారవోసితిన్

485. తే.గీ. ధార వోసిన దానిని తగునె ముట్ట
కాల మది నాకు నొక్కటఁ గలసి రాగ
దక్షిణగ నిత్తు స్వర్ణమున్ దప్పకేను
వేచి యుండుము స్వామి! యా వేళ దనుక

486. కం॥ అని విశ్వా మిత్రునకున్
మనవి యొనర్చి నృపుడు తన మందిరమునకున్
జని తన భార్యన్ పుత్రున్
గని యిట్లనియెను విచార గద్గద గళుడై

487. మ॥ ధర నెల్లన్ ధన సైన్య సంపదలతో దానంబుగా నిచ్చి తేఁ
బరమప్రీతిగ గాధి రాట్సుతునకున్ బంధమ్ము లేదింకపై
త్వరగా నేగ వలెన్, శరీరములు తప్పన్ లేవు వేరేవి యిం
దరవిందానన నావియన్నవి, కుమారా! రమ్ము వైళమ్ముగన్

488. కం॥ అనితెల్పి వారిఁ గైకొని
ముని వృత్తిన్ గోట దాటి భూపుడు మెల్లన్
జను చుండ విషయమున్ విని
జనులెల్లరు నటకుఁ జేరి సజల నయనులై





489. మ॥ జననాథా! యిటు లేల చేసితివి మోసంబయ్యెనా! దైవమా!
చనునే యింతటి క్రౌర్యమున్ దలప? విశ్వామిత్రుడిట్లేల చే
సెను? కాపాడెను గాదె పూర్వము శునశ్శేపున్ గృపామూర్తి యై!
నిను వంచించుట కేమి హేతు వకటా! నిన్‌బాసి జీవింతు మే?

490. చం॥ అని కడు దీనులై పలుకు నా నగర ప్రజ లక్కజం పడన్
వెనుకనె వచ్చి కౌశికుడు పెల్చన నో ధరణీశ! నిల్వు మా
చనకుము నాకు నీయదగు స్వర్ణమునిచ్చి యెటైన వెళ్ళుమా!
మనమున బాధయౌ నెడల మానుము దానము, కొమ్ము రాజ్యమున్

491. మ॥ అనినన్ భూపతి నమ్రుడై ముని వరా! అర్కాన్వయోద్దీపకుం
డను, సుక్షత్రియ వంశజుండ, బుధులానందింప, ధాత్రీశులున్
వినుతింపన్ భువి రాజ సూయ మఖమున్ విఖ్యాతిమైఁ జేసితిన్,
వెను కాడన్; గడువిమ్ము నాకుఁ గడు సంప్రీతిన్ ధనం బిచ్చెదన్

492. వ. అనిన ముని వరుండిట్లని యె

493. మ॥ పరిపాలింపగ లేదు రాజ్య, మిక వ్యాపారంబనన్ చేతిలో
నరకాసైనను లేదు; సేవకులు సైన్యంబుల్ గనన్ లేరెటన్
పరిహాసంబులుగాక స్వర్ణ మెటు సంపాదింతు, వింకేల, నా
తరమున్ గాదని యొప్పుకొ మ్మరుగుదున్ దథ్యంబు నాయంతటన్
494. మ॥ కడు నిక్కచ్చిగ పల్కు నత్తపసి వాక్యంబుల్ మదిన్ గుంచగా
జడ దారీ! భయ మేల నయ్య! ఋణమున్ సత్యంబు నేఁ దీర్చెదన్
దడవిమ్మా! యనుమానమేల! యటు లైనన్ మమ్ము నెవ్వారికేన్
నుడిగమ్మున్ దగఁ జేయ నమ్ముకొన భాగ్యోత్తంసునిన్ జూపుమా!

495. మ॥ అనుచున్ భూపతి నిల్వ కట్టె తన యర్ధాంగిన్ సుతున్ వెంట గై
కొని యేగెన్ బహు దూర మచ్చటచటన్ గోనల్ గిరుల్ వాహినుల్
వనముల్ దాటుచు కొన్నినాళ్ళు; తుదకున్ వారాణసీ పట్టణం
బును గంగాధరు వాసమున్ గనియె సమ్మోదమ్ము పొంగారగన్

496. మ॥ అట నుత్తుంగ తరంగ రంగ దుద పూర్ణాంచ త్తటీ సంగమున్
పటు పాపౌఘ వినాశ దక్ష భవ సంభావ్యోత్తమాంగంబునున్
వట సాలామ్ర తమాల పాదప లతా వ్యాకీర్ణ తీరాంగమున్
స్ఫుట మౌ గంగను గాంచె భూధవుడు సమ్మోదాబ్ధి నిర్మగ్నుడై

497. కం॥ కని యత్తటినీ పావన
వనముల ముప్పరునుఁ గూడి పరమా నందం
బున స్నాన మాడి యంతట
తన పూర్వుల కప్పిభుండు తర్పణ లొసగెన్

498. ఉ॥ అంతట సాగి వచ్చి ప్రళయాంత నటత్ ప్రతి పాద్యపాదు, పా
పాంతక జాహ్నవీ జల శుభాస్పదు, భక్త జ నావ నోద్గమ
శ్రాంతు, త్రినేత్రు, పంచ సుమ సాయక భంగ వినోదు, పార్వతీ
కాంతు, ననంతు, నీశ్వరుని గాంచిరి వేదన లెల్లఁ బాయగన్

499. ఉ॥ కాంచి నమస్కరించి తమ కష్టము లింక తొలంగు నంచు భా
వించుచు వారణాసి పుర వీధుల శోభను గాంచి మెచ్చుచున్
సంచిత పాపకర్మ వట సాల సమూల వినాశనక్రియో
దంచిత శాత ఖడ్గమిది, ధన్యుల మిప్పురిఁ జూడఁ గల్గుటన్

500. కం॥ అని యప్పుర వైభవమున్
తనయునకున్ సతికిఁ దెల్పి తత్పుర వీధిన్
జనుచుండ జముని యట్టుల
కని పించెన్ కౌశికుండు క్ష్మాపతి కెదుటన్

501. చం॥ కనఁ బడి యోనృపాల! తమకంబున దక్షిణ మాట మాని యి
ట్లనయము గుళ్ళు గోపురములంచు వృథా సమయంబు పుత్తువా!
వినయము మాని కక్కుమిదె వేగ సువర్ణ మటంచుఁ బల్క నా
జనపతి మ్రొక్కి యిట్లనియె సౌమ్యగతిన్ ముని వర్యు జూచుచున్

502. మ॥ అపరబ్రహ్మలు నైన మీ రెఱుగరే? అర్థాంగియున్ బుత్రుడున్
గృపణాత్ముండను నేను తప్ప మఱి యింకేదేనియున్ గల్గనే
తపసీ! నాకడ; దాస్యవృత్తికిని సిద్ధంబేము, మన్నించి స
త్కృప మీ సేవలు సేయఁ బన్పుడతి తృప్తిన్; లేదు మార్గంబికన్

503. చం॥ అది సరిపోదయేని తగు నర్థ మొసంగెడు వానిఁ జూచి యిం
పొదవగ నమ్ము కొండు మము, నూరక మీరలు కోపగించినన్
కదలి ధనంబు వచ్చు నెటు కాల గతుల్ వ్యతిరేకమైనచో?
సదయుడవై మరొక్కనెల సమ్మతితో గడు విమ్ము నమ్మికన్





504. కం॥ అన ముని సమ్మతిఁ దెల్పుచుఁ
జనె తన యాశ్రమమునకు ప్రసన్న వదనుడై
మనమున నా భూపాలుడు
దిన మంతయు చింతఁ జేసె తీవ్రముగ నిటుల్

505. సీ॥ అప్పుతీరెడు మార్గ మగు పించ దయ్యెగా
ఆదు కొనగ మిత్రు లైన లేరు.
యాచించుటది కడు నీచమ్ము క్షత్రియ
జాతి కనుచుఁ బల్కె శాస్త్రములును
ఆత్మహత్యకుఁ బూని యసువులఁ బాయుట
యదియు మహా పాప మంద్రు బుధులు
అప్పుతీర్పగ లేక ఆత్మహత్యకుఁ బూన
నవలి జన్మము నీచ మగుట ధ్రువము

గీ॥ కాన నన్నమ్ము కొని యెటులైన వీని
అప్పు తీర్చుట కర్తవ్య మనుచుఁ దలచి
భార్య మొగమును గని యేమి పలుక లేక
కలత వడు చుండఁ గాంచి య మ్మెలత యపుడు

## హరిశ్చంద్రుడు భార్యనమ్ముట

506. మ॥ కను యుగ్మమ్మున బాష్పముల్ గడువడిన్ గ్రమ్మంగ దగ్గుత్తికన్
జననాథా! దిగులేల? కష్టముల నిచ్చన్‌బొంది ధర్మమ్మునం
దనయంబున్ నిలువంగ నౌ; జగతి సత్యంబందు నిత్యంబు ని
ల్చిన సత్కీర్తినిఁ బొందవచ్చు నదియే చింతింప స్వాస్థ్యంబిడున్

507. ఉ॥ హోమము లెన్నిచేసినను నుగ్ర గతిన్ దప మెంత సల్పినన్,
వేమరు శాస్త్రముల్ చదివి పేరు గడించిన నైన, దానముల్
సోమము లెన్నియైన నొక సత్యముతో సరిగావు తల్పగన్
సేమము గా దసత్యము, నశించును దానఁ గడింది పుణ్యముల్

508. మ. కడు యుక్తంబుగ నిట్లువల్కు సతినిన్ గన్గొంచు భూపాలు డో
యుడు రాజానన! నిక్కమే యగును నీయుక్తుల్ ప్రశం సార్హముల్
గడువేగన్ ఋణమెట్లు తీరు ననియే కల్యాణి! నాచింత యి
య్యెడఁ గర్తవ్యము గూడ నీవె చెపుమా! యింకేటి కాలస్యమున్

509. వ. అనిన నయ్యలరుఁ బోడి యిట్లనియె

510. తే.గీ. పురుషునకు భార్యవలన నిప్పుడమి యందు
సత్సుతునిఁ బొందు టొక్కటే సత్ఫలమ్ము
అట్టి సంతాన ఫలము మీ కందె నెపుడొ
కాన నను విక్రయింపు మో ప్రాణనాథ!
అనిన నెత్తిన పిడుగు పడ్డట్లు విభుడు
పలికె నీరీతి కనుల బాష్పములు నిండ

511. మ॥ అకటా! యెంతటి మాటఁ బల్కితివి, నేనాపాటి దుష్టుండనా!
యికపై నిట్లనఁ బోకు నే మఱతునే యీ చంద్రబింబాస్యమున్;
పికనాదామృత ధారలన్ గురియు నీ ప్రేమోక్తులన్ విన్న నా
సకలంబౌ యిడుముల్ దొలంగు రమణీ! సాధ్యంబె నిన్వీడగన్

512. కం॥ అని మూర్ఛిల్లిన భర్తన్
గనుగొని సతి గొల్లు మనుచు కటకటఁ బడుచున్
తన సుతుని నతనిఁ జూచుచు
ముని వర్యునిఁ దలచు కొంచు పొగిలెన్ వగలన్

513. కం॥ ఇట నేమైనదొ యెఱుగక
కటకట యా రోహితుండు కన్నీరొలుకన్
అటునిటు కుదుపుచు నమ్మా!
యిటు లేటికి నేడ్తు వనుచు నేడ్వ మొదలిడెన్

514. ఆ.వె. అంత దండ ధరుని యట్టుల కౌశికుం
డటకు వచ్చి శీత లాంబువులను
విభుని ముఖము పైన వెడవెడఁ జల్లంగ
మూర్ఛఁ దేఱి తేడు మునికి మ్రొక్క

515. వ. జనవరుం గాంచి ముని వరుండిట్లనియె

516. ఉ. సత్యము సత్యమందు వది సంబరమే ధరణీశ! నీకు, నీ
సత్యమె కొంప ముంచు నిను, చాలును బింకము కట్టిపెట్టి యా
సత్యము వీడి నీ ఋణ మొసంగగ లేనను మాటఁ బల్కి దాం
పత్య సుఖమ్ముఁ బొందు మిక పాలన సేయుము రాజ్య మిమ్ముగన్





517. వ. అని మునీంద్రుండన హరిశ్చంద్రుడు వినయ వినమిత గాత్రుండై
యిట్లుపలికె

518. సీ॥ ఇన చంద్ర తారక లెల్ల నింగిని వెల్గు
సత్యమ్ము వలన నే సంతతమ్ము
విశ్వ విశ్వంభర విశ్వాంతరాళాన
నిలిచి యున్నది సత్య నియతి చేత
నిరతమీ పృథ్విని శిరమున నిడి ఫణి
వరలుట సత్యమ్ము వలనఁ గాదె
అవతారములఁ దాల్చి హరి యుగయుగముల
సత్యమ్ము కతననే జన్మలెత్తు

ఆ.వే. సత్యమందె గలదు స్వర్గమ్ము తలపంగ
అశ్వమేధ శతము లైనఁ గాని
యొక్క సత్య మునకు నిక్కమ్ము సాటియే
మాట తప్పఁ జాల మౌనివర్య!

519. కం॥ అనుచు హరిశ్చంద్రుండనఁ
గనలుచు ముని యతనిఁ జూచి ఖర కిరణుడు వా
రుణి కేగక మున్నే నా
ఋణ మీయక యున్న శాప మిచ్చెద నృపతీ!

520. కం॥ అని బెదిరించుచు నరిగెను
ముని, యంత విభుడు కడుభయమున నెయ్యదియున్
గనఁ జాలక కర్తవ్యము
వెనుకకు ముందుకునుఁ దిరిగె వెఱ్ఱియుఁ బోలెన్

521. ఉ. ఆ సమయమ్ము నందె యొక అగ్రకుల ప్రవరుండు చేత ద
ర్భాసనమున్ గమండులువు, నంసము నందొక మూటఁ దాల్చి యు
ద్భాసిత తేజుడై కదలి వచ్చుచు నుండెను శిష్యవర్గముల్
సేసెడి సేవలన్ గొనుచు చెచ్చెఱ నప్పుర వీధి నొయ్యనన్

522. చ॥ అతనినిఁ జూపి మాధవి ధరాధిపుతో ననె ప్రాణవల్లభా!
మతిఁ బరికింప భూసురుని మానుగ తక్కిన మూడు వర్ణముల్

సతతము తండ్రి యట్టులుగ సమ్మతిఁ జూచుట యొప్పు నంచు ము
న్నతిథులు దెల్ప వింటి నటు లౌటఁ దలంపుడు వానిఁ దండ్రిగా

523. తే.గీ. తండ్రి ధనమును గొనుటకు తగును కొడుకు
కాన నీ విప్రుఁ బ్రార్థించి కావలసిన
ధనముఁ గొను టొప్పదే మదిఁ దలపుమయ్య!
యనుచుఁ బల్కెడి యర్థాంగి నట్టె చూచి
పలికె నివ్విధి భూపతి పల్లటిలుచు

524. శా॥ దేవీ! క్షత్రియ వంశ జుండ తగునే దీనుండనై యాచనల్
గావింపన్; పరు నొద్ద గైకొనుట యన్ కార్యంబు నెట్లొప్పుదున్
భావింపన్ ధరణీ సురుండు గురువై భాసిల్లు చుండున్ గదా!
యే వర్ణంబుల కైన, నట్టి గురు నే నేరీతి యాచించెదన్

525. కం॥ నరపతి కధ్యయ నంబును
శరణా గత రక్షణమ్ము సత్ పాలన యున్
వర యజ్ఞదాన కార్యము
లరయన్ గర్తవ్యములని యందురు విబుధుల్

526. తే.గీ. దేహి యను మాట లేదు నా దేహ మందు
నిరతము దదామి యనుటయే నిల్పుకొంటి
కౌశికున కీయ వలసిన కనక మెటులొ
దాస్య మొనరించి యైన నే తప్ప కిత్తు

527. వ. అనియిట్లు క్షత్రి యోచితంబుగా పలుకు భర్త పలుకులు విని
యమ్మానిని

528. ఉ॥ కాలము శక్తి రూప; మది కష్ట సుఖంబులఁ గూర్చు చుండు, భూ
పాలుని బంటుఁజేయు, మఱి బంటును నందల మెక్కఁ జేయు నీ
కాలమె, సర్వసంపదలు కావు తిరంబులు భూతలేశ! ము
న్నేలిన రాజ్యమందె మన మిట్లు చరించుట తత్ప్రభావమే

529. చం॥ ఇనకుల నాథ! యాచనకు నీ మన సొప్పక యున్న, నన్ను నీ
యనఘున కమ్మి యాధనము నంతయు మౌని కొసంగి వానిదౌ





ఋణమును దీర్చుకొమ్ము, రవి యేగుచు నుండెను పశ్చిమాద్రికిన్
మన కిక లేదు మార్గమెట, మారు వచింపక విక్రయింపుమా!

530. ఉ॥ జూదము లాడఁ గాదు, పడి సోలగ మద్యముఁ గోరి కాదు, స్వ
ర్గాదులఁ బొందఁ గాదు, ధర నంతయు నేల దలంచి యేనియున్
గాదుఁ ధరాధినాథ! యల కౌశికునప్పును దీర్పనే గదా!
వేదన యేటికింక నను విప్రునకమ్మి ఋణమ్ము దీర్పుమా!

531. కం॥ అనియిట్లు పెద్ద కాలము
తనపతి కెక్కంగఁ జెప్పఁ దప్పదనుచు నా
జన నాథుడు పట్టమహిషి
నినవంశ స్నుషను విక్ర యింపఁ దలంచెన్

532. చం॥ కఱకుఁ దనంపు కత్తిఁ గొని కాయము భూమినిఁ ద్రెళ్ళ జంతువున్
నఱకెడు కర్మశాత్ముడయినన్ నిజపత్నిని విక్రయించునే?
వెఱవక యిట్టు లంగనను వీధినఁ బెట్టి కొనుండు మీర లం
చఱ చుట కిచ్చ గించి తిని అక్కఱినాత్ముని కంటె హీనుడన్

533. వ. అనివిల పించుచు తత్సమీ పంబునంగల యొక వేదిక
పైకెక్కి యో కాశీ పుర పౌరులారా!

534. ఉ. ఈమె మదీయ పత్ని, జగదేక పతివ్రత, శాంత మూర్తి, పో
రామికిఁ బ్రాణమిచ్చును, నిరంతరమున్ యజమాను సౌఖ్యమే
తా మది నెంచు, నీ యమను దాసిగ గైకొను డట్టులైన మీ
ధామము శాంతి ధామమగు, తప్పును కష్టము లబ్బు సంపదల్

535. కం॥ అనవిని యాబ్రాహ్మణులా
తనిఁ గని యెవ్వడవు నీవు? ధర్మమె నీకి
ట్లను గున్ సతి నమ్ము కొనుట?
కొని పొమ్మిటఁ గూడ దిట్టి కొఱగామి పనుల్

536. కం॥ అని గద్దించెడి విప్రులఁ
దన కరమున నెట్టు కొనుచు దగ్గఱి ద్విజ వృ
ద్ధుని వేషంబునఁ గల యా
ముని విశ్వామిత్రు డతని మోమున్ గనుచున్

537. ఉ॥ అంగన నమ్మ నెంచిన రయమ్మున మూల్యముఁ జెప్పుమయ్య, మా
యంగణ మెంతొ పెద్దది, మదంగన బల్ సుకుమారి యౌట; నా
చెంగట నున్న వస్తువిటు చేర్చగ లేక శ్రమంబుఁ బొందు; చే
యంగలదేని యెల్ల పను లట్టులె యీమెను కొందు దాసిగన్

538. కం॥ అన నా భూపతి డెందము
గున పంబునఁ బొడిచి నట్లు గుల్లై దుఃఖం
బెనయగ నేమియుఁ బల్కక
కనులట్లే మూసి నిలిచె కట్టెయుఁ బోలెన్

539. చం॥ అదిగని బ్రాహ్మణుండతని నాదర మొప్పగఁ జూచి యోయి! యి
మ్ముదిత వయో విలాసముల, మున్మను చేయగఁ బోవు చాకిరిన్
మది తలపోసి సందియము మాని ధనమ్మునుఁ గోరుమయ్య! నే
నదియిది యంచు బేరముల నాడక యిత్తును నీకు ద్రవ్యమున్

540. చం॥ పురుషున కెన్నడున్ ధనము పొల్తియె యంచు వచించు శాస్త్రముల్
తిరముగ వారిజాక్షులకు తెల్పెను కోటి సువర్ణ టంకముల్
ధర; మగ వారి కైన వసుధన్ పది కోట్లుగఁ దెల్పె; నందు చే
నర మరలేక యిత్తు కొను మవ్విధి కోటి సువర్ణ టంకముల్

541. మ॥ కపట బ్రాహ్మణుడైన కౌశికు డిటుల్ కల్పించు కొంచెద్దియో
చపలుం డట్టుల పల్కుచుండగ హరిశ్చంద్రుండు మౌనంబు తో
నపరాధిన్ బలె నిల్చియుండె, నిక నేలా! యంచు నాబ్రాహ్మణుం
డపుడంసంబున వస్త్రమున్ గొనుచు నొయ్యన్ విప్పి వైచెన్ భువిన్

542. ఉ॥ ఆగతి వస్త్రమున్ బఱచి యందు రయంబున కోటి నాణెముల్
ప్రోగుగ వైచి యాద్విజుడు పొల్తిని మాధవి నట్టె కేశముల్
వేగ కరంబునన్ గొనుచు వీధిన నీడ్చుక పోవుచుండ నా
సేగి కనుంగొనన్ హృదయ సీమ విదారిత మయ్యె భర్తకున్

543 ఉ॥ విప్రోత్తమా! నన్ను విడువుము కడసారి
కనులార బిడ్డను గాంచి వత్తు
నని పల్కు మాధవి ననుసరించుచు దుఃఖ
మతిశ యింపంగ నమ్మా! యటంచు





వచ్చు రోహితుఁ గని బ్రాహ్మణుండదలించి
కసరి కొట్టుచు నెట్టఁ గనుచు తల్లి
అయ్య! నన్ గొని నట్టు లర్భకున్ గొనుమేను
వీని నిడచి యుండ లేను స్వామి!

గీ॥ అనుచు దుఃఖించు నామె మాటను గ్రహించి
పురుషులకు నీయ వలసిన ధర మఱి పది
కోట్ల స్వర్ణ టంక ములను కుప్ప పోసి
బిడ్డనున్ దల్లి నిన్ గొని విప్రవరుడు

544. మ॥ చనుచుండన్ తనభర్త పాదయుగమున్ సాష్టాంగమై మ్రొక్కి యా
వనితా రత్నము, " జన్మజన్మలకు నాప్రాణేశుగా మిమ్ములన్
మనమం దెంచెద" నంచుఁ బల్కు, సతినిం బట్టిన్ గనుం గొంచు నా
జననాథుండతి దుఃఖ తప్తుడయి యాశ్వాసించె నీరీతిగన్

545. ఉ॥ లోకము లోన భర్తలతి లోభులు నావలె నుందురే యెటన్?
ప్రాకట రీతి భార్యలకు బంగరు సొమ్ములు పట్టు వస్త్రముల్
గైకొని వచ్చి సంతసముగల్గగ నిత్తురుగాని, దాసి గా
నే కతి నాత్ముడైన ధనమిట్టులఁ గైకొని విక్రయించునే?

546. మ॥ ఇన వంశాగ్రణి నైన నన్ను పతిగా నింపార చేకొన్న నిన్
మనసున్ రాయిగఁ జేసి నేనిటుల నమ్మన్ సమ్మతిన్ దెల్పితిన్
వనితా! యెంతటి హీన వృత్తుడను దివ్యంబైన సామ్రాజ్యపున్
ఘన భోగమ్ములఁ బొంద నర్హమగు నిన్ గష్టాల పాల్జేసితిన్

547. చం॥ అని యత దేడ్చు చుండగ ధరామరు దేమి యెఱుంగనట్టు లా
వనితను, రోహితున్ గురులు వట్టుక దండము తోడ కొట్టుచున్
గొని చను చుండఁ గన్గొనుచు గుండెలు వ్రయ్యలు గాగ నేడ్చుచున్
జనపతి యాత్మలోఁ దన యశక్తత కెంతయు నేవగించుచున్

548. సీ॥ సూర్య రశ్మి యొకింత సోకని పూఁబోడి
కఱకు టెండకు నిట్లు క్రాగ వలసె
దాస దాసీ జన దాస్యముల్ గొను రాణి
దాసీ యన భరించి తగ్గ వలసె

పట్టు పరుపుల పై పవ్వళించఁ దగిన
పుత్రుండు దండన పొంద వలసె
సకలోర్వి(ఁ గనుసన్న శాసింపఁ గల నేను
పరుల శాసనమున బ్రతుక వలసె

గీ॥ కట కటా! దైవమున కెంత కరుణలేదు
మరణమైనను రాదయ్యె కరుణ మాలి
యనుచు కన్నీరు రాల్చుచు నట్టె చూపు
లందెదు దనుక వారల నార్తిఁ గనుచు
కూలె నవ్విభుం డక్కటా! క్షోణిపైన

549. చం॥ ఇను డటు పశ్చిమాంబుధికి నేగుచు నుండగ కౌశికుండు వ
చ్చెను తన శిష్య సంఘములఁ జీరుక; వచ్చిన యంత తెమ్ము ద
క్షిణ యని బిట్టు నార్వగని, చేకొను మయ్య సువర్ణటంకముల్
ముని వర! యంచు రాజు తన ముంగలి నాణెములెల్లఁ జూపగన్

550. కం॥ కొనుమివి యని విభుదు తెలుప
ముని వరుడనె నెచట వీనిఁ బ్రోగొనరిచితో
వినిపింపుము నిజ మనగా
జనపతి యిటులనియె మిగుల సంతాపమునన్

551. కం॥ ముని వర! నా భార్యను, పు
త్రుని నొక భూ సురున కమ్మి రోయక వీనిన్
గొని భద్ర పరచి నాడను
కనకపు టంకములు పది యొకందును కోటుల్

552. కం॥ అన నా బంగరు నాణెము
లనఘుడు ముని వరుడు గాంచి ఆహా!యివియే!
ఎనయే ఏబది మణువుల
కనకమ్మున కివ్వి, చాలు కపటము లింకన్

553. కం॥ అని గద్దింపగ నృపు డి
ట్లనె నో కౌశిక మిగిలిన యవియును నెట్లో
దినములు గడవంగ తమకు
వినయమ్మున తెచ్చియిత్తు వినుమా మనవిన్





554. వ. అనిభూపాలుండన నుగ్రుండై విశ్వామిత్రుండు

555. చం॥ గడువిక పెంచు మాట యది కల్ల, యెఱుంగుము నేడు ప్రొద్దు గ్రుం
కెడు సమయంబు లోన ధన మెల్ల యొసంగిన నీకు సేమ మౌ
తడ వగునేని శాపమును తథ్యము బొందెదవయ్య! కాన నీ
యిడుములు నీవు బొంది ఋణమెట్టులొ దీర్పుము మాటలేటికిన్

556. చం॥ అని కడు నిష్ఠురమ్ములటు లాడియు మౌని సువర్ణ టంకముల్
గొని చనుదెంచె తక్కినవి కూర్చు మటంచు వచించి ఋగ్రునన్
జనపతి కేమి చేయుటకు జాడ గనంబడ కిప్పు డేరికే
నినుడటు గ్రుంకు లోపలనె నేనును నమ్ముకొనం దగున్ వడిన్

## హరిశ్చంద్రుడు తనను తా నమ్ముకొనుట

557. చం॥ అని తలదించి బిగ్గరగ నవ్విభుడిట్లనె పౌరులార! నన్
గొని సుఖియింపగన్ మదిని కోరుదు రేని కొనంగవచ్చు న
య్యిను డటు పశ్చి మాంబుధికి నేగక మున్నె ధనాఢ్యు లెవ్వరేన్,
అనయము దాస్యవృత్తిని ప్రియమ్మున నే నొనరింతు శ్రద్ధగన్

558. వ. అని అరచి నంతనే

559. సీ॥ మేని దుర్గంధమ్ము ఘ్రాణ రంధ్రమ్ముల
కసహనమై గుప్పు మనుచు సోక
అయఃఫలక మట్టు లాయత వక్షమ్ము
వికృతాకృతిన్ గడు భీతిఁ గొలుప
తేటి గములు రెండు తెట్టువలై నిల్చి
నట్లు శ్మశ్రు సమితి యవఘ ళింప
ఎత్తు పల్లము లౌచు నేపారు కోరల
రాయిడిఁ గరగర రవము లెగయ

గీ॥ బాన బొజ్జయు నల్లని వస్త్రములును
చేత పొడుగాటి కర్రయు, చిన్న ముంత
బుజమునన్ దాల్చి చండాలుఁ బోలె యముడు
వచ్చినిల్చెను వేగ భూపాలు నెదుట

560. చం॥ నిలిచి నృపాలునింగనుచు నీ వెవరోయి? నిజమ్మె దాస్యమున్
సలిపెద నంచుఁ బల్కితివి, సమ్మత మైనచొ రమ్మి నాకు కా
వలయును దాసు డొక్కడు, శవమ్ములఁ గాల్చెడి వారినుండి ని
చ్చలుఁదగు సుంకమున్ గొనుచు సమ్మతి సేవల నెల్లచేయగన్

561. కం॥ నాపేరు ప్రవీరుడు నే
కాపరి నిక్కాటియందు కలవర పడ, కే
నేపని పురమాయించిన
నాపనులన్ జేయవలయు ననువగు రీతిన్

562. మ॥ అనినన్ భూపతి సంశయించుచు మహాత్మా! బ్రాహ్మణుండేనియున్
జననాథుండయినన్ ననున్ గొనిన నేసంతోషినై వారికిన్
పనులన్ జేయఁ దలంచు కొంటి నకటా! ప్రారబ్ధ మిట్లయ్యెగా
అని యింకేదియొ చెప్పఁ బోవ శ్వపచుండా భూపునిన్ జూచుచున్

563. శా॥ ఏమయ్యా! యిది న్యాయమే మొదటనే యిట్లేటికిన్ జెప్పవో
నీమర్యాదలు చాలు మాట పయినన్ నిల్వంగలే కిప్పుడీ
వీ మాటల్ పలుకంగ భావ్యమగునే వేయేల యెవ్వారినేన్
నే మర్యాదగఁ గొల్తు నంటి వటులే నిల్వందగున్ మాటపై

564. తే.గీ. శ్వపచు పల్కులు విని హరిశ్చంద్రు డపుడు
వినయమున నిట్లువల్కె ప్రవీర! వినుము
ఆడి తప్పినవా డధమాధ ముండు
తథ్యమతనికి నరకమ్ము; దానికన్న
నిన్ను సేవించు టెంతయు మిన్నయగును
ఆడితప్పను నిలుతు సత్యమ్మునందె
కొనుము నన్నింక వదలి సంకోచమెల్ల
అనుచు నుండగ కౌశికు డరుగు దెంచి

565. మ॥ నృపతీ! వీడెవడైననేమి తగినట్లిత్తున్ ధనమ్మంచు తాఁ
గృప నిన్ గైకొన నిచ్చగించె నిక నీ కేలయ్య యాలోచనల్
అపరాధం బని యెంచ కాతడిడు నయ్యర్థంబుఁ గై కొమ్ము, నా
కిపుడేయి మ్మిను డల్లదే చనుచు నుండెన్ పశ్చిమాంభోధికిన్





566. కం॥ అని తొందరించు మునిఁ గని
జనపతి స్వామీ! వినుమిదె, క్షత్రియుడను నే
నిన వంశజుడన్, ధర్మమె
ధనమునకై శ్వపచున కిటు దాస్యమొనర్పన్

567. మ॥ అనినన్ మౌని వరేణ్యు డోయి నృపతీ!యట్లైననీతర్కముల్
విన నాకేటికి దూకు మెచ్చటయినన్ వేయేల నాదక్షిణన్
గొని తెమ్మా! యిను డస్త మింపకయె, లేకున్నన్ శపింతున్ సుమా!
అనిగద్దింప నృపుండు తత్పదము లొయ్యన్ బట్టి యుద్విగ్నుడై

568. ఉ॥ ఏ సమయాన కీ ఋణ మదెల్లను తీరునొ యంత కాలమున్
దాసుడనై మెలంగెదను త్వత్ చరణంబుల నాశ్రయించి నే
వేసట లేక, మీరె కడుఁ బ్రీతి ననున్ గొనుడయ్య వీనికిన్
దాసుడ నౌట కొప్పు; నను ధన్యునిఁ జేయుము మౌనిసత్తమా!

569. కం॥ అని పలుకు నృపుని మాటల
కనఘుడు ముని పల్కె నట్టులైన నృపాలా!
నిను నే దాసునిగా నీ
క్షణమునఁ గైకొనుచు నుంటి సమ్మతి తోడన్

570. చం॥ వినుమిక నాదు నాజ్ఞలను వేరొక టడ్డము చెప్పబోక నీ
వని; శ్వపచున్ గనుంగొనుచు నమ్ముదు నిప్పుడు నాదుదాసు, నీ
తనిఁగొన నెంతువేని వెసఁ దద్దయు నర్థమొసంగి దాసుగాఁ
గొనుమిదె సంశయింపకుము కోరిన సేవలఁ జేయు నీకికన్

571. చం॥ అన శ్వపచుండు నవ్వుకొని యమ్ముని చెంతకు వచ్చి మెల్లగా
మునివర! "రత్నగర్భ" యనఁ బొల్పగు భూమి "ప్రయాగ"యందు యో
జనశత వృత్తమై కలదు, సమ్మతి దాని నొసంగు చుంటి నిం
కను మణి హేమ రత్నముల కానుకగా నిడుచుంటి హెచ్చుగన్

572. చం॥ కొనుమని కుమ్మరింప మునికుంజరు డంతయు స్వీకరించి యా
జనపతి నప్పగించె శ్వపచస్థితి నొప్పుచు చూచుచున్న కా
లున, కదియంతయున్ గనుచు లోన నృపాలు డొకింత యేనియున్
గనలక మౌని యాజ్ఞ నటు కాదన డయ్యెను ధర్మ బద్ధుడై

573. తే.గీ. ధనముఁ గై కొని వెడలె నమ్ముని వరుండు
మాట నిలబెట్టు కొనియె నీ క్ష్మాధవుండు
మేలు మేలని దివి నుండి పూల వాన
వరుసఁ గురియించి రప్పుడు సురలు మెచ్చి

## కాటికాపరిగా నృపాలుడు

574. చం. మునివరు డేగి నంతటనె భూవరు హస్తము లట్టె గూర్చి త్రా
టను బిగియించి పట్టుక తటాలున నాశ్వపచుండు దండమున్
గొని యొక దెబ్బవైచి యిటు గొంకక బొంకగ జూతువౌర! నీ
పనియిక పట్టు వాడనని పల్కుచు నీడ్చుక పోయె నింటికిన్

575. చం॥ చని యట నింటి ముందె నృప చంద్రుని నిల్పి ప్రవీరు డిచ్చమై
తన గృహమందుఁ జొచ్చి మది తల్లడ మందక ప్రాత కుక్కిపై
తనువును వాల్చి మై మరచి తక్షణ మాత్ర సుషుప్తి లోనికిన్
జనె నృపు సంగతిన్ మరచి; సైపగ లేక నృపుండు నంతటన్

576. మ॥ అరెరే! జీవిత మిట్టు లాయెఁ గద! సప్తాంభోధి సంవీత మౌ
ధరణీ ఖండము నేలినట్టి నను నీ దైన్యాతి దైన్యంపు దు
ర్భర దౌర్భాగ్యము చుట్టెగా! కటకటా! పద్మాక్షి మత్పత్ని యే
కరణిన్ శోకిలు చున్నదో! తనయు డేకష్టంబులన్ గుందునో!

577. చం॥ ననుఁ గనలేక నాసుతుడు "నాన్నను చూపుము తల్లి యంచు వే
దన పడు చుండఁ గాంచి" యిదె తప్పక వచ్చును నేడొ రేపొ యం
చనయము బుజ్జగించుచు నహర్నిశముల్ సతి యెట్టి బాధలన్
దినములు పుచ్చుచున్న దొ విధీ! కడ కీగతి వ్రాసి పెట్టి తే.

578. మ॥ అని దుఃఖించుచు నైదునాళ్ళిటులె నిద్రాహారముల్ లేక యా
తనలన్ బొందెడి యానృపాలుఁ గని బంధమ్ముల్ వడిన్ విప్పి యి
ట్లనియెన్ దా శ్వపచుండు కింకర! అదే అల్లంత దూరాన ద
క్షిణ మందుండు శ్మశాన భూమి మనకే చెందున్ విలోకింపుమా!

579. చం॥ ఇకపై దానికి నీవె కాపరివి, నీ యిచ్చన్ స్వతంత్రించి ప్ర
క్కకు పోవన్ దలపెట్ట కెప్పుడును, సుంకంబున్ గడున్ శ్రద్ధగా
ప్రకటింపంబడినట్లు గైకొనుము, నీ వ్యాపారమందెన్న డేన్
వికటత్వం బగుపించెనేని వదలన్ వేవేగ దండించెదన్





580. చం॥ అని యొక దండ మిచ్చి చనుమా! అలసత్వముఁ జూపకంచు నా
జ్ఞనిడ, నృపాలు డాశ్వపచు శాసనమున్ దలఁ దాల్చి మేన మా
సిన వలువన్ ధరించి విధి చిత్రపు కృత్యము లోఁ దలంచుచున్
జని యెను మెల్లమెల్లగ శ్మశానము చెంతకు సత్యనిష్ఠుడై

581. సీ॥ అస్థి కపాలమ్ము లటునిటు కఠినమై
తనపాద యుగళికి తగులు చుండ
పట్టపగలు ఫేరవమ్ముల కూతలు
కర్ణరంధ్రములను గాసి వెట్ట
గృధ్ర కంక సమితి కేక లిడుచు వచ్చి
కంకాళములఁ బట్టి కదుపు చుండ
సగము కాలగ లేచు శవముల మొగములు
భయముఁ గొల్పుచు గుండె పగులఁ జేయ

గీ॥ హాసుతా! హాపతీ! యని యార్త రవము
లెసగ బాంధవుల్ పడిపడి యేడ్చు చుండ
మిగుల బీభత్స మైన యమ్మేదినిఁ గన
సతియు సుతులును భృత్యులు స్మృతిని మెదల

582. మ॥ తనయా! యెచ్చట నుంటి వయ్య! కడు సంతాపంబునన్ బొక్కుచున్
వనజాక్షీ! ఎటులుంటివోగద! నినున్ భావంబునం దెంచుచున్
దినముల్ పుచ్చుచు నుంటి కల్పములటుల్ దేవీ! కృధావేశుడై
ముని వర్యుండిటు వేరు చేసె మనలన్ పూర్వాప్త కర్మంబునన్

583. మ॥ కలవే? కష్టము లింతకన్న కలికీ! కానిమ్ము నే సుంతయున్
కలతన్ జెందను క్రిందు మీదయిన, నిక్కంబీ ప్రపంచంబునన్
కలుగున్ బో విజయంబు ధర్మమున కే కాలాన కైనన్ సతీ!
కలలో నైన నసత్యమున్ దలచి బొంకన్ సుమ్ము ముమ్మాటికిన్

584. శా॥ ఈ రీతిన్ దల పోయుచున్ మనమునం దెట్టెట్టొ ధైర్యస్థితిన్
చేరన్ బట్టుక, కాటిసుంకముల నిశ్చింతన్ యథారీతిగా
కారుణ్యత్వము మాని గైకొనుచు సౌఖ్యంబెల్లఁ బోనాడి యా
ధీరోదాత్తుడు పుచ్చుచుండె దినముల్ దీనాతి దీనమ్ముగా

585. సీ॥ నలిగి మాసిన యట్టి వలువను మొలఁ జుట్టి
పాత కంబళి వల్లె వాటు వైచి
నల్లని మసితోడ కాళ్ళు చేతులు నిండ
కలయఁ దిరుగుచు న క్కాటి నెల్ల
ప్రేతల కిడినట్టి పిండమ్ము లట్టులే
ఆరగించుచు నావురావు రనుచు
శవముల పైనుండి యవల వైచిన పుష్ప
మాలలు తలపాగ వోలె చుట్టి

గీ॥ రాత్రియును పగలు నెఱుగ రాక సతము
కంట నిద్దుర మాని యా క్ష్మావిభుండు
గడపె ద్వాదశ మాసముల్ కఠిన గతిని
సత్యనిష్ఠకు తల యొగ్గి సమ్మతమున

## రోహితుని మరణము

586. మ॥ అది యట్లుండగ కాశికాపురమునం దారోహితుం డొక్కనా
డుదయంబే తన మిత్రులన్ గలసి యత్యుత్సాహ మేపారగా
మదికిన్ మెచ్చెడి యాటలాడుచును సంభాషించుచున్ మెల్లనన్
ముదమారంగ తదంతికంపు విపినంబున్ జేరి యం దెల్లరున్

587. ఉ॥ ఆడియాడి అలసి, అంబుజ మిత్రుండు
నెత్తి కెక్కఁ జూచి నెలవులకును
నేగ నిశ్చయించి యెల్లవార లపుడు
తలచి రివ్విధమునఁ దలపులందు

588. ఉ॥ వచ్చితి మింత దూర, మిటు వచ్చియు నూరక పోవ నేటికిన్
చెచ్చెర దర్భలున్ మఱియు చెల్వగు నింధనముల్ వనంబునన్
హెచ్చుగ సేకరించుకొని యేగుట మేలని లోఁ దలంచి వా
రిచ్చమెయిన్ కుశంబులను నింధనముల్ గ్రహియించి యంతటన్

589. తే.గీ. పేర్చి బిగియించి మోపుగా కూర్చి కట్టి
పిన్నవాడని యైనను వెఱపు మాని
ఎత్తి యట్టులె రోహితు నెత్తి పైన
పెట్టి ఇండ్లకు సాగిరి వేగనంత.





590. చ॥ బరువధికంబుగాన కడు వందుచు రోహితు డల్లనల్లనన్
సొరుగుచు వారి వెన్కఁ జనుచున్ బహుదూరము సాగి యింకపై
చరణము లెత్తి పెట్టుటకు సైతము నోపక దాహ మెక్కుడై
సరసి నొకందుఁ గాంచి యట చయ్యన మోపునుదించి యొక్కచోన్

591. ఆ.వె. గట్టు పైన నొక్క పుట్టపై దానిని
దించి వేగ నేగి తృప్తి తోడ
నీరు త్రావి వచ్చి నిశ్చలమ్ముగ మోపు
నెత్తికెత్తు కొనగ నిశ్చయించి

592. చ॥ కరములు సాచినంతటనె కాళ మొకండతి వేగ వచ్చి యా
చిఱుతని కాటువేయ, నిక చెప్పునదేమి? దిశల్ ధ్వనింపగా
నరచుచు నేలపైన బడి యట్టిటు దొర్లుచునుండ ముందరన్
పరువడి నేగుచున్న ద్విజ బాలురు వెన్కకు వచ్చి చూడగన్.

593. చ॥ సరసర పుట్ట లోపలికి జారు భుజంగముఁ జూచి చెంగటన్
నురగలు గ్రక్కుచున్ మిగుల నొవ్వున దొర్లుచు నున్న రోహితున్
కరుణ దలిర్పఁ గాంచి భయ కంపితులై నిజమందిరమ్ములన్
పరువడిఁ జొచ్చి దాసిఁగని బావురు మంచు వచించి రంతయున్

594. కం॥ అదివిని మాధవి యంగము
లదరగ స్పృహతప్పి పడియె నవని తలమునన్
ముదుసలి విప్రుం డదిగని
యుదకముఁ గొనివచ్చి చల్లె నువిద ముఖముపై

595. ఉ॥ చల్లినయంత లేచి విధిచైదము నేడిటు లాయె నక్కటా!
వల్లభు డెందు నుండెనొ? దివాకరవంశ వివర్ధనా! సుతా!
చెల్లెనె నీకు నాయువులు, శీతకరాభ నిభాననున్ నినున్
కొల్ల గొనెన్ విధాత కడు క్రూరుడు గాదె మదిన్ దలంపగన్

596. చ॥ అని తల బాదు కొంచు కడునార్తి ధరన్ బడి దొర్లుచున్ ఘన
స్వనమున కేక లేర్పడ పిశాచము వట్టిన యట్టు లేడ్చు నా
వనజముఖిన్ గనుం గొనుచు బ్రాహ్మణ వృద్ధుడు క్రోధపూర్ణసం
జనిత నవారుణాక్షియుగ సంగతి భ్రూకుటి తల్లడం పడన్

597. శా॥ ఓసీ! కోటి సువర్ణ టంకముల నట్లొప్పించి నాయింటి లో
దాసీత్వం బొనరింప తెచ్చితి నినున్ తథ్యంబు, నే డీగతిన్
వేసంబుల్ బడు టొప్పునే వినుమికన్ విద్డూరముల్ చాలు, నా
యాసంబియ్యది దాస్య మన్నయెడ నా డట్లేటికిన్ జెప్పవే?

598. ఉ॥ చాకిరి చేయ నోపికయు చాలదటంచు వచింతు వేని, ని
ర్వాకము చాలు, నా ధనము వైళమ నాకు నొసంగి యేగుమా
కేకలు మాని, కాదనిన కిమ్మన కింటి పనుల్ క్రమంబునన్
చేకొను మంతె కాని యిక చెల్లవు నాకడ నిట్టి వేషముల్

599. చం॥ అని కడు నిష్ఠురంబుగ ధరామరు డాడుచు నుండ సైప క
వ్వనజ దళాక్షి భూసురుని పాదములంటి మహానుభావ! యి
ట్లన దగునయ్య! దాస్యమున కారట చెందుటలేదు, నాదు నం
దనుడు వనంబునం దురగ దష్టుడు నై వదలెన్ శరీరమున్

600. చం॥ ఇదె మన విప్రబాలు రిపు డేడ్చుచు తెల్పగ వింటినయ్య! నన్
సదయుడవై వనంబునకు చయ్యనఁ బంపుము, వాని దేహమున్
పదిలముగా శ్మశానమున పద్ధతి చొప్పున పూడ్చివత్తు నం,
చెదపగులంగ నేడ్చు కమ లేక్షణఁ గాంచుచు విప్రుడిట్లనెన్

601. శా॥ చాలున్ జాలును నంగనాచి పలుకుల్ సత్యంబుఁ బోనాడి యి
ట్లేలా! కట్టు కథల్ వచించి నను నట్టేటన్ బడన్ ద్రోచి నీ
బాలున్ గూడి పలాయనంబు గొనగా భావింతు, వట్లైన నే
బాలున్ గాను శిరమ్మునూపి నిను పంపన్, పొమ్మికన్ లోనికిన్

602. ఉ॥ పైకము ముందె గైకొని యుపాయముతోడ నసత్యముల్ గడున్
వాకొని మోసగించి పెర వారల పంచనఁ జేరు చుందు రీ
లోకమునందు పెక్కురిటు లుబ్ధులునై పని వాండ్రు, పాపముల్
గైకొని యాతనల్ వడరె కాలుని లోకముఁ జేరి పెక్కులున్

603. చం॥ సలసల కాగు తైలమున సంయమనీశు భటాళి చేరి నిన్
కలయగఁ ద్రిప్పి వేపుదురు కర్కశమౌగతి, నంతెగాక యా
వలి జననంబునన్ భువి ధ్రువంబుగ కుక్కుటమై జనింతు, వి
ట్లలయక జీతముల్ గొని ప్రయత్నముతో పనిమాని యేగినన్





604. తే.గీ. ఇన్ని మాటలు పలుకంగ నేల యింతి
ఏడుపులు మాని పని చేయ నేగు మింక
అట్లు కాదందు వేని మదర్థ మెల్ల
ఇచ్చి వెడలుము నీ యిచ్చవచ్చినట్లు

605. చం॥ అని కడు నిష్ఠురోక్తు లిటు లాడెడు భూసురుఁగాంచి నమ్రయై
యనఘ! నిజమ్ము పల్కితి, దయామతిఁ జూడుము నన్ను పంపుమా!
పని యొనరింప భీతిలెడి పందను గాను, తనూజు దేహమున్
ఖనన మొనర్చి వచ్చెదను కాదన బోకుము బ్రాహ్మణోత్తమా!

606. చం॥ అని బ్రతిమాలు చుండినను నాత డొకింతయు సంచలింప కి
ట్లనియెను దాసి! నీసుతు డెటైనను నేమి వినంగఁ బోను, నీ
పనులను పూర్తి చేయుమిక వాగుడుమాని, తిరస్కరించినన్
తనువున దండ తాడనము తప్పదు పొమ్మని హెచ్చరించుచున్

607. చం॥ గునగున లోనికిన్ జనియెఁ గ్రుద్ధత నాద్విజ సత్తముండు, న
వ్వనితయు నేడ్చి యేడ్చి స్పృహఁ బాసి భువిన్ బడి సుంతతేరి నె
మ్మనమున ధైర్యమూని యజమానుడు చెప్పిన యట్టు లింటిలో
పనులను పూర్తి చేసె నల భానుడు గ్రుంకక మున్నె శీఘ్రమే

608. మ॥ పనులెల్లన్ ముగియించి విప్రునకు సంభావ్యంబుగా శయ్య చ
య్యన సర్దన్, గని సంతసంబున ద్విజుం డా శయ్యపై మేను వా
ల్చిన పాదమ్ముల చెంతఁ జేరి పదముల్ చే నొత్తు చుండంగ బ్రా
హ్మణుడంతన్ గరుణాంత రంగుడయి యయ్యబ్జాక్షితో నిట్లనెన్

609. చం॥ తనయుడు పోయెనంచు మది తద్దయు దుఃఖిలు చుంటి, వింక నీ
తనయుని గాంచి యో అబల! ధర్మయుతంబుగ చేయదగ్గ యా
పనులను పూర్తిచేసికొని భానుడు దోపక మున్నె రమ్ము, లే
దన గురికాక తప్పదు మదాగ్రహ విస్తర దుర్భరాగ్నికిన్

610. మ॥ అనినన్ మాధవి సంతసం బెనయగా నత్యంత వేగంబునన్
గను యుగ్మమ్మున బాష్పధార లొలుకన్ గాఢాంధకారమ్మునన్
తనయా! యెచ్చట నుంటి వయ్య తుదకున్ దౌర్భాగ్యమిట్లాయెనా!
యని బిట్టార్చుచు తూలుచున్ జనియె ధైర్యం బెట్లొ నూల్కొల్పుచున్

611. చం॥ చనిచని యెట్టకేల కొక చక్కిన మున్ ద్విజ బాలకుల్ వచిం
చినటు తటాకమున్ మఱియు చెంతనె వల్మికమున్ గ్రమంబునన్
గని, యట కేగి చూచె తన కన్నకుమారుని దేహ మొక్కచో
వనరుహనేత్ర తా నుదయ భాస్కర తుల్య విరాజ మానమున్

612. చం॥ కని దరిఁ జేరి యామె పెను గాలికి కూలిన వృక్షమో యనన్
తనయుని చెంత కూలి పరితాపమునన్ తన బిడ్డ దేహమున్
తన యొడి నుంచి మిక్కిలిగ తాకిన దుమ్ము విదిల్చి నాయనా!
ననుఁ గను మయ్య యొక్కపరి నందన! పల్కుము ముద్దు లొల్కగన్

613. చం॥ అని విలపించుచున్ విభుని నాత్మఁ దలంచుచు ప్రాణనాథ! నీ
తనయునిఁ జూడు మయ్య! కడు దైన్యగతిన్ పృథివీ తలంబునన్
దినకర తేజ మట్లు పడి దిక్కఱి యుండెను, కాలపాశమో
యన నురగంబిటుల్ సుతుని యాయువులన్ గొని పోయె నక్కటా!

614. మ॥ మును దైవజ్ఞులు వీని జాతకము సంపూర్ణాయు రారోగ్యమున్
ఘన రాజ్యాదిక భోగయుక్తమని వక్కాణించి, రవ్వాక్యముల్
తనయా! తప్పెనొ? నీదు పాద కర సంధానమ్ము లౌ చక్ర మీ
న, నవాబ్జాదిక చిహ్నముల్ చెదరెనో నా తండ్రి! యే మయ్యెనో?

615. మ॥ మునుజన్మమ్ముల నెట్టి పాపముల దుర్బుద్ధిన్ గడున్ జేసితో
వనజాతాసను డిట్టి దుష్కృతికి నన్ పాల్జేసె నేడక్కటా!
అనఘాత్ముండగు ప్రాణనాథుడిట లేడయ్యెన్ సుతా! నీవునున్
కనులన్ విప్పి ప్రియంబునన్ బలుక వింకన్ దిక్కు నాకెద్దిరా?

616. మ॥ అని భూమ్యభ్రము లొక్కటన్ బగులున ట్లాకాంత రోదించుచున్
తన దౌర్భాగ్యము నెంచు కొంచు నచటన్ ధాత్రీ స్థలిన్ దొర్లుటన్
గని, యాప్రాంతపు రక్షకుల్ మిగుల దిగ్భ్రాంతాత్ములై వచ్చి య
వ్వన జాక్షిన్ గని పల్కిరిట్లు కరుణా పారీణ వాగ్వైఖరిన్

617. ఉ॥ ఎవ్వరిదాన వమ్మ? యిటు లేడ్చుట కేమి కతంబు నీకు? వీ
డెవ్వడు? నీ సుతుండె? పతి యెందుల కేగెను? నర్ధరాత్రియం
దివ్వన మందు నుంటి విటు లేలొకొ? యంచు ననేక రీతులన్
నెవ్వగ నున్న యవ్వనజ నేత్రను పృచ్ఛ యొనర్ప నామెయున్





618. కం॥ కదలక మెదలక వారల
కదియిది యని చెప్పఁబోక యవనీస్థలిపై
రొద మాని వివశ యైపడ,
నదిగని కడు భీతిఁ జెంది యా భటు లెల్లన్

619. చం॥ ఇదియొక బాల ఘాతి, మదినెంచ పిశాచమనంగఁదోచు, నీ
యదనున నొంటి నున్నయొక అర్భకు నిట్లు వధించి తెచ్చి స
మ్ముదమున నారగింప తలపోయుచు నేమి యెఱుంగ నట్లు తా
చద లదరంగ నేడ్చెడిని చాలును మాట లికేల యీామెతోన్

## మాధవికి మరణ దండన

620. చం॥ అని యొక రీతిఁ బల్కుకొని యందరు నయ్యమ కాలు సేతులన్
ఘన కచభారమున్ ఒడిసి గట్టిగపట్టి శ్మశాన భూమికిన్
గునగున నీడ్చుకొంచుఁజని ఘోర పిశాచిని తెచ్చినార మీ
వనమున నొక్కచోఁగని, జవమ్మున దీని వధించు టొప్పుగన్

621. మ॥ అని యచ్చోఁగల యాప్రవీరుఁగని వా రత్యంత ముద్వేగులై
వినిపింపన్ విని యాత డామె మొగమున్ వీక్షించి మున్నీమె నేఁ
గనియుంటిన్, పసివారి నెందరి నిటుల్ కారుణ్యమున్ వీడి తాఁ
దినెనో యిప్పటి దన్క; దీని యుసురుల్ దీయించుటే శ్రేయ మౌ

622. కం॥ ధరణీ దేవుల, గోవుల
సరసిజ నయనల శిశువులఁ జంపిన వానిన్
గురుపత్నీ సంగమరతుఁ
దెరువరులన్ దోచుకొనెడి తెక్కలి వానిన్

623. కం॥ కనకము దొంగిలు వానిని
వెనుకాడక యింట నిప్పు వెట్టెడి వానిన్
జనులకు గిట్టని వానిని
వనిత యనక విప్రుడనక వధియింపవలెన్

624. కం॥ అని పలికి భటుల వీడ్కొని
వనజేక్షణ హస్తములను పాదయుగమ్మున్
పెనవైచి కట్టి దాసున్
గని యిట్లని పల్కె మిగుల కర్కశ బుద్ధిన్

625. కం. తరుణి యని చూడ బోకుము
కరుణన్ విడి యీమె నిపుడె ఖండింపు మనన్
వెరగు పడి హరిశ్చంద్రుడు
తరళాక్షిన్ జంపుటిది యధర్మంబనుచున్

626. తే.గీ. తలచి యజమానుఁ గాంచి సంచలితు డగుచు
స్వామి! అబలను వధియింపఁ జాలనయ్య!
ఆజ్ఞయిడు మింక నెదియైన నాచరింతు
నన్ను మన్నింపు మనుచు విన్నపము సేయ

627. చం॥ భయపడకోయి యీమె కడు పాపి, వధించుట యుక్తమౌను, సం
దియమును మాని శీఘ్రమె వధింపుము, పాపము గాదు, దీన ని
శ్చయముగ పుణ్యమబ్బు నిది సత్యము, దీనిని చంపకున్న ని
ర్దయ వధియించు నింకను పురమ్మున బిడ్డల నెల్లవారలన్

628. చం॥ ఇదె యడిదమ్ము గైకొని వధింపుము దీని నటంచుఁ బల్కని
య్యది తగునయ్య! యోడ కొక యంగనఁ జంపుట; చంపితేని నా
కొదవదె రౌరవమ్ము, మది నొప్పను నేనిది, జీవితాంతమున్
ముదితను చంపరాదనుచు మున్నొక సద్వ్రత మేను బూనితిన్

629. చం॥ అన విని యాప్రవీరుడు దురంత క్రుధారుణ నేత్ర యుగ్ముడై
కనలుచు నోరి మూర్ఖ! నను కాదన నీ కెటు నోరు వచ్చెరా!
అనయము సేవకుం డధిపు నాజ్ఞ వహించుట కంటె నెక్కుడే?
వినయ విదూర! నీ వ్రతము, పెక్కులు దక్కు మయుక్త వాక్యముల్

630. కం॥ ఇదిగో ఖడ్గము గైకొని
యదియిది యని పెక్కు నీతు లల్లక యిపుడే
విదళింపుము దీని శిరము
మదిలోనన్ శంకమాని క్ష్మాస్థలిఁ గూలన్

631. వ. అనియాజ్ఞాపింప

## హరిశ్చంద్రుడు భార్యాపుత్రులను గుర్తించుట

632. ఉ॥ చేయున దేమి లేక కడు సిగ్గున శీర్షము నట్టె వంచి త
ప్తాయత చిత్తుడై దినకరాన్వయు డయ్యసి చేతఁ దాల్చి, య





న్యాయపు వృత్తికిన్ గడిగి యక్కట యింతటి పాపకర్మమున్
చేయదలంచితిన్ గద! యిసీ విధి యిట్టుల వ్రాసిపెట్టెనే!

633. కం॥ అని తన దురదృష్టమునకు
మనమున చింతించి విభుడు మానినిఁ గని యో
వనజేక్షణ! రమ్మిచటకు
కనికర మొకయింత లేక ఖండింతు నినున్

634. మ॥ అని ఖడ్గంబును పైకినెత్తుకొని డాయన్ బూని యొక్కింత ముం
దునకున్ వెళ్ళ ధరాధిపుండు వడి నుద్యుక్త క్రియారంభుడై;
తన భార్యామణి యీమెయం చెఱుగ డద్ధర్మాత్ము డప్పట్టునన్
తననాథుం డితడంచు నామెయు మదిన్ దా పోల్చదయ్యెన్ నిశిన్

635. చం॥ తన తలఁ ద్రుంచ ఖడ్గమును దాల్చి సమీపముఁ జేరుచున్న యా
తని గని బాష్పముల్ గదుర దైన్యగతిన్ వచియించె నిట్టు, లో
యనఘ! వధింప వచ్చు, వెనుకాడను చావుకు, కాని యొండు నా
మనవి వినంగ వేడెద శమంబు వహించి క్షణమ్ము సత్కృపన్

636. చ॥ అదె యటు చెంత నా తనయు దర్భకు డొక్క విషాహి దష్టుడై
వదలెను ప్రాణముల్, గడు కృపామతి నన్ను ననుగ్రహించినన్
పదిలముగా కుమారుని శవంబును నీకిదె యప్పగింతు నో
సదమల చిత్త! పంపుమిదె చయ్యన వత్తు క్షణమ్ములోపలన్

637. చం॥ అన విని కాటికాపరి దయార్ద్రమతిన్ తనుమధ్యఁగాంచి, యో
వనితరొ! వెళ్ళిరమ్ము కడు వైళమ యంచు ననుజ్ఞ నీయ, హా
తనయ! కుమార! వత్స! అని తద్దయు నార్చుచు బాలుడున్న యా
వనమును జేరి పుత్రుని శవంబును చేకొని వచ్చె పర్వునన్

638. తే.గీ. వచ్చి య క్కాటి యందొక ప్రక్క దించి
నాథ! ఎట నుంటి వయ్యా! నందనుని ఁగనుము
మరలి రానట్టి లోకాల కరిగె నయ్య!
నన్ననాథను చేసి భూనాథ! యిపుడు.

639. కం॥ నందనుని విడచి యిక నే
చందమ్మున నేను బ్రతుకఁ జాలుదు నయ్యా!

డెందమ్మున చింత వదలి
యిందే విడతు నిక దేహ మేలా బ్రతుకన్

640. వ. అని యివ్విధమ్మున విలపించు నమ్మానినీ మణి గద్గదం
బైన కంఠస్వరంబును పోల్చుకొనలేక కాటికాపరి వేషమున
నున్న హరిశ్చంద్రుండు

641. ఉ॥ బాలుని మోముపైనఁగల వస్త్రము నించుక పైకి లేపి భూ
పాలవరుండు వానిముఖ పద్మమునంగల రాజచిహ్నముల్
పోలగఁ జూచుచున్ మిగుల పొల్పగు చెక్కిళు, లాయతంబునై
వ్రేలెడు కేశ పాశమును, విస్తృతమైన యురఃస్థలమ్మునున్
గ్రాలెడు హస్తపాద యుగ కాంతులఁ గన్గొని చోద్యమందుచున్

642. మ॥ అకటా! యెంతటి అందగాడు తలపోయన్ రాజ వంశార్ణవ
ప్రకటుండైన సుధాకరుండితడు, దుర్వ్యాపారుడై కాలు డి
య్యకలంకున్ గబళించె, యెంత దయనీయంబిద్ది! హా! దైవమా
సకలం బీతని లక్షణమ్ములను గాంచన్ దోచు నాపుత్రుడున్

643. కం॥ నా సతి దాసిగ నెయ్యెడఁ
గాసిలు చున్నది యొ, సుతుడు కడు సుకుమారుం
డేసంగతి నున్నాడో
భూసురుకడ నంచు మిగుల పొగిలెడి శ్వపచున్

644. మ॥ కని యా మాధవి దీనయై శ్వపచ! మత్కాంతుండు లేడిందు, నా
తనయుం డీతడు, కాలు డివ్విధిని దుస్తంత్రుండునై వచ్చి యీ
తని ప్రాణమ్ములు తీసె యెంత దురవస్థన్ బొందెదో యింకపై
ననుచున్ గుండెలు బాదు కొంచు విధికృత్యం బాత్మ నిందించుచున్

645. వం॥ తొలగన్ జేసితి గాదె రాజ్య విభవోద్యోగంబు, భార్యన్ సుతున్
వెలిగావించితి, విట్లు నన్నతని దేవిన్ దాస్యపున్ వృత్తిలో
మెలగన్ జేసితి, వంతఁ బోక తనయుం బ్రేతమ్ము గావించి తి
ట్లలుకన్ దైవమ! యే మొనర్తు విక నయ్యర్కాన్వయోద్దీపకున్

646. మ॥ అని దుఃఖించెడి యామె పల్కులకు నిద్రావస్థ యందుండి మే
ల్కొనిన ట్లా నరపాలు డుల్కిపడి యాలోచించి హా! యేమి యీ





వనితా రత్నము నాదు పత్ని యగునా? బాలార్క తేజుండు నా
తనయుండే యిత దయ్యయో కడకు నా దౌర్భాగ్య మిట్లయ్యెనా?

647. కం॥ అని కుప్ప గూలె నరపతి
విని మాధవి యతడు తనదు విభుడే యనుచున్
మనమున నిశ్చయముంగొని
వనరుచు మూర్ఛిల్లె పుష్పవన లతికయనన్

648. ఆ.వె. అంత కొంత వడికి నా హరిశ్చంద్రుండు
తేరు కొనుచు లేచి బోరు మనుచు
తనయ! నన్ను నాన్న యని పిల్చు వారలు
కలరె భువిని నింక కన్న తండ్రి!

649. చం॥ అటు నిటు నాడి వచ్చి జనకా!యని యంక తలంబుఁజేరి బల్
చిటిపొటి నవ్వులన్ మిగుల చేత మెలర్పగ నాకు నిత్యమున్
పటు పరితాప భారమును బాపెడు వార లికెవ్వరయ్య? ని
న్నిటు పెరవారి కమ్మిన విహీనుడ నాకిది తగ్గ శాస్తి యౌ

650. కం॥ అని దుఃఖించుచు జనపతి
తనయుని దేహంబునెత్తి తన గుండియకున్
పెనగొనగ హత్తు కొని పృ
థ్వినిఁ గూలెను చేష్టలుడిగి వీఁటిడివోలెన్

651. ఉ॥ అంతట సుంత తేరుకొని యమ్మహిళామణి "భర్తఁగాంచుటన్
సంతసమందుటో, సుతుడు సద్గతి కేగుటఁ గాంచి యాత్మలో
చింతిలుటో" యెఱుంగక విశీర్ణ మనఃస్థితయై చలించి తా
నెంతయు క్రోధమూని పరమేశ్వరు కృత్యము నేవగించుచున్

652. శా॥ అయ్యో దైవమ! సప్తసాగర పరీతానంత భూమండలం
బయ్యాఖండలుఁబోలి యేలఁదగు విఖ్యాతున్ హరిశ్చంద్రునిన్
నెయ్యంబున్ విడి యీశ్మశానమున నీ నీచక్రియావృత్తికి
ట్లయ్యయ్యో! నియమించితే కరుణలేదా! దుర్విధీ సుంతయున్

653. చం॥ అని విలపించుచున్ పతిని నట్టులె కౌగిలిఁ జేర్చి భూవరా!
కనుగొను చున్నదంతయును కల్లయొ, సత్యమొ, యంచు నామదిన్

పెనగొనె సందియమ్ము, పృథివిన్ ఋజు వర్తను దైనవానికిన్
మనుజుడె కాదు సాయ మణు మాత్ర మొనర్పడు దైవమేనియున్

654. తే.గీ. ధరణిఁ బూజలు, వ్రతములు, ధర్మగతులు
వ్యర్థమని తోచుచుండె ధరాధి నాథ!
ధర్మ మార్గమ్ము, సత్యమ్ము, తప్పు ననెడి
వ్రతమెగద! నిను కాటి కాపరిని చేసె.

655. చం॥ అన విని వెచ్చనూర్చుచు ధరాధిపు డాసతి యాత్మవేదనన్
గని తనకట్టి నైచ్యగతి కల్గిన కారణమెల్ల తెల్పి మె
ల్లన శిరమున్ స్పృశించుచు కలంగెడి చిత్తముతోడ మానినీ!
తనయుడు రోహితుండెటుల తా మరణంబును బొందె తెల్పుమా!

656. కం॥ అని యడుగ మాధవీలత
తనయుడు విగతాశుడైన తద్విధమెల్లన్
జనపతికిఁదెల్ప నాతం
డనుగున్ సుతు తనువు చెంత నట్టె యొరుగుచున్

657. కం॥ తనయా! నీ యాదుస్థితిఁ
గనియును నే నింత దన్క కాయము తోడన్
మను చుంటిని కఠినాత్ముడ
కనికర మొకయింత లేదు కాలున కెందున్

658. మ॥ అని దుఃఖిచుచు వెఱ్ఱివాని వలె నయ్యార్కాన్వయుండుండ న
వ్వనితారత్నము భర్తఁగాంచి యనఘా! ప్రారబ్ధ మిట్లయ్యె గా!
జననాథా! యిక జాగుసేయఁ దగ దాచండాలు నాజ్ఞన్ వడిన్
మనమందెంచి మదీయ శీర్షమును ద్రుంపన్ సిద్ధమై లెమ్మికన్

659. శా॥ స్వామిద్రోహ, మసత్యదోషమును వీసంబైన లేకుండ మీ
సామీప్యంబున నున్న నన్ దునిమి మీ సత్యవ్రతం బెల్లరున్
వేమారుల్‌స్తుతియింపఁ జేయు మిక పై ప్రాప్తించు జన్మమ్ములన్
స్వామీ! భర్తగఁ నిన్నెగోరి మదిలో ప్రార్థింతు సర్వేశ్వరున్

660. కం॥ అని పలుకు రాణి మాటల
కనుపమ దుఃఖాతిరేకు డగుచు నృపాలుం





డిన వంశ ప్రవరుడు తన
మనమునఁ దలపోసె వివిధ మార్గముల నిటుల్

661. సీ॥ ఈ దుఃఖ భర మిప్పు డేగతిఁ దొలగింతు
నాత్మహత్యయె మార్గ మౌను నాకు
యజమాను ననుమతి నగ్నిశిఖల దూకి
యుసురులు వాయుటే యుత్తమమ్ము
సుతుని దేహము తోడ చితిలోనఁ బడియిందె
దేహమ్ము విడతు సందియములేక
అని తన నిశ్చయం బర్ధాంగికిన్ దెల్పి
నరకమైన స్వర్గ పురమె యైన

గీ॥ ఇదియె నానిర్ణయం బిక నింటికేగి
వేడ్క సేవింపుమో దేవి! విప్రవరుని
పుణ్య ఫలముండెనేని మువ్వురము మరల
కలిసి కొనవచ్చు నూర్ధ్వ లోకములయందు

662. మ॥ అనినన్ మాధవి ప్రాణనాథుఁగని దుఃఖావేశ నిర్మగ్న యై
యినవంశోత్తమ! నిన్నువీడి యిక నే నేరీతి ప్రాణమ్ములన్
గొని జీవించెద? మిమ్ముఁ గూడి యిదె నేనున్ బ్రాణముల్ వీడెదన్
నను వారింపకు మంచు పేర్చె ఁజితిఁ గ్రన్నన్ బాష్పపూర్ణాక్షియై

663. మ॥ ధరణీశుండును నద్దు చెప్పక మదిన్ ధైర్యమ్ము నెక్కొల్పి దు
ర్భర దుఃఖాగ్ని నడంచు కొంచు సుతునిన్ భాస్వత్ కులోద్దీపకున్
గరయుగ్మంబునఁబట్టి తెచ్చి చితి పైనన్‌బెట్టి సర్వేశ్వరిన్
గరుణామూర్తిని సన్నుతించె కడు యుక్తంబైన భక్త్యున్నతిన్

664. శా॥ అమ్మా! శాంభవి! యీశ్వరీ! సకలలోకారాధ్య! రక్తాంబరీ!
మమ్మున్ సమ్మతిఁ జూడుమమ్మ! కరుణన్ మా తప్పులన్ సైచి చే
కొమ్మా! మమ్ము త్వదీయ సన్నిధికికన్ కోశాంతరస్థా! పరా!
యిమ్మా! ముక్తిని జన్మసంకటము లింకేలా? జగత్పావనీ!

665. కం॥ అని ప్రార్థించి యొకించుక
కనుయుగ్మము తెరచి చూడ కంజజు దాదిన్

అనిమిషు లెల్లరు గన్పడి
రినకుల తిలకునకు మోద మేర్పడ నెదుటన్

666. ఉ॥ అంతట పద్మగర్భుడు ధరాధిపుఁ గాంచి నృపాల సత్తమా!
సంతసమయ్యె చూడుమిదె సంయమ నీశుని తోడ వేల్పులీ
చెంతకు వచ్చి నిల్చిరి, ఋషి ప్రవరుండగు కౌశికుండు తా
పంతము వీడివచ్చెను కృపన్ నిను మిక్కిలి ప్రస్తుతింపగన్

667. చం॥ అన విని రాజదంపతు లనంత ముదంబును బొంది చేష్టలు
డ్గిన విధ మౌచు నిల్చి పరికించుచు నుండగ వారిఁగాంచి య
య్యనిమిష నాథు డిట్లనె ధరాధిప! రండిదె మిమ్ము ముప్వురన్
గొని చనువాడ నాకమునకున్ వెస నెక్కుడిదే విమానమున్

668. కం॥ మీ సత్కర్మలు గుణములు
వాసిగ మిము నాకలోక వాసులఁజేయున్
చేసిన సత్కర్మల ఫల
మోసరిలక వెంటవచ్చు నుర్వీనాథా!

669. వ. అనిపలుక

670. కం॥ దివినుండి కుసుమ వర్షము
లవిరళముగ కురిసె నప్పు డవనీ పతిపై
ప్రవిమల సుధోరు ధారలు
ధవళిమలై చితిని గురియ తక్షణమందున్

671. ఉ॥ నవ్వుచు లేచి రోహితుడు నాన్నను తల్లిని కౌగిలించె, నా
ముప్వురు నంత దివ్య సుమ భూషణ వస్త్ర విరాజమానులై
నివ్వటిలన్ సురాధిపుడు నెక్కొను హర్ష మహాబ్ధి మగ్నుడై
యవ్విభుఁ గాంచి యిట్లనియె నాదర పూర్వక భాషణంబులన్

672. మ॥ ధరణీ నాయక! స్వర్గ మేగుదమ మోదంబొప్ప రండింక స
త్వరమే యెక్కుడు వ్యోమయాన మదె దివ్యంబై ప్రకాశించెడిన్
వరసౌఖ్యంబులు పొందవచ్చు నట సంభావ్యంబుగా నంచు తా
సురనాథుండు ప్రియంబునన్ బలుక నా సూర్యాన్వయుండిట్లనెన్





673. చం॥ శ్వపచున కేను దాసుడను స్వర్భువ నాధిప! వానియాజ్ఞ లే
కిపుడెటు వత్తు న్యాయమగునే! యన, నాతనిఁ గాంచి నవ్వుచున్
శ్వపచుడ నేనె సందియము వాయుము చూడు మిదెల్ల నాటకం,
బిపుడు శ్మశాన మేది? గృహమేది? యటంచు యముండు వల్కగన్

674. కం॥ కనిపింపదయ్యె శ్వపచుడు
కనిపింపదు వాని గృహము, కాదును నెందున్
కనిపింపదయ్యె భూపున
కనుపమ సంభ్రమము మఱియు నక్కజ మొదవన్

675. కం॥ అదిగని యింద్రుడు రాజా!
పదిల పడెనె మనసు రమ్ము స్వర్గ సుఖంబుల్
పొదువు కొని యెదురు చూచెడు
కదలుడు మీ ముప్వురింక కాదనక వడిన్

676. చం॥ అనిన నృపాలు డమ్మఘవు నర్థిఁ గనుంగొని యంజలించి యి
ట్లనియె సురేంద్ర! కోసల జనావళి యేగతి నున్నవారలో
కనవలె గాదె? వారలను కాదని నేనెటు వత్తు నయ్య! మీ
రనఘులు రాజధర్మ మిది యౌనె యొకింతఁదలంపు డాత్మలోన్

677. కం॥ అనురక్తుల భక్తుల విడు
టనఘా! గోస్త్రీ ద్విజ శిశు హత్యా సమముల్
ఘన పాప నిమిత్తములని
వినఁబడు నేనెటుల వత్తు వీడ్కొని వారిన్

678. తే.గీ. నాక మైనను దుర్భర నరకమైన
వారితోఁగూడి వచ్చెద ప్రాగ్దిశేశ!
ఇదియె నానిర్ణయము మాట లేటికయ్య!
అనిన సురపతి యిట్లనె నననునయమున

679. ఉ॥ నీ హృదయమ్మెఱింగితి గణింపగ ప్రాణుల పాప పుణ్య సం
దోహము లెట్టులో యటులె తోచును కష్టసుఖంబు, లందుచే
మోహము వీడు మయ్య! కడు పుణ్యుల కబ్బెడు స్వర్గమెందు సా
మూహికమై పొసంగ దిది పొచ్చెముగాదు నృపాల సత్తమా!

680. వ. అని సురేంద్రుండన నరేంద్రుండిట్లనియె

681. సీ॥ రాజ్యభోగమ్ముల రాజన్యు లిద్దర
వరలు చుండుట వారి వలన గాదె
దాన ధర్మమ్ములు తగ యజ్ఞయాగముల్
సలుప గల్గుట వారి వలన గాదె
దిశల మధ్యశమెల్ల తేజరిల్లిన దన
తలపంగ నవ్వారి వలన గాదె
స్వర్గ సుఖమ్ములఁ బడయ నర్హత నాకు
కలిగె నేదన వారి వలన గాదె.

గీ॥ కాన నాప్రజల విడచి కదల నేను
కష్టమైనను సుఖమైన కలసి మెలసి
వారితోఁ గూడి పొందుటే భావ్యమగును
నాదు కోర్కెను మన్నింపు మాదరమున

682. మ॥ అని యిట్లెంతయు ధర్మ బద్ధముగ వ్యాఖ్యానించు నాభూమి నా
ధున కంగీకృతిఁ దెల్పె నింద్రుదును; సంతోషమ్ముతో నందరున్
జనిరా కోసల రాజధానికి; హరిశ్చంద్రావనీ నాధునిన్
గనినంతన్ ప్రజలెల్ల వచ్చి రటకున్ కౌతూహలోత్సేకులై

683. ఉ॥ వచ్చిన యా ప్రజాళిఁగని స్వర్భువ నాధిపు డాదరించి, మీ
రిచ్చమెయిన్ సుఖమ్ముల నహీనగతిన్ సురలోక మందు బల్
మెచ్చుగ పొంద వచ్చునిక; మీ విభు ధార్మిక వృత్తి కే మదిన్
హెచ్చుగ సంతసించి మిము నెల్లర గైకొని పోఁదలంచితిన్

684. ఉ॥ రండిదె యెక్కుడంచు ననురాగము తోడ వచింప నెల్లరున్
నిండిన సంతసమ్మున ననింద్య చరిత్రుల కబ్బునట్టి యా
ఖండలు లోక వాసమిటు కల్గెఁగదా! కడుచోద్యమంచు నా
చండకరాన్వయప్రభు దెసన్ గన నాతడు సమ్మతింపగన్

685. చం॥ పరువున నేగి వారలు ప్రభాకరకోటి సమాన కాంతులన్
వరలెడు వ్యోమయానము నవారణ నెక్కిన యంత నందరున్
బరగిరి దివ్యతేజ తను భాసితులౌచు, ననంతరంబ యా
నరపతి సత్వరంబ తన నందనుఁ దోడ్కొనియేగి వేడుకన్





686. కం॥ కోసల రాజ్యాధిపతిగ
భాసిల నభిషిక్తుఁజేసి ప్రజల సచివులన్
భూసురులన్ దగురీతిగ
వేసరిలక సత్కరించి వీడ్కొని యంతన్

687. కం॥ సరగునఁ జని దేవేంద్రుని
సరసన నాసీను డయ్యె సంతస మొదవన్
వర సురవిమానమున న
ద్ధరణీశుడు సతినిగూడి ధార్మికవృత్తిన్

688. వ. అనియిట్లు హరిశ్చంద్రో పాఖ్యానమ్ము వ్యాసుండు
జనమేజయునకున్ వినిపించె నని పలికి సూతుండు
శౌనకాది మునులంగాంచి

689. ఉ॥ ఈ కథ విన్న వారలకు నిచ్చమెయిన్ వినిపించు వారికిన్
చేకురు శాంతి సౌఖ్యములు, చిత్తము నంగల కోర్కెలన్నియున్
ప్రాకటమై ఫలించు, నిక స్వర్గ సుఖంబులు సత్ప్రజాళియున్
ధీకుశలత్వమున్ గల సతీమణియున్ లభియించు నిక్కమున్

690. వ. అని తత్కథాశ్రవణ ఫలితంబు వచియించె.

691. కం॥ అంత నృపాలుడు తత్కథ
సాంతమ్ము గ్రహించి వ్యాస సన్మునిఁ గని య
త్యంత విధేయుడగుచు స
చ్చింతనుడై యిట్లువలికె చెలువము మీరన్

692. చం॥ అనయము నా నరేంద్రుడు శతాక్షికి భక్తుడటంచు మీరుము
న్ననినటు లెంతు; నీశ్వరి శతాక్షియనంబడఁగారణంబు నా
కనఘ! వచింపుమయ్య! జగదంబ గుణంబుల నెంతకాలమున్
వినినను నామనంబు తనివిన్ గనఁ జాలదు మౌనిసత్తమా!

693. వ. అనిప్రార్థించు జనమేజయుంగని కృష్ణద్వైపాయనుండు
శతాక్షీసంభవగాథ నిట్లు వినిపింపఁ దొడంగె.

## శతాక్షి - శాకంభరి

694. తే. ముని హిరణ్యాక్షు వంశ సంజనితుడైన
"రురుని" తనయుండునైపుట్టి పరమనీచ
కృత్యముల్ సల్పుచుండెను నిత్య మవని
"దుర్గముం"డను వాడు నిరర్గళ గతి

695. చం॥ దివిజుల శక్తియున్ మతియు తేజము సర్వము వేదశాఖలం
దవిరళమై వెలుంగుచు జయంబును వారికిఁ గూర్చు చుండుటన్
జవమున వేద వాఙ్మయము సాంగముగా నశియింపఁ జేసినన్
దివిజులనెల్ల గెల్చుటది తేలిక యంచుఁ దలంచి వెంటనే

696. చం॥ హిమగిరి కేగి అచ్చట నహీన గతిన్ దపమాచరించె నా
కమలజు గూర్చి దుర్గముడు, కాలముసాగె సహస్రవర్షముల్
క్రమమున తత్తపోఽనల శిఖల్ వడిఁ దాకగ సర్వలోకముల్
భ్రమసి వడంక సాగె నెడఁ బాయని భీతి ననిశ్చితస్థితిన్

697. చం॥ అతని తపఃప్రభావమున కబ్జజు డుబ్బుచు హంసవాహన
స్థితుడయి వచ్చి దుర్గమ! మదిన్ గల వాంఛిత మెద్దినీకు, స
మ్మతి నెరవేర్తునేనన నమంద ముదంబును బొంది దుర్గముం
డతి వినయాతిరేకమున నంబుజ గర్భుని కోరె నివ్విధిన్

698. చం॥ మనవి యొనర్తు నామది నమంద గతిన్ చెలరేగుకోర్కె నో
వనజ భవా! త్రిలోకముల వర్ధిలు బ్రాహ్మణ వేదితంబులౌ
ఘనమగు వేద మంత్రములు కావలె నావశ మంతెగాక, అ
య్యనిమిషలోకమున్ గెలుచు నట్టి బలమ్ము ననుగ్రహింపుమా!

699. చం॥ అనిన చతుర్ముఖుండును "తథాస్తు" ని పల్కి యదృశ్యమయ్యె, నా
క్షణమె సమస్త వేదములు సద్విజకోటికి దూరమయ్యె, కా
రణ మెదియో స్ఫురింపదు; ధరాసురు లెల్లరు నిత్యకర్మలన్
గొనకొని చేయ నెంచగ నగోచరమయ్యెను మంత్రతంత్రముల్

700. తే.గీ. యజ్ఞ యాగమ్ములవి శూన్య మౌటకతన
నిర్జరులు హవిస్సులు లేక నీరసించి





వార్ధకమ్మును బొందిరి స్వర్గమందు
అదను కని పెట్టి దుర్గముం డతిశయించి

701. చం॥ తన చతురంగ సైన్యముల దర్పమెలర్పగఁ దోడుకొంచు న
య్యనిమిష పట్టణమ్మును రయమ్మున ముట్టిడిసేయ దేవతల్
దనుజుని ధాటికిన్ నిలువ దక్షత లేక పలాయ నమ్ము గై
కొని వడి దుర్గమాటవులకున్ జని రొయ్యన ప్రాణభీతిచే

702. తే.గీ. చని యచట నందరున్ గూడి శైలజాత
నర్చనల్ సల్పి రధిక యుక్తాత్ములగుచు
హోమములు లేక వర్షముల్ లేమి కతన
భూమి నెల్లెడ దుర్భర క్షామమెసగె

703. ఉ॥ బీటలు వారె నేల, కనిపింపదు నీరు నదీ నదమ్ములన్
గాటపు టెండకున్ నరులెకాదు ఖగమ్ములు జంతు జాలముల్
పాటులు దప్పి యాయువులఁ బాయుచు నుండెను, జీవయాత్ర యే
టేటికి దుర్భరంబయి మహిన్ శత వర్షము లేగె నివ్విధిన్

704. ఉ॥ భూసురు లేమి చేయుటకు పొందిక దోపక శీతశైలమున్
డాసి పరాంబికన్ దమ యెదందల నిల్పి నుతించి రిట్టు లో
భాసుర మూర్తి! సర్వజన వంద్య! మహేశి! సమస్త భూత హృ
ద్వాస! నిరీహ! కోపమిది ధర్మమె మాపయి లోక పావనీ!

705. మ॥ మము రక్షింపుము, లేరు ని న్విడచి యమ్మా! మాకు దిక్కెవ్వరున్,
క్షమియింపన్ దగు మాదు తప్పులను మాసర్వస్వమున్ నీవె, నీ
సము లెవ్వారును లేరు భక్త జననీ! సర్వేశ్వరీ! యంచు స్తో
త్రములన్ సల్పగ శైలనాధసుత యాత్మన్ మెచ్చి విప్రాళికిన్

706. సీ॥ అంజనాచల సమమైన కాయమ్మును
కాటుక కను లసంఖ్యాకములును
ఉన్నత కర్కశోద్యోత మానంబౌచు
వర్తులంబై యొప్పు వక్ష భూమి
మేటి ధనుస్సును మిక్కిలి కాండముల్
వివిధాయుధమ్ములు వేన వేలు

వనమాలికాదులు వర శాకపంక్తులు
నమరిన హస్తముల్ కొమరు మిగుల

గీ॥ సకల సౌందర్య రాశియై ప్రకట మౌచు
భాను కోటి ప్రకాశ సమాన మైన
తేజ మున నిల్చె పార్వతీదేవి యచట
కనుల ముందర విశ్వ విఖ్యాతి గదుర?

707. ఉ॥ అంతట నామె దివ్య నయనాంబుజ పంక్తులనుండి ధార లై
వింతగ కుంభవృష్టి కడు పెల్చన గుర్వగ నెల్లలోకముల్
సంతస మందె; నోషధులు సార్ద్రములై పులకించె, వాహినుల్
కాంతునిఁ జేరనెంచి తమ గట్టులఁ దన్నుచు పర్వెపెల్లుగన్

708. ఉ॥ ఆ సమయమ్మునన్ గిరి గుహాంతర భూముల నున్న వేల్పు లా
యాసములన్ దలంగి గములై వెలికిన్ పరువెత్తి యాడుచున్
భాసుర దివ్య కీర్తనల పార్వతి నెంతయు సంస్తుతించి రా
భూసుర కోటితోఁగలసి పొల్పగు నక్షర మాల లల్లుచున్

709. మ॥ మము రక్షింప సహస్ర నేత్రములతో మాముందరన్ నిల్చి దుః
ఖములన్ బాపగనెంచి తీవిధమునన్ గల్యాణి! నేడున్ మొదల్
మిము మేమెల్ల "శతాక్షి" యంచు కడు సంప్రీతిన్ స్తుతింపంగ నో
హిమ శైలాత్మజ! యెంచు కొంటి మిక నీవే మాకు దిక్కమ్మరో!

710. మ॥ అని యిట్లెల్లరు వేడు కోల్సలుపగా నానంద సంధాయి యై
తన హస్తమ్ముల నున్న శాక ఫల విస్తారమ్ము లవ్వారికె
ల్ల నొసంగెన్; పశుఖేచరాదులకు నుల్లా సంబుగా నిచ్చె తా
వన ధాన్యాధిక ఘాసముల్ జనని సంపన్నమ్ములై వర్ధిలన్

711. కం॥ ఆ కారణమున నామెకు
శాకంభరి యనెడి పేరు సార్ధకమయ్యెన్
యీ కోలాహలము చెవులఁ
దాకగ దుర్గముడు సుంత తత్తఱ పడుచున్

712. ఉ॥ దూతలఁ జేరఁ బిల్చి యటఁ దోరపు సవ్వడి యౌట కెద్దియో
హేతు వెఱింగి రమ్మన, నహీన జవంబున వార లేగి శ్రీ





మాత యొసంగు భోజ్యతతి మానుగ దేవ మనుష్య జంతు సం
ఘాతము గూడి గైకొనుటఁ గల్గిన సందడి గా దలంచుచున్

713. చం॥ సరగున వచ్చి తెల్పి రట సాగుచు నుండెడి వైన మెల్ల వి
స్తరముగ, దుర్గముండపుడు సాయుధుడై చతురంగ సైన్యముల్
పరువడి వెంటరా నరిగి బాణ పరంపర లేయ నంత భూ
సురులును దేవతల్ గలియుచున్ సురవైరి నెదిర్చి నిల్వగన్

714. ఉ॥ రక్కసు ధాటి కెల్లరుఁ దిరంబుగ నిల్వగ లేక పోరుకున్
దక్కి కడింది భీతియును దైన్యముఁ బొందుచు నార్తనాదముల్
పెక్కులు సేయుచున్ శరణు వేడుచు నా జగదంబ చెంతకున్
సొక్కుచు నేగి యద్దనుజు చొప్పది యెల్లను విన్నవింపగన్

715. ఉ॥ వారల దుస్థితుల్ గని ప్రభాకర కోటి సమాన కాంతి వి
స్ఫారిత దేహయై జనని చక్రము నొందు సృజించి నిల్పె న
వ్వారల చుట్టు రక్షణగ, వైరి విముక్త నిశాత బాణ సం
చారము లెల్ల దేవ నర సంఘములన్ వడిఁ దాక కుండగన్

716. చం॥ ఆ సురవైరి దర్పము స్వయమ్ముగ తా నడగింప నెంచి యు
ద్భాసిత మూర్తియై నిలిచి పర్వతరాజకుమారి దైత్యు డా
యాసముఁ జెందు నట్టుల నిజాంబక పంక్తులనేయ నాతడున్
వేసటఁ జెంద కామెపయి వేయఁదొడంగె నుదగ్ర కాండముల్

717. మ॥ సమరం బిట్టుల సాగుచుండ కడు నాశ్చర్యంబుగా నంబ దే
హము నందుండి యనేక శక్తు లుదయంబయ్యెన్ విశేషాయుధ
క్రమ యుక్తంబగు హస్తపద్మములతో కామాక్షియున్ గాళియున్
రమయున్, బాలయు, జంభినీ మొదలుగా రక్షోబలాధిక్యమై

718. వ. అట్లుద్భవించిన యనంత శక్తులు

719. మ॥ క్షణకాలమ్మున వైరిపక్షమున రక్షశ్శ్రేణి నొక్కుమ్మడిన్
రణమం దుక్కడ గింప; దుర్గముడు సంరంభమ్మునన్ రేగి తా
నణు మాత్రంబును జంకఁ బోక యొకడే యయ్యంగనాశ్రేణితో
రణమున్ చేయుచు నుండె చూపరులు దిగ్భ్రాంతాత్ములై నిల్వగన్

720. కం॥ పది దినము లిట్లె పోరుచు
పదు నొకటన్ దుర్గముండు పరమోత్సాహం
బెదనిండ పరాక్రమమున
నదలించి జయించె శక్తులందర నొకటన్

721. మ॥ జయగర్వంబున దైత్యు డప్పు డతి విశ్వాసంబునన్ మించి ని
శ్చయబుద్ధిన్ దరలించి తేరును జగత్ సామ్రాజ్ఞి లక్ష్యంబుగా
వియదాగారమునిండ నంబకములన్ బెక్కేయ నయ్యంబయున్
బయలన్ దద్విశిఖంబులన్ దునిమి యాపై నుగ్రరూపమ్మునన్

722. చం॥ అరదము నాల్గు బాణముల, నశ్వములన్ మఱిరెంట, నాపయిన్
సరగున రెండు బాణముల సారథిఁ గూల్చి దిశల్ ధ్వనింపగా
నరచుచు దుర్గమాసురుని యంబక యుగ్మము వోవఁ జేసె న
చ్చెరువుగ నంబక ద్వయముచే సురసంహతి సంతసింపగన్

723.తే.గీ. మఱియు రెండింట బాహుల నరికి యంత
నొక్క శిత సాయకమ్మున టెక్కె మవనిఁ
గూలనేసి, యైదింటి చే గుండి యలను
చీల్చె దైత్యుని యుసురులు చెల్లిపడగ

724. తే.గీ. అవనిఁ గూలిన యతని దేహమ్ము నుండి
తేజ మొక్కటి వచ్చి యాదేవి యందు
కలిసె నచ్చటి సురలెల్లఁ గనుచు నుండ
మూడు లోకమ్ములును శాంతిఁ బొందెనంత

725. కం॥ హరి హర విరించి ముఖ్యులు
పరమేశ్వరి చెయిద మునకు పరమానంద
స్థిరులై పులకించి యపుడు
కరయుగ్మములెత్తి నుతులఁ గావించిరిటుల్.

726. తే.గీ. కమల జాండమ్ములకు నెల్ల కన్నతల్లి
వీవె; మునివరు లెపుడు సంప్రీతి తోడ
నిర్వికల్ప సమాధిలో నిన్నె నిల్పి
ధ్యాన మొనరింతు రెపుడు తాత్పర్య మెసగ





727. కం॥ శాకాంభరి! శతలోచన!
యాకలితో నల మఱించు నమరుల ద్విజులన్
లోకముల గల్గు ప్రాణుల
కాకలి పోకార్చి బ్రోచి తమ్మా! కృపచే

728. చం॥ అని నుతియించి పుష్పతతి నంబకు పూజలు సేయ మెచ్చి యా
జనని ప్రసన్నురాలయి నిశాటుని నుండి నిజస్వరూప మం
దున తగఁ జొచ్చి యుండెడి చతుర్విధ వేదము లందఁ జేసె బ్రా
హ్మణులకు నిత్యకర్మల నిరంతరమున్ దగ నాచరింపగన్

729. వ. అట్లందించి

730. శా॥ దేవ బ్రాహ్మణ వర్యులార! పరమోత్కృష్టంబునై యొప్పి సం
సేవింపన్ దగు నా స్వరూపమిది; రక్షింపన్ దగున్ దీని; సత్
భావం బొప్పగ నర్చనల్ సలుపు, దవ్యాజంబుగా సౌఖ్యముల్
ప్రోపై మీ కొనఁగూడు నిత్యమును సంపూర్ణస్థితిన్ వృద్ధియై

731. తే.గీ. దుర్గముని సంహరించుట దుర్గ యనియు
అక్షిశతముల నుండి వర్షాధికమ్ము
నవనిఁ గురియించుటను నే "శతాక్షి" యనియు
నామములఁ బొంది యొప్పు దీ నాటినుండి

732. కం॥ ఈ రెండు నామముల మదిఁ
జేరిచి తత్త్వమ్ము నెఱిగి చింతించెడి యె
వ్వారలు నైన ధ్రువమ్ముగ
చేరగలరు పరమ పద మచిరకాలమునన్

733. వ. అనిపలికి శతాక్షి యదృశ్యంబయ్యె నని తెలిపి వ్యాసుండు
జనమేజయుం గాంచి

734. ఆ.వె. అతి రహస్యమైన అంబామహత్వమ్ము
తెలియఁ జెప్పి తిపుడు తెల్లముగను
దీని వినిన వారు దివ్య దేవీ లోక
వాసు లౌట నిక్కువమ్ము భూప!

735. చం॥ వెరవున నన్య దేవతల వీడి కదుంగడు భక్తి యుక్తులై
తిరముగ నెవ్వరైన పరదేవతఁ గొల్చెడివార లెంచగన్
నరవర! సంసృతీ తత వన స్థిత కామ ముఖాది శాత్రవో
త్కర తరు సంతతిన్ నరుక దక్షము లైన కుఠారముల్ గదా!

736. చం॥ భయమున నైన సిగ్గునను భక్తిని నైనను మాతృభావ ని
ర్ణయముననైన యుక్తినయినన్ మదినిల్పి త్రిలోకపావనిన్
నియమము తోడఁ గొల్చెడి యనింద్యచరిత్రుల కబ్బుఁ గాదె ని
శ్చయముగ మోక్షధామము నిశాకర వంశ నృపాల సత్తమా!

737. మ॥ ముని వర్యుండటు తెల్ప భూపతియు సమ్మోదించి మౌనీశ్వరా!
తనయంశన్ గమలన్ సరస్వతి నుమన్ దాక్షిణ్య భావమ్మునన్
మును సృష్టించి త్రిమూర్తులన్ బిలిచి యీపూబోణులన్ మీరు చే
కొనుడంచున్ జగదంబ పల్కెనను పల్కుల్ పల్కినారల్ గదా!

738. కం॥ కమలన్ గౌరిని వాణిని
కమలాక్షున కభవునకును కంజ భవునకున్
క్రమమున జగదంబ యొసగె
ప్రమదమున సృజించి యనుచు పల్కితిరిగదా!

739. కం॥ అటులైన గౌరి హిమగిరి
కెటులన్ జనియించె, మరియు నిందిరయును తా
నెటుల కలిగె జలధికి నీ
పటు సంశయములను దీర్ప వలయు మహాత్మా!

## హరిహరుల గర్వభంగము

740. మ॥ మును హాలా హలు లుగ్ర దైత్యు లలుకన్ ముల్లో కముల్ గెల్చి యొ
య్యన పాలించుచు దీర్ఘకాల మటు బ్రహ్మన్ గూర్చి ధ్యానించి య
వ్వనజాతాసనుచే వరమ్ములను సంపాదించి గర్వమ్మునన్
జని రబ్జాక్ష గిరీశులన్ గెలువగా సంగ్రామ సంరంభులై

741. కం॥ అంతట హరిహరు లిరువురు
పంతమ్మున వారితోడ బహువర్షమ్ముల్





సంతతము రణమొనర్చిరి
సుంతయు విశ్రాంతిలేక చూపరు లదరన్

742. చం॥ తుద కెటులో హరీశ్వరులు దుష్ట నిశాటుల సంహరించి స
మ్ముదమున నేగి గర్వపరిపూర్ణ విలోకన చేష్టలొప్పగా
ముదితలఁ పత్నులన్ గనుచు "పోర జయించితి మిప్డుమేము దు
ర్మదులగు రాక్షసాధముల మానినులార!" యటంచు పల్కుచున్

743. చం॥ తమ యసమాన శౌర్యముల దంభమునన్ వచియించుచుండ నా
రమణులు వారిపట్ల యనురాగము చూపక"చాలుచాలు మీ
తమకము లింక పో"మ్మను విధంబున బిట్టుగ నవ్వుచుండ నా
క్రమమును గాంచి క్రోధపరిరంభిత చిత్తులు నై చలించుచున్

744. శా॥ మాయా మోహితు లౌచు వారపు డసంభావ్య ప్రసంగోక్తులన్
న్యాయాన్యాయము లెంచఁ బోక పలుకన్ వ్యావృత్తశోకాత్మ లై
శ్రేయం బెంచక గౌరియున్ మఱియు లక్ష్మీ దేవియున్ వేగమే
మాయంబైచని రెట్టులో పతుల సంబంధమ్ములన్ ద్రుంచుచున్

745. కం॥ అంతన్ హరి హరు లిరువురు
కాంతల్ చని నంత దేహ కాంతులు తొలగన్
వింతగ నిశ్చేతనులై
తంతువులన్ గట్టు వడు విధంబున నుండన్

746. చం॥ హరి హరు లట్టు లౌటఁగని యంబుజ గర్భుడు చింతఁజెంది యి
క్కరణిని వీర లుండుటకు కారణ మెద్దియొ? దేవ దేవులై
వరలెడి వీర లిట్టి దురవస్థలఁ జెందుటఁ జూడ లోకముల్
సరగున లీనమౌ ప్రళయ సంగతి యౌనని తోచెడున్ మదిన్

747. చం॥ అని తలపోసి యాక్షణమ యక్షి యుగమ్మును మూసి దివ్యదృ
ష్టినిఁగని, కారణమ్ము తన చిత్తమునన్ గ్రహియించి యా జగ
జ్జననియె యల్కమై యిటుల సల్పె నటంచుఁ దలంచి వేగమే
మను సనకాదులన్ బిలిచె మానస పుత్రుల నిద్ధతేజులన్

748. చం॥ జనకుని యాజ్ఞ వారలును చయ్యన వచ్చి నమస్కరించుచున్
వినయము దోప నిల్వఁగని వేడ్క విరించియు నాదరించి మీ

రనఘులు నేటి నుండి జగదంబను గూర్చి తపంబు నిష్ఠమై
అనయము సల్పి యామె నెటు లైన ప్రసన్నను చేయుడింపునన్

749. చం॥ హరిహరు లిర్వురిప్డు జగదాదిమశక్తి క్రుధారుణాగ్నికిన్
గురియయి చేతనత్వమును గోల్పడి యుండిరి, కాన మీరు సు
స్థిరమగు భక్తి తోడ పరదేవిని గూర్చి తపంబొనర్చి త
త్కరుణను బొంది యామె యలుకన్ దొలగింపుడు మోద మేర్పడన్

750. కం॥ శివకేశవు లిర్వురపై
నవిరళ మౌ ప్రేమ మొదవు నట్టుల యంబన్
ప్రవిమల గతి నుతి యింపుడు
వివిధ గతుల మీదు యశము వెలుగున్ దిశలన్

751. కం॥ అనవిని మను సనకాదులు
ఘన హిమవద్గిరికి నరిగి కఠినతరముగన్
జననీ మంత్రాక్షరముల
మననము చేయుచు తపమును మానక చేయన్

752. కం॥ శత వర్ష సహస్రమ్ములు
ప్రతి రోధము లేక తపము భక్తి నొనర్పన్
మతి సంతసించి యీశ్వరి
అతులిత తేజమున వారి కగపడి నంతన్

753. చం॥ మనువులు మౌని వర్యులు నమంద ముదావహులౌచు నీశ్వరిన్
వినయముతో స్తుతింపఁగని వేడ్క తదంబయు వారిఁ గాంచి మీ
మనములఁగల్గు కోర్కె లనుమానము లేక యెఱుంగఁదెల్పుడీ
యనఘ చరిత్రులార! యన నందరు నొక్కట నంజలించుచున్

754. కం॥ తల్లీ! హరి హరు లిప్పుడు
చెల్లిన నిజ శుక్తులౌట చేష్టలుడిగి వా
రల్లదె గృహముల కార్యము
లొల్లక పడియుండిరమ్మ యుత్ఫుల్లాక్షీ!

755. తే.గీ. "వారి నెటులైన చైతన్య వంతులు గను
చేయు మోయమ్మ! తమ తమ చేడియలను
వారితోఁగూర్చి" యనుచు సంభావ్యముగను
ప్రార్థనలు సల్పిరెల్లరు ప్రాంజలించి

756. ఉ॥ అంతట దక్షు డామెఁ గని యంజలి మోడ్చి త్రిలోక పావనీ
అంతియగాక నీవిక మదాత్మజవై జనియింపుమమ్మ! నా
స్వాంతము సాంత్వనంబొదవ, సమ్మతి నీ వర మిమ్మునాకు ని
శ్చింత వహించెదన్ చిరము జీవిత మెల్లను ధన్యమైనటుల్

757. చం॥ అన విని యంబ మిక్కిలి దయా పరివర్ధిత చిత్తయౌచు నో
మను ముని వర్యులార! మును మామక శక్తుల నిచ్చువేళ "మీ
రనయము వీరలన్ మిగుల నాదరమేర్పడ జూచు కొం" డటం
చనునయ మొప్ప బల్కితి హరాంబుజనాభులతోడ నాదృతిన్

758. కం॥ నా యాజ్ఞ మీరి వారిపు
డా యంబుజనేత్రల హృదయమ్ముల మిగులన్
గాయమ్ములు గల్గించుట
పాయక యిటుల దురవస్థ వారికి కలిగెన్

759. ఉ॥ మీరలు కోరినట్లుగ క్షమించితి వెన్నుని నీశు; స్వస్థతల్
గూరును వారి కింకపయి కొందల మందకుడయ్య, లక్ష్మి యా
క్షీరవరాబ్ధిఁ, బార్వతియు చెల్వుగ దక్షుని యింటఁబుట్టి సొం
పారగ చేరుకొందురల యచ్యుతు నీశ్వరు, మెచ్చలోకముల్

760. శా॥ మాయా బీజమె మంత్ర రాజమది సుమ్మా!దాని నెల్లప్పుడున్
బాయన్ బోక జపింపు డింక! కడు దివ్యంబైన నాయీవిరాట్
కాయంబున్ మది నిల్పి ధ్యానమును చక్కన్ జేయు, డారీతిగా
చేయన్‌జాలరొ, భక్తిఁగొల్వుడిదె మత్ చిన్మంగళాకారమున్

761. ఉ॥ స్థావర జంగ మాత్మక విశాల జగత్తు మదీయ మందిరం
బై వెలుగొందుఁ గాన నెటులైనను నన్మది నిల్పి నిత్యమున్
భావన సేయు, డర్చనల భక్తిని సల్పుడటంచు నాజగత్
పావని యానతిచ్చి ముని వర్యుల వీడి యదృశ్యమై చనెన్

762. ఉ॥ అంతట నమ్మునీశ్వరు లనంత ముదమ్ములఁ బొంది యేగి వృ
త్తాంతము నంతయున్ సరసిజాసనుకున్ వినిపింప నాత డ

త్యంతము సంతసించె, సమయంబటు సాగెను కొన్నినాళ్ళు, ధీ
మంతుని దక్షునింట ప్రియమై జనియించెను శక్తి సమ్మతిన్

763. మ॥ విరి వానల్ గురియించి రప్పు దివిజుల్ వేనోళ్ళc గీర్తించుచున్
మొరసెన్ దుందుభు లొక్కటన్ దివమునన్, ముల్లోకముల్ ప్రీతిమై
జరుపన్ సాగెను యుత్సవంబు; లమలస్వాంతమ్ములన్ సాధుసత్
పురుషుల్ పాడిరి లోకమాత జననంబున్ గాంచి యుత్సాహులై

764. కం॥ 'సతి' యని పేరిడి యా గుణ
వతి నతి గారాము తోడ ప్రాణసమముగా
పితరులు పెంచుచు యౌవన
వతియగు తఱి పెండ్లి చేయ వలెనని యంతన్

765. చం॥ శివునకు ఫాల నేత్రునకు సేవిత భక్త వరప్రదాతకున్
భవున కొసంగి యా సతిని వైభవ మొప్ప వివాహకార్యమున్
దివిజులు మెచ్చ సల్ప, నిజ తేజము దిక్కుల నిండ నప్పుడా
భవుడు వెలింగె శక్తియుత భాస్వరుడై ముదమంద లోకముల్

766. కం॥ ముని వరుడౌ దూర్వాసుం
డనుపమగతి తప మొనర్చి నంబన్ మదిలో
ననవరతము నిల్పికొనుచు
ఘన మాయా మంత్ర జప సుఖస్థితు డౌచున్

767. ఉ॥ ఆతని దీక్షకున్ ముదము నంది మహేశ్వరి నైజకాంతు ల
త్యాతత రీతి విస్తరిల నమ్మునివర్యుని మ్రోల నిల్చి సం
ప్రీతి నిజాంస భాగ పరివేష్టిత దివ్య సుగంధ బంధుర
స్ఫీత ప్రసూన మాలికను వేడ్కనొసంగె నదృష్టపూర్వమున్

768. శా॥ ఆ దివ్యంపు ప్రసూన మాలికను భక్త్యా వేశ సంపూర్ణు డై
యా దూర్వాసుడు స్వీకరించి జననీ యాశీస్సులన్ బొంది స
మ్మోదంబందుచు నుత్తమాంగమున సొంపుల్‌గుల్కcగైసేసి తా
నాదిత్య ప్రతిమానుడై గగన మార్గావర్తుడై వచ్చుచున్





## దక్షుని యపరాధము

769. ఉ॥ దక్షుని యింటికిన్ జనియెc దద్గృహ జాతను శక్తినిన్ విరూ
పాక్షుని ధర్మ పత్ని సతి నర్థిcగనుంగొని తత్కృపార్ద్ర సం
వీక్షణ ధన్యతన్ బడయు వేడుక నంతట వాని శీర్షమం
దక్షయ సౌరభంబయిన యవ్విరి దండను గాంచి దక్షుడున్

770. వ. తద్వృత్తాంతం బెరుంగంగోరి మహర్షి సత్తము నవలోకించి

771.చం॥ అతులిత దివ్య సౌరభ శుభాస్పద మీ సుమ మాల, యిద్ది యే
కతన లభించెమీకు, మునుc గానరు దీని మనుష్య మాత్రు లో
వితత తపఃప్రభావ! కడు వేడుక నెవ్వరు దీని మీకు స
మ్మతిని బహూకరించిరొ క్రమంబున తెల్పుము మౌనిసత్తమా!

772. మ॥ అని ప్రార్థింపగ నత్రినందనుడు నేత్రాబ్జంబు లార్ద్రస్థితిన్
గన, దగ్గుత్తిక తోడ నోయనఘ! నిక్కంబైన నాభక్తికిన్
మనమందెంతయు మెచ్చి యా జనని యీమాలన్ గడున్ దివ్యమున్
తన కంఠమ్మున నున్న దాని నొసగెన్ నా పుణ్య మూలంబునన్

773. మ॥ అనినన్ దక్షుడు సంత సించుచు "మహాత్మా! దీని నాకిత్తు వా"
యన దూర్వాసుడు కాదుకూడ దనబో కాపుష్పమాలన్ వడిన్
తన శీర్షంబున నున్నదాని నొసగెన్ దాక్షిణ్యభావమ్మునన్
తన నర్థించిన యాప్రజాపతికి మోదంబాత్మ నిండారగన్

774. శా॥ ఆ దక్షుండును దాని గైకొని యమందానంద సంధానుడై
యా దూర్వాసుని సాగనంపి యపుడే యామాలికన్ దాల్చి స
మ్మోదంబందుచు శయ్యకున్‌జని యటన్ బొల్పొందు మేల్ తల్పమం
దా దివ్యామల మాలcగీల్చి యటనే యారాత్రి యుత్సాహుడై

775. చం॥ అతులిత దివ్యహార జనితాద్భుత సౌరభ పార వశ్యుడై
రతుల నపూర్వసంగతి విరామ మెఱుంగక సల్పె పత్నితో
నితర మనమ్ము లేక; యిక యేటికి తత్కృత పాప హేతువై
మతి చలియించి యాతని కుమాధవుపై కడు ద్వేషమేర్పడెన్

776. ఉ॥ అల్లుని పైన ద్వేష మది యాత్మజ పై ప్రసరింప వానిదౌ
పెల్లగు దోష మామె కతి వేదన నింపగ నోర్వలేక క్రో

దోల్లలితాత్మయై జనకు నుద్ధతి సైపక యోగ వహ్నియం
దెల్లరు చూడ నాసతి దహింపగఁ జేసె నిజ స్వరూపమున్

777. చం॥ జనకుని దోషమున్ మదిని సైపగ లేక దహింప బడ్డ యా
జనని యనంతరమ్ము హిమ శైలగృహంబున నుద్భవించి మ
న్నన గొనె పార్వతీ సుభగ నామమునన్ గురువంశ వర్ధనా!
యని వచియించి వ్యాసముని యాగె నొక క్షణ కాలమట్టులే

778. చం॥ అదివిని యక్కజంపడుచు నా జనమేజయు డిట్లువల్కె నో
సదమల చిత్త! యోగ శిఖిసంగతి నాసతి యట్లు ప్రాణముల్
వదలుటఁ గాంచి యాశివుడు పట్టని యట్టుల చూచు చుండెనా!
మదినెటు నోర్వఁజాలె నిజ మానిని దుస్థితిఁ గాంచి యక్కటా!

779. చం॥ అని యడుగన్ మునీంద్రుడు ధరాధిపుఁ గాంచి కురుప్రవీర! యే
మని వచియింతు నయ్య! ప్రళయాంతకునిన్‌బలె నుగ్రకోప సం
జనిత నిటాల నేత్ర శిఖి సంహతులన్ గడు రౌద్ర మూర్తి యై
కనపడు శంకరున్‌గని వికంపితులై రపు డెల్ల వారలున్

780. ఉ॥ ఆతని యుగ్ర కోప వితతానల సంహతి నుద్భవించె రౌ
ద్రాతి శయంబునన్ క్షణమునందె భయంకర భద్రకాళికా
స్ఫీత గణమ్ముతోడ పరిసేవితుడౌచు త్రిలోక వాసులున్
భీతిల వీరభద్రు డతి భీకర రూపు డుదగ్ర తేజుడై

781. వ. అట్లుద్భవించిన వీరభద్రుండుగ్రుండై దక్షుని శిరంబు
ద్రుంచి వైవ

782. చం॥ కమలజు డాదిగా సురలు కంపిత దేహులు నౌచు వేగ సం
భ్రమమున శంకరున్ గలిసి ప్రార్థనలన్ శరణంబు వేడగా
శమిత క్రుధాత్ముడౌచు గిరిశాయి ముదమ్మున దక్షుమొండెమం
దమర నజోత్తమాంగము రయమ్మునఁ గూరిచి చేసె జీవితున్

783. చం॥ అటుపయి దక్ష వాటికకు నయ్యభవుం డరు దెంచి యచ్చటన్
చటుల దవాగ్ని ద్రుంగి పెలుచన్ దహనంబగు పత్నిఁ గాంచి యు
త్కట పరివేదనన్ గదిసి తత్ సతి దేహముఁ జిత్కళాభమున్
చిటిలెడు దాని నంసమునఁ జేరిచి మిక్కిలి భ్రాంత చిత్తుడై





784. ఉ॥ హాసతి! హాప్రియా! యనుచు నార్తి మెయిన్ విలపించుచున్ దిశల్
భాసిల నన్ని వైపులకు పర్వులు పెట్టుచు వెఱ్ఱివాని య
ట్లా సమయమ్మునన్ దిరుగ నాశివునిన్ గని వెన్ను డప్పు బా
ణాసన మెక్కువెట్టి నిశితాంబక పంక్తుల నేయుచున్ వడిన్

785. చం॥ శివుడెటు వెళ్ళి నిల్చినఁ బ్రసిద్ధిగ నాసతి దేహ భాగముల్
భువిపయి దుల్లఁ జేసె,c గడుపొల్పుగ నందును నందునందు, నా
శివుడును నన్ని రూపముల చెల్వుగ నిల్చెను నెచ్చటెట్టటన్
బ్రవిమల శక్తి యంగములు వ్రాలెనొ యచ్చట నచ్చటచ్చటన్

786. మ॥ అపుడా శంకరు డాది తేయుల ననంతానంద సంధానులన్
గృపతో గన్గొని దివ్యులార! యికపై నీ యీ ప్రదేశమ్ములం
దెపుడున్ దేవిని భక్తి తత్పరులునై యెవ్వారు సేవించినన్
దపముల్ సేసిన మంత్రముల్ దలచినన్ దథ్యంబు సిద్ధించెడున్

787. కం॥ ఆయా క్షేత్రము లెవ్వియొ
ఏయే రూపములతోడ నీశ్వరి యచటన్
శ్రీయుతమై వెలసిన దో
ఆయా వివరములు తెలుపు దయ్యా వినుమా!

## శక్తి పీఠములు

788. వ. "విశాలాక్షి"యను పేర వారణాసిలోను, 'గౌరి'యను నామంబున ముఖనివాసంబునను, 'లింగధారిణి'గా నైమిశంబునను, ప్రయాగన్ 'లలిత'గను, గంధ మాదనంబున 'కాముకి'గను, మానస క్షేత్రంబున 'కుముద'యనుపేరన్, 'విశ్వకామ'గా దక్షిణ క్షేత్రము లోను, 'విశ్వకామ ప్రపూరిణి'యై ఉత్తర క్షేత్రంలోను, గోమంతంబున 'గోమతి'గను, మందరమ్మున 'కామ చారిణి' గను, 'మదోత్కట'యై చైత్ర రథంబునను, హస్తినన్ 'జయంతి'గను, కాన్యకుబ్జంలో తిరిగి 'గౌరి'గను, మలయాచలంబున 'రంభ'గను, 'మతి'యై ఏకామ్ర పీఠంబునను, 'విశ్వేశ్వరి' యై విశ్వక్షేత్రం బునను, 'పురుహూతిక' యై పుష్కరంబునను, 'సన్మార్గదాయిని' యన కేదారక్షేత్రంబునను, హిమాలయంబున 'మంద'గను, 'భద్ర కర్ణిక'గా గోకర్ణంబునను, స్థానేశ్వరంబున 'భవాని' యను పేర, బిల్వక్షేత్రంబున 'బిల్వ పత్రిక'గను, 'మాధవి' యనుపేర

శ్రీ శైలంబునను, భద్రేశ్వరంబున 'భద్ర'గను, 'జయ' యను
నామంబున వరాహశైలంబునను, 'కమల' యై కమలాలయంబునను,
రుద్రకోటియందు 'రుద్రాణి'గను, 'కాళి'యనుపేర కాలంజర
క్షేత్రంబునను, శాలగ్రామంబున 'మహాదేవి' గను, శివలింగక్షేత్రమున
'జలప్రియ' యను నామంబునను, మహాలింగంబున 'కపిల'
గను, మాకోట క్షేత్రంబున 'ముకుటేశ్వరి'గను, మాయా
పురిన్ 'కుమారి' గను, 'లలితాంబిక'గా సంతానక్షేత్రంబునను,
గయన్ 'మంగళాదేవి'గను, పురుషోత్తమ పురిన్ 'విమలా దేవి'గను,
'ఉత్పలాక్షి'యై సహస్రాక్షంబునను, హిరణ్యాక్షంబున 'మహోత్పల'
గను, 'అమోఘాక్షి'యన విశాపాక్షేత్రంబునను, పుండ్ర వర్ధనంబున
'పాడల' గను, సుపార్శ్వంబున 'నారాయణి' గను, 'రుద్ర సుందరి'యై
త్రికూటంబునను, విపుల క్షేత్రంబున 'విపులా దేవి' గను, మలయా
చలంబున 'కల్యాణి'గను, 'ఏకవీర'గా సహ్యాద్రి పైనను, హరిశ్చంద్ర
క్షేత్రంబున 'చంద్రిక' గను, 'రమణ'యై రామ తీర్థంబునను,
యమునన్ 'మృగావతి' గను, కోటి తీర్థంబున 'కోటవి'గను,
మాధవ వనంబున 'సుగంధ' గను, గోదావరిన్ 'త్రిసంధ్య'గను,
'రతిప్రియా'నామంబున గంగాతీరంబునను, శివకుండంబున
'శుభానంద'గను, దేవికా తటంబున 'నందినీ దేవి' గను, ద్వార
వతిన్ 'రుక్మిణి'గను, బృందావనంబున 'రాధ'గను, మధురన్
'దేవకి' గను, పాతాళంబున 'పరమేశ్వరి'గను, చిత్రకూటంబున
'సీత'యై, వింధ్యన్ 'వింధ్య వాసిని'యై, కరవీర దేశంబున 'మహా
లక్ష్మీ'గను, 'ఉమాదేవి'యై వినాయక క్షేత్రంబునను, వైద్య
నాథంబున 'ఆరోగ్య'గను, 'మహేశ్వరి' యై మహాకాళక్షేత్రంబునను,
ఉష్ణతీర్థంబున 'అభయ' గను, వింధ్యపర్వత సానువుల 'నితంబ'
గను, మాండవ్యంబున 'మాండవి' గను, మాహేశ్వర పురంబున
'స్వాహాదేవి'గను, ఛగలండ ప్రదేశంబున 'ప్రచండ' గను,
అమరకంటకంబున 'చండిక' గను, 'వరారోహ'యై సోమేశ్వ
రంబునను, ప్రభాస తీర్థంబున 'పుష్కరావతి'గను, సరస్వతిన్
'దేవ మాత'గను, తటంబున 'పారావారా దేవి'గను, మహాలయం
బున 'మహాభాగ' గను, పయోష్ణిలో 'పింగ ళేశ్వరి' గను, 'సింహిక'గా
కృత శౌచంబునను, కార్తికంబున 'అతి శాంకరి' గను, ఉత్పలా





వర్తకంబున 'లోలా దేవి'గను, శోణ సంగమక్షేత్రంబున 'సుభద్ర'
గను, సిద్ధవనంబున 'లక్ష్మీమాత'గను, భరతాశ్రమంబున 'అనంగ'
గను, 'విశ్వముఖి'యై జాలంధరంబునను, కిష్కింధాద్రిన్ 'తారా
దేవి'గను, 'పుష్టి'యై దేవదారు వనంబునను, కాశ్మీరంబున
'మేధాదేవి'గను, హిమాద్రిన్ 'భీమాదేవి', 'తుష్ట', 'విశ్వేశ్వరి'యను
నామమ్ముల తోడను, కపాల మోచన క్షేత్రంబున 'శుద్ధి'గను,
'మాత'యై కాయావరోహణంబునను, శంఖోద్ధారంబున 'ధరాదేవి'గను
పిండాకరంబునన్ 'ధృతి'యై, 'కళాదేవి'గా చంద్రభాగా తీర్థంబునను,
అచ్ఛోదంబున 'శివధారిణి'గను, వేణాక్షేత్రంబున 'అమృతాదేవి'గను,
బదరీ క్షేత్రంబున 'నూర్వశి'గను, ఉత్తర కురుక్షేత్రంబున 'ఔషధి' యనుపేర,
కుశద్వీపంబున 'కుశోదక' గను, హేమ కూటంబున 'మన్మథ'గను
కుముద క్షేత్రంబున 'సత్యవాదిని' గను, అశ్వత్థంబున 'వందనీయ'గను
'నిధి' యను నామంబున వైశ్రవణంబునను, వేద వనంబున 'గాయత్రి'
గను, శివసన్నిధిన్ 'పార్వతి' గను, నాకంబున 'ఇంద్రాణి' గను,
బ్రహ్మవదనంబున 'సరస్వతి'గను, ఇనబింబంబున 'ప్రభ'గను,
మాతల యందు 'వైష్ణవీ మాత'గను, సతులం 'దరుంధతి'గను,
స్త్రీల యందు 'తిలోత్తమ'గను, చిత్తంబున 'బ్రహ్మకళ'గను,
సకల శరీర ధారులందు 'శక్తి' రూపిణి గను, 108 పీఠంబులయందు
సతీదేవి అంగములు శక్తి పీఠములుగా వెలసినవి.

789. కం॥ ఈ పీఠమ్ముల యందున్
ఆ పుర హరుడున్ వెలసెను నంబాయుతుడై
పాపములు తొలగి ముక్తియు
ప్రాపించును వీని మదిని వదలక తలపన్

790. చం॥ మనుజు డెవండ యేని స్థిర మానసుడై యిల శక్తి పీఠముల్
గనుచును నందునందు తమకంబును వీడి విశేష భక్తి తో
జననిని గొల్చి పూర్వులకు శ్రాద్ధవిధుల్ దిల తర్పణంబులన్
గొనకొని చేయుచుండ సమకూరును శాంతియు ముక్తి ధామమున్

791. శా॥ ఈ పీఠంబుల శక్తికిన్ దగినయట్లెవ్వారు పూజావిధుల్
లోపంబింతయు లేక చేయుదురొ నిర్లోభంబునన్, వారలీ

పాపాపార భవాబ్ధి దాటి యతులంబై యొప్పు దేవీ మణి
ద్వీపంబందు వసింతురెల్లపుడు ప్రీతిన్ తత్సమీపంబునన్

792. కం॥ ఈ యష్టోత్తర శత సం
ఖ్యాయుత నామముల నెవ్వఁడర్థిఁదల చుచున్
వ్రాయుచు నుండిన వానికి
బాయున్ గ్రహపీడ, లమరు భాగ్యోన్నతులున్

793. మ॥ అనుచున్ మౌని వరేణ్యుడిట్లు రమణీయంబైన యాఖ్యానమున్
వినిపింపన్ జననాధుడున్ మిగుల సంప్రీతాత్ముడై మ్రొక్కి, యో
ముని మాన్యా! యటు పైన నెట్లు జననంబున్ బొందె నాదేవి శీ
త నగాధీశుని యింట పార్వతిగ, తద్గాథన్ వచింపన్ గదే!

## తారకాసురదుష్కృత్యములు

794. మ॥ అని వేడన్ ముని పుంగవుండనియె రాజా! యీశ్వరుండట్లు భా
ర్యను కోల్పోయి విమోహితాత్ముడయి యశ్రాంతమ్ము దేశాటనం
బనయంబున్ దగసల్పి యంత నొకచో యుక్తాత్ముడై నిశ్చలం
బున లోకేశ్వరిఁ గూర్చి పూనెను తపంబున్ బెద్ద కాలంబుగన్

795. మ॥ సతి లేనందున మూడు లోకములకున్ సౌభాగ్యముల్ దప్పి న్యూ
నత గల్గెన్ గడు శక్తి హీనమయి, యానందంబులున్ శూన్యమై
అతి చింతల్‌గని రెల్లవారు, గ్రహతారానీకముల్ వక్ర సం
గతి వర్తింపఁ దొడంగ నెల్లరును రోగ గ్రస్తులై రొక్కటన్

796. ఉ॥ ఆ సమయమ్ము నందె కమలాసను దివ్యవర ప్రభావుడై
రోసముఁ బూని తారకుడు లోకములన్ వడి నాక్రమించి తా
వేసటఁబెట్ట సాగ, పరి వేదనఁ జెందుచు దివ్యులెల్లరున్
గాసిలి పర్వువెట్టి రటు గట్టుకు చెట్టుకు నొక్కరొక్కరై

797. ఉ॥ తారకు సంహరింపఁగల దక్షుడు లేడెట ముజ్జగంబులం
దారయ చంద్రశేఖరున కౌరసుడై జనియించునట్టి యా
ధీరుడు దక్క! నిత్తఱిని తీవ్ర తపంబున నుండె శంకరుం
డౌర! యుపాయ మెద్దియిక నంచు ఁదలంచుచు దేవ సంఘముల్





798. కం॥ కదు చింతించుచు వెన్నుని
కడకున్ జని విషయ మెల్ల కంజాక్షునకున్
వడి వడి వినిపింప, హరియు
తడయక యిట్లనియె దివిజ తతులన్‌గనుచున్

799. ఉ॥ దేవతలార! యింక కడ తేరును దుఃఖము లూఱడిల్లుడీ
భావములన్ జగజ్జనని పాదయుగమ్మును నిల్పి కొల్వు, డ
ప్పావని సత్కృపల్ గలుగ పాయువె దోషము లెల్ల, తల్లి యే
కావ వలెన్ గదా! సుతులఁ గష్టము లేపయి నట్టి వేళలన్

800. చం॥ మన యపరాధముల్ దలచి మన్నన చూపక తల్లియిట్లు నె
మ్మనమున మౌనమూనె, నిది మానుగ తానిడి నట్టి శిక్షయౌ
అనునయ మైన, దండనమె యైనను, తల్లికె చెల్లు, నేడు తా
మనల పరీక్ష చేయుటకె మౌనము దాల్చె నటంచు నెంచుడీ!

801. మ॥ అని యిట్లాఱటఁ బుచ్చి చక్రి వడి నయ్యాదిత్య సంఘమ్ముతో
జనియెన్ శీత ధరాధరమ్మునకు; విశ్వాసమ్ముతో నెల్ల రా
ఘన శైలంబున యోగ్యమౌ స్థలములన్ గల్యాణి మంత్రమ్ములన్
మననంబుల్ దగఁ జేయఁ బూని రవిరామ స్థైర్య దీక్షారతిన్

802. కం॥ కొందరు యజ్ఞమ్ముల మఱి
కొందరు నామ జపము లిక కొందరు వేదం
బందలి సూక్తపఠనముల
కొందరు పూజలను మిగుల కూర్మిజరుపుచున్

803. చం॥ గడపిరి పెక్కు వర్షములు కల్మషదూరులు నోచు వార, ల
య్యెడ నొక చైత్ర శుద్ధ మున నిమ్ముగ భార్గవ వాసరంబునం
దుడుపతి కోటి కాంతులను నుద్యదహస్కర కోటి దీప్తులన్
గడుకొని తేజ మొండు తమకన్నుల ముందుదయించె వేడుకన్

804 సీ॥ కోటి విద్యుల్లతల్ కొమరార గగన మం
దరుణ కాంతులఁ జల్లి నట్లు దోప
ఆద్యంతములులేక అన్నిదిక్కుల యందు
సమమౌచు కాంతి పుంజము లెసంగ

అవయవ శూన్యమై యాకార రహితమై
స్త్రీపుం నపుంసక రీతిగాక
నిజదీప్త లమరుల నేత్ర పద్మములకు
మసకలు నింపి విస్మయముఁగొలుప

గీ॥ మెల్లమెల్లగ నాతేజ మెల్ల మారి
జగతి సౌందర్యరాశి యచ్చటనె విడిసె
ననగ నవయౌవ నాకార ముసు ధరించి
దివ్య నవశోభ నాంగియై తెలియఁబడియె

805. సీ॥ పద్మ కోరకముల పరిహసించెడి పయో
ధరముల నొప్పు విస్తార యురము
చిఱు మువ్వల రవళిఁ జెలు వొందు కనకంపు
కటిసూత్రవర మోదకరము కౌను
తేటి గముల గుంపు తిన్ననై జారెడి
భంగి నొప్పెడి కేశపాశ భరము
కర్పూర వీటికా కమనీయ పరిమళా
క్రాంత దిగ్వలయ వక్త్ర స్థలమ్ము

గీ॥ స్వర్ణ మంజీర కేయూర సంతతులును
అష్టమీ చంద్ర విభ్రాజ దళిక భూమి
రక్త మాల్యాను లేప వస్త్రప్రదీప్తి
సర్వమోహిని యచట సాక్షాత్కరించె

806. కం॥ ఆనం దాశ్రువు లొల్కగ
మేనుల్ బులకింప తల్లి మేనున్ గనుచున్
మౌనమును బూని దివిజులు
ధ్యానించిరి కొంత తడవు తద్రూపంబున్

807. వ. అంత కొంతవడికి తేరుకొని వారల య్యంబ నిట్లు స్తుతించిరి

## దేవత లొనర్చిన దేవీస్తుతి

808. శా॥ దేవీ! శాంభవి! వైష్ణవీ పరమ సాధ్వీ! లోక మాతా! పరా!
భావా తీత గురుప్రభావ! జననీ! బ్రాహ్మీ! మహాలక్ష్మి! మా





కీవే రక్ష నమోనమః శరణు తల్లీ! సర్వశక్త్యాత్మికా!
వేవేగన్ గరుణించి బ్రోవఁగదె! విశ్వేశీ! జగత్పావనీ!

809. ఉ॥ నీ పర తత్త్వమున్ దెలియ నేర్చిన విజ్ఞుల కెల్లెడన్ జగ
ద్రూప విశాల సంసృతి సు దూరగతిన్జన నిత్య శాంత సం
దీపిత చిత్తు లౌదు, రిక నిన్ గ్రహియింపగ లేని వార లీ
పాపపు సంసృతిన్ బడి విపద్ఘన వార్ధిఁజరింతు రజ్ఞులై

810. మ॥ అని యిట్లందరు గద్గదస్వరములన్ హాహారవోద్వేగులై
జననిన్ స్తోత్రము సేయగా జననియున్ సంతోషమున్ జెంది య
య్యనిమేషాళినిఁగాంచి భక్త వరులారా! కోరుడీ యిత్తు చ
య్యన మీకెయ్యది నేడు కావలయునో ఆలస్య మింకేటికిన్

811. మ॥ అనినన్ దివ్యులు సంతసించి జననీ! యావంత యున్ నీ మదిన్
గనరానట్టి దొకండు గల్గునె పరీక్షల్ సేయనే గాదె యి
ట్లనుటోతల్లి! దురాత్ముడై యహరహం బాతారకుం డుగ్రుడై
యనయంబున్ మము హింసవెట్టెడు రణవ్యాపార దుశ్శీలతన్

812. ఉ॥ తారకు సంహరింపగల దక్షుడు లేడెట ముజ్జగంబులం
దారయ, చంద్రశేఖరున కౌరసుడై జనియించునాతడే
పోర జయించు దైత్యునని మున్ను విరించి వచించెఁగాని, యె
ట్లౌరసు దుద్భవించును నిజాంగనఁ గోల్పడి నట్టిశూలికిన్

813. ఉ॥ ఇంతకు మించి మేము వచియింపఁగలట్టిది లేదు తల్లి! దు
శ్చింతుని బారి నుండి దరిఁ జేర్చెడి మార్గము మాకుఁ జూపి ని
శ్చింతులఁ జేయు మమ్మ! మము; చెల్వగు మీ పద పంకజమ్ములన్
స్వాంతములందు నిల్పుకొని భక్తి భజింతు మహర్నిశంబులున్

814. మ॥ అని వేడన్ జగదంబ వారిఁగని మీ రావంతయే నింక న
ద్దనుజున్ గూర్చి కలంతఁ జెందకుడు సత్యంబింక నా శక్తియే
జనియించున్ హిమవంతునింట విలసత్ సౌభాగ్యరూపంబు సే
కొని గౌరీ వర నామయై బుధవరుల్ కొండాడ నుత్సాహులై

## పార్వతీ అవతరణము

815. సీ. అమృత తుల్యంబు లౌ అంబ మాటలు విని
హిమవంతు దుప్పొంగి యిట్టులనియె
హే! జగన్మాత! నే నెంత ధన్యాత్ముఁడ
భవదనుగ్రహము నాపాల గలిగె
స్థాణువునైన నన్ దండ్రిగా గోరి మత్
గృహమున జన్మించుటెంత యరుదు
ఎన్నిజన్మల కైన నిట్టి యదృష్టమ్ము
జడుడ నాచే పొంద బడునె తలప

గీ. జగము లందింక నాకీర్తి యుగ యుగముల
ప్రస్తుతింపంగ బడును సంభావ్యముగను
కమల జాండమ్ములను త్రిప్పఁగలుగు మేటి
తల్లి నాయింట నొక చిట్టి తల్లి యౌనె!

816. తే.గీ. వేద వేదాంత సంవేద్య వౌదు వీవు
నీదు రూపము ఁదెలియ నా కిచ్చగలదు
వేద విజ్ఞాన విహితార్థ విధము, మఱియు
భక్తి యోగమ్ముఁ దెలుపుమో భక్తి గమ్య!

## దేవీ గీత

817. చం. వినయము తోడ నీ గతిని వేడిన శీత నగేంద్రునిన్ ప్రియం
బునఁగని; నాకులన్ గడు ప్రమోదమునన్ బరికించి; యందరున్
వినగ వచించె నిట్లు కడు బిగ్గరగా జగదంబ నవ్వుచున్
వినుము హిమాచలేంద్ర! వినిపింతు మదీయ విశేష తత్త్వమున్

818. ఉ. “నే” నను తత్త్వమొక్కటియె నిశ్చల మై కలదయ్య మున్ను; న
ద్దానిని మించి వేరొక పదార్థము లేదెట, దానినే బుధుల్
ధ్యానమొనర్చు చుంద్రు పరమాత్మ యటంచును బ్రహ్మమంచు ని
ర్వాణ పదంబు, గమ్యమని, వాక్కుల కందని దంచు నెంచుచున్

819. చం. అది సతి గాదు పూరుషుడు నైనను గా దుభయంబు గాదు, సత్
పదమయి యొప్పు నాత్మయనఁబల్కుల కందక; తత్సమాన మె





య్యదియును లేదొకందు; కల దద్భుతమౌ నొక శక్తి దానికిన్
బదనుగ“మాయ” యన్న యొక నామముతోడ జగత్ ప్రసిద్ధమై

820. వ. మఱియును నామాయ నాయందెట్లునికి గల్గి యున్నదన

821. చం. ఇనునకు కాంతి వోలె, మఱి యిందున కొప్పెడు చంద్రికన్ బలెన్,
ఘనమగు నుష్ణ మగ్నికటు కల్గెను నాకిది నైజసిద్ధమై
మనుజుల సర్వకర్మములు, మారుచు నుండెడు కాలపున్‌గతుల్,
జననుత! దాని లోపలనె సంచరణంబొనరించు చుండెడున్

822. కం. మాయా సంయోగంబున
నాయా కాలముల బీజమై యొప్పుచు నే
నాయా జీవుల మఱి మఱి
పాయక సంసార విపుల వార్ధిన్ ద్రోతున్

823. చం. ఇది జడమంచు కొందరును, నియ్యదియే తమమంచు కొందరున్,
పదనుగ శక్తియంచును, తపంబని, మాయయు నంచు, జ్ఞానమం
చదియె ప్రధానమంచు నిటు లెన్నియొ నామములన్ జగమ్ములన్
పదిలముగా వచించెదరు ప్రాజ్ఞులు యోగ విచార ద్రష్టలై

824. చం. కనఁబడుచున్న దెల్ల నొక కాలమునన్ నశియించుచుండు, చే
తన మది స్వప్రకాశకము తత్‌ఘన తేజ మనన్య మెంచగన్
ఇన, శశి, సప్త జిహ్వల యహీనతమంబగు తేజమెల్ల త
జ్జనితమె నిశ్చయమ్ము గిరి సత్తమ! అన్యము గా దెఱుంగుమా,

825. తే.గీ. ప్రేమ కాస్పదమైన సంవిత్తు నిత్య
మవ్యయానందరూప సమంచితమ్ము
ఏత దితరమ్ము మిథ్యయం చెఱిగి నంత
సంగ రహితమ్ము గా నిది స్పష్టమౌను

826. తే.గీ. జ్ఞాన సుఖరూపమును, నిత్య సత్య, శుద్ధ,
మద్వి తీయమ్ము, పరిపూర్ణ, మాత్మ యెపుడు
వాసనా జన్య కర్మవిపాకము లవి
కలుగు చుండును మాయా వికారముననె

827. తే.గీ. అచల శేఖర! విను సంవిదాత్మయనగ
నా యలౌకిక రూప మవ్యాకృతమ్ము
అన్ని తత్త్వములకు నిది యాది యౌను
కారణమ్ములకి య్యదే కారణమ్ము
సచ్చి దానంద రూపమ్ము సర్వసాక్షి

828. తే.గీ. ఆది తత్త్వమ్ము నైన నీ యాత్మ నుండి
శబ్ద తన్మాత్రక మ్మాక సమ్ము పుట్టె
ఆకసమునుండి కలిగె స్పర్శాత్మకముగ
వాయు, వందుండి అగ్ని రూపగుణకమ్ము
పుట్టె, నయ్యగ్ని నుండి సంభూతమయ్యె
రస గుణాత్మక మౌచు తోయమ్ము, మఱియు
నప్పులందుండి గంధ గుణాత్మకముగ
పృథ్వి జనియించె వరుస నీ విశ్వమందు

829. తే.గీ. ఆకసము శబ్ద గుణకమౌ నచ్చముగను
శబ్దమును స్పర్శయును వాయు సంగతములు
అగ్ని కీరెంటితో రూప మమరి యుండు
రస యుతముగ పైమూడు నీరమున కమరె
అవని కేర్పడె గంధాదులైదు వరుస

830. తే.గీ. అక్కతమ్మున పంచ గుణాన్వితమని
యెంచఁబడియెను పృథ్వి యో హిమగిరీంద్ర!
పంచ భూతాల కలయిక వలనగాదె
సృష్టి యేర్పడె మిగుల విచిత్ర గతిని

831. కంద. ఇదియె మహత్సూత్రంబని
పదిలమ్ముగ లింగ మనియు భావింపఁబడున్
సదమల గతి నిది యెప్పుడు
విదితము భూతాత్మకముగ విబుధ వరేణ్యా!

832. కం. కారణ లింగ శరీరము
లారయ కలవయ్య రెండు నాత్మకు, నందున్
కారణ మవ్యక్తంబని
పేరుకొనగలేదె మున్ను విస్తారముగన్





833. కం. పంచీ కరణ క్రియతో
నంచితముగ స్థూలదేహ మమరెను, నదియే
పంచాత్మక గుణయుతమై
కాంచఁబడె విరాట్ విశాల కాయస్ఫురణన్

834. తే.గీ. భూత పంచక సత్వాంశములను బొంది
జ్ఞాన పంచేంద్రియములు సంజాతమయ్యె
వాని కలయిక వలన న వారి తముగ
కలిగె నంతః కరణమది గట్టురాయ

835. తే.గీ. వృత్తిభేదమ్ము తోడ వేర్వేరఁ దోచి
నాల్గు విధముల నొప్పు నంతః కరణము
వాని రీతుల నెల్లను వరుస తోడ
తెలియఁ జెప్పెద వినుము సందియములేక

836. కం. సంకల్ప వికల్పమ్ముల
సంకలితమె మనసు, దాని సంశయముల తా
నుంకించి నిశ్చయమ్మున
పొంకమ్ముగ నిల్పు నదియె బుద్ధి యనబడున్

837. కం. అను సంధానాత్మక మే
యనఘా! చిత్తమ్మగును; నహంకృతి రూపం
బున దనరు నాత్మవృత్తియె
యెనయ నహంకార మనగ నెన్నుదురు బుధుల్

838. తే.గీ. భూత పంచక రాజ సోద్భూత మౌచు
రూపములు పొందె సృష్టి స్వరూపమందు
నైదు కర్మేంద్రియములు విఖ్యాతిఁదనర
సర్వకర్మల నొనరింప శక్తి గలిగి

839. వ. మఱియు ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానము
లనియెడి పంచ ప్రాణముల యునికి నెఱింగించెద వినుము

840. తే.గీ. హృదయమున ప్రాణ మది యెప్డు మెదలుచుండు
గుదము నం దపానము తగ కూడియుండు

నాభి కడ నుండునది సమానమ్ము తలప
కంఠ సీమ నుదానమ్ము కల దెఱుంగ
దేహ మంతటన్ వ్యానమ్ము తేజరిల్లు

841. ఆ.వె. ప్రాణ పంచకమ్ము, పరగ నింద్రియములు,
బుద్ధి, మనసు, చిత్త ములు దలంప
సూక్ష్మదేహ మనగ చూడంగ బడియెను
ఇదియె లింగ దేహ మెదఁ దలంప

842. సీ. సత్వాత్మకం బౌచు స్వాశ్రయ గుణయుత
మైన ప్రకృతి మాయ యనగ నొప్పు
ఈ మాయ యందె తా నీశ్వరుం డనయమ్ము
ప్రతిబింబరూప భావము వహించు
సర్వజ్ఞుడును జ్ఞాన సంపూర్ణుడును సర్వ
కర్తయు తానెయై క్రాలు చుండు
ఇంక నవిద్యయం దీశుండు ప్రతి బింబ
రూపుడై జీవాఖ్యఁ బ్రాపు గాంచె

గీ. ఇతడె దుఃఖాశ్రయుండౌచు నిజ్జగాన
తల్లడిలుచుండు సకలమ్ము తనవె యనుచు
సత్వ మాయాశ్రయుండును సర్వకర్త
యైన యీశ్వరునకు దుఃఖ మరయ లేదు

843. తే.గీ. వ్యష్టి రూపుడు జీవు డీ సృష్టియందు,
ఈశ్వరుడు సమష్టియై యెసగు చుండి
జీవుల ననుగ్రహింప కాంక్షించి సర్వ
భోగ నిలయమ్ముగా విశ్వమును సృజించు

844. చం. అతనికి సృష్టి నిర్వహణమందు మహాద్భుత శక్తి నిచ్చి నే
సతతము ప్రేరణ క్రియను సల్పుచు నుందును, సర్వలోక వి
స్తృతియది నాదు మాయకు నధీనముగా చరియించు చుండు, తత్
ప్రతి యొక టెద్దియేని గనరాదు జగమ్ముల నిశ్చయమ్ముగన్

845. కం. వ్యవహారంబున మాత్రమె
ప్రవచింతురు మాయయంచు పండితు లేనిన్





ధ్రువముగ మాయయు నేనున్
ద్వివిధ మ్మనరాదు తత్వదృష్టిఁదలంపన్

846. వ. అట్లే యథార్థ స్థితిలో మాయకును అవిద్యకును భేదములేదు

847. కం. జగతిని సృష్టించి యవల
నగణితముగ ప్రాణ యుక్త నై నే నందున్
సుగమముగ ప్రవేశించెద
నగరాజా! ప్రతి యుగముల నానాగతులన్

848. చం. ఘట గగనమ్ము తద్ఘట వికారము లెందునుఁ బొందనట్లు, లు
త్కట తర చండ భానుని ప్రకాశము లొయ్యన నుచ్చ నీచ సం
ఘటితములయ్యు తద్గత సుగంధ మలాదుల నంటనట్లు, ప్ర
స్ఫుటముగ నే నుపాధులను బొందియు నంటక యుందు వానికిన్

849. తే.గీ. ప్రబల బుద్ధ్యాది కర్తృత్వ భావములను
నావిగా నెంచి చూతు రజ్ఞాన వశత
నిద్ది మాయావిభేదమం చెఱుగ లేక;
జీవ పరమాత్మలకు భేద భావ గతులు
కల్పితము; లవి మాయా వికారములగు

850. తే.గీ. ఎట్టి భేద కల్పన కైన హేతు వరయ
నితరములు గావు మాయయే హిమ గిరీంద్ర!
సృష్టి యంతయు నాలోన నిమిడి యుండు
ఓతమును ప్రోతమును గూడి యుండు నట్లు

851. తే.గీ. బ్రహ్మవిష్ణు మహేశ్వరుల్ వారి సతులు
సూర్యచంద్రులు తారకల్ తిర్యగాదు
లన్నియును నాదు రూపమ్ము లఖిల జగతి
శ్వపచ తస్కర విప్ర భూపతులు నేనె
దుష్ట సత్కర్మలును నేనె, దురితములును
చరము నచరము నౌవస్తు జాల మేనె
పుం నపుంసక స్త్రీ రూపములను నేనె
నేను కానిది లేదెందు నిక్కముగను

852. ఆ.వె. భ్రాంతి వలన సర్పభావమ్ము త్రాటిలో
కాను పించు రీతి నేను సైత
మజ శివాది తనువు లట్లు భాసిల్లుదు
నన్ని వేళలందు నచల ముఖ్య!

853. తే.గీ. స్వర్ణ కల్పితమైన యాభరణ మెట్లు
స్వర్ణమున కన్యమని చెప్ప వలనుగాదొ
అట్లె నాయందు కల్పిత మైనజగము
వేరు గాదది నాకంటె విమల చరిత!

## జగన్మాత విరాడ్రూప ప్రదర్శన

854. చం. అమృత సమాన మై యలరు నాజగదంబ వచించు పల్కు లా
హిమ ధరణీ ధరుండు విని యెక్కుడు మోదముఁ బొంది దేవి! నీ
విమల యథార్థతత్వమును వింటిని, నన్ను ననుగ్రహించి వి
శ్వమయ భవత్ స్వరూపమును సమ్మతిఁజూపుము లోకపావనీ!

855. కం. అనినన్ సంతస మందిరి
యనిమిషు లెల్లరును వాని యభ్యర్థనకున్
జననియు ముదమంది యపుడ
తన విశ్వాకృతినిఁ జూపె తత్ర స్థలకున్

856. సీ. ఆకాశమే యుత్త మాంగమ్ముగా నిల్వ
నర్కామృతకిరణు లక్షులుగను
శ్రుతులు వాక్కులు గాగ శ్రోత్రముల్గా దిశల్
వాయువే ప్రాణమై వరలు చుండ
విశ్వమ్ము హృదయమై పృథ్వియే జఘనమై
నభమెల్ల నాభియై విభవ మంద
నక్షత్ర సంతతి వక్షస్థలమ్ముగా
బాహు రూపముల దిక్పాలు రమర

గీ. కంఠ మై మహర్లోకము గ్రాలు చుండ
ముఖముగా జనుర్లోకము మోదమెసగ
ఫాలమై తపో సత్యలోకాలు వెలుగ
అశ్వినులు ముకు పుటములై యలరు చుండ





857. తే.గీ. గంధమే ఘ్రాణమై యొప్పి కలిమిసేయ
రేయి పవలును ఱెప్పలై ప్రీతి గూర్ప
బ్రహ్మ లోకము భ్రుకుటియై రహిని మించ
జలము తాలువులై యింపు లొలుకుచుండ
రసము జిహ్వగా మారి పర్వములు సేయ
యముడు దంష్ట్రలు గా నొప్ప క్రమముతోడ
హాసమై నిల్వ మాయ తా నక్కజముగ
పైపెదవి రూపమున సిగ్గు పరిఢ విల్ల
క్రింది పెదవిగ లోభమ్ము కీలుకొనగ
కుక్షిగా సాగరమ్ములు కొమరు మిగుల
పర్వతము లస్థికలుగ రూపములు దాల్చ
నదులు నాడులై వెలయంగ పదిలముగను
వృక్షతతి కేశములుగా సమృద్ధి నొంద
అలకలై యొప్ప మేఘ మండలము లెల్ల
శీత కిరణుడు చేతమై చెలువు మెరయ
జ్ఞాన సంపదయై నిల్వ చక్ర ధరుడు
రుద్రు దంతః కరణమై నిరూఢి కెక్క
అశ్వ జాతులు శ్రోణీ ద్వయమ్ముగాగ
శ్రీమహాదేవి శోభన శ్రీ దలిర్ప
నచట ప్రత్యక్ష మయ్యె మహాద్భుతముగ

858. మ. అనల జ్వాల లెసంగు మోము, వివరంబౌనాస్యమున్, దీర్ఘమై
కొనలన్ జాచెడు జిహ్వయున్, పటపటల్ గూరించు దంతమ్ములున్,
ఘన దివ్యాయుధ పంక్తి నొప్పు కడుదీర్ఘంబైన హస్తంబులున్
దినరాట్ కోటి సమాన తేజయుతమౌ దివ్యాకృతిన్ జూచుచున్

859. కం. ఊహల కందని రూపం
బాహా! యిదియంచు దివిజు లాశ్చర్యమునన్
హాహా రవములు సల్పుచు
దేహమ్ములు మరచి మూర్ఛఁ దేలిరి యెదుటన్

860. చం. దివిజుల యా యవస్థఁగని దివ్య చతుర్విధ వేదముల్ వడిన్
గవియుచు వచ్చి మంత్ర పఠనంబులచే స్పృహగల్గఁ జేయ, బల్

జవమున లేచి యెల్లరును సంభ్రమ చిత్త వికంపి తాంగులై
ప్రవిమల భక్తి శీర్షములు వంచి నుతించి రిటుల్ మహేశ్వరిన్

861. మ. క్షమియింపన్ దగు నమ్మ మమ్ము జననీ! సర్వేశ్వరీ! నీదు వి
శ్వమయంబై వెలుగొందు రూపమును గాంచన్ భీతిమై చిత్తముల్
శమముల్ దప్పె, నినున్ నుతింప వలనౌ సామర్థ్యముల్ మాకు పూ
జ్యములమ్మా! భవదీయ విక్రమము మాకజ్ఞేయ మూహింపగన్

862. చం. తనయుల మమ్మ! మీకు, తమ తత్త్వమెఱుంగగ మాకుసాధ్యమే?
యిన, శశి, పావకుల్, గ్రహము, లీ భువనంబులు, సస్యసంపదల్
మనుజులు, దానవుల్, దివిజ మండలి, సర్వచరా చరంబు లో
జనని! జనించె నీవలన, చాలవు వాక్కులు నిన్ గణింపగన్

863. మ. భువనేశీ! భవదద్భుతంబయిన యీ పూర్ణస్వరూపంబు, మే
మవలోకింపగఁ జాలమింక, నుప సంహారమ్ము గావించి క
న్గవలన్ దొల్లిటి మీ స్వరూపమును సందర్శింపగాఁ జేయుమా!
భువనంబుల్ వడకన్ దొడంగె నని దివ్యుల్ ప్రార్థనల్ సల్పగన్

864. వ. ఆ జగన్మాత వారి మొరలాలించి

865. తే.గీ. విశ్వరూపమ్ము నప్పుడ విడచి తనదు
సౌమ్య రూపమ్ముతో నిల్చె సమ్మతమున
మంద హాసప్రదీప్త పూర్ణేందు ముఖినిఁ
గాంచి హిమవంతుడును సురల్ గలత లుడిగి
శాంతి వహియించి సన్నుతుల్ సలిపి రెలమి

866. చం. అపుడు ప్రసన్న వాక్పణితి నంబ సుపర్వులఁగాంచి పల్కె నో
వ్యపగత దోషులార! పలు యజ్ఞములన్ జప దాన కర్మలన్
దపముల వేద శాస్త్ర పఠనంబుల సల్పియునైన, మత్కృపా
ప్రపఁగనలేక కాంచగ తరంబె మదీయ విరాట్ స్వరూపమున్

## దేవి యొసర్చిన తత్త్వబోధ

867. చం. అచల వరేణ్య! విన్ము పరమాత్మయె నిక్క ముపాధి యుక్తుడై
విచలిత జీవ భావమున పెక్కులు కర్మల నాచరించుచున్





ప్రచురిత రీతి కర్త నను భావమునన్ సుఖదుఃఖ పూర్ణుడై
అచర చరాది జన్మముల నందుచునుండు ననంత రీతులన్

868. ఉ. అంతము లేని జన్మలకు నజ్ఞతయే కతమయ్య! దాననే
యింతలు నింతలై యెగయు నీప్సిత పంక్తులఁ దీర్పనెంచి, య
శ్రాంతము పెక్కు కర్మముల సల్పుచు మిక్కిలి యారటమ్ములన్
శాంతి విహీనులౌచు పలు జన్మము లెత్తుచు నుందు రజ్ఞులై

869. తే.గీ. ఎల్ల కోర్కెల కజ్ఞాన మిక్క తలప
కాన నజ్ఞానమును వీడి క్రమముతోడ
జ్ఞాన మార్గాన నిష్కామ కర్మ లొనర
శాస్త్ర విధి నాచరింప మోక్షమ్ముగలుగు

870. తే.గీ. శమము దమమును నోర్పును సాత్వికతయుఁ
గలుగు పర్యంతమిట్లు సత్కర్మ లెల్ల
సలుప వలయును నావల సన్యసించి
బ్రహ్మనిష్ఠా గరిష్ఠుడౌ పరమ గురుని
చేరి సేవించి యేకాగ్ర చిత్తమునను
ఉపనిషత్ జ్ఞాన మున్ బొంది యున్నతమగు
పరమ పదమును బొందుట భావ్యమయ్య!

871. తే.గీ. పంచ కోశాంత రస్థమౌ బ్రహ్మతత్త్వ
మజము, నిత్యము, శాశ్వత మౌట, దాని
నేతి నేతి విచారణ నియతి సల్పి
పంచకోశ నిర్మూలన పథముఁ బట్టి
యెఱుగ వలయును జన్మ రాహిత్యమునకు

872. తే.గీ. ఆత్మ రథికుడు, దేహమే స్యందనమ్ము
బుద్ధి సారథి, కళ్ళెమై పొలుచు మనసు,
ఇంద్రియము లెల్ల గుఱ్ఱము లెరుగు మయ్య!
ఇంద్రియమనః ప్రయుక్తాత్మ యెంచిచూడ
భోక్త యనఁబడు జీవ సంబోధనమున

873. తే.గీ. జ్ఞాన సారథి మనసను కళ్ళెముఁగొని
ఇంద్రియాశ్వమ్ములను బట్టి యెఱుకగలిగి

దేహ మనియెడు రథమునఁ దిన్ననైన
మార్గమున సంచరింప గమ్యమును జేరు

## యోగబోధ

874. కం. ననుఁ దెలియ నిధి ధ్యాసా
ద్యను రూపంబైన యోగమను నొక మార్గం
బును గలదు, దానిఁదెల్పెద
వినుమో ధరణీ ధరేంద్ర విశ్వాసమునన్

875. కం. దేవీ ప్రణవాక్షరమని
భావింపంబడెడి త్రివిధ వర్ణాన్వితమున్
భావించి మదిని నిల్పుచు
రేవగలున్ దలప వలయు 'హ్రీం'కారమ్మున్

876. తే.గీ. స్థూల దేహమది'హ' కార సూచకమ్ము
సూక్ష్మ తనువది రేఫ విస్ఫురణఁగాంచె
కారణశరీర 'ఈ'కార మైరహించె
త్ర్యక్షరాన్విత హ్రీంకార మమరె నిట్లు

877. తే.గీ. వ్యష్టి దేహమ్మువోలె సమష్టియందు
నక్షరత్రితయము నన్వయమ్మొనర్చి
రెంటి కైక్యత మదిని తర్కించుకొనుచు
ధ్యాన మొనరింప వలయు నిత్యమ్ము భక్తి

878. తే.గీ. విషయ వాంఛల విడచి వివిక్త భూమిఁ
బ్రాణమును నపానమ్మును పరగనొకట
నిలిపి నిర్దోషుడై భక్తి కలితు డగుచు
స్థిర సుఖాసనాసీనుడై చిత్తమందు
పరమ'హ్రీం'ం కార మంత్రమున్ బట్టి నియతి
ధ్యాన మొనరింప వలయు నిత్యానురక్తి

879. తేగీ. 'యోగ'మనునది దవ్వుల నుండదయ్య!
జీవ పరమాత్మల సమైక్య సిద్ధి యదియె





తెలుప బడె యోగ మనుచు తద్విదుల వలన
దీని కార్గురు కలరు విద్విషులు తలప

880. మ. వరుసన్ కామము, క్రోధమున్, మదము లోభంబున్, విమోహంబు, మ
త్సర మీ యారును యోగ సాధనకు నిత్యంబడ్డమౌగాన, నీ
యరిషడ్వర్గము నుక్కడంచి కడు ధీరాత్ముల్ ప్రసిద్ధంబుగన్
పరమాత్మస్థితిఁబొందు చుందు రచలప్రజ్ఞా విశేషజ్ఞులై

881. సీ. యమ నియ మాసనా ద్యంగము లెనిమిది
చెప్పఁబడియె యోగ సిద్ధి కొఱకు
అందహింసయు 'సత్య' మస్తేయమును, బ్రహ్మ
చర్యము, దయా, ఋజు చరితములును
క్షమయు మితాహార శౌచమ్ములను పది
యమమున కంగమ్ము లౌచుఁ బరగు
తపము, సంతోషమ్ము, దాన, మాస్తిక్యము,
శ్రవణమ్ము, దేవ పూజనము, సిగ్గు

గీ. జపము హోమమ్ము దాన విస్తరణ మనగ
పదియు నియ మాంగములనఁ బ్రణుతికెక్కె
స్వస్తికమ్మును, వీరమ్ము, వజ్ర మనగ
పద్మ, భద్రమ్ము, లన నొప్పి పంచసంఖ్య
నాసనము లవి విఖ్యాతి నందె జగతి

882. వ.పాదద్వయమును వామ దక్షిణోరువులన్ జేర్చి కూర్చుండి దక్షిణపాదాం గుష్ఠమును వామ హస్తంబు తోడను, వామ పాదాంగుష్ఠమును దక్షిణ హస్తము తోడను, పట్టుకొని నిటారుగా కూర్చొనుట యే పద్మాసనము. ఊరువులకు, పిక్కలకు మధ్య పాద తలంబుల నుంచి చక్కగా కూరుచుండ నది స్వస్తికాసనము. పిఱుదుల క్రింద పాదములన్ జేర్చి చేతులను మోకాళ్ళపై ఆన్చి నిటారుగా కూర్చుండుట భద్రాసన మనంబడు. పాదయుగమ్ము నూరుద్వంద్వమునన్ జేర్చి మోకాళ్ళపై చేతుల నాన్చి నడుమును నిలిపి కూర్చుండిన నది వజ్రాసన మనం బడును. ఒక పాదతలము నెదుటి తొడక్రిందకు మఱియొక పాదతలము నెదుటి తొడమీదకు చేర్చి శరీరమును నిలిపి కూర్చుండిన నది వీరాసన మనంబడును.

883. కం. పై యాసనముల యందెది
హాయిన్ గలిగించు, నట్టి యాసనమున ప్రా

ణాయామ మొనర్చుచు యో
గాయత్తుండైన సిద్ధి నందు నతండే

884. తే.గీ. ఇడయు పింగళయన ముక్కు కెడమ కుడుల
నాడులుండును రెండు రంధ్రముల యందు
పదియునారు లిప్తల కాల పరిధిలోన
నెడమ రంధ్రమ్ముతో గాలి నిట్టె పీల్చి
అరువదియు నాల్గు మాత్రల యవధి దాని
శ్వాస కోశమ్మునన్ నిల్పి శాంత గతిని
ముప్పదియు రెండు మాత్రలఁ బోల్చుకొనుచు
పింగళానాడి మార్గాన విడువ వలయు

885. శా. గాలిన్ బీల్చుట పూరకంబనియు చక్కన్ లోపలన్ నిల్పి ని
ర్లోలాత్మస్థితి నుంచ కుంభకమునాన్, లోనున్న నవ్వాయువున్
వ్యాలోలింపక నిశ్వసించుటది తల్పన్ రేచకంబంచు ని
ట్లోలిన్ బల్కుదు రయ్య విజ్ఞు లెపుడున్ యోగాను సంధానులై

886. కం. ఒకపరి నీరీతి సలుపు
టొక ప్రాణాయామ మనగ నొప్పును, పలుమా
ర్లకలంక స్థితి సల్పిన
సుకరంబగు యోగసిద్ధి సుమ్మచలేంద్రా!

887. తే.గీ. విషయ సుఖముల వెంట పర్విడుచునున్న
ఇంద్రి యోద్వేగమును మరలించి దైవ
మందు తిరముగా నిల్పుటయ్యదియె జగతి
ప్రగతి కెక్కె 'ప్రత్యాహార' పద్ధతి యన

888. వ. మరియు ప్రాణ వాయువును చక్కగా శరీరావయవములయందు
నిలుపుటను 'ధారణ' యనియు, ఏకాగ్ర చిత్తంతో ఇష్టదైవమును
ధ్యానించుటయే ధ్యానమని, జీవబ్రహ్మైక్యభావంతో
సకల భూతములయందును సమత్వమును కలిగి యుండుటయే
'సమాధి' యని బుధ వరేణ్యులు వల్కుదురు

889. కం. జీవబ్రహ్మైక్య స్థితి
భావింపం బడుచు భూత పంచకయుతమై





పావక దినకర శశి తే
జావహ దేహమ్ము 'విశ్వ' మందురు విబుధుల్

890. ఉ. ముప్పది మూడు కోట్లపయిఁబొల్పుగ నేబది యైదులక్షలై
చొప్పడి యుండు నాడు లతి సూక్ష్మతరంబుగ దేహమందు, నం
దొప్పును ముఖ్యమై పది మహోజ్జ్వల శక్తి యుతంబు లౌచు, నం
దొప్పుగ మూడు నాడు లతి యున్నతముల్ వివరించి చూడగన్

891. కం. వెన్నెముక కెడమ వైపున
నున్నది 'ఇడ' యనెడు నాడి యుడుపతి కళగా
నెన్నఁబడె యమృత తత్వో
త్పన్నంబై శక్తిరూప ధారిణి యగుచున్

892. తే.గీ. వెన్ను పూసకు కుడివైపు 'పింగళ'యన
పురుష రూపమ్ముతో నొప్పు నరుణ తత్వ
మౌచు నాడి యొక్కటి, వాని మధ్యమందు
సర్వతేజో మయంబనఁబ్ర శస్తిఁగన్న
నాడిగలదు 'సుషుమ్న' యనంగ నొప్పి

893. వ. అగ్ని తత్వంబై విరాజిల్లు నాసుషుమ్నానాడి మధ్య భాగంబున ఇచ్ఛా, జ్ఞాన, క్రియా త్మకమై కోటి సూర్యసమభాస మానంబై స్వయంభూలింగము విరా జిల్లుచుండు. తదుపరి భాగంబున బిందు నాదోపేత శివాత్మకమై మాయా బీజము, దానిపై శిఖాకారముగా రక్తవర్ణముతో కుండలినీ శక్తియు భాసించు చుండును. దాని వెలుపల కనక వర్ణంబున చతుర్దళములతో నొక పద్మము కలదు. ఆపద్మ దళంబులపై వ-శ-ష-స అను నక్షరము లుండును. దానిపై మరియొక పద్మము దళ షట్కముతో వజ్ర ప్రభా విరాజ మానంబై అగ్నిఁబోలియుండు. బ-భ-మ-య-ర-ల అను నక్షరము లారేకులపై నుండును. దీనినే మూలాధారమని, స్వాధిష్ఠానమని వ్యవహరింతురు 'స్వ' అనగా పరం. పరముడికి అధిష్ఠానం గాన దీనిని స్వాధిష్ఠానమని పిల్తురు. దీనిపై నాభి ప్రదేశమున మణి పూరక చక్రం విద్యుల్లతావృత మేఘంలా కాంతులు విరజిమ్ము చుండును. మణిమయకాంతులచే నొప్పు చుండుటచేనిది 'మణిపద్మం' అనియు పిలువఁబడును. దీని దశదళమ్ములపైనను డ-ఢ-ణ-త.థ-ద-న-ప-ఫ అను నక్షరములుండును. దీని అధిష్ఠాత విష్ణువు. మణి పూరక చక్రంపై అనాహత చక్రం ఉదయ భానుని కాంతులతో ద్వాదశ దళ యుతంబై విరాజిల్లు చుండును. దీని రేకులపై 'క' కారం మొదలు 'ఠ'కారం వరకు అక్షరములుండును.

ఇది శబ్ద బ్రహ్మమయం. దీని మధ్యభాగంబున కోటి సూర్యప్రభలతో బాణ లింగ ముండును. ఇది ఆనంద సదనం. పురుషాధిష్ఠితం. అనాహత చక్రమునకు పైభాగమున షోడశ దళ యుతంబగు విశుద్ధ చక్రముకలదు. దీని రేకులపై పదునారు అచ్చులు వరుసగా నుండును ధూమ్ర వర్ణం కలిగి హంసాలోకనం తోనిది జీవునికి విశుద్ధిని కలిగించును. దీనిపైన ఆత్మాధిష్ఠతమై ఆజ్ఞాచక్రం ద్విపత్ర పద్మమై విరాజిల్లు చుండును. దీని రెండు రేకులపై 'హ' కార' 'క్ష' కారము లుండును మనోహరంబైన ఈ పద్మంపై భాగమున కైలాస చక్రం, దానిపై రోధినీ చక్రము ఉండును. ఇది దాటిన పిదప సహస్రారయుతమైన 'బిందు' స్థాన ముండును

894. సీ. గిరివర్య! ముందుగా స్థిరమైన మనసును
పూరక యోగ సంచారణమున
నాధార చక్రమం దట్టె సంయోజించి
గుద మేఢ్రముల మధ్య నిదుర వోవు
వ్యాళాకృతిని నున్న మూల శక్తిని లేపి
షట్చక్రముల వెంట జరుగఁబంపి
బిందు చక్రమ్మునఁ బొందిక గల్గించి
శంభునితో శక్తి సక్తమైన

గీ. యట్లు భావించి ధ్యానమ్ము నచల మతిని
సలుప స్రవియించు నమృత రసమ్ము నంత
శక్తిచేఁ దృప్తిఁ ద్రావంగఁ జేసి యవల
చక్ర షట్కాధి దేవతా సంఘ మునకు
తర్పణము చేయ వలయు ముదమ్ముతోడ

895. తే.గీ. అవల నాశక్తి నామార్గమందె దించి
నిలుప వలయును పూర్వపు నెలవు నందె
నిత్య మీరితి నిశ్చల నియతి తోడ
నభ్య సించిన యోగ పూర్ణాత్ముడౌను

896. కం. జరయును మరణము దుఃఖము
దరిఁజేరవు, సకల మంత్ర తంత్రము లెల్లన్
వరుసన సిద్ధించును నా
పరమంబౌ యోగమార్గ పరునకు నెపుడున్

897. కం. నాకుఁగల గుణములన్నియు
నాకున్ గల శక్తులెల్ల నానాటను న
వ్యాకృతి చేకుఱు చుండును
శ్రీకరమై సాధకునకు శీత నగేంద్రా!

898. తే.గీ. అవ్యయంబును దేశకాలాది రహిత
మైన పరమాత్మ తత్వంబు నందు యోగి
చిత్తమును నిల్పి తన్మయ స్థితిని బొందు.
మలిన చేతస్కునకుఁబొంద వలను గాదు

899. కం. నా మధుర రూప మెల్లపు
దేమరక మనంబునందు నిచ్చనిలిపి మత్
శ్రీమంతంబగు మంత్రము
నేమంబున సలుప వలయు నిత్యము జపమున్

900. తే.గీ. ప్రణవ మది ధనువనుచు భావనము చేసి
నిర్మలాత్మను శరముగా నిలిపి నియతి
బ్రహ్మపదలక్ష్యసాధనా పరుడునైన
యోగియే మోక్షసంసిద్ధి నొందఁగలడు

901. చం. నిజమున కేను పృథ్విఁగల నిర్మల తీర్థములందు లేను, సత్
భజనల నొప్పు క్షేత్రముల పట్టున నైన వసింప; నెవ్వడేన్
విజిత మనఃప్రవృత్తుడయి వేడ్క ననున్ మది నిల్పి నిత్యమున్
యజనమొనర్ప, వాని హృదయంబున నుండెద నెల్లకాలమున్

## భక్తి మార్గము

902. చం. సులభము భక్తి మార్గమది చువ్వె మనుష్యులకెల్ల, నందులో
కలుగవు కష్టముల్, మరియు కర్మము, జ్ఞానము, భక్తి యంచు మున్
దెలిపిరి ముక్తి మార్గములఁదెల్లముగా పరమర్షు, లందు ని
ష్కలుషపు భక్తి మార్గము సుఖంబును, నాచరణీయ మేరికేన్

903. వ. భక్తియు గుణభేదములంబట్టి మూడు విధములుగా చెప్ప బడియె

904. సీ. పరపీడ నార్థమై భావించి యొనరించు
దాంభిక మౌ భక్తి తామసమ్ము
స్వార్థమ్ము కొఱకునై స్వపర భేదమ్మునన్
సలిపెడు భక్తి రాజసము తలప

ఈశ్వరార్పణ బుద్ధి నితర చింతన లేక
కర్తవ్యదృష్టి నిష్కపట వృత్తిఁ
బాప పంకిలమును బాపు కొనుటకునై
సాగించు దృఢ భక్తి సాత్వికమ్ము

గీ. సాత్వికంబైన, నందును స్వపర భావ
బుద్ధి యుండును, నైనను పోల్చిచూడ
నిదియె శ్రేష్ఠము తక్కు రెండింటి కంటె
పరమ భక్తికి నవల సోపాన మదియె

905. వ. ఇక పరమ భక్తి యెట్టిదన

906. కం. నిరతము నా గుణగణముల
పరమంబగు ప్రీతి వినుచు భవ్యములౌ మత్
వర నామస్మరణముచే
తిరముగ గడుపంగ వలయు దినముల నెల్లన్

907. కం. కారణ మొకింత లేకయు
భారమ్మని యెంచఁబోక భావమునందున్
కోరక ముక్తిని సైతము
సారమతిన్ సలుప పరమ సాత్విక మదియౌ

908. సీ. సకల జీవుల యందు సమభావమును బొంది
అన్నింట నారూప మరయఁగల్గి
తనపట్ల తనకెంత యనురాగ ముండునో
అట్టు లే నాపట్ల నమరఁజేసి
చైతన్య సామాన్య సరణి నాలోకించి
తనకు నాకును న భేదమును గనుచు
దేవ్యాలయమ్ముల కవ్యాజగతి నేగి
భక్తుల సాంగత్యరక్తి నొప్పి

గీ. ద్రోహ చింతన లేక నిరీహు డగుచు
మంత్ర తంత్రాధ్యయన పరతంత్ర మతిని
కామమాదిగ శత్రు వర్గమును ద్రుంచి
నన్నుఁ గొల్చుటె పరభక్తి నగకులేంద్ర!





909. మ. పరభక్తి స్థితి నున్నతిన్ బడయు తద్భక్తుండె విజ్ఞాన సం
భరితాత్ముండయి ముక్తుడౌ; నతనికిన్ బ్రాప్తించు బ్రహ్మత్వమున్,
పరిశీలింపగ జ్ఞాన మొక్కటియె కైవల్యమ్ముఁ జేకూర్చి సు
స్థిర సౌఖ్యమ్మును నింపు మార్గ, మిక యోచింపంగ లే దన్యమున్

910. శా. వైరాగ్యమ్మును గల్గియుండియును దివ్యజ్ఞానమున్ బొందదేన్
జేరన్ బోవడు ముక్తిధామ, మటుపై శ్రీమంతులౌ వారి సౌ
ఖ్యారామంబున జన్మమెత్తి కడు యోగ్యంబౌ ననుష్ఠాన వి
స్తారుండై యట జ్ఞానమున్ బడసి యంతన్ బొందుఁబో మోక్షమున్

## అతిముఖ్య దేవీ స్థానాలు

911. చం. హిమగిరి నాథ! యీ జగతి నెల్లెడ సర్వచరాచరంబులన్
సమముగ నుందు నేను నిముసంబును వీడక, కాని యందులో
నమిత విశేషమౌ స్థలము లచ్చట నచ్చట నున్నవాని నో
యమల చరిత్ర! తెల్పెద ననన్యమతిన్ వినుమయ్య కొన్నిటిన్

912. వ. లక్ష్మీ దేవినై కోలాపురమ్మునను, మాతృ పట్టణమున రేణుక గను తులజాపురంబు నన్ హింగుళా దేవి గను, సప్త శృంగంబున జ్వాలా ముఖిగను, భక్తులకు నే దర్శన మిచ్చు చుందును. అట్లే శాకంభరి – భ్రమరీ – శ్రీరక్తదంతికా–దుర్గా స్థానములు వింధ్యాచల నివాసి నీ స్థానము, అన్నపూర్ణా మహా స్థానము, కాంచీపురము; భీమాదేవి, విమలాదేవి, శ్రీచంద్రలా కౌశికి స్థానములు, నీలాంబరీ దేవీ నిలయమైన నీల పర్వత శిఖరము, జాంబు నదేశ్వరీ విలసితమైన శ్రీనగరము, గుహ్యకాళీ నివాసం బగు నేపాలము, మీనాక్షీ ఆలయమైన చిదంబరము, సుందరీ సమధిష్ఠితమైన వేదారణ్యము, పరశక్తి ప్రతిష్ఠితమగు ఏకాంబరము, మదాలసా యోగీశ్వరీ స్థానములు, చీన దేశంబున నీల సరస్వతీ స్థానము, వైద్య నాథంబున భగళాదేవినిలయము, భువనేశ్వరీ నిలయమైన మణిద్వీపము, శ్రీమత్త్రిపురభైరవీ విరాజితమైన కామక్షేత్ర మండలము, ఇవి యన్నియు నా నివాసస్థానములు ఇందు కామాఖ్య యోని మండలము ఉత్తమోత్తమమైన దేవీస్థానము

అట్లే గాయత్రీ నిలయమైన శ్రీపుష్కరము, చండికాదేవికి ఆ స్థానంబైన అమరేశము, పుష్కరేక్షణీ నివాసంబైన ప్రభాసము, లింగధారిణీ నిలయంబగు నైమి శారణ్యము, పుష్కరాక్షంబునంగల పురుహూతా మందిరము, రతి నిలయంబైన ఆషాఢి, దండినీ నిలయంబగు చండ ముండీ మహాస్థానము, భూతి నిలయంబైన భారభూతి, నకు లేశ్వరీ నివాసంబైన నకులేశ్వరము, చంద్రికా నిలయంబగు హరిశ్చంద్రము, శాంకరీ విభూషితంబగు

శ్రీగిరి, శర్వాణీ నిలయంబగు మధ్యప్రదేశము, మార్గదాయినీ స్థానంబగు కేదారము, భైరవీ నిలయంబగు భైరవ స్థానము, త్రిశూలాలయ ప్రదేశంబగు జప్యేశ్వరము, సూక్ష్మాదేవీ నిలయంబగు ఆమ్రాత కేశ్వరము, శాంకరీ నిలయంబైన మహా కాలము, మంగళాలయంబైన గయ, స్థాణు ప్రియా రూపిణీ నివాసంబైన కురుక్షేత్రము, స్వాయంభువీ స్థానంబగు నాకులక్షేత్రము, ఉగ్రామందిరంబగు కనఖలము, విశ్వేశీ ఆలయమైన విమలేశ్వరము, మహానందాధి వాసి తంబగు అట్ట హాసము, మహాంతకాలయంబైన మహేంద్రము, భీమేశ్వరీ నిలయమైన భీమ క్షేత్రము, భవానీ, శాంకరీ, రుద్రాణీ నామ విరాజిత కాస్థానంబగు అర్థ కోటికము, విశాలాక్షీ నివాసంబైన అవిముక్తము, మహా భాగా నిధానంబైన మహాలయము, భద్ర కర్ణీ నివాసంబగు గోకర్ణము, భద్రాస్యకు నిలయమైన భద్ర కర్ణకము, ఉత్పలాక్షీ మందిరంబగు సువర్ణాక్షము, స్థాణ్వీశా నిలయంబగు స్థాణుక్షేత్రము కమలకు నాలయంబగు కమలాలయము, ప్రచండా మందిరంబగు ఛగలాండకము, త్రిసంధ్యా నివాసంబైన కురండలము, ముకుటేశ్వరీ నిలయమైన మాకోటము, శాండకీ స్థానంబగు మండలేశము, కాళీ నివాసంబగు కాలంజరము, ధ్వని మందిరంబగు శంకుకర్ణము, స్థూలాస్యానివాసంబగు స్థూల కేశ్వరము, హృల్లేఖా రూపిణీ విహార స్థలంబగు జ్ఞాన హృదయాంభోజము, నా కత్యంత ప్రీతి పాత్రములైన దివ్యక్షేత్రములు. ఆయా రూపంబుల నే నాయా క్షేత్రములలో వెలసి యుందును

913. శా. ఆయాక్షేత్ర చరిత్రలన్ మఱియు మాహాత్మ్యంబులన్ బ్రీతితో
నాయా విజ్ఞులు తెల్పగావిని మహాహ్లాదంబుతోనేగి శ్ర
ద్ధా యుక్తస్థితి నర్చనల్ సలిపినన్ దథ్యంబు సంసార దు
ర్జేయంబై చెలరేగు బంధముల నిర్జింపంగ సాధ్యంబగున్

914. కం. ఇలఁగల మత్ క్షేత్రములన్
కలయన్ దిరుగంగశక్తి కలుగని యెడ ని
ర్మలమతి కాశికిఁజని న
న్నలయక నర్చింప నబ్బు నఖిల ఫలంబుల్

915. శా. ప్రాతర్వేళల లేచి భక్తులు ననున్ భావించి మన్నామముల్
చేతో మోద మెలర్పఁ బల్కినను, నిశ్శ్రేయస్కర క్షేత్ర సం
ఘాతంబున్ మదిలోఁ దలంచినను నిక్కం బెల్ల పాపంబులున్
వాతోద్ధూత తృణంబు భంగి కడు దవ్వైయేగు నెవ్వారికేన్

916. చం. వినుమిక పర్వతేంద్ర! వినిపించెద కొన్ని వ్రతంబులన్, మదిన్
ఘనతర భక్తి నెవ్వడతి గౌరవ మొప్పగ తద్వ్రతంబు లొ
య్యన నొనరించు చుండు నత దంతమునన్ గడు శాంత చిత్తుడై
జననము లేని మద్విమల సత్పద మందు కొనున్ ధ్రువంబుగన్

917. వ. అనంత తృతీయము, రస కల్యాణి ఆర్ద్రానందకరము, శుక్ర
వార వ్రతము, సోమవార వ్రతము, కృష్ణ చతుర్ద శీవ్రతము,
ప్రదోష వ్రతము లనంబడు వ్రతము లతి ముఖ్యములైనవి

918. చం. శివుడు ప్రదోషకాలమున చెల్వుగ పార్వతిఁగూడి నాట్యమున్
దివిజులు మెచ్చఁజేయు నతి తేజ మెలర్పగ, నట్టివేళలన్
బ్రవిమల భక్తి మద్వ్రతము పాయక సల్పిన యట్టి వారికిన్
వివిధ ఫలమ్ము లబ్బు నతి విస్తృత కాలము నిశ్చయంబుగన్

919. తే.గీ. పగటి వేళల నుప వాస వ్రతముఁబూని
సోమ వారంపు వ్రతము విశుద్ధ మతిని
చేయుటయ్యది మిక్కిలి శ్రేష్ఠమయ్య
ప్రీతి కరమది నాకు గిరి ప్రశస్త!

920. తే.గీ. ఉత్సవమ్ములు పూజలు నున్న వెన్నొ
భక్తి నేటేట వాని నవారితముగ
జరుపు వారికి నేనిత్తు సౌఖ్యములను
చిత్తశాంతిని మఱియు నిశ్రేయసమును

921. సీ. పూజా విధానముల్ భువి రెండు రకములు
బాహ్యాంతరములనఁ బరగి; యందు
బాహ్యపూజయు రెండు పద్ధతులైయుండు
వైదిక తాంత్రిక భాగములుగ
వేద పారగు లైన విప్రులు వైదిక
పూజ లొనర్పంగఁ బోలు నయ్య!
వేదపఠనము లేని వివిధ జాతుల కెల్ల
తాంత్రిక పూజలే ధర్మమగును

గీ. శాస్త్ర విధులను వీడి స్వేచ్ఛా యుతముగ
పూజ లొనరింప పతనమ్ముఁ బొందు నరుడు
శాస్త్ర పద్ధతి మీరక సల్పెనేని
సత్ఫలంబులఁ బొందు నిశ్చయము సుమ్ము

922\. కం. జ్ఞాన యుతంబగు భక్తికి
నే నతి సులభముగ చిక్కు దెల్లర కెపుడున్,
జ్ఞాన రహిత కర్మలవియు
వేనకు వేలైనఁగావు ప్రియములు నాకున్

923\. కం. శ్రుతులును స్మృతులునుఁదెలిపిన
గతులే ధర్మములు గాని గ్రంథము లెన్నో
యితరములు తెలిపి నట్టివి
వ్యతిరేకములౌను ధర్మ వర్తనములకున్

924\. కం. ధర్మమున కలుగు భక్తియె
నిర్మలమై యొప్పుఁ దాన నిర్వాణ పదం
బర్మిలి వరియించును మఱి
ధర్మరహిత మది పతన పథంబగు తలపన్

925\. మ. సకలజ్ఞత్వము శక్తి మంతమగు నస్మత్తత్వమందుండి యీ
సకలామ్నాయము లుద్భవించినవి విశ్వంబందు; నాయందు లే
దిక యజ్ఞాన, మదట్టు లౌట మఱి యింకేరీతిగా వేదముల్
ప్రకటింపంబడు నప్రమాణములనన్ బ్రజ్ఞాన సంభూతముల్

926\. ఉ. కావున వేదధర్మముల కట్టడికిన్ దలలొగ్గి కర్మముల్
భావన చేసి చేయుట శుభంబగుఁ గావున పెక్కు తంత్రశా
స్త్రావిల ధర్మసంగతు లనార్య జనోక్తము లౌట వాని, ని
ర్జీవములన్ బ్రమాణములు సేయుట కూడదు వైదిక క్రియన్

927\. తే.గీ. వేద ధర్మమ్మునకు హాని విస్తరిలిన
యుగ యుగమ్ముల తద్ధర్మ ముద్ధరింప
నవత రించెద నేను తదను గుణమగు
రూపములఁదాల్చి దుష్టుల రూపుమాప

## తామసాగమములు

928\. ఉ. పెక్కులు వేదసంస్కృతికి భిన్నములై కలవయ్య శాస్త్రముల్,
నిక్కము తామసంబులవి నింద్యములేయగు, నీలకంఠుడే
యొక్క ప్రయోజనమ్ముమది నూహ యొనర్చి సృజించె వాని, నా
చక్కికిఁద్రిప్పి మోహ పరిసంభ్రమ చిత్తులఁజేయఁగొందరన్

929\. తే.గీ. వామ కాపాల కౌలక భైరవాది
పద్ధతులు తామసమ్ములు పర్వతేంద్ర!
వేద ధర్మవిరుద్ధముల్ పెక్కుఁగలవు
ద్విజుల కర్హమ్ము గావవి స్వీకరింప

930\. మ. మును దక్షాదుల శాపవాక్యముల విప్రుల్ వేదమార్గమ్ములన్
గొన కున్నందున వారి యుద్ధరణకై కూర్మిన్ మహాదేవు డా
య్యన సృష్టించెను తామసంబులగు నయ్యామ్నాయ సందోహమున్;
గననౌ నందును కొన్ని వేద విహితాంగంబుల్ విచారించినన్

931\. సీ. ఈషణముల వీడి యెల్ల భూతములందు
దయఁగల్గి భక్తి సంధానుడగుచు
త్రికరణ శుద్ధిగా దివ్య తీర్థ క్షేత్ర
దర్శన మొనరించి దర్ప మడచి
నన్ను ధ్యానించుచు నా గాథల వినుచు
భక్తి యోగమున సత్పథముఁగనుచు
వేదధర్మమ్ముల వీడక నిత్యమ్ము
సంతృప్తుడౌచు ప్రశాంతిఁ బొంది

గీ. జ్ఞాన సూర్యప్రకాశ శస్త్రమ్ముతోడ
ఖండనము చేసి యజ్ఞాన కాననమును
పరమ పదమును బొందంగ వలయు నరుడు
శ్రేష్ఠ తమమగు పూజా విశేష మిదెయె

932\. కం. అంతర పూజకు నర్హత
సంతరిలెదు దన్క సగుణ సంబంధమ్మున్
స్వాంతము మెచ్చిన రూపున
నెంతయుఁబూజింప వలయు నీశ్వరిని విధిన్

## బాహ్య పూజ

933\. సీ. తెలవారుటకు మున్నె దేవీస్మరణ తోడ
నిదుర లేచిన మీద నిర్మల మతి

నమల సహస్రార కమలంబునన్ గల
శ్రీగురు మూర్తిని చిద్విలాసు
ధ్యానించి యటుపైన వ్యాళాకృతిని నున్న
కుండలినీ శక్తిc గొల్చి యంత
శౌచాది కమ్ముల సల్పి యగ్ని రగిల్చి
హోమ కార్యము కడు నోర్మిసలిపి

గీ. భూత శుద్ధి యొనర్చి శ్రీమాత నచట
నిలిపి న్యాసమ్ముcగావించి నిత్య పూజ
లాగమోక్తవిధాన నిర్వ్యాజ భక్తి
సలుప వలయును మనసు నిశ్చలముcజేసి

934. ఉ. పూజయు హోమ కార్యమును పూర్ణముగా నొనరించి యంత స
ద్భాజనులైన విప్రుల సువాసినులన్ దగ బ్రహ్మచారులన్
భోజన దక్షిణాదుల ప్రమోదముcగల్గcజేసి సంతసో
త్తేజ సుగీత నృత్యములcc దృప్తిని నా కొనగూర్పగా వలెన్

935. కం. నిరతం బవ్విధి నర్చన
లరమరికలు లేక సల్పి నట్టి జనులకున్
దురవస్థలుండ వెపుడున్
తిరముగ ననుc జేరcగలరు దేహాంతమునన్

936. కం. ఈ దేవీ గీతను కడు
మోదంబునcజదివి, సుగుణపుంగవులకు న
త్యాదరమున వినిపించిన
శ్రీదేవీ కృపయు మోక్ష సిద్ధియుc గలుగున్

937. కం. అనిపలికి యంబ తక్షణ
మనిమిషులన్, గిరిని వీడి యరిగిన యంతన్
దనియుచు దేవత లెల్లరుc
జని రపుడు వినమ్రు లౌచు స్వాలయములకున్

938. వ. అని యీ వృతాంతం బంతయు వేద వ్యాసుండు జనమే
జయునకుంజెప్ప జనమే జయుండును సంతృప్త హృదయుండై యిట్లు వలికె.

939. మ. హిమశైలాగ్రణి కా జగజ్జనని తా నేరీతి జన్మించె,?న
య్యమ 'గౌరీ' వర నామ మెట్లు గొనె,? భస్మాంగున్ శివున్ గోరి ప్రే





మమునన్ బెండిలి యెట్టు లాడె,? సుతుగా మాన్యున్ మహా విక్రమున్
విమలాకారుని స్కంధు నెట్లు వడసెన్? బ్రీతిన్ వచింపంగదే!

940. కం. తారకు నత దేరీతిన్
పోరన్ వధియించి యమృత భోక్తల కెల్లన్
దోరపు కష్టము లూడ్చెను
భారంబని తలపcc బోక వచియింపగదే!

941. ఉ. క్షీర పయోధి నుండెటుల శ్రీరమగా నుదయించె నాజగత్
కారిణి,? యేగతిన్ హరిని కాంతునిగా వరియించె,? నంతటన్
శౌరికి శూలి కెట్టు లుపశాంతి వహించెను గర్వముల్;కృపా
పారగ! తెల్పుమంచు నరపాలుడు వేడె వినమ్ర చిత్తుడై

942. కం. అని యీ రీతిగ సూతుడు
ముని వరులౌ శౌనకాది ముఖ్యుల కెల్లన్
విని పింపగ వారెల్లరు
విని పులకిత గాత్రులైరి వేడుక లొదవన్

## ఓం తత్ సత్

943. వ. ఇది శ్రీదేవీ కరుణా కటాక్ష లబ్ధ విభవుండును, కమలాంబా సుబ్బరాయుల ద్వితీయ పుత్రుండును, కౌశిక సగోత్రుండును, నగు సుబ్బారావు కవి ప్రణీతంబగు శ్రీదేవీ భాగవతమను మహా పురాణమునందు, నారదునకు దక్షుని శాపము, సూర్యవంశ చరిత్ర, సుకన్యా నాసత్యసంవాదము, పరీక్షలో నెగ్గిన సుకన్య, శర్యాతి సుకన్యను శంకించుట, అశ్వినీ దేవతలకు సోమపానార్హత, రేవతుని సత్యలోక యాత్ర, రేవతీ బలరాముల వివాహము, ఇక్ష్వాకు శశాదుల కథ, మాంధాత జన్మ వృత్తాంతము, సత్యవ్రత చరిత్ర, త్రిశంకుని దేవి అనుగ్రహించుట, అరుణుడు చేసిన ధర్మబోధ, త్రిశంకుడు సశరీరుడై సురలోకమేగ యత్నించుట, విశ్వామిత్ర శ్వపచుల కథ; ప్రత్యుపకృతి;త్రిశంకునకు సశరీర స్వర్గము, హరిశ్చంద్రుని పుత్ర వాంఛ, రోహితుని పలాయనము హరిశ్చంద్రుడు రోగ గ్రస్తుడగుట; అజీగర్తుని చరిత్ర, శున శ్శేపుని సందేహ నివృత్తి, వసిష్ఠుని స్వర్గలోక గమనము; సూకరాకార దానవ సృష్టి, రాజ్యదానము హరిశ్చంద్రుడు భార్యనమ్ముట, హరిశ్చంద్రుడు తనను తా నమ్ముకొనుట, కాటి కాపరియైన నృపాలుడు, రోహితుని మరణము, చంద్రమతికి మరణ దండన, హరిశ్చంద్రుడు భార్యాపుత్రులను గుర్తించుట, శతాక్షి – శాకంభరి, హరిహరుల గర్వభంగము, దక్షుని యపరాధము, శక్తి పీఠములు, తారకాసుర దుష్కృత్యములు, దేవతలొనర్చిన దేవీస్తుతి, పార్వతీ అవతరణము, దేవీగీత, తత్వబోధ, భక్తి మార్గము, తామ సాగమములు, బాహ్యపూజలు అను కథావిశేషములతో కూడిన సప్తమ స్కంధము.

# శ్రీ దేవీ భాగవతము (ఆంధ్రము)

## అష్టమ స్కంధము

1. కం. శ్రీ సూర్యాన్వయ జలధిన్
భాసిల్లెడి రామచంద్ర పరమాత్ముని హృ
ద్వాసిని జానకి మద్రస
నాసనమున నిల్చుగాక! ననవర తంబున్

2. చం. మునివరులార! యట్లు ముని ముఖ్యుని వ్యాసుని పృచ్ఛసేయు న
జ్జనపతిఁగాంచి మోద పరిసక్త మృదుస్మిత వక్త్రుడౌచు న
మ్ముని వివరించె నెట్టటులె పూర్ణముగా వివరింతు మీకునున్
వినయముతో వినుండు కడు విందగు వీనుల కాలకించినన్

3. వ. అని పలికి సూతుండు శౌనకాది ముని పుంగవులంగాంచి
యో ముని సత్తములారా! కురు కులేంద్రుండైన జనమేజయుం
గాంచి మునికుల వర్యుండు దయార్ద్ర చిత్తుండై

4. కం. జన నాథా! వినుమయ్యా!
మును నారద మునికి యోగ పురుషుడు నారా
యణు డనఘాత్ముడు గృపఁ దె
ల్పిన విషయమ్మును దెలిపెద వివరము గాగన్

### నారద నారాయణ సంవాదము

5. ఉ. పాయక ముజ్జగంబుల నవారణఁజుట్టుచు దివ్యగాన చిం
తాయత వృత్తి నొప్పు కలహాశను డొక్క దినమ్ము వచ్చె నా
రాయణు నాశ్రమంబున కనంత ముదంబున; వచ్చినంత నా
ప్యాయతతోడ సత్కృతుల నాతనిఁ దృప్తి యొనర్చె వెన్నుడున్

6. ఉ. అంతట భక్తి తత్పరత నమ్ముని వర్యుడు మ్రొక్కి పల్కె దై
త్యాంతక! దేవ దేవ! నిగమాగమ సన్నుత! నా మనంబు నం
దెంతయు సందియం బొకటి యేచుచు నుండు ననుక్షణంబు శ్రీ
కాంత! మదీయ శంక దొలగన్ గృపతో వివరింపఁ గోరెదన్

7. చం. కత మది యెద్ది యీ జగతి కల్గుట, కెచ్చటి నుండి పుట్టె, తత్
స్థితికిని నెద్ది కారణము, దేనిని చేరి లయించు, సర్వమున్





శ్రుతి వినుతా! మనంబునకు సుంతయుఁ దోపక యున్నదయ్య, స
మ్మతి నెఱుగంగఁ దెల్పుము క్రమంబునఁ దద్విధ మంతయున్ గృపన్

8. మ. అనినన్ సంతసమందుచున్ బలికె దైత్యారాతి దేవర్షితో
ననఘా! సర్వ జగద్విధాన మెవ డత్యాసక్తి శ్రోత్రమ్ములన్
విన నుంకించునొ యట్టి మానవుడు నిర్భీత స్థితిన్ గిట్టుటల్
జననంబుల్ గల సంసృతీ జలధి నిచ్చున్ ముగ్గ బోడెన్నడున్

9. మ. త్రిజగత్తత్వ మదెల్లయున్ దలప నా దేవీ విలాసంబ యౌ
త్రిజగత్ సృష్టియు పోషణమ్ము లయమున్ దేవీ కృతంబుల్ సుమీ1
భజియింపన్ దగు నామెనే, సకల పాపంబుల్ పటా పంచలై
విజితాత్ముండును ముక్తుడౌ నరుడు దేవీ నామ చింతారతిన్

10. మ. శతరూపావిభు డంబు జోద్భవు మనో జాతుండు స్వాయంభువన్
ప్రతి పాద్యాఖ్యుడు తొల్లిటిన్ మనువుగా ప్రాచుర్యమున్ బొంది తా
పితరున్ బ్రహ్మను పెక్కు మార్గముల తృప్తిన్ జెంద సేవించుచున్
వితతఖ్యాతిఁజరించు చుండ నజుడున్ వీక్షించి మోదంబునన్

11. మ. తనయా! నిశ్చల భక్తి తోడ జననిన్ ధ్యానింపుమీ కల్గెడున్
జనులన్ సృష్టి యొనర్చుశక్తి మిగులన్ సత్యంబు పో పొమ్మనన్
మను వయ్యాజ్ఞను దాల్చి నిశ్చలమతిన్ మాయా మహాశక్తినిన్
మనమందుంచి తపం బొనర్చె నిహ సంబంధమ్ముఁ బోనాడుచున్

12. శా. ఓత ప్రోతములట్టు లుద్భవములై యొప్పారు నీ లోకముల్
మాతా! నీ వలనన్; మొదల్ దుదయు సామ్యంబుల్ గనన్ నీకు లే
వోతల్లీ! అజ, పంక జాక్ష శివు లుద్యోగంబు లాద్యంతమున్
బ్రీతిన్ దామొనరింపఁ గల్గుటకు దేవీ! కారణంబీవెగా!

13. తే.గీ. 'హ్రీ'యు,ఁ గీర్తియు,ఁగాంతియు, నెలమి స్మృతియు,
కమల, గిరిజయు, సతియు దాక్షాయణి యును,
వేద గర్భయు, మొదలుగా వినుతిఁగన్న
నామము లవెల్ల నీవెగా కామదాయి!

14. శా. నీ రూపమ్మునె నిల్పు కొందు మదిలో, నిన్నే జపింతున్ సదా!
నీ రమ్యంబగు నామముల్ దలచెదన్, నీ గాథ లాలించెదన్,

నోరారన్ భవదీయ కీర్తనల నెంతో తృప్తిమై పాడెదన్
నేరం బెంచక నాదు విన్నపము మన్నింపం గదే యీశ్వరీ!

15. చం. అని మను విట్లు వేడ జగదంబయు నాతని ముందు నిల్చి యో
యనఘ! వరమ్ము వేడు మన నాతడు మోదముఁ జెంది తల్లి! నా
కనయము నీజగమ్ముల నిరర్గళరీతి సృజింపఁగల్గు శ
క్తిని దయ సేయు మమ్మ! యని దీన గతిన్ నతుడౌచు వేడినన్

16. కం. జననియు సంతస మందుచు
మనువును దీవించి వాని మనమునఁ గల కో
ర్కెను దీరిచి యికపై నీ
వొనరించెడి సృష్టి వృద్ధి నొందును మిగులన్

17. వ. అని పలికి యంతర్హిత యయ్యె

18. కం. దేవీ దివ్య వరంబున
నావిర్భూతోత్సవుండు నగు 'మను' వంతన్
వేవేగన్ జని తండ్రికి
నీ విషయం బెల్ల వినయ మేర్పడఁ దెల్పెన్

19. చం. తెలిపి వినమ్రుడై పలికె దేవర! నేనిక జీవ కోటులన్
పలుగతులన్ సృజించెదను, పాయక యజ్ఞము లంబపేర ని
ర్మల మతి నిర్వహింతు, నిక మామక కార్యము లాచరింపగా
స్థల మెట చూపుమయ్య! కనఁ జాలను నే పృథివీ తలం బెటన్

20. వ. అని ప్రార్థింప చతుర్ముఖుండు తనలో నిట్లని తలంచె

21. మ. ధరణీ మండల మెల్ల తోయముల క్రిందన్ మున్గి యుండెన్ గదా!
అరెరే! వీనికి నే స్థలం బెటుల నీయన్ జాలుదున్, నాకు న
య్యరవిందాక్షుని వేడుటే యిపుడు యోగ్యంబంచు యోచించుచున్
హరిఁ జింతించుచు నుండె పంకజ భవుండట్లే యనన్యాత్ముడై

22. చం. అతని నుతింప సాగిరపు డమ్మను ముఖ్యులు, నంత నాప్రజా
పతి ముకు రంధ్రమున్ వెడలి వచ్చెను సూకర మొక్క యంగుళ
ప్రతి యగు దేహమున్ గలిగి, భావములం దట నున్న వారి క
తృతులితమైన భీతియును నచ్చెరువున్ గలుగన్ క్షణమ్మునన్





23. చం. అదియును భీకరంబయిన యాకృతితోడ వివృద్ధయై మహా
మదగజ మట్టులై, గిరి సమంబును నై, కనుపించి యంతటన్
చదలదరంగ గర్జనము సల్ప, గ్రహించి విరించి ముఖ్యు ల
య్యది కరుణాంతరంగుడగు నచ్యుతు లీల యటంచు నెంచుచున్

24. ఉ. నాలుగు వేద మంత్రముల నమ్రత తోడ నుతింప నంత నా
కోలము సంబరం పడుచు కూరిమి నందర వైపుఁజూచుచున్
శూలము లట్టు వెంట్రుకల సూటిగ మేనున నిక్కఁజేయుచున్
దూలుచు నమ్మహా జలధి తోయములన్ వడి మున్గె వింతగన్

25. ఆ.వె. సూకరమ్ము జలధిఁ జొచ్చు చుండగ దాని
వాడి యైన రోమ పంక్తు లెల్ల
తాకినంత తనదు తనువు చీరుటఁ జేసి
అరచె పాహి పాహి యనుచు నబ్ధి

26. చం. జలనిధి పల్కులన్ వినక సాగి వరాహము పర్వు పర్వునన్
జలముల లోని కేగి పెలుచన్ గలయన్ దిరుగాడి యాడి భూ
వలయము నొక్క చోటఁగని, పట్టి నిజోగ్ర తరంపు దంష్ట్రపైఁ
దలగక చక్కనిల్పు కొని దర్పమెలర్పగ వచ్చె రివ్వునన్

27. ఉ. వచ్చి జలమ్ము పై నిలిచి భాసిలె నొక్క సరోజమున్ గజం
బిచ్చపెకల్చి దంతములఁ నిమ్ముగ నిల్పి వెలుంగు భంగి; నీ
యచ్చెరువున్ గనుంగొనుచు నంబుజ గర్భుడు సంస్తుతించె తా
హెచ్చిన భక్తి మై పులక లేర్పడ నీగతి నంబు జోదరున్

28. శా. దేవా! దానవ భంజనమ్మునకునై దివ్యావతారమ్ములన్
నీ వీరీతి ధరించి లోకములకున్ నీమూర్తులన్ నిత్యమున్
సేవింపంగల భాగ్యమిచ్చితివి; నిశ్చింతన్ బ్రజాసృష్టి నేఁ
గావింపందగు శక్తి నీవలననే గల్గెన్ గృపా సాగరా!

29. ఉ. నీ కను సన్నలన్ నడతు నే నెపుడున్ బురుషోత్తమా! సురల్
నీకరుణన్ గదా సుధను నిత్యము పానము సేయుచుంట, యా
నాక విభుండు స్వర్గ భువనంబును నేలుట కీవె మూలమౌ
శ్రీకర మూర్తి! నీ కృపఁ బ్రసిద్ధి గడించెద రెల్ల దిక్పతుల్

30. చం. అని చతురాననుండు చతురాస్యములన్ నుతియింప సంతసం
బెనయ వరాహ మూర్తియు నహీన కృపామృత వీక్షణంబులన్
వనజ భవున్ గనుంగొనుచు ప్రక్కల చూచుచు నుండ నంతలో
దనుజు డొకండు వచ్చి కడు దర్పముతో నెదిరించి నిల్చినన్

31. కం. అతని, హిరణ్యాక్షుడనెడి
దితిజుని, శ్రీహరియు తనదు తీవ్ర గదా వి
స్తృత హతిఁ గూలిచి యంతన్
క్షితిని యథాస్థితిని నిలిపె సింధు జలములన్

32. చం. నిలిపి వరాహ మూర్తి కడు నిశ్చలతన్ నిజవాసమేగె, వే
ల్పులును విరించియున్ మనువులున్ ముదమందిరి మౌనివర్య! యీ
కలిత వసుంధరోద్ధరణ గాథఁ బఠించిన నాలకించినన్
దొలగును పాపముల్ గలుగు తూర్ణమె సద్గతు లెట్టి వారికేన్

33. ఉ. అంతట పద్మగర్భుడపు దమ్మనువున్ గని వత్స! భూతలం
బంతయు నీదెయింక, నటులౌట యథేచ్ఛగ సృష్టిఁజేయు మ
త్యంతము ప్రాణులన్; మఱియు నాశ్రమ ధర్మము లుద్ధరించుచున్
సంతతి వృద్ధిసేయుము, ప్రశస్తిగ యజ్ఞము లాచరింపుమా!

34. చం. గుణముల, సద్యశంబునను, గొప్ప తనంబున, నీకు సాటియౌ
తనయులఁ బొంది వారలకు తద్దయు సద్గుణ రూప యుక్తలన్
వినయ వివేక వర్తనల వెల్గెడి కన్నెలతో వివాహమున్
ఘనముగ చేయు మెల్లరకు కల్గు సుసంతతి వారి కొప్పుగన్

35. తే.గీ. భక్తి యుక్తుడవై పరాత్పరుని యందు
మనసు నిల్పుచు పరిచర్య లనుదినమ్ము
సలుపు చుండుము యోగ నిశ్చలత గల్గి
కర్మ లొనరింపు మయ్య నిష్కామ బుద్ధి

## మను వొనరించిన సృష్టి

36. కం. అని పలికి బ్రహ్మవెడలెను
జనకుని యాజ్ఞను సరణి సకల ప్రజలన్





మను వపుడు సృష్టి చేసెను
దిన దినమున్ వృద్ధి యౌచు తేజరిలంగన్

37. వ. అంత

38. సీ. అతనికి నిర్వురు సుతులు గల్గిరి ప్రియ
వ్రతుడును నుత్తాన పాదుడునన,
కూతులు పుట్టి రాకూతియు, దేవహూ
తియు, ప్రసూతియు నన తేజమెసగ
ఆకూతిని రుచిమహర్షికి నొసగెను
తగ దేవ హూతిఁ గర్దమున కొసగె
దక్షున కొసగెను తనర ప్రసూతిని
వృద్ధి యయ్యెను వంశమెల్ల నంత

గీ. రుచికునకుఁ బుట్టె యజ్ఞుడు రోచులలర
కపిలు డుదయించె నంత నా కర్దమునకు
దక్షునకు పుట్టి రధిక సంతాన మగుచు
పుత్రికలు పెక్కు రుర్విని పొలుపు మిగుల

39. తే.గీ. వారి లోపల యజ్ఞుడన్ భూరి యశుడు
రాక్షసుల నుండి మనువును రక్ష చేసి
విశ్వవిఖ్యాతి నందెను శాశ్వతముగ
కపిలుడను వాడు సాంఖ్య యోగమ్ముఁ బూని
యాశ్రమము నొండు నిర్మించి యందు మిగుల
సాధనన్ జేసి తల్లికి సాంఖ్య యోగ
మార్గముల నెల్లఁ దెలిపెను మానితముగ
రచన చేసెను సాంఖ్య శాస్త్రము నితండు
"కాపిలం"బను పేర విఖ్యాతిఁ దనర
సాంఖ్య యోగమున కత డాచార్యుడయ్యె

40. కం. విను మను పుత్రుల వివరం
బనఘా! వివరింతు దాని నవధానమునన్
వినినన్ బాపములు తొలగి
యనుకూలము లౌను సత్కృతార్థ ఫలంబుల్

41. ఉ. ఆ మను నందనుండగు ప్రియవ్రతుడున్ దన తండ్రి పట్టునన్
ప్రేమముఁజూపుచున్ దగిన రీతిగ సేవల వానిఁదన్పుచున్
ఏమరఁబోక కార్యముల, నెన్నడు వీడక సత్య ధర్మముల్,
సేమముతో మెలంగెఁగడు చిన్నతనంబున నుండి పెద్దయై

42. ఆ.వె. అతడు విశ్వకర్మ సుతను బర్హిష్మతి
నబ్జముఖిని పెండ్లి యాడి ప్రీతిఁ
బడసె సుగుణ యుతుల పదుగురు సుతులను
చివర నొక్క సుతను చెలువ మొప్ప

43. వ. అగ్నీధ్రుండును, ఊర్ధ్వజిహ్వుండును, యజ్ఞ బాహువు,
మహా వీరుడు, రుక్మశుక్రకుడు, ఘృతపృష్ఠుడు, సవనుడు
మేధాతిథి, వీతి హోత్రుడు, కవి, అను పదుగురు కుమారులును
ఊర్జస్వతి యను నొక కుమార్తెయు కలిగిరి

44. కం. వారలలో కవియు, మహా
వీరుండును, సవనుడు, నతి ప్రీతిన్ ముగురున్
వైరాగ్యమ్మునుఁ బూనుక
చేరిరి మున్యాశ్రమములఁ జేయన్ దపముల్

45. తే.గీ. పరగ నీ ప్రియ వ్రతున "కుపాస్య" యనగ
కలదు మఱియొక పత్ని, యక్కమల నేత్ర
కుద్భవించిరి నందను లుత్తముండు,
తామసుడు, రైవతు డనగ ధాత్రి మువురు

46. కం. వీరలు మువ్వురు పిదపన్
వీరులు నై కీర్తిఁ బడసి విఖ్యాతి మెయిన్
వేరుగ మన్వంతరముల
కారోపితులై వెలింగి రధినాయకులై

47. కం. అంతన్ బ్రియ వ్రతుం డ
త్యంత పరాక్రమమున ధర నతి దక్షుండై
సొంతమ్ము దశార్బుదములు
దాంతుండై యేలె బాహు దర్పోన్నతుడై





48. చం. ఒక దెస సూర్యుడుండ మఱి యొక్కట చీకటు లుంటఁజూచి యో
ర్వక యత దన్యభాగమున భాస్కరతుల్య విరాజమానమౌ
నొక రథ మెక్కి వెల్గుల ననూనముగా ప్రసరింపఁ జేయుచున్
సకల వసుంధరా వలయ చారణుడై యడగించెఁ జీకటిన్

49. తే.గీ. అతని రథనేమి భూమి యందచట నచట
పుడమిఁ జీల్చుట ద్రోణు లేర్పడియె నేడు;
సప్త సాగరములని ప్రశస్తి నంది
యందు ద్వీపమ్ములేడుగా నరయఁబడియె

50. నాటి నుండియే "సప్త ద్వీపా వసుంధరా"యని పుడమి ప్రసిద్ధినందె.
అవియే జంబూద్వీపము, ప్లక్ష ద్వీపము, శాల్మలీ ద్వీపము, కుశ
ద్వీపము, క్రౌంచ ద్వీపము, శాక ద్వీపము, పుష్కర ద్వీపము నను
నామంబుల నొప్పి యుండె. ఇవి యొకదాని కంటె మఱియొకటి
రెట్టింపు పరిమాణంబున నుండు

క్షార సముద్రము, ఇక్షురస సముద్రము, సురాసముద్రము,
ఘృత సముద్రము, క్షీర సముద్రము, దధి మండ సముద్రము,
శుద్ధోదక సముద్రము అను నామంబుల సప్తసాగరము లేర్పడియె

51. సీ. అందు జంబూ ద్వీప మది క్షార సాగర
పరివేష్టితంబౌచు ప్రగతికెక్కె
అగ్నీధ్రుడను నతం డధి పతి యయ్యెనా
ద్వీపమ్ము నకుఁగడు తేజమొప్ప
ఇక్షురసాబ్ధి సంవృతమైన ద్వీపము
ప్లక్షనామంబునఁ బరగు చుందు
ఊర్ధ్వజిహ్వుడు దీని కొడయుడై యనురక్తి
నేలెను పెక్కేడు లిచ్చకమున

గీ. అల సురాబ్ధి పరివృతమై యలరు భూమి
శాల్మలీ ద్వీప మనగఁ బ్రశస్తిఁగనియె
'యజ్ఞ బాహువు' బాహు బలాఢ్యుడెలమి
దాని కధిపతి యయ్యెను ధర్మ యుతుడు

52. తే.గీ. ఘృత సముద్ర పరివృత విస్తృతమునైన
య క్కుశద్వీప మేలె నిరర్గళముగ
నా హిరణ్య రేతసు డసహాయ బలుడు
కలిత దుగ్ధాబ్ధి సంవృత క్రౌంచ నామ
ద్వీపమేలెను ఘృత పృష్ఠ భూపు డెలమి
మఱియు దధిమండ సాగర మధ్యమందు
'శాక'మనియెడు ద్వీపమున్ చక్కనేలె
విభుడు "మేధాతిథి"కడు వివేక మతిని
'వీతి హోత్రుడు' పుష్కర ద్వీప మేలె
శుద్ధజలధి పరివృత విశుద్ధభూమి

53. కం. తన సుతయగు నూర్జస్వతి
ననఘున కుశనసున కిచ్చి యానందమునన్
జనకుడు ప్రియవ్రతుడు తా
నొనరించె వివాహ కార్య మున్నత ఫణితిన్

54. కం. వారిరువుర కొక కూతురు
వారిజదళ నేత్ర పుట్టె వాగ్విభవమునం
దా రమణికి సరి లేరని
పేరెన్నికఁ గన్నయింతి పృథ్వీ స్థలిపై

55. వ. దేవయాని యనుపేరన్‌బరగు నయ్యింతి కడు ప్రసిద్ధురాలు
ఆమె పేరు నీవు వినియేయుందువు నారదా! యిక ద్వీప వర్ష
భేదముల గుఱించి వివరించెద వినుము

## జంబూ ద్వీప వర్ణనము

56. సీ. శత యోజన సహస్ర వితత విస్తీర్ణయై
పద్మకర్ణిక భంగి వర్తులముగ
నమరి జంబూద్వీప మలరారు చుండును
నవ వర్షముల తోడి ప్రవిమలముగ
అందు మహాగిరు లష్ట సంఖ్యఁ గలవు
ద్వీపమ్ముఁ జుట్టి సుదీర్ఘ మగుచు
ధనురాకృతిని బొంది తన్మధ్యభాగాన





వరలు నిలావృత వర్షమెలమి
దీని కేంద్రమునందు దివ్యమై భాసించు
మేరు పర్వతము గంభీరవృత్తి

గీ. నొప్పు లక్ష యోజనముల యున్నతమున
ఆ సువర్ణాద్రి భూగోళ మందు మధ్య
నమరి యున్నది కడు దీర్ఘమైన శిఖర
భాగముగలిగి కేంద్ర పర్వత మనంగ

57. సీ. ఆ యిలా వృతమున కవల నుత్తరమందు
హద్దులై యమరె మూడద్రు, లవియు
శ్వేతమ్ము, నీలమ్ము, శృంగ వంతమ్మన
నొప్పు నామమ్ముల నున్నతిఁ గనె
రమ్యక, కురువర్ష రమ్య భూములకివి
దక్షిణాంతమ్ములై తనరి యుండు
నీమూడు గిరులును నిట్టె తూర్పుకు సాగి
నిలిచి యుండును క్షార జలధి చెంత

గీ. ఉత్త రోత్తర మధికమై యొప్పు వీని
యందు నదులు నదములు లతావృత తరు
సంతతి మిగుల శోభా విశాల మగుచు
నేత్ర పర్వమ్ము సేయు సందియములేదు

58. గీ. ఆ యిలా వృతోర్వికి దక్షిణాగ్రమందు
నిషధమును, హేమ కూటము, నిస్తులంపు
శీతశైలము ననగ విశిష్ట గిరులు
గలవు ప్రాగ్దిశా విస్తార తలము గలిగి

59. కం. హరివర్షము, కింపురుషము
భరతము నా నొప్పి మూడు వర్షంబులు పై
గిరులే సరిహద్దులుగా
ధర వరలుచు నుండె నారదా! శ్రేష్ఠములై

60. తే.గీ. ఆ యిలావృత వర్షమ్ము నాను కొనుచు
మాల్య వంతాద్రియును పశ్చి మమునఁగలదు

గంధమాదన గిరియు ప్రాగ్భాగ మందు
గలదు బహువిశాలముగ భూతలమునందు

61. ఆ.వె. నీల, నిషధ, కేతు మాల, భద్రాశ్వ వ
ర్షముల కెల్ల లవియె క్రమముతోడ
నివియు నొక్కటొకటి యిరు యోజ నమ్ముల
విస్తరించి యుండు నిస్తులగతి

62. తే.గీ. మంద రాచలమ్మును మేరు మందరమ్ము
కుముదము సుపార్శ్వ కము, నను విమల గిరులు
మేరు పర్వత పాద సమీప మందు
నయుత యోజన విస్తీర్ణమై వెలుంగు

63. తే.గీ. కేతనములట్టు లొప్పి తద్గిరుల పైన
గగనమున్ దాకు విధమున నెగసి పైకి
నలరు చూత జంబూ కదం బాది తరులు
సరసులును నాల్గు గలవు విస్తరిలి యచట

64. తే.గీ. క్షీర, మధ్విక్షు, సుజలముల్ చెలువుమీర (మధు + ఇక్షు)
సరసులవి నాల్గు నొప్పు ప్రశస్తి గలిగి
అచటి జలముల స్పృశియించి నంత మాత్ర
యోగ మైశ్వర్యమును గల్గు నున్నతముగ
మానవులకైన దివ్యుల కైన ధ్రువము

65. కం. దివిజులు తమ కాంతలతో
నవిరళ గతి నీ కొలకుల నానందమునన్
వివిధ గతుల విహరించెద
రవధు లెఱుగఁ బోక యిచ్చ నద్భుత రీతిన్

66. వ. మఱియు నిందు నందక, చైత్ర రథక, వైభ్రాజక, సర్వభద్రక
నామంబుల నుద్యాన వనంబులు కనుల పండువు సేయుచుండు

67. ఉ. మందర పర్వతాగ్రమున మానుగ నున్నత చూత వృక్ష మొం
డందముగాఁ గనంబడు వియత్తలమున్ స్పృశియించు చున్న యా





చందము దోపగా, నమృత సార యుతంబులు తత్ఫలంబులున్
బొందుగ పర్వతాగ్రముల పోలికఁ గన్పడు నద్భుతంబుగన్

68. చం. అరుదుగ తత్ఫలంబు లనయంబును విచ్చుట, రక్తవర్ణమై
దొరలెడు తద్రసంబులటఁ దోరములై "యరుణోద" వాహినిన్
పరువడి లీనమై యరుణ వర్ణము నెక్కుడు సేయు చుండుటన్
సరిపడె దాని పేరునకు సార్థక మేర్పడి నట్టి చందమై

69. చం. అరుణ తరంబునై యెగయు నన్నది నొక్క తటిన్ మునింగినన్
గరగును పాపముల్ సకల కార్యములున్ నెరవేరుచుండు, తత్
పరిసర తీరమందె కొలువై పరదేవత వెల్గుచుండు; న
'య్యరుణ' వరాభిధాన సక లార్థము లిచ్చుచుఁ బ్రోచుభక్తులన్

70. తే.గీ. మేరు మందర శిఖర గంభీర భూమి
నలరు జంబూ తరువర శాఖాగ్ర ఫలము
లక్కజము గొల్పు చుండును హస్తి యుత్త
మాంగముల మించు పరిమితి నవఘళింప

71. శా. ఆ జంబూ ఫలముల్ ధరన్ బడుచు వ్రయ్యల్ గాగ నశ్రాంత మ
వ్యాజంబై ప్రవహించు తద్రస మిలన్ వ్యాపించి ప్రఖ్యాతమై
తా"జంబూనది" యన్న నామమును బొందన్ గల్గె, తత్తీరమం
దే"జంబ్వాదిని" యున్నపేర వెలసెన్ దీప్తిన్ పరాదేవియున్

72. తే.గీ. ఆమె జంబూ ఫలమ్ముల నాహరించి
అమర రాక్షస నాగ ఋష్యాది గణముఁ
బ్రోచు చుండును కామితమ్ముల నొసంగి
భక్తి భజియింప సర్వ పాపముల నడఁచు

73. ఉ. అచ్చటి మన్ను జాంబవ రసార్ద్రమునై కడునాని యంతటన్
హెచ్చగు గాలికిన్ మఱియు నెండకు నెండి సువర్ణ లోహమై
యచ్చుపడున్ దివౌకసులు హస్తములన్ స్పృశియింప, దానినే
యిచ్చ విభూషణమ్ములుగ నేర్పడఁ జేసి ధరింతు రా సురల్

74. కం. జంబూఫల రసములతో
సంబంధము గలిగి మన్ను స్వర్ణంబగుటన్

జాంబూనద మనియెడి పే
రుం బొందెన్ స్వర్ణ మధిక రుచిరం బగుచున్

75. కం. కలదు సుపార్శ్వ శిఖరమున
నలఘు కదంబ తరువొకటి యత్యున్నతమై
గలగల పారును నత్తరు
బిలపంచకమున్ వెలువడి పెల్లుగ జలముల్

76. కం. అవి యైదు వాహినులుగా
ప్రవహించు నిలావృతంపు పశ్చిమ దిశయం
దవిరళ గతి, తజ్జలములు
ప్రవిమలములు మధుర గంధ భరితము లనఘా

77. కం. ఇందలి యుదకముఁద్రావెడు
బృందారక ముఖ సుగంధ విభవము లెలమిన్
చిందును శత యోజనములు
మందగతిన్ బ్రతి దినమ్ము మహిమ దలిర్పన్

78. వ. ఈ ప్రదేశమున వెలసిన "ధారేశ్వరి" మహా మహిమ గలది.
ఈమె దేవపూజ్య, మహోత్సాహ, కాలరూప, మహాసన,
కాంతారగ్రహణేశ్వరి, కర్మఫలద, కరాళదేహ, కాలాంగి,
కామకోటి ప్రవాతని – అనునామంబుల స్తుతియింపంబడుచున్నది.

79. తే.గీ. కుముద పర్వత శిఖర మం దమరియుండు
గొప్ప శాఖలు గల్గి న్యగ్రోధ మొండు
'శత బల'మ్మను పేర నా శాఖి యొప్పు
దాని మూలమ్ము నుండి యుద్భవమునంది
నదము లొక కొన్ని మిక్కిలి ముదముగలుగ
వేగ ప్రవహించు నయ్యిలా వృతము చెంత
నుత్తరదిశగ, తత్ప్రజ కున్నతముగ
పాడి పంటలు వస్త్రసంపదల నెల్ల
పుష్కలమ్ముగ నొసగు చుమోద మెసగ

80. తే.గీ. అచట గల మహాదేవి 'మీనాక్షి' నీల
వస్త్ర, రౌద్రముఖియునునై వరలు చుండు





దేవ మానవ సేవ్యయై దివ్య మహిమ
గలిగి వరదాయి. యనగ విఖ్యాతిఁ బడసి

81. వ. మఱియును నాదేవిని మత్తమాతంగ గమన, మదనోన్మాదిని,
మానప్రియ, మానప్రియాంతర, మార వేగ ధర, మారపూజిత,
మార మాదిని, మయూర వర, శోభాఢ్య, శిఖి వాహన గర్భ,
ఇత్యాది నామంబులతో స్తుతియించు చుందురు

82. ఉ. ఈ నద నిర్మలోదకము లించుక త్రాగిన వార లెన్నడున్
గానరు వార్ధకంబును, నకాలపు మృత్యువు, రోగ బాధలున్
మేన వికారముల్, మఱియు మిక్కిలి ఘర్మజలంబులున్ శ్రమల్;
గాన శతాధి కాబ్దముల కాలమటన్ వసియింతు రెల్లరున్

83. కం. ఇరువది శిఖరమ్ములతో
వరలుచు నుండును సుమేరు పర్వత, మదియున్
దిరముగ పదియున్ దొమ్మిది
గిరులకు మధ్యమున నుండు కేంద్రము వోలెన్

84. వ. కురంగము, కురగము, కుశుంభము, వికంతము, త్రికూటము,
శిశిరము, పతంగము, రుచకము, నిషధము, శితీ వాసము, కపిలము,
శంఖము, వైడూర్యము, చారుధి, హంస, ఋషభము, నాగము,
కాలంజరము, నారదము, నను పేర్లు గల యిరువది శిఖరములతో
నా సుమేరు పర్వత మొప్పియుండును

85. సీ. మేరు గిరికి తూర్పు మేరనఁ గన్పించు
పర్వతములు రెండు పరగ నిల్చి
దేవకూట, జఠర దివ్య నామమ్ముల
నొప్పి యుండు మిగుల నున్నతముగ
పదియు నెన్మిది వేల పై నొప్పు యోజన
విస్తీర్ణమును రెండు వేల యోజ
నముల నున్నతియును సమకూర్చుకొనియవి
శోభఁ గూర్చును కడు చూప రులకు

గీ. పారి యాత్రమ్ము, పవమాన పర్వతములు
పశ్చిమమ్మున గలవు సంభావ్యముగను

పరగ కైలాస, కరవీర పర్వతములు
మేరువుకు దక్షిణమ్మునఁ దీరియుండు

86. కం. మకరము, త్రిశృంగ మనగా
ప్రకటితమై యుండు రెండు పర్వతములు తా
మొక వరుస నుత్తరమ్మున
నకలంకం బగుచు చూడ నాశ్చర్యముగన్

87. చం. ఎనిమిది పర్వతమ్ములిటు లెల్లలుగా తన చుట్టు నిల్వ భా
నుని వలె మేరు పర్వతము భాసిలు చుండును; తద్గిరీంద్రపున్
ఘన శిఖరాగ్ర మధ్యమున కాంచన గర్భుని పట్టణమ్ము కాం
చన కల శాగ్ర సంనిహిత సౌధ తతిన్ విలసిల్లు నున్నతిన్

88. మ. అరవిందాసను పట్టణమ్మునకు చుట్టె యష్ట భాగమ్ములన్
పురముల్ బంగరు సౌధ సంపదల నొప్పున్ చక్కనై, దిక్పతుల్
కరమున్ బ్రీతి వసించు చుందు రట విఖ్యాతిన్ స్వకార్యమ్ములన్
సురలోకాధిపు నాధి పత్యమున సంశోభిల్లగాఁ జేయుచున్

89. వ. మనోవతి, అమరావతి, తేజోవతి, సంయమని, కృష్ణాంగన,
శ్రద్ధావతి, గంధవతి, మహోదయ, యశోవతి, యను నామంబుల
నొప్పు నీ తొమ్మిది నగరముల యందు బ్రహ్మ, మఱియు
నింద్రాది అష్ట దిక్పాలురు వసింతురు

90. మ. హరి పాదోద్భవ యైన గంగ మును తా నమ్మేరు శైలాగ్రమం
దరితిన్ బాదము మోపె పాప హరయై; యాప్రాంతమే మిక్కిలిన్
చరితార్థమ్మునుఁ బొందె విష్ణుపద సంజ్ఞన్ బూజ నీయంబుగా
వరలెన్ మూడు జగంబు లందు మిగులన్ బ్రాశస్త్యమున్ బొందుచున్

91. తే.గీ. పూర్వ ముత్తాన పాదుని పుత్రు డమిత
విష్ణు భక్తుడు ధ్రువుడు, తా విష్ణు పాద
పద్మరజమును తలఁదాల్చి భద్ర గతిని
వాస మొనరించు చుండు న పర్వతమున

92. తే.గీ. అతని మహిమ మెఱిగిన ఋష్యాదు లెల్ల
సర్వలోక హితార్థమై సమ్మతమున





నిత్య మచ్చట కేగి వినీతు లగుచు
చేయు చుంద్రు ప్రదక్షిణల్ చిత్త శుద్ధి

93. తే.గీ. ఆక సమునుండి క్రిందకు దూకునపుడు
పరమ శివుడు గంగను తన శిరమునందు
తొలుత బంధించి పెక్కు పాయలుగ దాని
వదల, నదియును మెల్లన కదలి వచ్చి
మేరు పర్వత శిఖరమున్ జేరి యచట
నలువ నగరాన కాలూని నాల్గు గతుల
గిరికి చుట్టును తిరుగుచు నరిగె తుదకు
భూతలమ్మున నుండి సముద్రమునకు

94. కం. 'సీత'యును, నలక నందయు,
భాతిగ చక్షువును, మఱియు భద్రయు నన వి
ఖ్యాతిగ నామములు గలిగి
భూతలమున గంగ పారె పొలుపు మిగులగన్

95. ఉ. అనయము నందు'సీత' కమలాసను వాసము నుండి తూర్పుగా
జని యట గంధమాదన విశాలగిరిన్ దిగి భద్ర ఘోటకం
బనియెడు వర్షమున్ దడిపి యాభువిఁ బూత మొనర్చి దివ్యులున్
మనుజులు సన్నుతింపగ గ్రమంబున క్షారపయోధికిన్ జనున్

96. మ. అల చక్షుర్నది పశ్చిమోర్వి వలనై యామాల్యవంతాద్రి, కు
జ్జ్వల రీతిన్ జని 'కేతుమాల' యను వర్షంబున్ సుసంపన్న సం
కలితన్ జేసి పయోధికిన్ జనును; యుక్తంబైన సద్బుద్ధి నా
జలమందెవ్వడు మున్గు, వానికగు మోక్షప్రాప్తి శీఘ్రంబుగన్

97. తే.గీ. అలక నందయు హేమ కూటాద్రి కరిగి
భరత వర్షమ్ము నన్ వేగఁబర్వి యంత
దక్షిణాబ్ధినిఁ జేరు; తత్తటిని యందు
స్నాన మొనరింప పాప సంచయము తొలగు
రాజ సూయ ఫలమ్ము సంప్రాప్తమగును

98. తే.గీ. 'భద్ర' యను నది శృంగ వత్పర్వతమున
కరిగి కురువర్ష భూముల నాక్రమించి

పాడి పంటల సస్య సంపదల నొసగి
సాగరమ్మునఁ గలిసి విశ్రాంతిఁ బొందు

99. చం. ధర భరతోర్వి యొక్కటియె తథ్యము నారద! కర్మభూమి నా
బరగును, తక్కు వర్షములు పాయక నిత్యము భోగభూములై
వరలుచు నుండు నందురు, దివౌకసులున్ దమ పుణ్యశేష వి
స్తర ఫలితోపభోగములు దా రటఁ బొందుదు రాయుతాబ్దముల్

100. తే.గీ. ఆయువుల్ వత్సరము లోనఁ బాయుననగ
గర్భముల్ దాల్తు రచ్చటి కాంత లెలమి
అచట కాలమ్ము గడచు నిత్యమ్ము తలప
మున్ను త్రేతాయుగమ్మునఁ బోలి మిగుల

101. చం. అరయగ నచ్చటన్ జను లహర్నిశమున్ జపయోగ తత్పర
స్థిరులయి సంస్తుతించెదరు దేవిని, నిత్యము సర్వకాలముల్
విరియు సుగంధ బంధుర విభిన్న సుమప్రకరమ్ముఁదెచ్చి సు
స్థిరమతులై యొనర్తు రతి తృప్తిగ నర్చన లిచ్ఛకమ్మునన్

102. మ. కమనీయంబగు వృక్ష సంతతులతో గంభీర వాక్పూర సం
భ్రమ శైలామల వాహినీ తతులతో వ్యాకీర్ణ కాసార హం
స మరాళాదిక పక్షి సంఘములతో సౌందర్యమై యాస్థలం
బమరోద్యాన వనంబనన్ దనరు నిత్యం బక్షి పర్వంబుగన్

103. కం. ఈ నవ వర్షమ్ములలో
శ్రీ నారాయణు డెపుడు వసించుచు నుండున్
మానుగ లోకానుగ్రహ
మూనుచు దేవీ భజనల నొనర సలుపుచున్

104. చం. కమలజు నక్షి సంభవుడు కాల గళుండు నిజాంగనామణీ
సముచిత సంస్థితాంకుడు ప్రసన్నుడునై యిట నుండు భక్తసం
ఘముల విశేష పూజలను గైకొనుచున్, పురుషుండెవండు త
ద్విమల వనంబు సొచ్చిన సతీమణి యౌ నతి విస్మయమ్ముగన్

105. వ. పార్వతీదేవి శాపకారణమ్మున నట్లు జరుగును





106. ఆ.వె. అచటి యింతు లెల్ల రభవుని కొఱకునై
సేయు చుండ పూజ లాయతగతి
శంకరుండు తాను సంకర్షణునిఁగూర్చి
సలుపు చుండు ధ్యాన మలఘు గతిని

107. చం. సురముని వర్య! రుద్రుడు విశుద్ధ మనంబున నచ్యుతున్ సదా
స్మరణ మొనర్చు చుండును ప్రశాంతివహించి యిలావృతంబునన్
కర మనురక్తి శాంకరియు, గౌరవమొప్పగ తద్గణమ్ములున్
నిరతము సంస్తుతింప కడు నిశ్చల పూర్ణ సమాధి నిష్ఠుడై

108. తే.గీ. అచ్యుతుడు హయగ్రీవుడై యలరు నచట
నెపుడు భద్రాశ్వ మనెడి యుర్వీస్థలాన
పరగ భద్రశ్రవుండు తత్పతియనగుట
భద్ర సేవకు లైరి త ద్వంశ భవులు

109. వ. "ఓం నమో భగవతే ధర్మాయాత్మ విశోధ నాయనమః"
అనంబడు ప్రత్యేక మంత్రంబులతో భద్రశ్రవసులు హయగ్రీవు
నిట్లునుతించు చుందురు

110. శా. స్వామీ! విశ్వము నశ్వరంబనెడి విశ్వాసమ్ముతో నుండియున్
నీ మాయా పరివేష్టి తాత్ములయి సందేహించుచున్ యోగులున్
ధీమంతుల్ గడు మోహ మగ్నులగు టెంతేనిన్ విచిత్రంబయౌ
నేమంచెన్నుదు మింక నజ్ఞులము నీయా లీలలన్ శ్రీపతీ!

111. మ. అమరర్షీ! హరివర్షమందు నరసింహా కారుడై భక్త సం
ఘములన్ బ్రోచుచు నుండు వెన్నుడు; తదాకారమ్ము ప్రహ్లాదుడే
సమదృష్టిన్ దరిశించి ముందుగ, ప్రశస్తంబైన గీతంబులన్
రమణీయంబుగ సంస్తుతించెగద! యుగ్రత్వంబు శాంతింపగన్

112. వ. "ఓం నమో భగవతే నారసింహాయ! నమస్తేజస్తేజసే, ఆవిర్భవ
వజ్రదంష్ట్ర కర్మాశయాన్ రంధయ రంధయ తమోగ్రసగ్రస
ఓం స్వాహా! అభయం మమాత్మని భూయిష్ఠాః, ఓం క్ష్రౌం"
అను మంత్రములతో దైత్య సూనుడైన ప్రహ్లాదుడలనాడు
స్తుతించెన్ గదా! హరి వర్షవాసులు నేటికినీ ఆమంత్రముల
నుచ్చరించు చుందురు.

113. చం. జగములకున్ శుభంబగు,cబ్రశాంతి వహింతురుగాక యెల్లరున్
ద్విగుణిత మయ్యెడున్ దితిజ విద్విషుపై ననయమ్ము భక్తి, దు
ష్ట గణము లంత మొంది వెస సర్వులకున్ గల బంధనమ్ములున్
దెగి నరసింహ మూర్తి కృపcదృష్టిని గాంతురు గాక లోకులున్

114. మ. నిను సేవింపగ లేని వాడు నరుడే? నీయందు నిత్యమ్ము నె
వ్వనికిన్ భక్తి యనంతమై నిలుచు నబ్భాగ్యోన్నతున్ దేవతల్
గని రక్షింతురు; మీనమెందు జలమున్ గాదన్న వేరొందుచో
మన లేనట్లుగ నీదు భక్తి విడినన్ మర్త్యుండు జీవించునే?

115. మ. అని యీరీతిగ దైత్య నందనుడు ప్రహ్లాదుండు నిత్యమ్ము న
ద్దనుజారిన్ నరసింహమూర్తి నతి తాత్పర్యమ్మునన్ స్తోత్రముల్
వినయం బొప్పగc జేసె, నేడు నటులే ప్రీతిన్ గడున్ భక్తితో
ననయంబున్ హరివర్ష వాసులును తామర్చింతు రయ్యచ్యుతున్

116. మ. స్మర రూపంబున కేతు మాలయను వర్షంబందు శ్రీశుండు తా
స్మరియింపం బడుచుండు తత్ప్రజలచే; సాక్షాత్తు శ్రీలక్ష్మియే
స్థిరమై యం దిలవేల్పుగా వెలసె, నాదేవీ లలామంబె యా
స్మర రూపున్ స్తుతియించె విష్ణువును సన్మంత్రమ్ములన్ ముందుగన్

117. వ. "ఓం హ్రీం శ్రీ హూం ఓం నమో భగవతే హృషీ కేశాయ
సర్వగుణ విశేషై ర్విలక్షి తాత్మనే, ఆకూతీ నాం చిత్తానాం
చేతసాం విశేషాణాం చాధిపతయే షోడశ కళాయ,
ఛందో మయాయ, అన్న మయాయ, అమృత మయాయ,
సహసే, ఓజసే, బలాయ, కాంతాయ, కామాయ నమస్తే
ఉభయత్ర భూయాత్" ఇత్యాది మంత్రములతో లక్ష్మీదేవి
శ్రీమహా విష్ణువును స్తుతియించె

118. కం. ఇవియే నేటికి నచ్చట
ప్రవిమల మంత్రమ్ములయ్యె పడతు లచట న
య్యవికలుని హృషీ కేశునిc
దవిలి యుపాసింతు రతడె తమ పతి యనుచున్

119. తే.గీ. ఆ హృషీకేశు భర్తగా నాత్మcదలచి
అర్చనలు సేయు వారల కఖిల భోగ





భాగ్యములు గల్గు నాయు రారోగ్యములును
వర్ధిలును జగత్పతి సత్కృపా సమృద్ధి

120. తే.గీ. పద్మ నాభుండు రమ్యక వర్షమందు
మత్స్య రూపమ్ము ధరియించి మహిమ గల్గి
వెలసి యుండును; తద్భూమి విభుడు మనువు
మున్ను స్తుతియించె నమ్మత్స్య మూర్తినిట్లు

121. వ. "ఓం నమో ముఖ్యతమాయ నమః సత్వాయ ప్రాణాయౌజసే
బలాయ మహా మత్స్యాయనమః "అని మనువు నుతించె

122. ఉ. లోపల వెల్పలన్ సకల లోకములందు చరించు నీవు పా
పాపనయుండవై జగము లన్నిటిc ద్రిప్పుచు, నీశ్వరుండవై
దీపిలు చుంటి వయ్య; జలధిన్ బ్రళయాంతమునందు నిల్చి, నీ
వాపయి సృష్టికిన్ దగినయట్లు విచారణ సేయుదొంటిగన్

123. కం. అని రమ్యక వర్షప్రజ
లనయము నామత్స్యరూపు నానందమునన్
మనముల ధ్యానించు కొనుచు
ననఘాత్ములు నై చరింతు రమర మునీంద్రా!

124. మ. భగ వంతుండు హిరణ్మయంబనెడి దివ్యంబైన వర్షంబునన్
దగ కూర్మాకృతి నిల్చె యోగపతియై, తద్రూపమున్ ముందుగా
తొగ సూడచ్చట సంస్తుతించె కడు సంతోషమ్మునన్, మీదటన్
ప్రగతిన్ బొందిరి కచ్చ పాకృతు హరిన్ బ్రార్థించి యచ్చోప్రజల్

125. వ. "ఓం నమో భగవతే అకూపారాయ సర్వ సత్త్వ గుణ
విశేషణాయ నోపలక్షిత స్థానాయ నమోవర్ష్మణే,
నమో భూమ్నే నమోఽవస్థానాయ నమస్తే" అనిఅర్యముడు
హిరణ్మయ వర్ష ప్రజలతో కలసి కూర్మరూపమ్మును నుతించె

126. ఉ. ఆది వరాహ మూర్తియగు నచ్యుతు దుత్తర భూములందు తా
మేదిని సన్నుతింప నెలమిన్ వసియించు కవీంద్రులున్ బుధుల్
వేద విదుల్ నిరంతరము వేడ్కభజింపగ నెల్లవారి సం
వేదన లెల్లc బాపుచు సువిస్తర శోభ లెసంగc బృథ్వికిన్

127. వ. “ఓం నమో భగవతే మంత్ర తత్త్వలింగాయ యజ్ఞక్రతవే
మహాధ్వరావయవాయ మహావరాహాయనమః, కర్మ శుక్లాయ
త్రియుగాయ నమస్తే “అని భూదేవి వరాహమూర్తిన్ స్తుతియించె

128. మ. కింపురు షాఖ్య వర్షమున కేసరి సూనుడు సంస్తుతింప ది
వ్యంపు వపుర్ధరుండయి దివాకర వంశ్యుడు రామమూర్తి తా
నింపుగ నిల్చి యుండు తన యింతిని సీతను గూడి శీలమే
సంపద యై దలిర్ప ననిశమ్మును సాధు జనాళిఁ బ్రోచుచున్

## విశిష్ట భార తావని

129. మ. భరతోర్విన్ జనియించు నట్టి జనులే భాగ్యోన్నతుల్ నారదా!
పరమాత్ముండగు విష్ణుమూర్తి తమకున్ భక్తిన్ బ్రసాదింప దు
ష్కర యజ్ఞాది తపోవిధానముల దుస్సాధ్యం బనన్ జెల్లు నా
పరమోత్కృష్ట ఫలంబు వారల కిలన్ బ్రాప్తించు భక్త్యున్నతిన్

130. చం. పిలిచిన పల్కు శీఘ్రముగ వెన్నుడు భారతవర్ష వాసులౌ
నలఘు తరంపు భక్తులకు; నార్తిగ నొక్కక్షణమ్ము నెమ్మదిన్
దలప భయంబుఁ బాపు నిది తథ్యము, వేరొక చోట జన్మ మే
ఫలమునొసంగు?, నిందలి భవంబది గొప్ప వరంబె యెంచగన్

131. కం. కలవిట పెక్కు నదీనద
ములు, కలవిక పెక్కు పుణ్య భూములు నిచటన్
కలవు చతుర్వేదమ్ములు
వెలసెన్ శాస్త్రమ్ములిచట విజ్ఞాన ఖనుల్

132. ఉ. కాదది వాసయోగ్య, మెటఁగల్గదొ విష్ణుకథా సుధారసం,
బేదది సాధు భక్తజన హీనమొ, యెచ్చట యజ్ఞ కర్మముల్
మాదిరి కైనలేవొ యది మానుగ వాసవు లోకమైన, న
య్యాదిజు లోకమైన, నిటలాక్షుని లోకమెయైన నారదా!

133. మ. భరతోర్విన్ జనియించినట్టి జనులెవ్వారున్ తలంపంగ బో,
రరుదౌమోక్ష పదమ్ము చిత్రము, పునర్జన్మంబు భావించి భూ
ధర వృక్షాదిక జన్మముల్ గొనుటకే తామెప్డు వాంఛింతు రీ
ధరపై దీని పవిత్రతన్ దలచి తద్బంధంబదేమోకదా!





134. మ. అనయంబిచ్చట యజ్ఞ కుండముల నాయా మంత్రపూర్వంబుగా
మనుజుల్ శ్రద్ధగ వ్రేల్చు హవ్యముల సంభావించి గైకొందు ర
య్యని మేషుల్ నిరతమ్ము; యజ్ఞ పురుషుండంభోజనేత్రుండు, కో
రిన కోర్కెల్ సమకూర్చు వారలకు సంప్రీతిన్ విశేషమ్ముగా

135. వ. మఱియు నారదా! స్వర్ణప్రస్థ, చంద్ర శుక్ల, ఆవర్తన, రమమాణ,
మందర, హరిణ, పాంచజన్య, సింహళ, నామమ్ములతో
నీ జంబూ ద్వీపమున కెనిమిది ఉపద్వీపములునుఁ గలవు.

## ప్లక్ష ద్వీపము

136. మ. పొలుచున్ ద్వీపములందు ప్లక్షమది జంబూ ద్వీపమున్ బోలి, యా
స్థలమం దగ్ని హిరణ్మయుండు, మఱియున్ దత్ప్రాంత మేలెన్ గడున్
బలవంతుండగు సప్తజిహ్వు, డతడున్ బ్రాయమ్ము నిండన్ గుమా
రులకున్ ద్వీపముఁ బంచి యిచ్చి చనె చిద్రూపున్ బరున్ గొల్వగన్

137. కం. శివుడున్, యవసుడు, భద్రుడు
నవలన్ శాంతుడును క్షేము డమృతు డభయుడున్
ధవులైరి ప్లక్షమున గల
వివిధములగు భాగములకు వేర్వేర మునీ!

138. వ. మఱియు నా ప్లక్ష ద్వీపంబున అరుణ, నృమ్ణ, ఆంగిరసి,
సావిత్రి, సుప్ర భాతిక, ఋతంభర, సత్యంభర యను సప్త
నదులును; మణికూట, వజ్రకూట, ఇంద్రసేన, జ్యోతిష్మత్,
సువర్ణ, హిరణ్యష్ఠీవ, మేఘమాల, అనంబడు సప్త పర్వతమ్ములును గలవు.

139. తే.గీ. హంస యును, పతంగమ్ము, నూర్ధ్వాయనమ్ము,
మఱియు సత్యాంగ, మనెడి నామముల నాల్గు
వర్ణముల వారలుందు రీప్లక్ష భూమి
నచటి నదులందు స్నానమ్ము నాచరింప
సకల పాపముల్ దొలగు నిస్సంశయముగ

140. చం. సరసిజ మిత్రుఁగొల్తురు ప్రజల్ నిరతమ్మును భక్తియుక్తి నిం
దిరవుగ నెల్లవారలు నహీన గతిన్ నిగమోక్త పద్ధతిన్;
పరగ సహస్ర భానుని కృపన్ నివసింతురు వీర లెల్ల సు
స్థిరముగ వేయి వర్షములు చింత లెఱుంగక శాంతచిత్తులై

141. కం. ఇక్షు సముద్రముచే నీ
ప్లక్ష ద్వీపమ్ము చుట్టcబడి యుండును నిం
దక్షయమై ప్రజకెల్లన్
దక్షతయును, బలము, బుద్ధి తగ వర్ధిల్లున్

## శాల్మలీకుశద్వీపములు

142. సీ. శాల్మలీ ద్వీప వైశాల్యము ప్లక్షమ్ము
కంటె రెండింతలై గ్రాలు చుండు
నెలమి సురాంభోధి యీద్వీపమును చుట్టి
యుండును గాంభీర్య ముట్టిపడగ
నిందలి శాల్మలీ వృక్షంపు గూటిలో
గరుడుండు వసియించుc గరము ప్రీతి
యజ్ఞ బాహుండు ప్రియవ్రత తనయు డీ
ద్వీప మేలుచు నుండు తేజ మలర

గీ. ఈతడును నిజ ద్వీపమ్ము నేడు గతుల
విభజనము సేసి సుతులకు వేరువేర
నప్పగించెను నేడ్గుర కాదరమున
నిందు సైతము ప్రవహించు నేడు నదులు

143. వ. సురోచనము, సౌమనస్యము, రమణము, దేవ కర్షకము, పారిభద్రము,
ఆప్యాయనము, విజ్ఞాతము, అను నామంబుల నాసప్తభాగము లొప్పుచుండును
శాతశృంగము, వామ దేవము, కందకము, కుముదము, పుష్పవర్షము,
సహస్రశ్రుతి, అనునామంబుల నేడు పర్వతములందుగలవు.
అనుమతి, సినీ వాలీ, సరస్వతీ, కుహువు, రజని, నంద,
రాక, అనునామంబులతో సప్త నదులాద్వీపమ్మునc గలవు.

144. తే.గీ. శ్రుత ధరయు, వీర్యధరయు వసుంధరయు, ని
షుంధరయు నను సంజ్ఞలన్ శోభ గలిగి
వర్ణముల్ నాల్గు గలవిట; వారలెల్ల
కూర్మి సోమేశ్వరున్ భక్తి గొల్తురెపుడు

145. తే.గీ. కృష్ణ శుక్ల పక్షమ్ముల కిరణ రాశిc
బరిధ విల్లెడి సోముడీ ప్రజలకెల్లc





బరగ నధి నాయకుండునై ప్రగతి కెక్కె
దీని చెంతcగలదు కుశద్వీప మనఘ!

146. కం. ఘృతసాగర పరి వేష్టిత
వితత కుశద్వీప మందు వెలుగుచు నగ్ని
ప్రతి యనగ కుశస్తంభం
బతులితమై యొప్పుచుండు నాశ్చర్యముగన్

147. తే.గీ. కాన నిది కుశద్వీపమై ఖ్యాతిc గాంచె
దీనినేలె ప్రియవ్రత సూనుడనఘు
డగు హిరణ్యరేతసుడు సద్యశము హెచ్చ
ప్రజలు సుఖ శాంతులను బొంది వర్ధిలంగ

148. తే.గీ. ఈ నృపాలుడున్ ద్వీపమ్ము నేడు గతుల
విభజనము సేసి సుతులకు వేరు, వేర
పంచి యిచ్చెను నేడ్గుర, కంచితముగ
వారి యభిధానముల నవి ప్రగతి కెక్కె

149. వ. వసు, వసుదాన, దృఢరుచి, నాభిగుప్త, స్తుత్యవ్రత, వివిక్త, దేవక
నామమ్ములతో నీ ద్వీపము లేడును ప్రసిద్ధికెక్కినవి.
చక్ర, చతుశ్శృంగ, కపిల, చిత్రకూటక, దేవానీక, ఊర్ధ్వరోమ,
ద్రవిణములనెడి పర్వతములును,
రసకుల్య, మధుకుల్య, మిత్రవింద, శ్రుతవింద, దేవగర్భ, ఘృతచ్యుత,
మందమాలిక యను నామంబుల నేడు నదు లిందు ప్రవహించుచుండు,
మఱియు కుశల, కోవిద, అభియుక్త, కులక నామధేయంబుల
చాతుర్వర్ణ్యవిభాగంబిందుcగలదు వీరెల్ల రగ్ని నుపాసింతురు

150. కం. ఇందలి నదీ జలమ్ములc
బొందుగc బానమ్ముc జేయు పుణ్యాత్ములకున్
జెందును సకలైశ్వర్యము
లెందున్ రోగముల బాధ లేర్పడ వెపుడున్

## క్రౌంచ ద్వీపము

151. కం. కలదు కుశద్వీపమ్మున
కలతిన్ దూరమున క్రౌంచ మనియెడు ద్వీపం

బలఘు క్షీర పయోనిధి
వలయిత మైయొప్పి క్రౌంచ పర్వత యుతమై

152. తే.గీ. ఇది కుశద్వీపమునకు రెండింతలుండు
పూర్వ మిట క్రౌంచ పర్వతమును కుమార
స్వామి భేదించె తనదైన శక్తిచేత
అనఘుడౌ ప్రియవ్రతునకు నాత్మజుండు
ప్రీతిఁ బాలించె ఘృత పృష్ఠ విభుడు దీని

153. కం. ఇతడున్ ద్వీపము నేడ్గురు
సుతులకు విభజించియిచ్చి సుస్థిర మతి స
ద్గతి మదిఁగోరి తపస్సం
గతుడై పరమాత్ముఁ జేరె కాలంబేగన్

154. వ. ఆమ, మధుర రుహ, మేఘ పృష్ఠ, సుధామక, భ్రాజిష్ఠ, లోహితార్ణ,
వసస్పతి, యను నామమ్ములతో నాయేడు దేశము లొప్పుచున్నవి.
మఱియు శుక్ల, వర్ధమాన, భోజన, ఉపబర్హణ, నంద, నందన,
సర్వతో భద్రయను పర్వతములు,
అభయ, అమృతౌఘ, ఆర్యక, తీర్థవతి, వృత్తిరూప
వతి, శుక్ల, పవిత్ర వతిక, అనునేడు నదులును ఈ ద్వీపమునగలవు.

155. కం. చాతుర్వర్ణ్యమ్ముల జను
లేతత్తటినీ జలముల నిచ్చన్ గొనుచున్
బ్రతుకుదురు భోగ భాగ్యో
న్నతులై వరుణుని గొలుచుచు నయవర్తనులై

156. తే.గీ. ఋషభ, దేవక, ద్రవిణ, పురుషు లనంగ
నాల్గు వర్ణముల జను లనవరత మట
వరుణ దేవుని మదినిల్పి భక్తి తోడ
చేయు చుందు రుపాసనల్ స్థిరమనముల

## శాకద్వీపము

157. శా. క్రౌంచద్వీపము చెంతనే గలదు 'శాకద్వీప' మాదీవి చు
ట్టంచుల్ త్రాకుచు మండ సాగరము వృత్తాకారమైయుండు; క
న్పించున్ శాక మనంగ నొప్పు బలమౌవృక్షంబు తద్వీప మం;
దెంచన్ దానిని 'శాక'మంటకు కతం బీ శాక వృక్షంబె యౌ

158. తే.గీ. ఇదియు విస్తీర్ణమందు ముప్పదియు రెండు
లక్షలౌ యోజనములు కలదు నిజమ్ము
దీని నేలె ప్రియవ్రత సూను డలఘు
యశుడు మేధాతిథి మిగుల నాదరమున

159. తే.గీ. ఆతడును నేడ్గురు సుతుల కవని యెల్ల
సమముగా పంచి యిచ్చి నిస్సంగ బుద్ధి
యోగ మార్గావ లంబుడై యంతమందు
మోక్షమును బొందె నిజవంశ పూర్వులవలె

160. వ. పురోజవుడు, మనోజవుడు, పవమానకుడు, ధూమ్రానీకుడు,
చిత్ర రేఫుడు, బహు రూపుడు, విశ్వధృక్కుడు, అను నామంబుల
నయ్యేడుగురును ప్రసిద్ధివడసిరి.
అట్లే ఈశాన, ఊరు శృంగ, బలభద్ర, శతకేశర, సహస్రస్రోతక,
దేవపాల, మహాశన అను పర్వతము లీరాజ్యాలకు
సరిహద్దులుగ నున్నవి
అనఘ, ఆయుర్ద, ఉభయవృష్టి, అపరాజిత, పంచపది,
సహస్రశ్రుతి, నిజధృతి అనుపేర్లు గల నదు లీరాజ్యముల
యందు ప్రవహించు చున్నవి.
మఱియు సత్యవ్రత, క్రతువ్రత, దానవ్రత, అనువ్రత, అను
భేదములతో చాతుర్వర్ణ్యముల వారిందు గలరు. వీరెల్ల రీశ్వరు నుపాసింతురు

## పుష్కర ద్వీపము

161. శా. శాకద్వీపము కంటె పుష్కరము వైశాల్యమ్మునన్ మిన్నయై
వీకన్ శుద్ధ జలార్ణ వావృతమునై, భృంగార పద్మాంచిత
మ్మై, కమ్రాకృతి వెల్గు చుండు, నిట నీయబ్జంబు పైనన్ సదా
శ్రీ కంజోద్భవు డుండుఁ గాన నిది వర్ణింపన్ బడెన్ శ్రేష్ఠమై

162. తే.గీ. కనక పుష్కర ముండిన కారణమున
పుష్కర ద్వీప మనుపేరఁ బొల్చె నిద్ది

మాన సోత్తర మనియును దీనినెపుడు
ఋషి వరేణ్యులు బల్కుదు రిచ్చకమున

163. ఉ. దీనిని వీత హోత్రుడు సుధీమణి యేలె ప్రియవ్రతాఖ్య భూ
జాని తనూ భవుండు కడుసమ్మతి; నీతని కిర్వురాత్మజుల్
గాన నిజావనిన్ సమముగా సుతు లిర్వురకిచ్చి యిచ్చమై
తాను కడింది భక్తి పరతత్పరుడై కనె ముక్తిధామమున్

164. చం. రమణయు, ఘాతకీ యన విరాజిలు దేశము లవ్వి, వానికిన్
సమముగ హద్దునా నవధి శైలము మిక్కిలి యున్నతంబుగా
నమరి కనంబడున్, మఱియు నగ్గిరి శృంగపు నాల్గు దిక్కులన్
గ్రమముగ పట్టణమ్ములు విరాజిలుచుండు మహాద్భుతంబులై

165. చం. ఆ నగరమ్ము లెల్ల దివిజాధిపుడాది దిగీశ వాసముల్,
భానుడు మేరువున్ దిరిగి వచ్చిన యంతట గోచరించు ముం
దా నగ శృంగ భాగమున నద్భుతరీతిగ; మాన వాళికిన్
భానుడె కాలచక్రము నవారణ ద్రిప్పెడి దేవుడెన్నగన్

166. కం. ఈ పుష్కర దేశమ్మున
కాపురముల్ సేయువారు కర్మల తోడన్
శ్రీపరమాత్ము భజించుచు
నాపైఁబడయుదురు ముక్తి నంతము నందున్

## లోకాలోక పర్వతము

167. మ. అటుపై మిక్కిలి యున్నతంబగుచు లోకాలోక దివ్యాంతరో
త్కట దేశంబున పర్వతం బొకటి లోకాలోక నామంబునన్
దిటవైకన్పడు, తత్ప్రదేశమది యుద్దీపించు భృంగారపున్
బటు కాంతిన్ వహియించి దర్పణ మటుల్ ప్రాశస్త్యమున్ బొందుచున్

168. మ. కనరా వచ్చుట ప్రాణు లెవ్వియును, మూర్ఖత్వంబుతో నెవ్వరేన్
జనినన్ రారిక నెన్నడేనియునుఁ గానన్ దాని కాపేరు వ
చ్చెను, దానిన్ బరమేశ్వరుండు సృజియించెన్ మూడులోకాలకున్
గొన భాగమ్మున నున్నతంబనగఁ దక్కున్ వాని కాధిక్యమై





169. శా. భానుండాది ఖగోళ పంక్తులును నర్వాచీనముల్ దీని కో
మౌనీంద్రా! సువిశాల మయ్యది గణింపంగా చతుర్థాంశమై
కానన్ వచ్చు ధరాతలంబునకు, మున్ గంజాసనుం డిమ్మగన్
దానోద్వృత్త దిశా గజంబుల నిటన్ దా నిల్పె నల్దిక్కులన్

170. సీ. పొసగ ఋషభమన, పుష్ప చూడము,వామ
నమ్మును నపరాజి తమ్మునగ
నభిధానముల నొప్పు నా దిగ్గజమ్ములు
నాధారములవియె యఖిలమునకు
నష్ట సిద్ధులఁగూడి హరి నిరంతరమును
తన విభూతుల కెల్ల తగిన రీతి
శక్తి సామర్థ్యముల్ యుక్తు లైశ్వర్యమ్ము
లందించు చుండు నెయ్యమ్ము గదుర

ఆ.వె. సకల లోకములకు సర్వ శుభములిడ
నాయుధములు నాల్గు హస్తములను
దాల్చియుండు నతడు తథ్యమీ జగములు
లయముఁ జెందు దన్క నియతి తోడ

171. కం. తనమాయా విరచితమై
తనరెడి యీ జగములుండుఁ దన వెల్పల లో
నను లోకాలోక స్థితిఁ
గనుపించుచుఁ గన పడకయు కల్పము వరకున్

## సూర్యచంద్రాది గ్రహగతులు

172. కం. లోకాలోకాద్రికిపై
నాకాశము గలదు మిగుల నమలంబగుచున్
శ్రీకరుడగు సూర్యుడు తాఁ
బ్రాకటమై మధ్యనుండు బ్రహ్మాండమునన్

173. చం. ద్యుమణికి భూమికిన్ నడుమ దూరము నెంచగ యోజనమ్ములం
దమరెను కోటు లిర్వదియు నైదును; సూర్యుని కారణమ్మునన్
గ్రమమున నీయజాండమున గన్పడు భిన్నవిధంబు లౌచు నా
కమును, దిశల్, వియత్తు, నరకంబును, పృథ్వియు, నాగలోకమున్

174. మ. తపనుం డొక్క మృతాండజుండగుట మార్తాండుండు నానొప్పె; తా
తపనీ యాండజుడై హిరణ్యభవ సార్ధక్యాభిధానంబుతో
నుప చారంబులు బొందు; నాత్మయతడే యోచింపఁదిర్యక్‌సరీ
సృప మర్త్యామర వృక్ష జాతులకు, తానే యీశ్వరుండెంచగన్

175. సీ. ఇపుడు నే తెల్పిన దీ భూమి విషయమౌ
నటుపైన నూర్ధ్వమం దమరె దివము
అంత రిక్షమ్మునం దలరుచు భాస్కరుం
డీ త్రిలోకముల దీపింపఁ జేయు
నారోహణ స్థానమగు నుత్తరాయణ
మందు దీర్ఘమ్ములై యహములొప్పు
నవరోహణస్థాన మగు దక్షిణాయన
మందు సన్నమ్ములౌ నహము లెల్ల

గీ. పగలు రాతిరియును విషువత్తు లోన
సమములైయుండు; భానుడా సమయమందు
నంతరిక్షాన సమముగా నరుగు కతన;
కాలభేదమ్ము లీరీతి కలుగు చుండు

176. ఉ. ఆ రవి మేషమందు, తులయందును సాగెడి కాలమందు వి
స్తారము నల్పమున్ గనక సామ్యత నుండు నిశల్ పగళ్ళు; వి
స్తారము లౌపగళ్ళు రవి తా వృషభాదిగ నైదు రాశులన్
జేరెడు నుత్తరాయన విశేషపు కాలములందు సమ్మనీ!

177. తే.గీ. విస్తరించును రాత్రులు వృశ్చికాది
పంచరాశుల భానుండు సంచరింప
నదియె పేర్కొనఁ బడె దక్షిణాయన మన
శాస్త్ర విదులైన వారిచే సమ్మతమున

178. తే.గీ. మంద, శీఘ్ర, సమగతుల చంద మిట్లు
కలిగె పద్మ బాంధవునకు కాలమందు
గ్రహములకు నిట్లె స్థానముల్ గలవు మూడు
మధ్య మోత్తర దక్షిణ మార్గములన





179. తే.గీ. మార్గమది "జరద్గవ"మగు మధ్యమమ్ము
ఒనర "నైరావ" "తమ్మది యుత్తరమ్ము
చెల్లె"వైశ్వానర"మది దక్షిణమనంగ
వీధులీ మార్గములకు వేర్వేరఁగలవు
మూడు మూడేసి వినుము సమ్మదము తోడ

180. తే.గీ. పరగ ఋషభ, గో, జారద్గవమ్ము లవియు
మూడును జరద్గవమునకుఁ గూడియుండు,
రమ్యమౌ నాగము, గజ, మైరావతమ్ము,
ననగ నైరావతమునకు నమరి యుండు,
అజయు, మార్గియు వైశ్వాన రాఖ్యలఁదగి
వెలయు వైశ్వానరమునకున్ వీధులగుచు

181. సీ. అశ్వనీ భరణులు నవలి కృత్తిక యునుఁ
దగ"నాగవీథియై" తనరు చుండు
రోహిణీ మృగశిర యుక్తమై నార్ద్రయు
గజవీధి యనగఁ బ్రఖ్యాతి వడసె
పుబ్బ, ఉత్తర, మఖల్ పొల్పొంద ఋషభమై
విఖ్యాతి వడసె నీ విశ్వమందు
హస్తయున్ జిత్తయు నమలమౌస్వాతియు
గోవీథి యయ్యె ఖగోళమందు
మూలయు నాషాఢముల్ రెండునున్ గూడి
అజ వీధి యన నొప్పె నాకసమున

తే.గీ. శ్రవణయున్ ధనిష్ట శతభిషయును గూడి
అంతరిక్షాన మృగ వీధి యనగఁ బరగె
రెండు భద్రలును మఱియు రేవతియును
నలరె వైశ్వానరీ వీధి యనగ దివిని

182. తే.గీ. వాయురూప పాశము లుత్త రాయనమున
గట్టిగా లాగి పట్టిన కారణమున
మందగతి సాగు భానుని స్యందనమ్ము
కాన నిడివియై యుండు పగళ్ళు మిగుల
నిదియె యారోహణంబని యెంచఁబడియె

183. తే.గీ. దక్షిణాయన మందు తత్పాశములను
వదలి పెట్టుట నరదమ్ము పరువువెట్టు
శీఘ్ర గతిఁగాన నహములు చిన్నవయ్యె
దీని నవరోహణమ్మని తెలియ వలయు

184. తే.గీ. వైషు వమ్మున సమగతిఁ బాశములను
పట్టి యుంచిన కతమున పగలు, ఱేయి
సమములై యుండుగాన నీ గమనగతిని
మధ్యమండల గతియని మాన్యులనిరి.

185. సీ. మేరు గిరీంద్రపు తూరుపు దిక్కున
నమరేంద్ర పురి గల 'దైంద్రి' యనగ
దక్షిణమ్మున యమ ధర్మరాజు పురము
సంయమనీ పుర సంజ్ఞ నొప్పు
పడమర వరుణుని పట్టణమ్ము గలదు
'నిమ్లోచనీ' యన నిర్మల గతి
ఉత్తర దిక్కు నం దొప్పు కుబేరుని
పట్టణమ్మది 'విభా వరి' యనంగ

గీ. భాను డుదయించు నింద్రుని పట్టణమున
యమ పురిన్ జేరు కొనును మధ్యాహ్నమునకు
నవల నిమ్లోచనీ పురి నస్తమించు
రాత్రి గడపుఁగుబేర పురమ్ము నందు

186. తే.గీ. మేరు పర్వతమునఁగల వారి కెపుడు
గగన మధ్యమ్మునన్ రవి కానుపించు
ఎవరి కెటు వైపు ముందు కన్పించు నినుడు
వారలకు నెల్ల నయ్యదే తూరుపగును

187. చం. అరుణునకున్ దలంప నుదయాస్తమయంబులులే, వతండు సు
స్థిరుడగు, దృశ్యమౌచును నదృశ్యము నౌచును నుంటచే నిటుల్
పరిగణనం బొనర్పఁబడె భావ వికల్పము చేత; కాల దిక్
పరిమితు లవ్వి యేర్పడెను ప్రాణులకున్ వ్యవహార సిద్ధికై





188. తే.గీ. రవికి వామభాగము నుత్తర మ్మటంచు
కుడిని దక్షిణ మనుచు పల్కుదురు బుధులు
దర్శనాదర్శనముల భేదమును బట్టి
తూర్పుపడమర దిక్కులు తోచుచుండు

189. సీ. ఇనుడైంద్రి నుండి దక్షిణమునకున్ జేరఁ
బదునైదు గడియలు పట్టు ననగ
నయ్యది రెండు కోట్లాపైన ముప్పది
యేడు లక్షల డెబ్బదేను వేల
యోజనముల దూర ముండు ననియెదరు
పడమటికిని నేగు పగిది యదియె;
పూషుని రథమొక్క మూరుతమునకు ము
ప్పది నాల్గులక్ష లెన్మిదియు నూ ర్ల

గీ. యోజనమ్ములు నేగుచు నుండు సతము
సరిగ తొమ్మిది కోట్ల యోజనము లనుది
నమ్ము పయనించు చుండు నత్తమ్మి హితుడు
గ్రహము లితని ననుసరించి కదలు చుండు

190. సీ. ఒక్క చక్రము తోడ నొప్పుచునుండు న
య్యర్కుని దివ్యంపు స్యందనమ్ము
పదియు రెండాకులున్ పరగ మూడడ్డలు
నేమి షట్కంబును నియమ గతిని
గలుగు తచ్చక్రమున్ కవులు వర్ణింతురు
సంవత్సరాత్మక సంజ్ఞ తోడ
దాని యక్షంబొండు తగమేరు శిఖరాన
వేరొండు ధ్రువునిపై చేరి యుండు

ఆ.వె. సప్త సంఖ్యఁగలుగు ఛందస్సులే దీని
కశ్వ సప్తకమ్ము లైవెలుంగు
అరుణుడు గరుడునకు నగ్రజుండనఘుడు
దీని నడపు చుండు తేజమెసగ

191. చం. అలయక వాలఖిల్యమును లర్వది వేవు రనారతంబు నా
జలజ హితున్ స్తుతింతురు ప్రశస్తములౌ్రశ్రుతి సూక్త సంహతిన్
దలగక యచ్చరల్ మునులు దైత్యులు దివ్యులు నాగులున్ సదా
నెలకొక యేడ్గురై మొనసి నెమ్మినుతింతురు చండభానునిన్

192. చం. వినుమిక మౌని వర్య! విని పింతును చంద్రునిఁ గూర్చి, వానితో
ననుగమనంబొనర్చెడి గ్రహాదులఁ గూర్చియు; తద్గతుల్ గడున్
వినుటకు చిత్రమౌను, పృథివీస్థలిఁ గల్గిన మానవాళి జీ
వనమున మంచి చెడ్డల కవశ్యము నయ్యవి హేతు భూతముల్

193. ఉ. కుమ్మరి సారెపై క్రిములు కూటువలౌచు పరిభ్రమించు చం
దమ్మున కాలచక్రమున తద్గ్రహ సంతతి భానుఁగూడి సే
మమ్ముగ సంచరించును క్రమమ్ముగ మేరువుఁ జుట్టు కొంచు, ని
త్యమ్మును నెల్లలోకముల కభ్యుదయమ్మును గల్గఁజేయుచున్

194. తే.గీ. అందు కొన్ని స్వకీయములై గమించు
నన్యరాశుల నొక కొన్ని యనుసరించు
రెండు విధముల గ్రహగతు లుండునిటుల,
ఆది పూరుషుడు స్వకీయు డర్కు డెపుడు

195. చం. ఋతువుల ధర్మముల్ దలగ నీయక యయ్యయి లక్షణంబులన్
సతతముఁగల్గఁజేయుచు నిజస్థితి నుండు సతమ్ముభాను, డ
త్యతులిత భక్తి వాని నెవ రచ్చన సేయుచు యజ్ఞయాగ స
త్క్రతువు లొనర్చు చుందురొ తిరంబుగ వారికిఁగల్గు శ్రేయముల్

196. ఉ. ద్వాదశ రాశులన్ జలజ బంధుడు సంచరణం బొనర్చుచున్
ద్వాదశ మాస భేదములఁ దాఁగలిగించును;రేఁబవళ్ళు ప
క్షోదయముల్ గనంగ నగు నొక్కొక మాసమునందు; వత్సరం
బాదరణీయ మయ్యెనిటు లారయ కాలగతి ప్రవృత్తిలో

197. కం. తిరముగ సపాద యుతమగు
నిరునక్షత్రముల కాలమే రాశి యగున్
సరియగు తొమ్మిది పాదము
లరయంబడె రాశి యనగ నమర మునీంద్రా!





198. కం. మాసద్వయమొక ఋతువుగ
భాసిల్లున్ ఋతువులారు ప్రతి వర్షమునన్
వాసిన్ రెండయనములుగ
నాసంవత్సరము తెలియ నయ్యెన్ జగతిన్

199. సీ. వత్సరమ్మని పరివత్సరమ్మని యిడా
వత్సరమ్మని యను వత్సర మని
యిద్వత్సరమ్మని యినుని గతులఁ బట్టి
యైదువిధములయ్యె నబ్దములును
సూర్యరశ్మి కవల సోముడు లక్షయో
జనముల దూరాన సంచరించు
పక్ష ద్వయంబున భక్షించు నాతడు
మాస కాలమ్మును మానితముగ

గీ. రవిని మించిన వేగ సంరంభుడగుచు
సంచరించుచునుండు; నీ సమయ మందు
పూర్ణ కిరణుడై యాతండు పొందుగలిగి
యుండునక్షత్రమును బట్టి యుక్తమౌచు
మాస నామమ్ము లేర్పడె భాసురముగ

200. కం. పెరిగెడి కళలన్ చంద్రుడు
సురలకు మిక్కిలిగ ప్రీతి చొప్పడఁజేయున్
తరుగుచు నుండెడి వేళల
నిరవుగ పితృదేవతలకు నింపొన గూర్చున్

201. కం. పగటికి సూర్యుడు కారణ
మగుచుండెడి విధమున నమృతాంశుండును తా
నగును నిశికి కారకు, డీ
జగతిన్ బ్రాణమ్మతండె జంతు తతులకున్

202. కం. ఒక్కొక నక్షత్రమ్మున
నక్కలువల ఱేడు చేరి యరువది గడియల్
నెక్కొని యుండును దీప్తిన్,
నిక్కం బత డమృత పూర్ణ నిలయుండనఘా!

203. తే.గీ. అన్నమయు దోషధీపతి యైన యతడు
ప్రాణికోటికి నెల్లను ప్రాణదాత
సర్వ మయుడని యీతని జగతియందు
పిలుచు చుందురు విబుధులు ప్రీతితోడ

204. తే.గీ. చంద్రునకు సుదూరమున 'భ' చక్రమొందు
శత సహస్రత్రిగుణిత యోజనము లవల
సవ్యముగ మేరు గిరిఁజుట్టి సాగుచుండు
సకల నక్షత్ర కూటమీ చక్రమందు
సంచరించుచు నుండు విస్మయము గదుర

205. తే.గీ. ఈ'భ' చక్రమునకు పైన నెలమి శుక్రు
డుండు నిరునూరు వేలగు యోజనముల
దూరమున సంచరించుచు ద్యుమణిఁ గూడి
ముందు వెనుకల కడు శీఘ్ర మందగతుల

206. సీ. ఈ శుక్రునకు బుధు డిరునూరు వేల యో
జనముల దూరాన సంచరించు
నత్యనావృష్టుల కతడు కారకుడౌచు
భయమును కలిగించు ప్రాణులకును
ఇతనికి ద్విసహస్ర శత యోజనములలో
నంగారకుం డూర్ధ్వమందు గలడు
పక్షత్రయంబుండు ప్రతిరాశి నీతండు
వక్రింప దేని శుభమ్ము లొసగు

గీ. అవల శనియుండు నూర్ధ్వమం దర్కసుతుడు
మందగమనమ్మునన్ మూడు మాసములకు
రాశి మారుచు నీతడు ప్రాణికోటి
కశుభ కారకుడనగ భయమ్ముఁగొలుపు

207. చం. ఒనరగ నీశనైశ్చరున కూర్ధ్వమునందు దశైక లక్ష యో
జనముల దూరమందు ఋషి సప్తక మండల మొప్పుచుండు, వీ
రనయము నెల్ల లోకముల కభ్యుదయమ్మును గోరుకొంచు ద
క్షిణముగ సంచరింతురు ప్రసిద్ధి వహించుచు నాకసమ్మునన్





208. చం. పదనుగ నాఋషీశ్వరులు వర్తిలు మార్గముకంటె యెత్తునన్
పదియును మూడు లక్షలకు పైగల యోజన దూరమందు, స
మ్ముదమున లోక వంద్యుడయి పొల్చుచు నుండు ధ్రువుండు కాంతి సం
పదల గ్రహంబు లన్నిటికి పంచుచు మిన్నున దక్షిణమ్మునన్

209. ఉ. బాగవతోత్తమున్ సుజనవంద్యుని నాతనిఁ జుట్టి నిత్యమున్
జాగొనరింపఁ బోక గ్రహ సంతతు లెల్ల చరించుచుండు సం
యోగిత కాష్ఠ రజ్జువున కొయ్యనఁగట్టగ మండలాకృతిన్
వేగమ పర్వులెత్తెడి విభిన్నము లౌ పశు సంతతిన్ బలెన్

210. మ. ధ్రువ నక్షత్రమె కేంద్ర బిందువుగ సందోహమ్ములై నిత్యమున్
భవితవ్యస్థితి ప్రాణి కోట్ల కిడుచున్ బ్రహ్మాండమం దండజ
ప్రవరంబుల్ బలె నీ గ్రహంబులు సమీర ప్రేరణన్ కాలమం
దవిరోధంబుగ సంచరించు నొక కల్పాంతమ్ముగన్ నారదా!

211. తే.గీ. గ్రహ గణమ్ముల శింశుమారముగఁ దలచి
యోగ ధారణ విద్య యం దున్నతముగ
నారి తేరిన వారు పుచ్ఛాగ్రమందు
ధ్రువుని భావించి ధ్యానింతు రవని యందు
కుండలీ భూత దేహులై కూర్మితోడ

## దేహాంతర్గత జ్యోతిశ్చక్రము

212. సీ. లాంగూల మందు కల్మష విదూరుండగు
నల ప్రజాపతిని ధ్యేయముగ నిల్పి
అగ్నీంద్ర ధాతృలన్ మయ విధాతృల నిజ
పుచ్ఛాంతమందున పూన్చి నిలిపి
కటియందు ఋషి సప్త కమ్మును బావించి
గ్రహముల పార్శ్వభాగముల నెంచి
పృష్ఠమ్మునం దజ వీధిని తల పోసి
గగనమ్ము నుదరభాగమునఁ గూర్చి
వర పుష్యమీ పునర్వసు తారల నెడమ
కుడి యూరువుల సమకూర్చి నిల్పి

ఆర్ద్రనాశ్లేషను నమరంగ సవ్యాప
సవ్య పాదమ్ములఁ జక్కఁ జేర్చి

ఆ.వె. యముని దవడ లందు, నంగార కుని ముఖ
మందు, శనిని గుదము నందుఁ జేర్చి
దేవగురుని నంస దేశమం దమరించి
అర్కు వక్షమందు నమరఁ జేసి

213. తే.గీ. హృదయమందు నారాయణున్ బదిల పరచి
శీతకరుని మనసు నందు చిక్కఁబట్టి
అశ్వినులను స్తనంబుల నాదరించి
శుక్రు నాభీ స్థలమ్మున చూచుకొనుచు
బుధుని నుచ్ఛ్వాస నిశ్వాస ములఁ దలంచి
కంఠమున రాహు కేతుల గౌరవించి
తక్కు నక్షత్రముల రోమ తతిని నిల్పి
విష్ణుమయ దేహుడై యోగి వేద్యుడగుచు
సంధ్యలందున ధ్యానమ్ము సలుప వలయు

214. వ. "ఓం నమో జ్యోతిర్లోకాయ కాలాయానిమిషాంపతయే
మహా పురుషాయాభి ధీమహి" అను మంత్రమును
జపించుచూ యోగ సాధన చేయవలయును.

215. వ. ఈరీతి మూడు సంధ్యల
పూరుషు డీమంత్ర జపము పొందుగఁ జేయన్
దూరంబగు గ్రహదోషము,
లాఱున్ దత్కాల పీడ లాశ్చర్యముగన్

216. సీ. అర్క మండలమున కయుత యోజనముల
దిగువన రాహువు తిరుగుచుండు
గ్రహణ కారకుడౌచు కమల నాభుని కృప
నమర ఖేటత్వము లందియుండు
విస్తరించు నతడు వేయిరెట్లుగ రవిన్
గప్పు సమయ మందు గగన వీధిఁ





జంద్రునిఁగబళించు సమయమ్ము నన్ద్రయో
దశ సహస్రముగ విస్తారుడగును

గీ. చంద్ర సూర్యులఁ గప్పెడు సమయములను
పూర్ణిమల నమా వాస్యల మురవిరోధి
చక్రహతిఁ దొలగి చను విస్మయముగదుర
నిదియె 'యుపరాగ' మనుచు గుర్తింపబడును

217. చం. ఎలమిని నీ గ్రహంబులకు నెల్లను క్రిందుగ సిద్ధచారణా
ద్యలఘు విశేష పుణ్య నిలయంబులు భాసిలు యోజనాయుతం
బులు; మఱి కొంత నిమ్నముగఁ బొల్చును యక్షపిశాచ భూత సం
కలిత విహార లోకము లగణ్యములై గగనమ్ము నందొగిన్

218. కం. వాయు ప్రసరణ నొప్పెడు
నాయవధిగ నంతరిక్ష మనఁబడు, నదియే
పాయక మేఘ సమూహం
బాయతగతి నుండు మేర యైయొప్పారెన్

219. ఉ. దీనికి క్రింది భాగమున తేజరిలున్ శత యోజనంపు దూ
రాన '.ధరాస్థలమ్ము" బహురమ్య సుపర్ణ మరాళ సారస
శ్వేన పతంగజన్మ లకు సీమగ, తక్కిన జీవరాశికిన్
మానుగ జన్మభూమియన మాన్యతనొందుచు సింధుయుక్తమై

## అధోలోకములు

220. తే.గీ. కడు విశాలమై యొప్పెడి గగనములను
గలిగి విలసిల్లు నపర నాకముల వోలె
నయుత యోజన విస్తీర్ణమౌచు నుర్వి
క్రింద సప్త రంధ్రమ్ము లానంద దములు

221. కం. అతలము, వితలము, సుతలం,
బతుల తలాతలమనగ, మహాతలమనగన్,
వితత రసాతలమన, స
న్నుతగుణ! పాతాళ మనగ నుతిగనె నవియున్

222. చం. బలయుతులైన దైత్యులును, పన్నగ, దానవ సంఘముల్ స్వకీ
యులగు కళత్ర పుత్ర హిత యుక్తులునై యనురక్తి తోడ ని
ష్కలుషపు భక్తి నీశ్వరుని సమ్మతిఁ గొల్చుచు గర్వపూర్ణ సం
కలితులునై వసింతు రధికంబగు మాయలు నేర్చి యిచ్చటన్

223. చం. మయుడను శిల్పి వీరలకు మానిత రత్న విభూషితోత్కరం
బయి విలసిల్లు పట్నముల నాయతమైయలరారు వీధులున్
నియమిత గోపురాగ్రములు నెక్కొను మంటప సౌధపంక్తు, లిం
పయిన వనంబులున్ గలుగునట్లు రచించి యొసంగె నేర్పునన్

224. చం. జరయును, రోగముల్, తనువు జారుటయున్, పలితంపుకేశముల్,
తరుగుట, రంగు మారుటయు, దైన్యము, లౌషధసేవనంబులున్,
పొరిపొరి ఘర్మబిందువులు పొల్చుట, దుర్భరమేని గంధముల్,
మరణభయమ్ము, లెన్నడును మచ్చునకున్ గనరావు వీరికిన్

225. కం. మురహరు చక్ర భయమ్మే
తఱచుగఁ గలగించు చుండు తద్దయువారిన్
విరివిగ తద్భయమున త
త్తరుణుల గర్భములు జారు దైన్యం బెసగన్

226. చం. అతలమునాఁబ్రసిద్ధమగు నగ్ర బిలంబున, తొంబదారుగా
నతులిత మాయలన్ గఱచి యద్భుత రీతి త్రిలోక వాసులన్
మతులు భ్రమింపఁ జేయఁగల మానినులన్ సృజియింపగల్గి యు
ద్ధతి 'బలు'డన్ననామమున నమ్మయునాత్మజు డుండు స్వేచ్ఛమై

227. ఉ. ఆతనిచే సృజింపఁబడి యంగన లెల్ల విలాస లాస్య వి
ఖ్యాతులు మందహాస పరికంపిత నేత్రలు నౌచు పూరుష
వ్రాతము నెల్ల కౌగిళులఁ బట్టుచు పుల్కలెసంగ బల్కుచున్
చేతము లుల్లసిల్లగ విశేష సుఖంబుల గూర్తు రయ్యెడన్

228. తే.గీ. తల్లిదండ్రులు లేని స్వతంత్రులైన
యచటి తరుణుల చేష్టల కాత్మలందు
సంతసము లెసగ నచట సంచరించు
పురుషు లెల్లరు గర్వ సంభరితులగుచు





నేనెసిద్ధుడ నీశుడ నేనె బలుడ
ననుచు విహరింతు రధిక మదాంధులగుచు

229. చం. ఇక వితలమ్మునం దల మహేశుడు స్వీయ గణంబు తోడ సు
ప్రకటితుడై యుమన్గలసి రాజిలు చుండును కంజ గర్భు సృ
ష్టికిఁగడు విస్తృతిన్ గలుగఁ జేయుచు నాకుల సేవ లిచ్చ నం
దుకొనుచు 'హాట కేశు'డను నూతన నామముఁదాల్చి నిచ్చలున్

230. ఉ. ఈ వితలమ్మునందు ప్రవహించుచు నుండును నిత్య మమ్మహా
దేవుని వీర్యధార నొక దివ్య తరంగిణి హాటకీ యనం
గా విలసిల్లి; తత్తటినిఁగల్గు తరంగ సమూహముల్ సదా
జేవురు రంగుతో ననల జిహ్వలకున్ సరివచ్చు చుండెడున్

231. తే.గీ. అచట లభియించు కనకమ్ము హాటకమన;
దాన నచటి యువతులు సంతసము తోడ
నాభరణములు చేయించి శోభలొల్క
మేన ధరియించు చుందురు మిక్కిలి గను

232. కం. వితలమునకు దిగువననే
సుతలంబను బిలము గలదు సువిశాలంబై
సుత గుణుడు 'బలి' విరోచను
సుతు డేలుచు నుండు దాని సుఖ శాంతులతో

233. చం. సురపతి మేలు గోరి మధు సూదను డా బలిచక్రవర్తి న
చ్చెరువుగ నీ తలంబునకుఁ జేర్చెనె కాని సురాధి నాధు రా
జ్యరమ వరింప దయ్యె, దను జాధిపునిన్ ద్యజియింపదయ్యె, యీ
ధరణి సమస్తమున్ హరికి దానమొసంగిన సత్ఫలంబనన్

234. చం. అని మహనీయులాతని నిరంతరమున్ గొనియాడు చుందు,రై
నను సరిపోల వానుతులు నారద! యుర్వర నెల్ల నాజనా
ర్దనునకు దానమిచ్చిన యతండు గడించెడి తత్ఫలం బిదే
యనఁదగ దచ్యుతుండు పురుషార్థ విధాయకుడై వెలుంగుటన్

235. తే.గీ. హరికి సర్వస్వ మర్పించి నట్టి బలికి
కర్మ బంధ ప్రసక్తికి కారణములు

రాజ్యవిభవమ్ములేల సంప్రాప్త మగును;
వామ నాకృతి తన వైభవముల నెల్ల
నపహరించి శరీర మాత్రావ శిష్టు
గా మిగిల్చె ననుటయె నిక్కమ్ముతలప

236. ఉ. అంతటి బుద్ధిమంతుడు బృహస్పతియే తనమంత్రి యయ్యు, తా
నెంతటి మూఢుడౌనొకొ మహేంద్రుడు;శ్రీహరియే ప్రసన్నుడై
చెంతన నిల్చి యుండగ నిసీ! విభవమ్మును గోరెఁగాని, తాఁ
జింతనఁ జేయదయ్యెగద! శ్రేష్ఠ తమంబగు ముక్తి ధామమున్

237. ఉ. ఆ దనుజేంద్రు తాత దనుజారికి భక్తుడు, విజ్ఞుడౌట, ప్ర
హ్లాదుడు భక్తవత్సలు ననంతుని కోరెనె రాజ్యభోగముల్?
శ్రీదయితున్ దదీయ పద చింతనఁజేసెడి బాగ్యమొక్కటే
యాదరవృత్తి నిమ్మనియె నంతటి యోగ్యులు మున్నుఁగల్గిరే?

238. చం. బలియును నట్టి వాడగుట ప్రాజ్ఞులచేఁదగ పూజలందుచున్
చెలిమిని పద్మనాభుడె ప్రసిద్ధిగ నాతని యింటి ముంగిటన్
దలగక సేవకున్ బలె ముదమ్మునఁ గావలి కాయుచుండ తా
నిలిచెను తత్తలంబున గణింపగ నౌనె తదీయ భాగ్యముల్

239. మ. దశకంఠుండు త్రిలోకముల్ గెలువగా దర్పోద్ధతుండై వెసన్
దిశలన్ గెల్చుచు తత్తలంబునకు నేతేరన్ దదుద్వృత్తికిన్
భృశమున్ గిన్కవహించి శ్రీపతి కడున్ వేగంబుగా పాద క
ర్కశ ఘాతంబునఁ దన్నె వానినతి దూరంబందుఁ ద్రెళ్ళన్ వడిన్

240. చం. సుతలము క్రిందనే గలదు శోభదలిర్ప తలాతలంబు నాన్
వితత బిలంబు; దాని నతి వేడుక నేలు ననేక మాయలం
దతి చతురుండు దానవుల కాదరణీయుడునై 'మయుండు' మా
పతికృప రాజ్యమున్ గొని యపార వివేక విశారదుండనన్

241. చం. కలదు మహా తలంబనగ కద్రువ పుత్రుల కాలవాలమై
యెలమిఁదలాతలంబునకు నింకను క్రిందుగ; పక్షిరాడ్భయం
బలము కొనన్ సతీసుత హితావళితోడ సుషేణ తక్షకా
ద్యలఘు ఫణీంద్రు లీ తలము నందెవసింతు రతిప్రమత్తులై





242. ఉ. దీనికి క్రిందనే గలదు దీర్ఘబిలంబు రసా తలంబనన్
దానవ దైత్య నాగకుల దర్పిత దేహుల కిక్క యౌచు, నా
దానవ వైరి శ్రీహరి సతంబును వారల విక్రమంబులన్
బూని యడంచు చుండ బిలముల్ వడిఁ జొత్తురు భీత చిత్తులై

243. మ. తత విస్తారమునై రసాతలము క్రిందన్ బొల్చు చుండున్ మహో
న్నత పాతాళము, నాగ లోక మనియున్ దానిన్ బ్రశంసింతు, ర
ప్రతిముల్ వాసుకి, శంఖచూడ, ధృతరాష్ట్ర, శ్వేత, శంఖాది వి
స్తృత కోపావిల మూర్తులుందు రచటన్ స్ఫీరోగ్రు లాశీవిషుల్

244. ఆ.వె. పంచ సంఖ్య మొదలు ఫణసహస్రంబుల
నలరు చుందు రందు నహివరేణ్యు
లలఘు మణుల తోడ నలరారు తద్భోగ
కిరణ సమితి తమముఁ గెడపునచట

245. కం. ఆ పాతాళము క్రిందన్
బ్రాపుగఁ ద్రి సహస్ర యోజ నమ్ముల దవ్వై
దీపించు 'తామసీ'కళ
వ్యాపించి 'యనంత' యనెడు నభిధానమునన్

246. చం. తనర సహస్ర శీర్షముల ధాత్రిని మోయుచు నాదిశేషు డ
త్యనుపమ శక్తియుక్తుడు ననంతు డటన్ గల సర్పకోటి చే
ననయముఁ బూజలన్ గొనుచు నందు విరాజిలుచుండు, నెల్లర
య్యనఘుని నాదిదేవుడని యాత్మల నెంచి భజింతు రాదృతిన్

247. తే.గీ. పదియు నొక్కటి వ్యూహముల్ పదిల పడగ
రుద్రు డుదయించె శేషుని భ్రుకుటినుండి
త్ర్యంబకుడు త్రిశూల ధరు డుగ్రంపు మూర్తి
అతని సంకర్షణుండని యభినుతింత్రు

248. చం. సతతము నాగముఖ్యులు విశాల ఫణాగ్ర విశిష్ట రత్నసం
తతుల ననంతు సారస పదమ్ముల కద్భుత నూత్నకాంతి వి
స్తృతి నరుణత్వమున్ గలుగఁ జేయుచు నుందురు, నాగకన్యలున్
వితత విలాసలాస్యపరివృత్తుల భక్తి భజింతు రాతనిన్

249. సీ. అరివర్గజితుడతం దఖిల సురాసుర
సిద్ధోరగగణ సంసేవ్య మాను
దమృత వాగ్ఝరులతో నాప్యాయతలు గుల్క
పలుకరించు దరికి వచ్చు వారి
వాడని సడలని వైజయంతీమాల
ననవరతముఁదాల్చి యలరుచుండు
నంస భాగమ్మును హలమున కానించి
నీల వస్త్ర ధరుడై నిలిచి యుండు

తే.గీ. నొక మహాతత్వనిధి యన నుర్వినెల్ల
లోక కల్యాణమును మదిలోన నెంచి
మోయుచుండును సతతమ్ము మోద మెసగ
నాది శేషుడు ఋషి వరు లభి నుతింప

250. ఉ. ఆతని నామమున్ దలచి నంతనె పాపులు నార్తు లెల్లరున్
పూత చరిత్రు లౌదురు, విభూషిత సత్వగుణాఢ్యుడౌచు నీ
భూతలమున్ వహించు; సరిపోలరు వానికి నన్యదేవతల్,
ప్రీతిఁదదున్నతిన్ బొగడ వేయును నాల్కలు చాలవెంచగన్

251. మ. అని నారాయణుడిట్లు వల్కి క్షణ మయ్యాఖ్యానమున్ నిల్పియో
య్యన మౌనీంద్రుని వంకఁ జూడ, మదిలోనానందమున్ బొంది య
మ్మునివర్యుండు మహానుభావ! కడు సమ్మోదంబు గల్గించె మీ
యనవద్యంబగు వాక్సుధాఝురులు, దివ్యంబుల్ గదా! మీనుడుల్

252. ఉ. ఐనను సంశయమ్ము మది కయ్యెడు నయ్య! సమస్త కర్మలీ
ప్రాణులకున్ సమానమయి వర్తిలు చుండగ కర్మభేద మె
ద్దానన వచ్చె లోకమున, తద్విధ మెల్ల నెఱుంగఁదెల్పుమా
జ్ఞాన నిధీ! యటంచు సుర సంయమి వేడె వినమ్రశీర్షుడై

253. వ. వేడినంత

254. శా. ఆ నారాయణు డిట్లు వల్కె మునివర్యా! కర్త కెల్లప్పుడున్
నానారీతుల శ్రద్ధలున్, త్రిగుణముల్ నవ్యంబులై తోచుటన్
గానన్ వచ్చు ఫలంబు లెల్లెడల తత్కర్మాను కూలంబులై
నానాభంగిమలన్ విచిత్రముగ నెన్నన్ సర్వకాలమ్ములన్





255. మ. కలుగున్ సత్వగుణాభి భూషనకు సౌఖ్యంబెప్పుడున్ గర్తకున్,
ఫలమౌ దుఃఖము రాజసాన్వితునకున్ భారంబుగా దోచుచున్,
చెలగున్ మౌఢ్యము తోడి దుఃఖ మది యోచింపన్ దమఃకర్తకున్,
కలుగన్‌బోవు సమానమై ఫలితముల్ కాలంబునందెన్నడున్

## పితృనరక లోకములు

256. చం. అతలముపైన నీధరణి కవ్వల క్రిందఁ గలట్టి లోకమే
పితృగణ వాసమై యలరు; వేడుక తత్ పితృ దేవతల్ కృపా
యుతులయి స్వీయ గోత్రజుల కుజ్జ్వల సౌఖ్యము లాయురున్నతుల్
సతతముఁ గల్గ దీవెనల సమ్మతి నిచ్చుచు నుందు రిమ్ముగన్

257. ఉ. ప్రాణులసర్వకర్మల స్వభావములన్‌గని వారికెల్లఁ బ్రో
గైన యనేక దోషముల కయ్యయిరీతులఁగల్గు శిక్షలన్
బూని విధించు చుండును యముండట పాలకుడై మహోద్ధతిన్
వానికి నాజ్ఞలన్ నెఱపువారు భటాళియు నుందురయ్యెడన్

258. కం. నరకమ్ములు గల వీతని
పరిపాలన మందు పాప ఫలదమ్ములునై
యిరువది యొక్కటి యనియును
నిరువది యెనిమిదియు ననుచు నెన్నంబడుచున్

259. వ. అవియును తామిస్రము, అంధ తామిస్రము, రౌరవము,
మహా రౌరవము, కుంభీపాకము, కాల సూత్రము, అసి పత్రా
రణ్యము, సూకర ముఖము, అంధ కూపము, క్రిమిభోజనము,
విశసనము, లాలాభక్షము, సారమేయాదనము, అవీచి,
అయఃపానము, క్షార కర్దమము, రక్షోగణము, సంభోజము,
శూల ప్రోతము, దందశూకము, వటారోధము, పర్యావర్తకము,
సూచీముఖము నను నామమ్ములనొప్పుచూ యాతనా
భూములై కర్మానుసారముగ ప్రాణి కోటికి ప్రవేశార్హములై
యొప్పుచుండును మఱియు కర్మభేదములును, నాయా
కర్మలకు లభించు నరకమ్ములను గూర్చి వివరించెదను వినుము

260. కం. పరదారా ధన సంగ్రహ
పరులకు తామిస్రమొదవు; భటులచ్చోటన్

గురుదండ తాడనమ్ముల
పొరిపొరి తద్దేహములను పొక్కింతురొగిన్

261. తే.గీ. పతుల వచించి నడయాడు సతుల కెల్ల
నంధ తామిస్ర నరక సంబంధ మబ్బు
నచటి యాతనల్ వర్ణింప నలవి గాదు
కన్ను పొడిచిన నేమియుఁ గాన రాక
మతులు సెడి కూలుదురు వృక్షతతుల వోలె

262. చం. నిరతము నాది నాది యని, నేనును, నాసతి, బిడ్డలంచు స్వా
ర్థరతి పరార్థ సంగ్రహ విధానము లెన్నెడి ద్రోహ చింతనా
పరులకు రౌరవమ్మున నివాసము తప్పదు; వార లెవ్విధిన్
పరులను హింసవెట్టిరొ నిబద్ధిగ నాగతి యౌను వారికిన్

263. మ. ధర నేప్రాణుల నెవ్వరేగతిని స్వార్థంబెంచి హింసించి, రా
కరణిన్ హింసల వారి నొంచుదురు నిక్కంబందు తత్ప్రాణులే
రురువుల్ గా పరిణామ మంది మిగులన్ గ్రూరంబుగా నారదా!
రురువుల్ సర్పకులంబు కంటె కడు క్రూరుల్ రక్తమాంసోదనుల్

264. తే.గీ. అందు పచ్చి మాంసముఁ దిను నట్టి రురులు
క్రూర జంతు స్వరూపులై కూడియుందు
రమ్మహా రౌరవ నరక మందు పెక్కు
హింస లొనరించుచున్ భయ హేతువులుగ

265. మ. పశుపక్ష్యాదులఁ జంపుచున్ మిగుల దుర్వ్యాపార పారీణులౌ
పిశితాహారులు దేహముల్ విడిచి కుంభీపాక దుర్వార క
ర్కశ హింసాలయమైన దుర్గతినిఁ జేరంబోదు, రచ్చో నహ
ర్నిశలున్ గ్రాగెడు తైల పాత్రముల వీరిన్ దేల్తు రుగ్ర స్థితిన్

266. తే.గీ. తాను హింసించిన పశు సంతతుల కెన్ని
వేల రోమముల్ గల వన్ని వేల యేండ్లు
శిక్షలన్ బొందు నాతడు చేరి యచట
తప్తతైల పాత్రమున సంతప్తుడగుచు





267. చం. పితరుల విప్రులన్ మఱియు వేదములన్ గడు ధిక్కరించు దు
ర్మతులు మహాగ్నికుండ సమ రశ్ముల మండెడు కాలసూత్ర దు
ర్గతిఁబడి క్షుత్పిపాస లధికంబయి దుస్సహ వేదనాభరం
బతిశయిలన్ మహోగ్రముగ నార్చుచు గ్రుగ్గుచు నుందు రయ్యెడన్

268. చం. నియమిత వేదమార్గముల నిందయొనర్చుచు నిష్ఠురంబుగన్
నయగతి వీడి స్వేచ్ఛ మెయి నాస్తిక వర్గము తో చరించు ని
ర్భయు నటుఁ ద్రోయుచుందు రసిపత్ర వనంబున; నందుకింకరుల్
దయఁదలపంగఁబోక కడు దారుణ హింసల నొంతు రెంతయున్

269. కం. కొరడాలన్ గొని వ్రేయుచు
పరుగులు తీయింతు, రంత వదలక తనువున్
ఖర ఖడ్గంబులఁ జీరుచు
కురియింతురు శోణితముల ఘోర తరముగన్

270. ఉ. పంతముఁ బూని శిక్షల న వారణ వేయుచు తత్ప్రజావళిన్
చింతల పాలొనర్చుచు, విశిష్టులు నౌ ద్విజ కోటి కెప్డు డ
త్యంతము నీచ కృత్యముల నాఱడులన్ గలిగించు చుందు భూ
కాంతుడు ద్రెళ్ళు సూకర ముఖంబను ఘోరతరంపు దుర్గతిన్

271. తే.గీ. చెరకు గడఁబిప్పి యొనరించు కరణి నతని
దేహమున్ బట్టి కరములఁద్రిప్పి ద్రిప్పి
భటులు నలిపి వేయుచు నుండ చటులగతిని
నార్తనాదమ్ములన్ ముద్దయౌ నతండు

272. ఉ. లౌకిక భోగముల్ మదిఁ దలంపక తత్ పరమున్ దలంచు న
వ్యాకుల చిత్తులన్ మిగుల నాఱడి వెట్టెడి వాడు పాపముల్
గైకొని యంధకూప నరకంబున కేగి సరీసృపాళిచే
చీకటి యందు నొంచఁబడి చిక్కి ధరన్ బొరలాడు మూల్గుచున్

273. తే.గీ. పంచ యజ్ఞమ్ము లొనరించి పరమ ప్రీతి
నతిథులకు భోజన మ్మిసుమంత యిడక
తాను మాత్రమె భుజియించి తనివిఁ జెందు
నరుడు కృమి భోజన మనెడి నరకమునకు

నేగి కృమి కుండ మందొక కృమివిధాన
మలము భక్షించు చుండును కలియఁదిరిగి

274. ఉ. అక్కర లేకయుండియును నన్యుల రత్నసువర్ణ భూషలన్
జిక్కిన యంత దోచుకొని జీవితమున్ గడు వైభవమ్ము పెం
పెక్కగఁ బుచ్చు పూరుషున కేర్పడు దుర్గతి "తప్తమూర్తి;" తా
నక్కడ కట్టి వేయఁబడు నగ్ని కహోరమునన్ దృఢంబుగన్

275. మ. బలవంతమ్ముగ నన్య కాంతలను నిర్బంధించి భోగించు న
క్కలుషాత్మున్; దెగి యన్యపూరుషుల సాంగత్యమ్ము వాంఛించు న
వ్వెల యాలిన్ దగ వజ్ర కంటక మహా భీలంబునౌ స్తంభమున్
బలిమిన్ కౌగిలిడంగ జేయుదురు దుర్వారక్రియన్ దద్భటుల్

276. తే.గీ. వావి వరుస లెఱుంగక పశువు వోలె
కాంతలన్ బొందువానిని కంటక యుత
శాల్మలీసాల మెక్కింత్రు జాలి వీడి
శాల్మలీ నరకమున దుస్సహ మనంగ

277. మ. నిరతంబున్ మలమూత్ర శోణితములన్ నిండారి దుర్వాసనా
భరితంబై పరిఖాకృతిన్ యమ పురిన్ వ్యావర్తనంబైన వై
తరణిన్ వాసము సేయుచుండెదరు మత్స్యశ్రేణి చందాన ము
ష్కరులై ధర్మము వీడి వర్తిలెడి భూకాంతుల్ తదుద్యోగులున్

278. తే.గీ. అచటి జలజంతువులు వీరి నారగింప,
జ్ఞాన మింతైనఁ దఱుగక చావఁబోక
యధిక బాధలఁ గుందుచు ననవరతము
ననుభవింతురు స్వీయ పాపౌఘ ఫలము

279. కం. ఆచారములన్ దలపక
శౌచమ్మును విడచి పశువు చందమ్మున ని
చ్చాచారుం డగుమనుజుం
డీ చందమునన్ మునుంగు నీ వైతరణిన్

280. చం. ఖరముల జాగిలంబుల సుఖమ్ముగఁ బెంచుచు జంతుజాలమున్
నిరతము వేటలాడు కడు నింద్యులునౌ ద్విజ కోటి నెల్ల. ని





ష్ఠురగతి శాతబాణముల స్రుక్కగఁ నొంతురు ప్రాణరోధ దు
స్తర నరకమ్మునన్ గవిసి సంయమ నీశుని క్రూర కింకరుల్

281. మ. పసులన్ జంపుచు దంభవర్తనులునై పల్మారు యజ్ఞమ్ము లిం
పెసగన్ జేసెడి ధూర్తులన్ యమభటుల్ హీనస్థితిన్‌బట్టి వై
శసనంబందు కశాభిఘాతముల నశ్రాంతమ్ము దండింతు రా
పసులన్ మోదెడి రీతి దుర్భర గతిన్ వారార్చి పర్వెత్తగన్

282. చం. ధరణి మదోద్ధతుండయి యధర్మగతిన్ నిజరేత మే నరుం
డరమరలేక పత్నికిడి యాఅటఁ బెట్టుచుఁద్రావఁజేయు; నా
దురితుని వీర్యకుండమను దుర్భర దుర్గతిఁద్రెళ్ళఁజేసి ని
ష్కరుణఁ గొనంగఁజేయుదురు కాలుని బంటులు స్వీయ రేతమున్

283. ఉ. ప్రాణులకున్ విషంబునిడి ప్రాణములన్ గొను వారిఁ, జోరులై
మానక దొంగిలించుచు నమాయిక పాంథుల నొంచువారలన్,
గ్రామములన్ బొలంబులను గాల్చెడు వారల 'శ్వానకాద' దు
ర్ధామమునందు శ్వాన పరిదష్టులఁజేతురు కాల కింకరుల్

284. తే.గీ. కూట సాక్ష్యమ్ము లిడు వారి, గుడుల సొమ్ము
లూడ్చుకొని కుల్కువారి నత్యున్నత గిరి
శిఖరములనుండి ద్రోతురు శిరము క్రింది
గాగ వడి 'నవీచీ' నరకమున భటులు

285. ఉ. అచ్చటి నేల యంతయును నంబువులన్ గెరటమ్ము లున్నయ
ట్లచ్చుపడున్;నిజమ్మరయ నంబువులచ్చట లేవు;రాలపై
పెచ్చులు; వానిపైఁ బడిన వీరి శరీరములెల్ల ముక్కలై
యచ్చపు నువ్వుధాన్యముల యట్లు కకావికలై కనంబడున్

286. వ. ఇంక నిరయంబను నరకంబున

287. మ. ద్విజులన్, వైశ్యుల, భూపులన్, పురుషులున్ స్త్రీలున్ సురాపానదు
ర్భజనాసక్తులు నైన;వారల భటుల్ బంధించి యామీదటన్
నిజహస్తమ్ములఁ దప్తలోహరసమున్ దెప్పించి త్రావింతు ర
క్కజమై వారల రోదనల్ దశదిశాక్రాంతమ్ములై పర్వగన్

288. కం. వర్ణాశ్రమ ధర్మపరుల
దుర్నయులై యపహసించు దుష్టాత్ములకున్
నిర్ణయము 'క్షార కర్దమ'
దుర్నరకము; శిక్షలచట దుర్భరములగున్

289. కం. నరమేధాద్యజ్ఞమ్ముల
జరిపెదు నవ్వారి శాతశరములఁగొని చీ
ల్తురు తద్దేహములను ని
ష్కరుణన్ "రక్షోగణ"మను కాలుని పురిలోన్

290. శా. కేళిన్ బక్షుల షట్పదంబులఁ గడున్ గ్లిష్టంబుగా సూత్రమం
దోలిన్ గ్రుచ్చుచు నాటలాడు కడు దుర్యోగున్ మహాభీలమౌ
'శూల ప్రోతము' నందు వైచి యటులే శూలమ్ములన్ గ్రుచ్చి, కా
కోల శ్వాన సమూహమున్ బనుతు రుక్కుంగోళ్ళస్రుక్కింపగన్

291. తే.గీ. ఎవ్వ రేరీతిఁబరుల హింసింతు, రట్లె
వారి శిక్షించెదరు యమ భటులు దంద
శూక నరకమ్ము నంజేర్చి శోకరవము
లెసగ బంధించి మిక్కిలి హీనగతిని

292. కం. అతిథుల కన్నము వెట్టక
యతిలోభులు నైన ద్విజుల నండజములచే
నతులిత గతిఁ బొడిపింతురు
మతులు సెడగ నేత్రముల నమానుష రీతిన్

293. తే.గీ. ధనము గలిగియు లోభియై దానమిడక
తాను కుడువక పేద విధాన నుండు
నతని 'సూచీ ముఖ' మను దుర్గతికిఁ జేర్చి
యాతనలు వెట్టు చుందురు యమభటాళి

294. చం. కల విక పెక్కు ఘోర నరకంబులు నారద! వానిఁ దెల్ప నా
కలవియె? యైన నొక్క విషయమ్ము వినన్వలె, నట్టి వానిలో
నలఘు ధనాఢ్యులే మిగుల యాతనలం బడుచుందు, రర్థకా
ముల నరకంబు లే యధికముల్ పరికింపగ మౌని సత్తమా!





295. కం. పాపాత్ములు నరకంబున
కేపగిదిన్ జనుదు రటులె యెవ్వరు పుణ్య
ప్రాపకు లౌదురొ, వా రా
యా పగుదుల నాకసుఖము లందెద రనఘా!

296. చం. తెలిపెద నొక్కమాటఁ గడుఁ దెల్లముగా మునివర్య! విన్ము,ని
ర్మలమతి లోకమాతను నిరంతరమున్ భజియించు టొక్కటే
తలపగ పాపకంటక వితాన వనోగ్ర కుఠారమౌను, చిం
తిలఁ బని లేదు, దేవిని నుతించెడు వానికి గల్గు సద్గతుల్

297. కం. అనినన్ నారాయణుఁగని
యనిమిషముని పల్కె నిట్టు లానందమునన్
దనువున పులక లెసంగగ
వినయమ్మున మ్రొక్కి మిగుల విజ్ఞత దోపన్

298. శా. దేవీ పూజల నెట్లు సల్పవలె? తద్దివ్యంపు మంత్రమ్ము ము
న్నేవారల్ జపియించి ధన్యులయి, రేయే కష్టముల్ దీఱె, నా
దేవీప్రార్థన రూపమైన పరమోత్కృష్టంపు ధర్మమ్ములున్
నీవే చెప్పఁదగున్ మహాత్మ! యిక లేరెవ్వారలున్ త్వత్సముల్

**దేవీ పూజావిధానములు**

299. – అనియడిగిన నారదుంగని నారాయణుండిట్లు చెప్పఁ దొడంగె

300. సీ. ఏకాగ్ర చిత్తుడై యెలమి పాడ్యమి తిథి
నాజ్యధారల తోడ నధికభక్తి
నంబను పూజించి యాజ్య దానమ్మున
భూమి సురులఁ దృప్తిఁ బొందఁ జేయు
కర్తకు తొలగును కల రోగముల పీడ
లారోగ్యవంతుడై యలరుచుండు
విదియనా దంబను వేడ్క శర్కర తోడ
పూజించి యాపైన భూసురులకు
శర్కరను దానమొసగ నిస్సంశయముగ
నాయు రారోగ్య భాగ్యమ్ము లధిక మౌను

తదియనా దతి భక్తి దుగ్ధమ్ముతోడ
నంబ నభిషేక మొనరించి యవని సురుల
క్షీరదానమ్మునన్ దృప్తి సేయ వలయు

301. చం. చవితి దినమ్మునన్ మిగుల శ్రద్ధగ పూజ లొనర్చి దేవికిన్
వివిధములైన యప్పములు ప్రీతి నివేదనఁ జేసి భూసుర
ప్రవరుల కయ్యపూపముల భక్తిని దానమొసంగ కార్యముల్
జవమున సత్ఫలంబుల నొసంగు నవిఘ్నములొౘు దాతకున్

302. తే.గీ. పంచమీ తిథి యందు రంభాఫలముల
నంబ నతిభక్తిఁ బూజించి యవల విప్ర
వర్యులకవి దాన మిడినఁ బ్రజ్ఞమిగుల
వికసనము నొంది దాత వివేకియౌను

303. తే. షష్ఠి తిథినాడు మధువును సమ్మతమున
నంబకు నివేదనమ్మిడి యవల దాని
విప్రవరులకు దానమ్ము వేడ్క నొసగు
దాత దీప్తి మంతుడగును తథ్యముగను

304. తే.గీ. సప్త మీ దినమ్మున జగజ్జననిఁ గొల్చి
గుడము నైవేద్యమిడి కడు కూర్మిదాని
విప్రులకు దాన మొసగిన వీడి పోవు
సర్వదుఃఖముల్ దాతకు సత్వరమున

305. తే.గీ. నారి కేళమ్ము లష్టమి నాడుభక్తి
నమ్మకర్పించి ద్విజులకు నాదరమున
దానమొసగిన దాతకు తాపశమము
గల్గు నమ్మహాదేవి సత్కరుణ వలన

306. కం. నవమిని లాజల నంబన్
బ్రవిమల మతి నర్చఁ జేసి బ్రాహ్మణులకు న
య్యవి దాన మిడిన దాతకు
దివి భువి సుఖశాంతులబ్బు దేవీకృప చే





307. తే.గీ. నల్ల నువ్వుల దశమి నాడుల్ల మలర
దేవిఁబూజించి ద్విజులకుఁదృప్తి కలుగ
వాని దానమ్ము నిచ్చెడి వారికెపుడు
గలుగ వావల యమలోక కష్టగతులు

308. తే.గీ. పదు నొకండవ తిథి యందు పరమభక్తి
పెరుగు నైవేద్యమిచ్చి శాంకరిని గొల్చి
విప్రులకు దధి నొసగిన విజ్ఞు దరయ
నంబ కత్యంత ప్రీతుడౌ నవని యందు

309. కం. ద్వాదశి దినమున నటుకుల
శ్రీదేవిని పూజ చేసి స్థిరమతి వానిన్
భూదేవుల కిడు దాతల
కా దేవీకృప లభించు ననవర తంబున్

310. తే.గీ. అంబకు త్రయోదశీ దిన మందు సెనగ
పప్పును నివేదనముసేసి బ్రాహ్మణులకు
దానమొసగిన దాతకు తప్పి పోవు
చెడ్డగ్రహముల పీడలు శీఘ్రగతిని

311. తే.గీ. పేల పిండిని పెరుగుతో మేళవించి
శ్రీకరికి చతుర్దశి నాడు చేత మలర
నర్పణము చేసి విప్రుల కద్ది యిడిన
శివుని కృపగల్గు వారికి శీఘ్రగతిని

312. కం. పున్నమి దినమున దేవికి
పన్నుగ నైవేద్య మిడిన పాయసమును తా
మన్నన విప్రుల కొసగిన
గ్రన్నన పితృదేవతలకు గల్గున్ సుగతుల్

313. కం. వారము దినముల నొక్కొక
వారమ్మున దేవిఁ గొల్చు పద్ధతులను ని
ర్ధారణఁ జేసిరి విబుధులు
ధీర మతీ! సంగ్రహముగఁ దెలిపెద వినుమా!

314. సీ. భాను వారమ్మున పాయసాన్నమ్మును
క్షీరమున్ శీతాంశు వారమందు
కదళీ ఫలమ్ము లంగారక దినమున
నవనీతమున్ సౌమ్య దివస మందు
గురు వాసరమ్మున కూరిమిఁ గలకండ
శర్కరన్ శుక్ర వాసరము నందు
స్థిర వాసరమ్మున పరగ ఘృతమ్మును
నంబకర్పించుచు నర్చసేయ

గీ. సత్ఫలంబులు సమకూరు శాంతి కలుగు
నటులె వివిధ నక్షత్రమ్ము లందుసైత
మంబఁబూజించి విప్రుల నాదరించి
తృప్తిపరుపంగ వలయుఁ బృథ్వీతలమున

315. తే.గీ. చైత్ర మాసమ్ము మొదలుగ సమ్మతమున
శుద్ధ తదియన నంబకు షోడశోప
చార పూజ మధూక వృక్షమ్ము క్రింద
జరుపుచుందురు మాసమాసమ్మునందు

316. తే.గీ. చైత్ర మాసాన శుక్ల పక్షపు తృతీయ
మందు పంచ ఖాద్యములు సంభావితముగ
వండి నైవేద్య మిడి పూజ భక్తి సలుప
తల్లి కృపగల్గు కర్తకు తథ్యముగను

317. కం. వైశాఖ శుద్ధ తదియన
శ్రీశాంకరిఁబూజ చేసి చిత్తంబున నే
యాశయును లేక గుడమున్
బ్రాశనముగ దేవి కీయ వలయున్ భక్తిన్

318. వ. అట్లే మిగిలిన మాసములయందును శుద్ధతృతీయమున
క్రమముగా తేనె, వెన్న, శర్కర, పాయసము, క్షీరము, పేనిక,
దధి కూర్చిక, ఘృతము, నారికేళములను నివేదించుచు
దేవిని పూజింప వలయును
చైత్రము మొదలు ప్రతి మాసము నందును వరుసగా
నమ్మను - మంగళ, వైష్ణవి, మాయ, కాళరాత్రి, దురత్యయ





మహా మాయ, మాతంగి, కాళి, కమల వాసిని, శివ,
సహస్ర చరణ, సర్వమంగళ, యను నామమ్ములతో
పూజింప వలయును

319. కం. ఆవిధమున పూజించిన
దేవీకృప గల్గు మఱియుఁ దీరును కోర్కెల్
భావింపఁ గల్పకంబౌ
సేవించెడి వారికెల్ల శ్రీదేవియిలన్

320. దండకము–
శ్రీలోక మాతా! పరబ్రహ్మరూపీ1 జగత్సృష్టి కర్త్రీ! మదో
న్మత్తరూపీ! మహా మంత్రరూపీ! మహామంత్రగమ్యా!
మహాదివ్యగాత్రీ! సహస్రార్కదీప్తా! మహాయోగ మాయా!
మహా మోహనాశీ! మహా భీకరీ! శ్రీకరీ! మానసాంతర్నివాసీ!
సురేంద్రాది దిక్పాల కోటీర మాణిక్యతేజో విరాజత్ పదాం
భోజయుగ్మా! కపాలాస్థి మాలాధరీ! నిర్మలా!నిత్య
దాక్షిణ్య మూర్తీ! విరూపీ! సురూపీ! శివా! భావజారిప్రియా!
భర్తృ దేహార్ధ వాసీ! దయాబ్ధీ! నమస్తే! నమస్తే! నమస్తే! నమః

321. మత్తకోకిల
ఈవిధంబున శాంకరిన్మది నెంచి కొల్చెడి వారికిన్
భావి కాలము సౌఖ్యశాంతులు భద్రమై విలసిల్లుతన్
బ్రోవులౌ ధన ధాన్యముల్గడుఁ బూర్ణ మౌచు ధరాస్థలిన్
వేవిధంబుల వంశమెల్లను వృద్ధియౌ నిరతంబిలన్

**స్వస్తి.**
**ఓంతత్సత్**

322. వ. ఇది శ్రీదేవీ కరుణాకటాక్ష లబ్ధ విభవుండును, కమలాంబా సుబ్బరాయుల ద్వితీయ పుత్రుండును, కౌశిక సగోత్రుండును, నగు సుబ్బారావు కవి ప్రణీతంబగు శ్రీదేవీ భాగవతమను మహా పురాణమునందు - నారద నారాయణ సంవాదమ్మును, మనుసృష్టియు, జంబూద్వీప వర్ణనము, విశిష్ట భారతావని, ప్లక్షద్వీపము, శాల్మలీ కుశద్వీపములు, క్రౌంచ ద్వీపము, శాక ద్వీపము, పుష్కర ద్వీపము, లోకాలోక పర్వతము, సూర్య చంద్రాది గ్రహగతులు, దేహాంతర్గత జ్యోతిశ్చక్రము, అథోలోకములు, పితృ–నరక లోకములు, దేవీపూజా విధానములు నను విశేషవిషయమ్ములనొప్పు నష్టమస్కంధము

**శుభం**

తిరుమల తిరుపతి దేవస్థానము వారొసంగిన రూ. 30,000/- లు గాక గ్రంథ ముద్రణకై ఆర్థిక సహాయమొనరించిన ఈ క్రింది వదాన్యుల కెల్లప్పుడు శ్రీదేవీ అనుగ్రహము సంప్రాప్తింప వలయునని ప్రార్థించుచున్నాను.

1. కీ॥శే॥చల్లా చినరోశి రెడ్డి గారి జ్ఞాపకార్థము వారి సతిమణి శ్రీమతి వేంకట సుబ్బమ్మ, కుమారుడు శ్రీ పెంచల రెడ్డిగారలు, అనంతసాగరం - రూ. 10,000/-

2. శ్రీ చలంచ్యాల వేంకట సుబ్రహ్మణ్య శర్మ శ్రీమతి భాను తులసి గారలు, కావలి - రూ. 10,000/-

3. శ్రీ జంగా శివకుమార్ గారు, నెల్లూరు - రూ. 10,000/-

4. శ్రీ పిడూరి మల్లికార్జున రావు శ్రీమతి నాగమణిగారలు, బుచ్చిరెడ్డిపాళెం. - రూ. 5,000/-

5. శ్రీ యాలమూరి కొండా రెడ్డి శ్రీమతి అరుణ భారతీ దేవి గారలు, కావలి. - రూ. 3,000/-

6. శ్రీ మెటుకూరి వేంకట సుబ్బారెడ్డి శ్రీమతి రామసుబ్బమ్మ గారలు, అనంతసాగరం - రూ. 2,000/-

7. శ్రీ మాదిరాజు రాఘవేంద్రరావు గారు - రూ. 2,116/-

8. శ్రీ సురభి వేంకట చలమయ్య గారు, ఆత్మకూరు - రూ. 2,000/-

9. 'స్పందన' సాహితీ సమితి వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ నందనవనం శ్రీహరి రావు గారు, కావలి. - రూ. 2,000/-

10. శ్రీ మద్దూరు మాలకొండా రెడ్డి గారి కుమారుడు శ్రీనివాసులు రెడ్డి గారు, కోదండరామాపురం. - రూ. 2,000/-

11. శ్రీ తక్కోలు నారాయణ రెడ్డి గారు, కోదండరామాపురం - రూ. 2,000/-

12. శ్రీ వెల్లంచేటి చంద్రమౌళి శ్రీమతి సుమన గారలు సప్తగిరి లాడ్జి, నెల్లూరు. - రూ. 2,000/-

13. కీ॥శే॥ అనంతరాజు లక్ష్మీకాంతారావు శ్రీమతి హైమవతమ్మగారల జ్ఞాపకార్థం కుమారుడు, కోడలు, శ్రీ ఎ.వి.ఎల్.కె. ప్రసాద్ రావు శ్రీమతి కల్యాణి గారలు - రూ. 1,116/-

14. శ్రీ ఆత్మకూరు వేంకటసుబ్బయ్య గారు, అనంతసాగరం - రూ. 1,116/-

15. శ్రీ కె.వి. శేషారెడ్డి గారు విశ్రాంత ప్రధానోపాధ్యాయులు, ఆత్మకూరు. - రూ. 1,116/-

16. శ్రీ అల్లంపాటి రాఘురామి రెడ్డి గారు, అనంతసాగరం - రూ. 1,116/-

17. శ్రీ పట్టెం రమణయ్య గారు, బుచ్చిరెడ్డిపాళెం. - రూ. 1,116/-

18. శ్రీ చలం చ్యాల సూర్య ప్రకాశ రావు శ్రీమతి సీతాదేవి గారలు, కావలి. - రూ. 1,116/-

19. శ్రీ అల్లంపాటి చిన్నపరెడ్డి గారు, బ్రాహ్మణపల్లె - రూ. 1,116/-

20. శ్రీబోయిళ్ల రాజశేఖర్ రెడ్డి గారు, కంపసముద్రం - రూ. 1,116/-

21. కీ॥శే॥ అల్లంపాటి లక్ష్మమ్మ, పెద రమణారెడ్డి గారల కుమారుడు శ్రీ రవీంద్రా రెడ్డి, శ్రీమతి రాజేశ్వరి గారలు పరికోట. - రూ. 1,000/-

22. శ్రీమతి అల్లం పాటి సౌదామిని, చిన రమణా రెడ్డి గారల జ్ఞాపకార్థం కుమార్తె, అల్లుడు మేదరమెట్ల సునీత, కృష్ణమోహన్ గారలు, హైదరాబాదు. - రూ. 1,000/-

23. శ్రీపసుపులేటి రమేష్ గారు, తెలుగు పండిట్ శిద్దన కొండూరు. - రూ. 1,000/-

24. శ్రీమతి పర్వత రెడ్డి పేరమ్మ, కీ॥శే॥ మాలకొండా రెడ్డి గారల జ్ఞాపకార్థం పర్వత రెడ్డి బాలకృష్ణ రెడ్డి, (సర్పంచ్) శ్రీమతి ప్రమీల గారలు, పరికోట. - రూ. 1,000/-

25. శ్రీ నాశిన రామయ్య గారు, నెల్లూరు. - రూ. 1,000/-

26. శ్రీ పాలగుళ్ళ చిన్నపరెడ్డి గారు, నెల్లూరు. - రూ. 1,000/-

27. అన్నలూరు వాసుదేవ రావు గారు, కావలి. - రూ. 500/-